ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

# భాగవతం ఉపాఖ్యానములు

- శ్రీమతి ప్రభల వేంకట నాగలక్ష్మి

# శ్రీ భాగవతము ఉపాఖ్యానములు




గ్రంథకర్త, ప్రకాశకులు :

ప్రభల (పోతుకూచి) వేంకట నాగలక్ష్మి

W/o. మధుసూదనశాస్త్రి

డోర్ నెం. 1-12-5, వెల్లంకివారి వీధి,

నాజరుపేట, తెనాలి - 522 201, గుంటూరుజిల్లా.

శ్రీ భాగవతము - ఉపాఖ్యానములు

పోతుకూచి వేంకట నాగలక్ష్మి

ప్రథమ ముద్రణ : నవంబరు, 2007



కాపీలు : 1000

వెల : రూ. 80-00

ప్రతులకు :

**పోతుకూచి వేంకట నాగలక్ష్మి**
డోర్ నెం. 1-12-5, వెల్లంకివారి వీధి,
నాజరుపేట, తెనాలి - 522 201.
గుంటూరు జిల్లా.

**శివకామేశ్వరి గ్రంథమాల**
41-22/4-36, భ్రమరాంబాపురం,
కృష్ణలంక, విజయవాడ - 520 013.
ఫోన్ : 0866-2522824

**శివకామేశ్వరి ఆర్ష గ్రంథమాల**
27-18-59, కాంగ్రెస్ ఆఫీస్ ఎదుట,
కాంగ్రెస్ ఆఫీస్ రోడ్, గవర్నర్‌పేట,
విజయవాడ - 520 002.
ఫోన్ : 0866-6661777

డి.టి.పి. :
**వివేకానంద టెక్నికల్స్**
టి.జె.రోడ్, కొత్తపేట, తెనాలి.

ముద్రణ :
**లక్ష్మీ వైభవ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
గాంధీనగర్, విజయవాడ-3.

శ్రీ వేంకటేశాయ నమః



శ్లో॥ కల్యాణాద్భుతగాత్రాయ కామితార్థ ప్రదాయినే ।
శ్రీమద్వేంకట నాథాయ శ్రీనివాసాయ మంగళం ॥

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారి
ఆర్థిక సహాయముతో ఈ గ్రంథము ముద్రించబడినది.

# అంకితము




పరమ పవిత్రమైన "శ్రీ భాగవతము - ఉపాఖ్యానములు" అను తెలుగు వచన గ్రంథమును, శ్రీ సీతా సమేత రామచంద్రమూర్తి పాదపద్మములకు భక్త పారిజాతముగ అంకిత మొనర్చుచున్నాను.

భక్తితో

**పి.వి.నాగలక్ష్మి**

## కృతజ్ఞత

1. గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయ మొనగూర్చిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి తొలిదొలుత హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు తెలుపుకొనుచున్నాను.

2. గ్రంథమును డి.టి.పి. ద్వారా టైపు చేసి సహకరించిన వివేకానంద టెక్నికల్స్, టి.బి. రోడ్, కొత్తపేట, తెనాలి వారికి, సర్వాంగ సుందరముగ గ్రంథమును ముద్రించిన లక్ష్మీ వైభవ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారికి హార్థిక కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నాను.

3. గ్రంథము నా మూలాగ్రము పరిశీలించి అనుగ్రహాశీస్సు లందించిన శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజము, దాసకుటి, అంగలకుదురు పంచమ గురు స్థానీయులు, వారి చరణార విందములకు నమస్సుమాంజలు లర్పించుకొనుచున్నాను.

గ్రంథమును సమీక్షించి అమూల్యాభిప్రాయములతో ఆశీస్సు లందించిన విశ్రాంత ప్రధానాంధ్రోపన్యాసకులు, సోదర సమానులు శ్రీ మానూరు శ్రీనివాస హనుమంతరావుగారికి వందన సహస్రములు.

ఇంకను ప్రత్యక్షముగను, పరోక్షముగను సహాయ సహకారము లందచేసిన వారెల్లరకు కల్యాణప్రదుడైన శ్రీ వేంకటాచల నిలయుడు సర్వదా, శతధా, సహస్రధా, అనుగ్రహాశీస్సులు, సర్వవిధ సౌభాగ్యములు, ఆయురారోగ్యములు కలుగచేయాలని త్రికరణశుద్ధిగ ప్రార్థించుచున్న..

మీ అభిమాన రచయిత్రి

**పి.వి. నాగలక్ష్మి**

## హామీ పత్రము

ఈ గ్రంథ రచనయందు వచ్చెడి విమర్శలకు, ఆక్షేపణలకు నేనే బాధ్యురాలను.

ఇట్లు

రచయిత్రి

**పి.వి. నాగలక్ష్మి**

**శ్రీరామానుజదాసస్వామి పంచమ గురుస్థానీయులు**
**శ్రీకోదండరామ సేవక ధర్మ సమాజము "దాసకుటి"**
**అంగలకుదురు - 522 211. (వయా) తెనాలి, గుంటూరుజిల్లా.**

## ఆశీఃపూర్వక ప్రశంస

శ్రీమతి ప్రభల (పోతుకూచి) వేంకట నాగలక్ష్మి రచించిన "భాగవతము - ఉపాఖ్యానములు" పుస్తకమును పఠించి, ఆనందించితిని. రచయిత్రి సరళ తెనుగున భాగవతము నందలి ఉపాఖ్యానములను చక్కని కథలుగా పిన్న, పెద్దలెల్లరు శ్రవణ, పఠనముల ద్వారా సంతోషభరిత స్వాంతులగు రీతి వివరించినది. "భాషాప్రవీణ" రాలగుటయే గాక, "శ్రీమద్వాల్మీకి రామాయణాంతర్గ సుందరకాండము" "హనుమద్వైభవము", "భాగవతోత్తములు" మున్నగు పుస్తకముల రచించిన పురాణేతిహాసవిదుడగు తండ్రి శ్రీ పోతుకూచి లక్ష్మీనరసింహ మూర్తిగారి పుణ్యాశీః ప్రభావము రచయిత్రికి లభించుటవలన ఆమె లేఖిని నుండి యిట్టి యుదాత్త పుస్తకము వెలువడినది.

శ్రవణ, పఠన, మననాదుల ద్వారా జనులకు క్రమముగా భక్తి, జ్ఞాన, వైరాగ్య, తపో, ముక్తులను ప్రసాదించెడి అత్యద్భుత ప్రభావ కలితమైనది "శ్రీ భాగవతము" "కిమ్ జపన్ముచ్యతే, జన్మ సంసార బంధనాత్" ఏ భగవద్రూపమును ధ్యానించి, జపించిన జీవులకు జనన, మరణ రూపకములగు బంధముల నుండి ముక్తి లభించును? అని భీష్మాచార్యుల వారిని ధర్మరాజు ప్రశ్నించగా, "జగత్ప్రభుమ్, దేవదేవమ్, అనంతం పురుషోత్తమమ్ ... ధ్యాయన్, స్తువన్, నమస్యంచ యజమానస్తమేవచ" సర్వ జగములకు ప్రభువు దేవతలకు కూడ దేవుడు, శాశ్వతుడు, నిత్యుడు, పురుషోత్తముడు ఐన శ్రీమన్నారాయణుని ధ్యానించి, స్తుతించి, నమస్కరించుట ద్వారా భవబంధవిమోచన కలుగునని భీష్ముడు పేర్కొనిన, ఆ దివ్యపురుషుని అవతార లీలలు, భక్తపాలన, దుష్టశిక్షణాదుల విశదముగా వివరించిన గ్రంథమే "శ్రీ భాగవతము" అష్టాదశ పురాణములు, వేద ధర్మములు మరియు సర్వ ఉపనిషత్సారమగు "భగవద్గీత"ను అంతర్భాగముగా కలిగిన "శ్రీ

మహాభారతము"ను రచించిన వేదవ్యాస మహర్షికే జనించి "చింత"ను దూరము చేయగలిగిన ఉత్కృష్ట కథా వస్తువు కలది "శ్రీ భాగవతము." అట్టి భాగవతమునందు, కథాకథన సందర్భముగా పేర్కొనబడిన ఉపాఖ్యానములనే గాక శ్రీ మహావిష్ణువు దివ్యావతార కథలను ప్రత్యేకించి శ్రీ కృష్ణావతార ప్రారంభము మొదలు అవతార పరిసమాప్తి పర్యంతము గల కథను కూడ రచయిత్రి యీ చిన్ని పుస్తకమున హృద్యముగా వివరించినది.

శ్లో॥ కృతే నారసింహోభూత్ త్రేతాయాం రఘునందన ।
ద్వాపరే వాసుదేవస్య, కలౌవేంకట నాయకః ॥

కృతయుగమున శ్రీ నరసింహమూర్తియు, త్రేతాయుగమున శ్రీ రఘువంశ ప్రదీపకుడైన శ్రీరామచంద్ర మూర్తియు, ద్వాపర యుగమున 'శ్రీ కృష్ణస్వామియు భక్తజనుల అభీప్సితములను నెరవేర్చిన విధమున కలియుగమున శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుల మనోభీష్టముల నెరవేర్చు నన్న ప్రామాణిక శ్లోకమును బలపరచు విధమున అక్షయ గ్రంథమగు శ్రీ భాగవతమునందలి ఉపాఖ్యానములతో కూడిన యీ పుస్తకమును రచించిన రచయిత్రికి తిరుమల తిరుపతి దేవస్థానమువారు అక్షయుడగు శ్రీ వేంకటేశ్వర స్వామి పుస్తక ముద్రణకు ద్రవ్య సహాయమొసంగుట అక్షయ ఆశీస్సులనందించుటయే.

ఈ పుస్తక పఠన, శ్రవణాదులచే భక్తులు తమ తమ యీప్సితముల భగవదనుగ్రహ బలమున సిద్ధింపజేసికొనగలరని ఆకాంక్షిస్తూ, దాసకుటీస్థ శ్రీ వైదేహీ, రామానుజ, సంజీవరాయ సహిత కోదండరామ ప్రభువు దివ్యానుగ్రహ బల సంపత్తిచే రచయిత్రి తన లేఖిని నుండి ముున్ముందు యితోధిక పుస్తకముల వెలువరించు గాతయని ఆశీః పూర్వక ప్రశంస గావించుచున్నారు.

సదా భగవద్భాగవతాచార్య సేవలో

**రామానుజదాసుడు**

దాసకుటి,

సర్వజిత్ అషాఢ కృష్ణ చతుర్దశి

ఓం నమో భగవతే వాసుదేవాయ

## అంతరంగము

పాఠక మహాశయులకు హృదయ పూర్వక నమస్సుమాంజలులు. శ్రీ భాగవతము వచన గ్రంథమును రచించవలెననెడి ప్రేరణమునకు ప్రధాన కారణము మా నాన్నగారైన శ్రీ పోతుకూచి లక్ష్మీనరసింహమూర్తి గారు. వీరు ఉపాధ్యాయులుగా పనిచేసి, పదవీ విరమణ తదుపరి ఆధ్యాత్మిక గ్రంథపఠనము, గ్రంథరచనలు మున్నగు సారస్వత కార్యక్రమములందు కృషి యొనర్పసాగిరి. జీవితములో ఏదో యొక సత్కార్యమొనర్చి, జన్మ సాఫల్యత గావించుటకు పరమావధిగ నిర్ణయించుకొనుట ఉత్తమ ధర్మమని సూచించిరి.

మా నాన్నగారి బాల్యమిత్రులు, హితైభిలాషులు, సహృదయులు శ్రీయుతులు మారేమండ హనుమంతరావు రిటైర్డు హిందీ పండితులు పలికిన హితోక్తులు మరువరానివి. పలికెడిది భాగవతమట, పలికించెడి వాడు రామభద్రుడట అని మహాకవి బమ్మెరపోతనామాత్యులు నుడివినట్లు వ్రాసిన భాగవత కథలే వ్రాయవలెను. ఏలననగా? భాగవతము భక్తిరస ప్రధానమైనది. అది వేదముల కంటే పరమ మాహాత్మ్యము కలది. అందువలన తరతరాలు ఉపయోగపడునట్లు అందలి ఉపాఖ్యానములు రచించుము." అని హెచ్చరించినారు.

తెనాలికి అతిసమీపమునందు గల అంగలకుదురులో శ్రీ కోదండ రామసేవక ధర్మసమాజము "దాసకుటి" అను శ్రీవాసుదాసస్వామి (వావిలికొలను సుబ్బారావు) వారి ఆశ్రమము గలదు. ప్రస్తుతము ఆశ్రమ పంచమ గురుస్థానీయులు నాన్నగారికి మిత్రులేగాక ఆత్మీయులు గూడ. శ్రీగురువు గారు ప్రసంగ వశమున, "ఏదైనా రచనా వ్యాసంగము చేపట్ట వచ్చును గదా !" యని నన్ను ఉత్సాహపరచినారు.

అటుపై నాలో స్పందన కలిగినది. నా దృష్టి భాగవతముపై నిలచినది. విశ్వవ్యాపకుడైన శ్రీ మహావిష్ణువు అవతార వైభవ విశేషములను శక్త్యనుసారము రచించి గ్రంథస్థము గావించవలెనను అభిలాష

బలీయము కాగా, దైవ ప్రేరణయు లభించుట నా అదృష్టము. ఒక శుభ ముహూర్తమున గ్రంథరచనకు శ్రీకారము చేయగలిగితిని.

రచనయందు నాన్నగారి సహాయ సహకారములు గైకొనుచు నిర్విరామ కృషిగావించి, నా ఆశయ సాధనకు రూపకల్పన చేయగలిగితిని. ప్రస్తుత కాలమాన పరిస్థితుల ననుసరించి, గ్రంథ రచన కంటె, ముద్రణము చాల వ్యయప్రయాసలతో గూడియున్నది. అందులకు గాను, పెద్దల సూచన మేరకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారికి ముద్రణకు ఆర్థిక సహాయమర్థించుచు, గ్రంథమును సమర్పించడమైనది. వారు దయతో గ్రంథ ముద్రణకు ఆర్థిక సహకారము నందించినారు. నా కృషికి భగవత్ప్రసాదము లభించినందులకు చాల సంతోషమైనది.

భాగవతము భక్తి, జ్ఞాన, వైరాగ్యాది లక్షణములు గల పరమోత్కృష్ట గ్రంథరాజము. అందుగల ఉపాఖ్యానములన్నియు భక్తిరస పూరితములే. శ్రవణ, పఠన, మననాదుల ద్వారా మోక్షకారకములను నసుటలో సందియ మిసుమంతయును లేదు. అందుకు ఉదాహరణముగా ఈ క్రింది అంశములు మచ్చుతునకలు.

కం॥ ఇందుగలడందు లేడని సందేహము లేదు చక్రి సర్వోపగతుం ।
     డెందెందు వెదకి చూచిన అందందేగలడు దానవాగ్రణి వింటే ॥

(భా. సప్తమ స్కంధము27వ పద్యం)

కం॥ అలుకనైన చెలిమినైన కామంబునైన బాంధవమునైన భీతి
     నైన తగిలి తలుప నఖిలాత్ముడగు హరిచేరవచ్చు వేఱసేయడతడు ॥

(భా. సప్తమ స్కంధము14వ పద్యం)

శా॥ కామోత్కంఠత గోపికల్, భయంబునకంసుందు వైరిక్రియా
     సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
     ప్రేమన్ మీరలు భక్తినేయునిదె, చక్రింగంటి మెట్లైనను
     ధ్యాన ధ్యానగరిష్ఠుడైన హరిన్ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా !

(భా. సప్తమ స్కంధము 18వ పద్యం)

ఇక, ముఖ్యముగా నేటి యువతీ యువకులు ఆంగ్ల విద్యా వ్యామోహమున దగుల్కొని, మన సంస్కృతీ సాంప్రదాయములను పూర్తిగ విస్మరించుచున్నారు. ఇయ్యది అందరెరిగిన సత్యమే. కాని మన ఋషులు స్వార్థరహితులై మానవాళికందించిన భాషా సారస్వత సంపదను, సంస్కృతిని మనము చేజేతుల దూరమొనర్చుకొనుచున్నాము. ఇయ్యదియు విజ్ఞతకాదు. కావున అత్యాధునిక విద్యతోపాటు, మన ప్రాచీన గ్రంథములైన రామాయణ, భారత, భాగవతములను గూడ మన బిడ్డలచే పఠింపచేయుట తల్లిదండ్రుల కర్తవ్యము.

భాగవతమును తెనుగులో ఇతఃపూర్వము యెందరో మహనీయులు వచన కావ్యములుగా వెలువరించి, విజ్ఞాన వీచికలను దేశము నలుదెసల వ్యాప్తిగావించి, పండిత పామరులను పరవశింప చేసియున్నారు. వారందరికి హృదయ పూర్వక పాదాభివందనములు. అయినను భగవత్ప్రేరణ నాధారముగా భాగవత వచన రచనకు సాహసించినందులకు మన్నించ ప్రార్థన,

సర్వులకు పఠనా సౌలభ్యము నుండు విధమున, భాగవతమందలి ఉపాఖ్యానములను, గాథలను సులభశైలిలో అందించుటకు ప్రయత్నించితిని. యువతీయువకులు, పెద్దలు, సారస్వతాభిమానులు, కవిపండితులు, రస గ్రహణపారీణులు సాదరముగ పఠించి, హంస క్షీర నీర న్యాయము వగిది గుణముల నాస్వాదించి ఆదరమున తమ అమూల్య పవిత్రాశీస్సులందించగలరని విశ్వసించుచున్నాను.

ఇట్లు
రచయిత్రి
పి.వి. నాగలక్ష్మి

# విషయసూచిక

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీ భాగవతం - ఉపాఖ్యానములు

**ప్రార్థన :**

శ్రీ కైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకు గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండ కుంభకు మహానందాంగనాడింభకున్ ॥

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వవిఘ్నోప శాంతయే ॥

తల్లీ నిన్నుదలంచి పుస్తకము చేతంబూనితిన్ నీవునా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబుశో
భిల్లం బల్కుము నాదువాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ పూర్ణేందు బింబాననా ॥

ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వని యందుడిందు బరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వడనాది మధ్యలయుడెవ్వడు సర్వము దానయైనవా
డెవ్వడు వాని నాత్మభవునీశ్వరునే శరణంబు వేడెదన్ ॥

చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరికీర్తినుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
గలుగనేటికి తల్లుల కడుపుచేటు ॥

హరియను రెండక్షరములు
హరియించును పాతకముల నంబుజనాభా !
హరినీనామ మహత్త్వము
హరిహర పొగడంగవశమె ! హరిశ్రీకృష్ణా !



# 1. భాగవతము - మహిమ

భాగవతము అనుపదమున '5' అక్షరములున్నవి. అందు ప్రత్యక్షరమునకు మహత్తర పరతత్వార్థమును మహనీయులు నిర్వచించియుండిరి. అందు :

| | | | |
|---|---|---|---|
| ప్రథమాక్షరము | **భా** | అనగా | భక్తి |
| ద్వితీయాక్షరము | **గ** | | జ్ఞానము |
| తృతీయాక్షరము | **వ** | | వైరాగ్యము |
| చతుర్థాక్షరము | **త** | | తపస్సు |
| పంచమాక్షరము | **ము** | | ముక్తి, మోక్షము |

అనగా భక్తి వలన జ్ఞానము గలుగును. దానినాధారముగ వైరాగ్యము చేకూరును. వైరాగ్యమునకు అడ్డుగ నిలచి వేధించునవి. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి అరిషడ్వర్గములు. వీనిని జయించినచో తపస్సు అలవడును. తపస్సు సిద్ధించినచో తురీయావస్థయైన మోక్షము లేక ముక్తి లభించును. ఇవి ఒక దానికొకటి అనుబంధమై యుండును. మోక్షమునకు సోపానములుగ తెలుపబడినవి.

**భక్తి మార్గములు :** భక్తి నవవిధములు. 1. శ్రవణము, 2, కీర్తనము 3. స్మరణము 4. పాదసేవ 5. అర్చనము 6. వందనము 7. దాస్యము 8. సఖ్యము 9. ఆత్మనివేదనము. ఇవియు క్రమమున అనుబంధమై ఆత్మనివేదనమునకు సోపానముములని పండితుల అభిప్రాయం. భక్తి యనగా సేవయని అర్థము చెప్పబడుచున్నది. అట్టి సేవయు అష్టవిధములని చెప్పబడినది.

1. భగవత్‌వాత్సల్యము 2. భగవత్పూజయందుమోదము-సంతోషము 3. భగవద్దర్శనము 4. భగవద్విషయమందు దంభము (కపటము) లేకుండుట 5. భగవత్కథాశ్రవణేచ్ఛ 6. స్వర, నేత్రాంగ వికారము-(అనగా పలుకు మాట లందును, చూపులందును అపవిత్రత, అనుచిత, అసందర్భము) పొందకుండుట, 7. సదా భగవంతుని నామస్మరణము 8. అమాంసభక్షణము (మాంసాదులయందు రజోతమోగుణములుండునుగాన, సత్త్వగుణప్రధానములైన ఆహార, పానీయములను స్వీకరించుట) మున్నగునవి.

**అష్టాంగ యోగములు :** దీనిని గురించి భాగవతమున-ప్ర.స్కం. 131వ పద్యములో తెలుపబడుచున్నది.

చ॥ యమ, నియమాది యోగముల నాత్మనియంత్రితమయ్యు,
గామ రోషముల బ్రచోదితంబయగు, శాంతి వహింపదు, విష్ణుసేవచే
గ్రమమున శాంతి గైకొనినకైవడి, నాదు శరీర జన్మక
ర్మముల రహస్య మెల్ల మునిమండన! చెప్పితి నీవు గోరినన్ ॥

**యమములు :** సత్యముపలుకుట, హింసచేయకుండుట, వేరొకరిసొమ్ము దొంగిలింవకుండుట, బ్రహ్మచర్యమును పాటించుట, అవసరమునకు మించి సంపదను సేకరింపకుండుట, ఇవి ఐదు.

**నియమములు :** శౌచము-(శుచిగనుండుట) సంతోషము, తపస్సు, భగవద్ధ్యానము, స్వాధ్యాయము (భారత, భాగవత, రామాయణములు, ఉపనిష్యాది గ్రంథపఠనము) ఈశ్వర ప్రణిధానము-(భగవద్దర్శనము, నమస్కారాదులు - మున్నగునవి అష్టాంగములు.

"యోగఃచిత్త వృద్ధి నిరోధకః" అను ధర్మముననుసరించి యోగాభ్యాసము వలన మనస్సు నియంత్రణము జరుగును. కాని మరల కామ, క్రోధాది గుణములచే నియంత్రణను గోల్పోయి, అశాంతి పాలగును. విష్ణుసేవాకైంకర్యమువలన మనస్సు క్రమమున శాంతిపొందును. తద్వారా పైనపేర్కొనిన చందమున జన్మరాహిత్యము చేకూరి మోక్షప్రాప్తి కలుగును. కనుక భాగవతమునందలి ఉపాఖ్యానములన్నియు ఈసత్యమునే ప్రబోధించుచున్నవి.

## 2. భాగవతపఠనావశ్యకత - ఆశయము

ఒక సమయమున శౌనకుడు సూతునితో నిట్లనెను.

ఓ మహానుభావా! శుకయోగీంద్రుడు ఎట్టి ప్రయోజనమాశించి, భాగవతమును పఠించెనో తెలుపుడని ప్రార్థింప సూతమహర్షి ఇట్లు చెప్పెను.

కం॥ ధీరులు, నిరపేక్షులు నా
త్మారాములునైన మునులు, హరిభజనము,
నిష్కారణము చేయుచుందురు
నారాయణు డట్టివాడ నవ్యచరిత్రా! భాగవతము-ప్ర.స్కం. 138వ పద్యం

మునులు, మహర్షులు సుఖదుఃఖములకు పొంగకయు, క్రుంగకయు, ధైర్యమున యుండువారును, కామములందు కోరికలు లేనివారును, అనవరతము తమ హృదయకమలమందు శ్రీహరి ధ్యానానందానుభూతులు పొందువారును, కారణము, ప్రతిఫలాపేక్ష నాశించకయే జగన్నాథుడు, జగత్కళ్యాణమూర్తి గుణగణములను కీర్తించుచు గానమొనర్చు వారలను, శ్రీపతియు, ప్రతిఫలాపేక్షరహిత ప్రేమాను వాత్సల్యములు గల భక్తులనుద్ధరించుచుండును." అని శౌనకునకు వివరించెను. కనుక మనభారతీయ సంస్కృతి ఔన్నత్యమును, విశిష్టతను సర్వులు గ్రహించి, అందలి అమృతరసాస్వాదనమును తనివితీర అనుభవించి తరించుట ప్రతియొక్కరి జీవితపరమావధి.

## 3. వ్యాసమహర్షి

శ్రీహరి నాభికమలమునుండి బ్రహ్మసృష్టి ప్రారంభించెను. అనంతరము శ్రీమహావిష్ణువు యపాంతరతముడు అనువానిని సృజించి, "కుమారా! నీవు శ్రుతులను విని, వ్యాసమొనరించి, ప్రచారము చేయుము" అని ఆనతిచ్చి అంతర్ధానుడయ్యెను.

మరుజన్మలో యపాంతరతముడు కృష్ణద్వైపాయనుడై సత్యవతీ పరాశరులకు వ్యాసభగవానుడై జన్మించెను. ఒకానొక సమయమున వ్యాసుడు దండకమండలమును ధరించి, తల్లిదండ్రులకు నమస్కరించి తపమాచరింప బయలుదేరెను. "తల్లీ! నీవు మదిలో తలచినంత మాత్రమున నీ సన్నిధికి రాగలను," అని మాతాపితరుల దీవనలంది తపోభూములకు చనెను.

పిమ్మట కొంత కాలమునకు శంతనమహారాజు సత్యవతిని మోహించి పరిణయ మాడెను. వారికి భీష్ముడు జన్మించెను. సత్యవతి తండ్రి దాశరాజుకిచ్చిన మాట ప్రకారము భీష్ముడు పెండ్లి యాడక బ్రహ్మచారిగ నుండెను. తదుపరి శంతనునకు సత్యవతి వలన చిత్రాంగద, విచిత్రవీర్యులను పుత్రులిరువురు గలిగిరి. వారిలో ఒకరు మరణించగ రెండవవాడైన విచిత్రవీర్యునకు కాశీరాజు పుత్రికలగు అంబిక అంబాలికలతో వివాహము జరిగెను. కొంతకాలమునకు అతడు మరణించెను. కురువంశము అంతటితో ఆగిపోయెను. అంత భీష్ముని వివాహ మాడుమని సత్యవతి కోరెను. అందులకాతడు అంగీకరించలేదు. వంశాభివృద్ధికి బ్రాహ్మణుని వలన సంతతి పొందిన ధర్మవిరుద్ధముగాదని సత్యవతికి వివరించెను.

అంతట సత్యవతి వ్యాసుని మనమున ధ్యానించెను. సంస్మరణ మాత్రమున వ్యాసుడు ప్రత్యక్షమాయెను. కోడండ్రకు సంతానమనుగ్రహించి వంశముద్ధరింపుమని సత్యవతి వ్యాసుని కోరెను. వ్యాసుడు తల్లి అదేశానుసారము అంబికకు ధృతరాష్ట్రుని, అంబాలికకు పాండురాజును, అంబికదాసికి విదురుని ప్రసాదించి వంశము నుద్ధరించెను. అనంతరము అంబికా అంబాలికలకు తత్త్వోపదేశము చేయగ, వారును కఠోరతపమాచరించి పుణ్యలోకములకు చనిరి.

వ్యాసమహర్షి పలుమార్లు పాండురాజు పుత్రులకు దర్శనమిచ్చి వారి యోగ క్షేమములు చూచెను. ఉపకారము లెన్నింటినో యొనగూర్చెను. ప్రతి స్మృతియను విద్యను ధర్మరాజుకు ఉపదేశింప, దానినాతడు అర్జునునకు బోధించెను. దాని సహాయముచే అర్జునుడు దేవతలను మెప్పించి పలువిధ శస్త్రాస్త్రములను పొందెను.

కురుక్షేత్ర సంగ్రామ సమయమున అంధుడైన ధృతరాష్ట్రునకు యుద్ధమున మరణించిన వారి జన్మ రహస్యములను వివరించి దర్శింపచేసెను. కురుపాండవుల చరిత్రనంతటిని తనపేర గ్రంథస్థముగావించెను. అదియే 'మహాభారతము' పంచమవేదమై వ్యాసభారతమై జగద్విఖ్యాతి గాంచెను.

వ్యాసభగవానుడు. అష్టాదశ పురాణములను రచించెను. చివరగ మహా భాగవతమును రచించి మనశ్శాంతిని పొందెను. వేదములను నాలుగు భాగములుగ విభజించెను. శిష్యులైన పైలునకు ఋగ్వేదమును. వైశంపాయనునకు యజుర్వేదమును, జైమినికి సామవేదమును, అధర్వణ వేదమును సుమంతునకు తెలిపి, దేశమున వ్యాప్తి చేయుడని ఆదేశించెను. తాను రచించిన పురాణేతిహాసములను ప్రచారము చేయుమని సూతునకు తెలిపెను. ఆతడు వానిని విశ్వవ్యాప్తి గావించెను.

ఒక సమయమున వ్యాసుడు శివునిగూర్చి తపమాచరించెను. శివుడు ప్రత్యక్షము కాగ, తనకొకపుత్రుని ప్రసాదింపుమని గోరెను. శివుడా వరమును ప్రసాదించి అదృశ్యుడాయ్యెను. ఘృతాచియను అప్సరకాంతవలన వ్యాసునకు పుత్రుడొకడు కలిగెను. ఆతడే శుకుడు. శుకునకు వ్యాసుడు దివ్యబోధనలనేకములు వివరించెను. సృష్టిక్రమమును, యుగములు వాని ధర్మములను తెలిపెను. వర్ణాశ్రమ ధర్మముల నెరింగించెను. అరిషడ్వర్గములను జయించి తపమాచరించినచో పరమపదప్రాప్తి కలుగునని వివరించెను. అంతట శుకుడు మహాజ్ఞాని అయ్యెను. స్మృతికర్తలలో వ్యాసుడొకడు. ఆమహర్షి రచించిన గ్రంథములను 'లఘువ్యాసస్మృతి' అనియు.

దానినే 'వ్యాససంహిత' అనియు అందురు. ప్రజోపకరమగు ఆచారవ్యవహారములు అందునిక్షిప్తము చేయబడెను. ఒక కీటకమునకు వ్యాసుడు ఉత్తమ జన్మను ప్రసాదించెను. అది ఉత్తమ జన్మలు దాల్చుచు ఇంద్రునకు ప్రాణమిత్రుడై ప్రకాశించెను. ఎట్టి ప్రతిఫలాపేక్షలేక వ్యాసభగవానుడు పంచమవేదమైన మహాభారతమును మానవాళికందించి చరితార్థుడై తారాపథమున ప్రకాశించెను. **"వ్యాసో నారాయణో హరిః"** అనగా శ్రీకృష్ణ పరమాత్ముడే వ్యాసుడు. అట్టి వ్యాసభగవానుడు మహాభాగవతమును రచించుటకు యొనగూడిన పరిస్థితులను తెలియుట ముఖ్యము.

## 4. మహాభాగవతం - అవతరణ

కృష్ణద్వైపాయునివల్ల మునులంతా వేదాలను, పురాణేతిహాసములను తెలిసికొని సౌలభ్యంకోసం అనేక శాఖలుగా విభజించి తమ శిష్యులకు బోధించిరి. అటులావిధముగ వేదాలు శాఖోపశాఖలుగా విస్తరిల్లెను. కాని వ్యాసునకు మరొకచింత కలిగెను. అది ఆ మునిని పట్టి పీడించుచుండెను. "స్త్రీలకు, సూద్రులకు వేదము చదివే అర్హత లేదు. అందువలన వారు ముక్తిని పొందలేకున్నారు. వారిని గూడ తరింపచేయు మార్గమేమి?" అని ఆలోచించసాగెను. అపుడు సమస్త వేదములసారమంతా ప్రోగుచేసి, సర్వ ధర్మలను ప్రతిపాదిస్తూ మహాభారతమును ఇతిహాసమును రచించెను. వేదాలను వేరుచేయటంద్వారా కృష్ణద్వైపాయనునకు 'వ్యాసుడు' అనెడి పేరు ప్రసిద్ధమయ్యెను. వేదవ్యాసుడని ముల్లోకములు కొనియాడెను. కాని వ్యాసునకు మనశ్శాంతి లేకుండెను. ఏదో తెలియని వ్యాకులత ఆమహర్షిని పట్టి పీడించసాగెను. అట్టి సమయమున ఒక దినమున సరస్వతీనదీతీరమున చింతాక్రాంతుడై కూర్చుండెను. మనశ్శాంతి కరవైనందులకు కారణము తెలియక విచారించసాగెను.

అపుడు నారదమహర్షి అచ్చోటికి చేరుకొనెను. వ్యాసుడామహర్షిని పూజించి ఉచితాసనమున కూర్చుండచేసెను. అంతట నారదుడు, 'మహర్షీ! నీవు పరబ్రహ్మాదుల నిరంతరము ఉపాసించు మహనీయుడవు. అనుక్షణము సంతుష్టాంతరంగుడవై యుండవలసిన నీవు ఏలనో అటుల కనుపించుటలేదు. దేనినో పోగొట్టుకొనిన వానివలె ఖిన్నుడవై యుంటివి. అంతటి చింతకు బలవత్తరమైన కారణమేమై యుండును?" అని ప్రశ్నించెను.

అందులకు వ్యాసుడు, దేవర్షిసత్తమా ! ఏలనో నా ఆత్మ చింతతో నిండియున్నది. కారణము తెలియకున్నది. వేదములను విభజించితిని. పురాణములను రచించితిని.

సర్వధర్మములను, కర్మలను ప్రతిపాదించుచూ మహాభారతమును రచించగలిగితిని. కాని నాకు శాంతి లభించకున్నది. కారణమూహించ జాలకుంటిని.

మహాత్మా ! తమరు బ్రహ్మమానసపుత్రులు. నిరంతరము హరిపద ధ్యాన తత్పరులు. త్రికాలవేదులు. త్రిలోకసంచారులు. తమకు తెలియని రహస్యములు, సత్యము లేదు. నేచేసిన నేరమో, దోషమో, తెలిపి నాకు చిత్తశాంతిని ప్రసాదింపుడు. అట్టి ఉత్తమ మార్గముపదేశించి పుణ్యులుకండు." అని వేడుకొనెను.

నారదుడంతట "మహర్షీ ! నీమాటలన్నియు సత్యములే. కాని, నీవు లక్ష్మీవల్లభుడైన శ్రీహరి మహిమను కీర్తించవైతివి. ఇప్పుడైనను నారాయణుని దివ్యలీలలను వర్ణించుము. అటుల చేయనిచో నీశ్రమయంతయు వ్యర్థము. నీవు రచించిన పురాణేతిహాసములందు శ్రీమన్నారాయణుని సందర్భానుసారముగా వర్ణించి యుంటివేగాని, ప్రధానముగా వర్ణించి చెప్పవైతివి. కావున సర్వవ్యాపకుడైన విష్ణువును వర్ణించుచు గ్రంథమొక దానిని రచించుము. అయ్యది ముల్లోకములందలి భాగవతోత్తములకు శిరోధార్యమై ప్రకాశించుచు, 'భాగవతము' అను పేరున జగత్ప్రసిద్ధ మగును. దాని మూలమున నీవు శ్రీమహావిష్ణువునకు ప్రీతిపాత్రుడవై పరమానందము పొందగలవు." అని చిత్తశాంతినిపొందు ఉత్తమమార్గమును ఉపదేశించెను.

భాగవత రచనకు ప్రధానమైన మూలచరిత్రమిది. నారదమునీంద్రుని ఆదేశానుసారము వ్యాసమహర్షి భాగవత రచనకు పూనుకొనెను. సరస్వతీ నదీ తీరమునకు పశ్చిమ ప్రాంతమునగల "శమ్యాప్రాసం" అను ఆశ్రమము పరమపుణ్య ప్రదమైనది. అచ్చట వ్యాసుడు అత్యంత భక్తిశ్రద్ధలతో ఉత్తమదీక్షతో ఆశీనుడై భాగవత రచనకు శ్రీకారం చుట్టెను. అనంతము, అమోఘము, అద్భుతము అయిన భగవంతుని లీలలు వివరించినాడు. భక్తియోగములో సమాధి నిష్ఠలో లీనమైన వ్యాసభగవానునకు భగవంతుని లీలావిలాసములన్నియు దృగ్గోచరమగుటచే, లీలామానుషవిగ్రహుని దివ్యలీలలన్నియు మధురమనోహరముగా వర్ణించి భాగవత గ్రంథ రచనము చేయగలిగెను.

తరువాత భాగవతమును తనకుమారుడైన శుకయోగీంద్రునిచే చదివింప చేసెను. గంగానదిలో ప్రాయోపవిష్టుడైన పరీక్షిన్మహారాజుకు ఏడుదినములలో శుకుడు భాగవతమును వినిపించెను.

భారతమును పదునెనిమిది పర్వములుగా విభజించిన విధముననే, వ్యాసుడు భాగవతమును పదిరెండు స్కంధములుగా విభజించి చెప్పెను. సంస్కృత

భాగవతమునకు కవిపండితులనేకులు వ్యాఖ్యానములను వ్రాసియుండిరి. అందు శ్రీధరాచార్యుని వ్యాఖ్యానము ఉత్కృష్టమైనదని పండితులభిప్రాయము. ఈ వ్యాఖ్యానములకు త్రిమతములవారు వారి వారి మతానుసారముగా అభిప్రాయములు తెలిపియుండిరి.

## 5. బమ్మెర పోతన

పోతన మహాభక్తుడు. భాగవతామృతమును ఆంధ్రలోకమునకు అందించిన మహనీయులలో పోతన అగ్రగణ్యుడు. ఈయన జన్మస్థలము ఓరుగల్లు నందలి బమ్మెర గ్రామము. ఈతని కాలము క్రీ.శ. 1450-1510 సంవత్సరములు. అనగా పదునైదవ శతాబ్దికి ఉత్తరార్థము.

పోతన తల్లిదండ్రులు కేసనమంత్రి లక్కమాంబలు, కౌండిన్య గోత్రము వాడు. ఆపస్తంబ సూత్రుడు. సహజ పాండిత్యుడు. వీరభద్రవిజయము, భోగినీదండకము వీరి రచనలు. శ్రీనాథుడు పోతనకు సమకాలికుడు. కేసన, మల్లన, నారయలు పోతన కాలమువారే.

## 6. నైమిశం

నైమిశారణ్యము మహత్తర పుణ్యక్షేత్రము. అది శ్రీమహావిష్ణువునకు ఆవాసపవిత్ర స్థలము. పురాణములకదిపుట్టినిల్లు. ఒక సమయమున మహర్షులందరు అచ్చట సత్రయాగముచేయ సమావేశమైరి. యాగము సహస్రసంవత్సరములు జరుగును. ఆ సమయమున సూతుడు అచటికరుదెంచెను. అతడు జగద్విఖ్యాతుడైన పురాణ ప్రవక్త. రోమహర్షణుని కుమారుడు. వ్యాసుడు తాను రచించిన పురాణేతిహాసము లన్నింటిని రోమహర్షణునకు ఉపదేశించెను. సూతుడు తండ్రివద్ద వానినన్నింటిని అభ్యసించి గొప్ప పౌరాణికునిగా ప్రసిద్ధిచెందెను.

శౌనకాది మునులందరు సూతుని భక్తిశ్రద్ధలతో పూజించి గౌరవించిరి. తమకు పురాణజ్ఞానమును కలిగింపుమని ప్రార్థించిరి. వారు కోరినవిధముగా సత్రయాగ కాలమంతయు, సూతుడు పురాణములను వినిపించగా, వానినివిని మునులందరు తరించిరి. ఆ విధముగా శౌనకాది మహర్షులమూలమున పురాణములెల్ల లోకమున వ్యాపించి బహుళప్రచారమయ్యెను.

భాగవతమును సూతుడు ఒక ప్రత్యేక విధమున వివరించెను. భగవంతుని అనంతలీలలు అందువిశేషముగ వర్ణించినందుననే, భాగవతము విశిష్టస్థానమును సంతరించుకొనినది. అందువలననే వ్యాసభగవానుడు భాగవతమును రచించి చిత్తశాంతిని, ఆత్మానందమును పొందగలిగెను. ఇందు మరియొక్క విశేషముగూడ పేర్కొనవచ్చును. వ్యాసుడు తాను రచించిన మహాభారతాది ఇతిహాసములను శిష్యులకు ఉపదేశించినను, భాగవతమును మాత్రము తన పుత్రుడైన శుకునకే బోధించెను.

గంగానది నదులలో శ్రేష్ఠమైనది. అటులనే పురాణములందు భాగవతము శ్రేష్ఠతమము. కనుకనే భాగవతము కలియుగమునందు సమస్త దోషములను హరింపచేయును. అట్టి భాగవత పఠనమునకు శుకుడె అర్హుడని వ్యాసభగవానుడు అభిప్రాయపడి, అతనిచేతనే అధ్యయనము చేయించినాడు.

## 7. అష్టాదశపురాణములు - (18)

అష్టాదశ పురాణములను సులువుగా గుర్తించుటకు ఈ శ్లోకము మిగుల ఉపయుక్తము.

**భద్వయం మద్వయం చైవ బ్రత్రయం వచతుష్టయం ।**
**అనాపలింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్ ॥**

**భద్వయం:** 1. భాగవతము, 2. భవిష్యపురాణము.

**మద్వయం:** 1. మత్స్యపురాణము 2. మార్కండేయ పురాణము.

**బ్రత్రయం:** 1. బ్రహ్మపురాణము 2. బ్రహ్మవైవర్త పురాణము 3. బ్రహ్మాండ పురాణము

**వచతుష్టయం:** 1. విష్ణు పురాణము 2. వరాహపురాణము 3. వామన పురాణము 4. వాయు పురాణము.

అ - అగ్ని పురాణము.
నా - నారద పురాణము.
ప - పద్మ పురాణము.
లిం - లింగ పురాణము.
గ - గరుడ పురాణము.
కూ - కూర్మ పురాణము.
స్కా - స్కాంద పురాణము.

ఇవి పదునెనిమిది పురాణములు. ఇవి గాక ఇంకను సనత్కుమార, నారసింహ, మున్నగు ఉపపురాణములు, గణేశ, మౌద్గల పురాణములు గలవు. ఇవి యన్నియు వ్యాసమహర్షిచే సృజింపబడినవే.

## 8. శుకయోగి

పూర్వము ఒకానొక సమయమున వ్యాసమహర్షి మేరుపర్వతమున ఉగ్రతప మాచరించెను. శంకరుడపుడు ప్రత్యక్షమై వరముకోరుకొనుమనెను. వ్యాసుడు, "మహానుభావా ! పంచభూతములతో దీటగు పుత్రుని అనుగ్రహించు" మని ప్రార్థించెను. "అటులే అగుగాక" అని పరమేశ్వరుడు వరము ప్రసాదింప, దాని ప్రభావమున శుకుడు జన్మించెను.

ఒక దినమున వ్యాసుడు అగ్నికార్యం నిమిత్తము అరణి మథించుచుండెను. (అరణి అనగా ఒక కర్రలో మరియొక కర్రను అమర్చి రాపిడి చేయుట. ఈక్రియలో అందు అగ్ని పుట్టును.) ఆసమయమున ఘృతాచియను అప్సరాంగన వ్యాసుని కంటబడెను. వెనువెంటనే ఆతనికి మోహము జనించెను. ఆవిషయము ఘృతాచి గ్రహించెను. కాని తపస్సంపన్నుడైనముని ఆగ్రహించి శపించునని భయమందెను. వ్యాసుని వంచించవలెనని దలచి, ఘృతాచి శుక (చిలుక) రూపము ధరించి అందందు సంచరించసాగెను. కామ పీడితుడైన వ్యాసుడు చిలుకను వీక్షించు సమయమున ఆతనివీర్యము అరణిలో పతనమయ్యెను. వెనువెంటనే బాలుడొకడు జన్మించెను. బాలుని రూపురేఖా విలాసములు ముమ్మూర్తులా చిలుకను బోలియన్నందున, అతనిని శుకుడనిరి. అదియే ఆతనికి సార్థక నామమై లోకమున ప్రసిద్ధుడాయెను. స్త్రీ పురుషులు సంగమించు కాలమున వారిమనస్సు దేనియందులగ్నమైయుండునో అద్దానిరూపురేఖలు గుణములు కలిగెడు సంతానముపై ప్రతిబింబించునని పెద్దలందురు. కర్మానుభవము గూడ అందులకు తోడగును.

పుట్టుక తోడనే శుకుడు మహాయోగాయెను. బ్రహ్మ ఆబాలునకు ఉపనయనాది సంస్కారములుగావించెను. దండకమండలములు వరప్రసాదముగా దివినుండి ఆతనికి లభించెను. శుకుడు వేదవేదాంగములు, శాస్త్రములు తండ్రివద్దనే అభ్యసించెను. తండ్రి ఆదేశానుసారము జనకమహారాజువద్ద పరబ్రహ్మతత్వాన్ని గ్రహించెను. నారద మహర్షిగూడ శుకునకు పరతత్వాన్ని బోధించినాడు.

శుకుడు అవధూత, (దిగంబరుడు) ముక్తసంగుడు, సృష్టియందలి ప్రత్యణువు బ్రహ్మపదార్థముగా గోచరించును. స్త్రీ, పురుషభేదము గాని, అందుకు సంబంధించిన పరిజ్ఞానముగాని లేదు. అంతయు ఒక్కటే అను భావము మాత్రము గలదు. సర్వసంగ పరిత్యాగి యాతడు. వివస్త్రుడై తిరుగుచుండెడివాడు. ఆతని ప్రవర్తనము అంతుపట్టెడిది గాదు. అందువలన శుకుని ఉన్మత్తునిగను, మూఢునిగను భావించెడివారు.

ఒక సమయమున శుకుడు కైలాసమునకు పోదలచెను. ఒక్కమాటుగ ఆకాశమున కెగసెను. అదిగమనించిన వ్యాసుడు వానివెనుకనే బయలుదేరెను. అపుడు ఒక సరోవరమున దేవకాంతలు కొందరు వివస్త్రలై జలక్రీడలు సలుపుచుండిరి. వారు శుకుని జూచిరి. అటుమీదట దేవతాస్త్రీలు వ్యాసుని చూచి, సిగ్గుచే వెనువెంటనే వస్త్రములు ధరించిరి. శుకునిజూచి మనోవికారము చెందరైరి. ఆచర్య వ్యాసునకు వింతగ గోచరించెను. వారి దరిచేరి అందలి అంతరార్థమును తెలుపుమని మగువలను గోరెను.

"సుందరులారా ! నాకుమారుడు శుకుడు ప్రాయమున చిన్నవాడు. మరియు యౌవ్వనమునందున్నవాడు. అట్టివాని గాంచి మీరు సిగ్గుచెందిన వారుగారు. పసివానిని గాంచిన భావనతోనే ప్రవర్తించినారు. మరినేను వానికంటే పెద్దవాడను. వాని తండ్రిని. నన్ను చూచినతోడనే లజ్జచే భీతమనస్కులై వెనువెంటనే వస్త్రములు ధరించినారు. ఎందులకట్లు ప్రవర్తించినారు." అని ప్రశ్నించెను.

అపుడాదేవాంగనలు, "మహర్షీ ! మన్నింపుడు. మీరు గొప్పజ్ఞానులు. వయోవృద్ధులు. అయినను మీయందు రాగద్వేషాదులు నశించలేదు. స్త్రీ పురుష భేదజ్ఞానం నీయందు యింకను నిలచియున్నది. నగ్నముగ మమ్ములను గాంచినంతనే నీయందు మన్మధవికారములు జనించు అవకాశములు యింకను మెండుగయున్నవి. కాని నీపుత్రుడు శుకుడు అట్లుగాదు. అతడు మహాయోగి. బ్రహ్మజ్ఞానము గలవాడు. సృష్టిలో ప్రతివస్తువునందును సమత్వదృష్టి గలవాడు. స్త్రీ పురుష భేదజ్ఞానమాతనికి లేదు. వివస్త్రలమై నగ్నముగావున్న మమ్ము జూచినను అతని యందు యెట్టి వికార చేష్టలు లేవు. అటులే మాకును సిగ్గు జనించినదిగాదు. యెట్టి మనోవికారభావనలు మాలో చోటుచేసికొన్నది లేదు. మాదృష్టిలో నీపుత్రుడు శుకుడు తల్లియొడిలోని పసిపాపడే." అని బదులుపలికిరి.

శుకుడు ఎందును ఎక్కువ కాలము నిలువడు. ఎవ్వరితోడను భాషించడు. ఎవ్వరిని చూడడు. ఒకచో ఎందైనను నిలచినను, ఆవుపాలు పితుకుటకు ఎంత

కాలము పట్టునో, అంతకాలము మాత్రమే యుండును. (ప్రస్తుత కాలమానము ప్రకారము అరున్నర నిమిషములు.) ఎవ్వరైనను ప్రశ్నించినచో, అందుకు సరియగు సమాధానము చెప్పిగాని పోడు. అట్టి శుకయోగీంద్రుడు వ్యాసభగవానుడు రచించిన మహాభాగవతమును తాను స్వయముగా పరీక్షిన్మహారాజుకు వినిపించి, తాను ధన్యుడై తద్వారా సమస్త మానవాళిని ముక్తులను గావించినాడు. పరమభక్తాగ్రగణ్యులలో ఒకరైన శుకమహర్షిని గూడ మనము అనుదినము స్మరించుట మనధర్మము.

## 9. నారదుడు

పూర్వకల్పమున ఉపబర్హణుడను గంధర్వుడు కలడు. అతడు మిగుల విలాస లోలుడు. సౌందర్యమున మన్మధునకు దీటగువాడు. తన సౌందర్యాది లక్షణములతో మగువలను మత్తునముంచి, వారికి ప్రియుడై కేళీవిలాసములకు వశుడై యుండెడివాడు.

ఒక సమయమున విశ్వశ్రేష్ఠులైన బ్రహ్మలు "దేవసత్రము" అనుయాగమును సంకల్పించి, అందుగల అప్సరకాంతలను,"ఓ సుందరాంగనలారా! యాగమునకు వచ్చి శ్రీమన్నారాయణుని గుణగణములు గానము చేయవలసినదిగా కోరిరి." అంత ఉపబర్హణుడును కాంతలతోగూడిచని, విష్ణుగాథలను మనోహరముగ గానమొనర్చెను. తరువాత మోహావరవశుడై, కాంతలతోగూడి వెనుతిరిగివచ్చెను. అతని నిర్లక్ష్యభావమునకు బ్రహ్మ ఆగ్రహించి, "తేజోహీనుడవై, శూద్రుడవై జన్మింపు" మని శపించెను. అటుపై ఉపబర్హణుడను ఒక బ్రాహ్మణునియింట దాసికి పుత్రుడై జన్మించెను. అటుల జన్మించియు బ్రహ్మజ్ఞానులైన మహనీయులను సేవించియు, శుశ్రూషలు చేసియు, పూర్వపుణ్య భాగ్యవశమున తదుపరి కాలమున బ్రహ్మమానస పుత్రుడై జన్మించి నారదనామమున ప్రసిద్ధుడాయెను.

### భాగవతమందలి ఇతిహాసము :

నారదుని తల్లి ఒక బ్రాహ్మణోత్తముని గృహములో సేవలు చేయుచుండెడిది. బాల్యమునుండి నారదుడు భక్తిభావతత్పరుడు. సన్న్యాసులవద్దకేగి వారలను సేవించు చుండెడివాడు. జన్మతః బాలునియందు గురుభక్తి, భగవద్భక్తి, మితభాషిత్వము, సదాచారము, సన్మార్గవర్తనము మొదలైన సద్గుణములన్నియు మెండుగ గలవు. మహనీయులను సేవించుచు వారితోపాటు భోజనాదులు స్వీకరించడము వలన,

చిత్తశుద్ధి గలిగెను. బాలునిచూచిన సన్న్యాసులకు అతనియందు దయ, వాత్సల్యము, అనుగ్రహ భావమేర్పడెను. పరమేశ్వరతత్త్వజ్ఞానము నుపదేశించిరి. నాటినుండి నారదుడు పరమభగవద్భక్తుడై ప్రకాశించెను.

నారదుని తల్లి అమాయకురాలు. ఏమియు తెలియని మూఢురాలు. ఆకారణము చేత, ఏకైక పుత్రుడైన నారదునియందు తగినయట్లు యోగక్షేమములు విచారించెడిది కాదు. ఒకనాడు దురదృష్టవశమున ఆమెను పామొకటి కాటువేయగా ఆమె మరణించెను. ఆ సమయమున నారదుడు ఐదేండ్ల ప్రాయమువాడు. తల్లి మరణముతో నారదుడు దిక్కులేనివాడై దుఃఖములతో నిండినవాడయ్యెను. అయినను ఆవిచారమును వెనువెంటనే మరువగలిగెను. సన్న్యాసులతో కలసి తిరుగువాడు. సన్న్యాసము స్వీకరించవలెనను కోరిక బలీయముగనుండెను. మాతృబంధముకూడా అతనికి విడిపోయెను. అదికూడ తనభావములకు అనుకూలించినందులకు ఆనందించెను. ఒక శుభదినమున సన్న్యాసము స్వీకరించి దేశసంచారము మొదలిడెను. ఆకలి దప్పులతో అలమటించుచున్నను, అలసిపోవుచున్నను, ఎన్ని బాధలు యెదురై బాధించుచున్నను, హరినామస్మరణము మాత్రము నారదుడు మరువలేదు, విడువలేదు.

ఒక దినమున నారదుడు ఒకనదిని సమీపించెను. అందు స్నానమాడి సంధ్యా వందనాదులు, జపతపానుష్ఠానములు ముగించుకొని, కడుపునిండుగ నీళ్ళుత్రాగి, ఒక అశ్వత్థవృక్షపు నీడక్రింద సేదతీర్చుకొను నిమిత్తము కూరుచుండెను. చిత్తమును శ్రీమహావిష్ణువు పాదపద్మములపై ఆయత్తపరచి, తన్మయత్త్వమొంది హరినామ స్మరణము చేయుచు ధ్యానసమాధినిచేరెను. ధ్యానముద్రలో ఆతనికి భగవంతుని దివ్యసందర్శనభాగ్యం లభించెను. కాని అది క్షణములో అదృశ్యమయ్యెను. ఆదివ్య మంగళస్వరూపము అంతలోనే అంతర్ధానమైనందులకు, ఆతనియందు ఆనందం, దుఃఖం ఏక కాలమందు కలిగెను. భగవంతుని వియోగమును భరించలేక వికల మనస్కుడై తహతహలాడెను. అమితమైన ఆరాటము, ఆవేదన, తపనకు గురయ్యెను. అయినను హరినామ స్మరణార్ణవమున నోలలాడెను. అపుడాతనికి అశరీరవాణి వినిపించెను.

"వత్సా! నారదా! ఈ జన్మమునందు నీవు నన్ను గాంచజాలవు. నీ భక్తికి మెచ్చి, నాదగు దివ్యరూపమును ఒక్కపరి దర్శింపచేసితిని. మహనీయులైన మహా

యోగులకు కూడ నాదివ్యదర్శనభాగ్యము దుర్లభము. ఒక విశేషము వినుము. త్వరలో నీవు ఈ శరీరమును త్యజించగలవు. అపుడు నీకు నాసాన్నిధ్యం లభించ గలదు. నీకు దివ్యమైన జ్ఞానమును, స్మృతిని అనుగ్రహించుచుంటిని. దాని ప్రభావమున భక్తి, జ్ఞానాన్ని విడువక కలిగియుందువు."

తరువాత కొంతకాలమునకు నారదుడు దేహము చాలించెను. కల్పాంతమున లోకములన్నియు నశించి జలమయమయ్యెను. ఆ మహా సముద్రమున శ్రీమన్నారాయణుడు ఒకచోట లీలావినోదుడై శయనించియుండెను. అంత బ్రహ్మదేవుడు నారాయణుని గర్భములో ప్రవేశించనున్న సమయమున, బ్రహ్మదేవుని శ్వాసతో నారదుడు బ్రహ్మగర్భములో ప్రవేశించెను.

అనేక యుగముల తదుపరి పరమేష్టి మరల సృష్టికి పూనుకొనెను. అపుడు బ్రహ్మదేవుని ప్రాణములనుండి మరీచి, మున్నగు ప్రజాపతులు జన్మించిరి. వారితో పాటుగ నారదుడు ఉద్భవించెను. శ్రీమన్నారాయణుని దివ్యానుగ్రహము వలన నారదునకు దివ్యశరీరము లభించెను. దేవదత్తము, అత్యంత మహిమాన్వితము అయిన "మహతి" అనువీణ నారదునకు ప్రాప్తించెను. దానితో పాటుగ సర్వజ్ఞత్వము, చిరంజీవత్వము, అపారపాండిత్యప్రతిభ, సుమధురమనోహరగానము లభించెను. త్రిభువనములందు ఎదురులేక సంచరించగల శక్తియు చేకూరెను. ఈ విధముగ బ్రహ్మమానస పుత్రుడుగ అవతరించిన నారదుడు పరమ భాగవతోత్తముడుగ ప్రకాశించెను.

నారము అనగా జ్ఞానమని అర్థము. జ్ఞానప్రదాత కనుక ఆతనిని నారదుడనియు, మోక్షమును, సద్గతినిచేరుటకు మార్గదర్శకుడగుటచే నారదుడని సార్ధక నామధేయు డయ్యెను. జగత్కల్యాణ కృత్యములకు సహకరించుటలో నారదునియందు ఒక ప్రత్యేక లక్షణమున్నది. ఉదాహరణకు గర్భస్థశిశువు అయిన ప్రహ్లాదునకు జ్ఞానప్రదాత అయ్యెను. అట్లే వాల్మీకికి "రామతారక మంత్రముపదేశించి" గొప్పజ్ఞానిగను, మహర్షిగను గావించినాడు. అంతేగాక గాయత్రీ రామాయణముపదేశించి, వాల్మీకి మహర్షిచే ఆదికావ్యమైన శ్రీమద్రామాయణ మహాకావ్యాన్ని సృష్టింపచేసినాడు. అటులే వ్యాసమహర్షిచే భాగవతమును రచింపచేసి మహర్షికి మనశ్శాంతిని గలిగించిన మహనీయుడు. అట్టి నారదుడు మనయెల్లరకు చిరస్మరణీయుడేగదా!.

# 10. అశ్వత్థామ

శౌనకాది మహామునులు సూతుని ఈ విధముగ ప్రశ్నించిరి. "ఓ మహర్షీ ! పరీక్షిన్మహారాజు ప్రాయోపవేశం ఎందులకు చేసినాడు? శుకుడు భాగవతమును వినిపించుటకు కారణమేమి?" అనినంత సూతుడు మహాభారతమందలి చివరి ఘట్టమందలి కొన్నివిశేషములు వివరించవలసివచ్చెను. అందు అశ్వత్థామ చరిత్ర ముందు నుడివెను.

కురుపాండవులకు కురుక్షేత్రములో పదునెనిమిది దినములు మహాసంగ్రామము జరిగెను. ఉభయసైన్యములందు మహావీరులెందరో మరణించిరి. కురుసార్వభౌముడైన దుర్యోధనుని తొడలు భీముడు విరుగగొట్టగా శమంతపంచకమువద్ద కురురాజు నేలగూలెను. అప్పటి యుద్ధమున మరణించక మిగిలియున్న వీరాగ్రేసరులలో అశ్వత్థామయొక్కడే. ధృతరాష్ట్రుడు అప్పుడు ప్రాణావశిష్టుడై యుండెను. అతనికి ఆనందమును కలిగించుటకు అశ్వత్థామ ఘోరకృత్యమునకు పూనుకొనెను. నిదురించుచున్న బాలకులైన ఉపపాండవులకు, అర్ధరాత్రి సమయమున శిరస్సులు ఖండించి వచ్చెను. అది తెలిసిన పాంచాలి దుఃఖము పట్టజాలక కన్నీరుమున్నీరుగా రోదించెను. అంతట పార్థుడు అశ్వత్థామ తల నరకి తెత్తునని ప్రతినబూని ద్రౌపదినోదార్చెను. గాండీవధారియై అర్జునుడు బయలుదేరెను.

అర్జునుడు తనకడకు రోషావేశముతోవచ్చుట గమనించిన అశ్వత్థామ భయమున రథమునెక్కి పారిపోసాగెను. కొంత దూరము పోయిన పిదప, అశ్వత్థామ "అపాండవమగుగాక" అని సంకల్పించి ప్రచండమైన అస్త్రాన్ని ప్రయోగించెను. ఆ అస్త్రప్రభావమునుండి ఉజ్జ్వలతేజస్సు వెలువడ దశదిశలు తేజస్సుచేనిండెను. అదిగాంచిన అర్జునుడు భయమంది తరుణోపాయము తెలుపుమని శ్రీకృష్ణునివేడెను. "అర్జునా ! అశ్వత్థామ బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించినాడు. దానిని ప్రతిఘటింప నేరితరముగాదు. అందుకు ప్రతిగా నీవును అదే అస్త్రమును ధ్యానించి ప్రయోగించుము. అంతకు మించి వేరు మార్గాంతరములేదు." అని శ్రీకృష్ణుడు తెలుప, అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మను ధ్యానించి బ్రహ్మ శిరోనామకాస్త్రమును ప్రయోగించెను. రెండస్త్రములు గగనమున ఢీకొనగ ప్రళయాగ్ని జ్వాలలుద్భవించెను. అవి భూనభోంతరము లావరించెను. ప్రాణికోటియంతయు భీతావహులై హాహాకారములొనర్చుచు తల్లడిల్లెను. ప్రళయకాల మాసన్నమైనట్లు తోచెను. అపుడు శ్రీకృష్ణుడు, "అర్జునా! అస్త్రముల రెంటిని ఉపసంహరింపుము" అని ఆనతిచ్చెను.

ఆ దివ్యాస్త్రమును అగస్త్యుడు ద్రోణునకుపదేశింప, దానినామహనీయుడు ప్రియశిష్యుడైన అర్జునునకు బోధించెను. అశ్వత్థామయు ఎటులో తండ్రిని ప్రార్థించి, మహాస్త్రమును పొందెను. కాని అశ్వత్థామకు అస్త్రప్రయోగము మాత్రము తెలియును గాని ఉపసంహారము తెలియదు. ఎట్టి పరిస్థితులందును అస్త్రమునెవరి మీదను ప్రయోగించవలదని ద్రోణాచార్యుడు అశ్వత్థామకు గట్టిగ చెప్పెను. కాని తండ్రి మాటలను పెడచెవినిపెట్టి అశ్వత్థామ ఘోరమైన అస్త్రమును ప్రయోగించినాడు. అతనియందుగల తామసప్రవృత్తి అందుకు ప్రధానకారణము.

శ్రీకృష్ణుని ఆదేశానుసారము దివ్యాస్త్రముల రెంటిని ఉపసంహరించెను. వెంటనే అర్జునుడు అశ్వత్థామ మీదకు దుమికి, ఆతనినిపట్టి రథమునకు బంధించెను. ద్రౌపదివద్దకు గొనిపోవుటకు సిద్ధపడగ, కృష్ణుడు అతనిని నిర్దయగ వధించుమని పార్థుని హెచ్చరించెను. " అర్జునా! ఇతడు కడుపాపాత్ముడు. అర్ధరాత్రిసమయమున బాలురనికూడ కనికరించక అతి దారుణముగ, నిష్కారణముగ ఉపపాండవులను వధించిన పరమకిరాతకుడు. బ్రాహ్మణుడని తలచక ఈతని శిరము ఖండించి పాంచాలికొసగి నీప్రతిన చెల్లించుకొనుము." అని తీవ్రముగ హెచ్చరించెను.

అయినను పార్థుడు ఆతనిని వధించుటకు సమ్మతించలేదు. గురుపుత్రుడు. మీదుమిక్కిలి బ్రాహ్మణుడు. గురుపుత్రుడు గురువుతో సమానుడు. అందుచే అశ్వత్థామను వధించుటకు చేతులాడలేదు. రథమునకు బంధించిన వానిని అట్లే పాంచాలి వద్దకు గొనిపోయెను.

శ్రీకృష్ణుడు అర్జునుని చిత్తశుద్ధిని పరీక్షింపనెంచి, అశ్వత్థామను చంపుటకు ప్రోత్సహించెను. కాని అర్జునుడు ధర్మము పాటించి శ్రీకృష్ణుని మెప్పించెను.

పాంచాలి అశ్వత్థామను గాంచి జాలిపడెను. తన పుత్రులను సంహరించి, తనకు గర్భశోకమును కలిగించిన కఠినాత్ముడనికూడ ఏవగించుకొనక పూజ్య భావమున భక్తితో నమస్కరించెను. "ఇతడు బ్రాహ్మణుడు, గురుపుత్రుడు, సాంగోపాంగముగ ధనుర్వేదమును, అస్త్రవిద్యారహస్యములను బోధించిన ద్రోణాచార్యుని పుత్రుడు. వీనిని గాంచినంతనే కుంభసంభవుని చూచినంత తృప్తి కలుగుచున్నది. నీవితనిని సంహరించినచో, ఈతని తల్లి కృపి పుత్రశోకంతో వెంటనే మరణించును. మనకీపాపమువలదు. క్షమించి వదలుము. ఎవరి కర్మ వారనుభవింతురు. నీవు ధర్మజ్ఞుడవు. ధర్మమును రక్షింపుము. వంశకీర్తిని నిలుపుము." అని ప్రార్థించెను.

పాంచాలి మాటలకు అర్జునునకు కర్తవ్యము తోచినదిగాదు. ఆలోచించ సాగెను. అంతట కృష్ణుడు, "పార్థా ! నీకొక ఉపాయముచెప్పెద వినుము. అశ్వత్థామతలలో దివ్యరత్నమున్నది. అతని కేశములతో అది పుట్టినది. ఆశిరోమణి గొప్ప మహిమ గలది. ఆతని శిరోజములు ఖండించి, శిరోమణిని గ్రహించుము." అని చెప్పెను. వెంటనే ధనుంజయుడు ఆతని శిరోజములు ఖండించి దివ్యమణిని గ్రహించి, అతనిని బంధవిముక్తుని గావించి విడిచిపుచ్చెను. ధర్మశాస్త్రమున చెప్పినవిధముగా అశ్వత్థామ గొప్ప అవమానమును పొందెను. తలగొరుగుట, సంపద హరించడము, దేశ బహిష్కరణము బ్రాహ్మణునకు దండనములని శాస్త్రప్రమాణము. అశ్వత్థామ తేజమంతయు గోల్పోయెను. అవమానభారమున అచ్చోటు విడచిచనెను.

అశ్వత్థామ ప్రయోగించిన దివ్యాస్త్రము వ్యర్థముకాలేదు. పాండవులు దేవతల వరప్రభావముచే జన్మించినవారు. వారినేమియు చేయజాలదు. కాని ఆసమయమున అభిమన్యుని భార్య ఉత్తర గర్భవతి. ఆమెకు పుట్టబోవుబిడ్డ పాండవుల వంశాంకుర మగును. అందుచే అస్త్రప్రభావము గర్భస్థపిండమును వేధించసాగెను. ఆవేదన భరించజాలక ఉత్తర పరుగునవచ్చి శ్రీకృష్ణుని పాదములవ్రాలి తనబిడ్డను రక్షింపుమని ప్రార్థించెను. అంతట కృష్ణుడు యోగమాయను ఉత్తర గర్భములో ప్రవేశపెట్టి శిశువును కాపాడెను. తన చక్రాయుధముచే బ్రహ్మశిరోనామకాస్త్రమును అణచెను. తరువాత ఉత్తరకు పుత్రుడు కలిగెను. అతడే పరీక్షిత్తు. ఆతడు పెరిగిపెద్దవాడై పరీక్షిన్మహారాజుగ ప్రసిద్ధుడై ఘనకార్యములనేకములు చేసెను.

## 11. భీష్ముడు

శంతనమహారాజు వలన గంగాదేవికి భీష్ముడు జన్మించెను. ఇతని మొదటిపేరు దేవవ్రతుడు. "ద్యో" అనుపేరు గల తొమ్మిదవ వసువుయొక్క అవతారము. తనతండ్రి శంతనమహారాజుకు, సత్యవతితో పెండ్లి జరిపించుటకు ఆమె తండ్రి దాశరాజు అభిమతానుసారము జీవితాంతము బ్రహ్మచారిగా నుందుననియు, రాజ్యపదవి నాశించననియు, రాజ్యమును తృణప్రాయముగ త్యజింతుననియు భీష్మప్రతిజ్ఞ చేసెను. అట్టి భీషణప్రతిజ్ఞ చేసినందున నాటినుండి దేవవ్రతుడు భీష్ముడనుపేర సార్థక నామధేయుడయ్యెను. తన తండ్రి సుఖసంతోషములకై, మానవునకు అత్యంత మోహకారకమగు స్త్రీసుఖమును, భోగభాగ్యములకు ఆలవాలమైన రాజ్యసౌఖ్యములను

జీవితాంతము శాశ్వతముగా త్యజించినాడు. ఈకారణముతో తండ్రి భీష్మునియెడ మిగుల ప్రసన్నుడాయెను. "పుత్రకా ! నీయిచ్ఛలేక మృత్యువుకూడా నిన్ను కబళింప జాలదు. కనుక నీకు ఇచ్ఛామరణమును ప్రసాదించుచున్నాను" అని వరమనుగ్రహించెను.

భీష్ముడు అజన్మ బ్రహ్మచారి. మహాతేజస్వి. శస్త్రాస్త్రములందు పరిపూర్ణ పాండిత్య ప్రతిభ గలవాడు. అపార అనుభవజ్ఞుడు. మహాజ్ఞాని. గొప్పవీరుడు. ధృఢ నిశ్చయ సంపన్నుడు. మహాపురుషుడు. ఈ మహనీయుని యందు శౌర్యము, వీర్యము, త్యాగము, క్షమ, దయ, శమము, దమము, సత్యము, అహింస, సంతోషము, శాంతి, బలము, తేజస్సు, న్యాయమందు విశ్వాసము, నమ్రత, ఉదారత, లోకప్రియత్వము, స్పష్టమైన వాదప్రతివాద పటిమలుగలవు. కారణజన్ముడు, ఎట్లనగా?

క॥ ముదమున ప్రభాసుడనునెని
మిదియవ వసునంశమునను మేదిని భీష్ముం ।
దుదయించె సర్వవిద్యా
విదుడపజిత పరశురామ వీర్యుండు బలిమిన్ ॥

పూర్వ జన్మమందు భీష్ముడు ప్రభాసుడను అష్టమవసువు. ఆతడు శాపవశమున శంతనమహారాజుకు దేవవ్రతుండనుపేర జన్మించెను. ఆతడే భీష్ముడు. దేవవ్రతునకు గాంగేయుడనియు పేరుగలదు. మహావీరుడు, అమిత బలసంపన్నుడు.

ప్రతివాదపటిమ, సాహసము, బ్రహ్మచర్యము, జ్ఞాన విజ్ఞానములు, మాతా పితరుల యందును, గురువులయెడను మిక్కిలి భక్తిభావము మున్నగు సద్గుణము లన్నియు ఆతనియెడ పరిపూర్ణముగ వికసించి స్థిరముగ నిలచి ప్రకాశించు చుండెను. ఇతని జీవితము భగవద్భక్తికి అంకితము. శ్రీకృష్ణభగవానుని చక్కగ అధ్యయనము చేసిన మహనీయుడు. పరమనిష్ఠాగరిష్ఠుడు. సేవయందు శ్రద్ధాసంపన్నుడు. శ్రీకృష్ణ భగవానునికి ప్రీతిపాత్రుడు.

ధుర్యోధనుని కొలువు నందున్నను. ఎవరియందును పక్షపాతవైఖరిని ప్రదర్శించ లేదు. ముమ్మూర్తుల ధర్మపక్షపాతి. కౌరవ సభామధ్యమున, నిర్భయముగ రారాజునకు హితముపదేశించిన హితైభిలాషి. శ్రీకృష్ణ భగవానుని విశ్వరూపమును సందర్శించిన పరమభాగవతోత్తముడు. రాజనీతి, ధర్మరక్షణము, క్షాత్రధర్మము నిలుపుటకుగాను కురుక్షేత్రసంగ్రామములో అతిరథుడైనిలచి పోరొనర్చిన వీరాగ్రేసరుడు. రణరంగమున భీష్మునితో సమానుడైన వీరుడెవ్వడును కానరాడు.

ఆచార్యస్థానమలంకరించిన భీష్మపితామహుడు కురుక్షేత్ర మహా సంగ్రామమున, కౌరవపక్షమునకు సర్వసైన్యాధ్యక్షుడై పదిదినములు భయంకరమగు సంగ్రామ మొనర్చెను. తదుపరి క్షతగాత్రుడై అంపశయ్యపై చేరెను.

కురుక్షేత్రయుద్ధము ముగిసెను. పాండవులు ద్రౌపదిని వెంటనిడుకొని గంగానదీ తీరమునకు చేరిరి. శ్రీకృష్ణుడును వారిననుసరించెను. అందరు గంగానదిలో స్నాన మాడిరి. యుద్ధమున మరణించిన జ్ఞాతులకు, బంధుజనులకు యధావిధిగ ఉత్తర కర్మలు నెరవేర్చిరి. తర్పణములు పిండప్రదానములు నిర్వర్తించి పరిశుద్ధులైరి.

యుద్ధమందు అఖండ విజయమును పొందినను, రాజ్యసంపదలు లభించినను ధర్మరాజుకు సంతోషములేదు. శాంతిలేదు. తీవ్ర మనస్తాపమునకు లోనయ్యెను. విరక్తిభావము బలపడెను. వ్యాసుడు శ్రీకృష్ణుడు చెప్పిరి. కాని ధర్మరాజుకు దుఃఖోపశమనము కాకుండెను. చివరకు తనపితామహుడు భీష్ముని వద్దకు వెళ్లవలెనని నిర్ణయించుకొనెను. శరతల్పగతుడైయుండి ప్రాణత్యాగంచేయుటకు సిద్ధముగాయున్న భీష్మునిచెంతకు ధర్మరాజుచేరెను. తనవెంట తమ్ములు, శ్రీకృష్ణుడు, ధౌమ్యుడు మున్నగువారందరు అరుదెంచిరి. ధర్మరాజు భక్తితో భీష్మునకు నమస్కరించి పూజించెను. తన దుఃఖకారణము వివరించి, కర్తవ్యమును బోధించమని ప్రార్థించెను. అపుడు దైవాంశసంభూతుడైన భీష్ముడు ధర్మరాజునకు ఎన్నో ధర్మములను, ధర్మసూక్ష్మములను వివరించెను. అందు క్షత్రియ ధర్మములు, లౌకిక పారలౌకిక ధర్మములు అనేకములు గలవు. శ్రీకృష్ణభగవానుని దివ్యతత్వాన్ని వివరించెను. ఆసమయమున విష్ణు సహస్రనామ స్తోత్రమును సృజించెను. "జరిగిన విపత్తుకు, అనర్ధములకు కారకులెవ్వరును కాదు. అంతా దైవనిర్ణయము. భగవంతుని పర్యవేక్షణలో జరిగినది. మనము నిమిత్తమాత్రులము. కావున విచారము మాని వివేకుడవై ధర్మయుతముగ రాజ్యపాలనము చేయుము." అని ధర్మబోధచేసెను.

అంత ఉత్తరాయణపుణ్యకాల మాసన్నమయ్యెను. భీష్ముడు దేహము త్యజించెను. ధర్మరాజు పితామహునకు యధావిధిగ దహనసంస్కారముల గావించెను. శ్రీకృష్ణభగవానుని సమక్షంలో ధర్మరాజునకు రాజ్యపట్టాభిషేకము జరిగెను. తమ్ములు ధర్మరాజును సేవించుచుండిరి.

# 12. పరీక్షిత్తు

అభిమన్యుడు మహావీరుడైన అర్జునుని కుమారుడు. ఉత్తర అభిమన్యుని భార్య. అభిమన్యుడు భారతవీరులలో అగ్రగణ్యుడు. భారత యుద్ధమున మహాద్భుతముగా పోరి, కురువీరులందరిని చికాకుపరచి, చివరకు రణమందే మరణించి వీరస్వర్గ మలంకరించిన మహాపరాక్రమశాలి అభిమన్యుడు.

అభిమన్యుడు మరణించునప్పటికి, అతని భార్య ఉత్తర గర్భవతి. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రము బారినుండి ఉత్తరగర్భమును శ్రీకృష్ణుడు రక్షించెను. పదినెలలు నిండిన తదుపరి ఉత్తర ప్రసవించగ బాలుడు జన్మించెను. బాలునకు "పరీక్షిత్తు" అని పేరిడిరి. బాలుని జన్మకాలమున ధర్మరాజు అనేకములైన దానధర్మములొనర్చెను. "పరీక్షిత్తు పరమభాగవతోత్తముడగును. వంశోద్ధారకుడై ప్రపంచ ప్రఖ్యాతి గాంచును." అని జ్యోతిష్కులు పలుక, ధర్మరాజు మిగుల సంతసించెను.

ధర్మరాజు అనంతరము పరీక్షిత్తు హస్తినాపురరాజ్యమునకు ప్రభువై అనేక సంవత్సరములు ధర్మమును రక్షించుచూ రాజ్యపాలనము గావించెను. ఇరావతియను సుగుణశీలి పరీక్షిత్తుభార్య. ఈమె ఉత్తరుని కుమార్తె. పరీక్షిత్తునకు జనమేజయుడు మున్నగు పుత్రులు నలుగురు కలిగిరి. కృపాచార్యులవారి అనుజ్ఞతో గంగాతీరంలో మూడు అశ్వమేధ యాగములను నిర్విఘ్నముగ చేసెను. దేవతలు స్వయముగవచ్చి యాగహవిర్భాగములను స్వీకరించిరి. ఇటుల పరీక్షిత్తు జగత్ప్రసిద్ధుడై రాజ్యపాలనము చేయుచున్న సమయమున ద్వాపరయుగము ముగిసి కలియుగము ప్రవేశించెను. రాజ్యమున కలిపురుషుడు ప్రవేశించెను. ఆవార్త వినిన పరీక్షిత్తు చతురంగబలములను కూడదీసికొని కలినెదుర్కొన జైత్రయాత్ర సాగించెను. ఎదురులేక రాజ్యములనేకములు జయించెను. అనేక పుణ్యకార్యాములాచరించి, హరిభక్తులను సేవించెను. తన వంశీయులచరిత్ర వినుచు భక్తపరాయణుడై రాజ్యపాలనము సాగించెను.

ఆ సమయమున ధర్మదేవత వృషభ రూపముధరించి ఒంటికాలుపై తిరుగాడ సాగెను. భూమాత గోరూపము దాల్చి బిడ్డను పోగొట్టు కొనిన తల్లివలె విలవిల విలపింపసాగెను. అంత ధర్మదేవత గోమాతను, "ఓయీ ! నీవిట్లు విలపించుటకు కారణమేమి?" అని ప్రశ్నించెను. అపుడు భూదేవి, "ఓయీ ! నా దుఃఖకారణమేమని వర్ణింతును? శ్రీకృష్ణుడవతారము చాలించి నన్ను విడిచివెళ్ళినాడు. కలిపురుషుడు ప్రవేశించినాడు. ఓధర్మమూర్తి! నీవు సర్వజ్ఞుడవు. సర్వము నెరిగిన వాడవు. నీవు

మూడుపాదములు పోగొట్టుకొని ఒంటికాలుపై తిరుగుచున్నావు. ప్రస్తుతము లోకములో అవినీతి, అధర్మము పెచ్చుపెరిగి విలయతాండవం చేయుచున్నవి. ఇంకమనకు దిక్కెవరు? మనలను రక్షించు వారెవ్వరు? అందుకే ఏమియుతోచక దుఃఖించుచున్నాను." అని పలికెను. వీరిద్దరు సంభాషించుకొన్న ప్రదేశం కురుక్షేత్ర ప్రాంతమందలి సరస్వతీనదీతీర ప్రాంతము. పరీక్షిన్మహారాజు అపుడా సమయమున కచటి కరుదెంచెను.

అపుడా ప్రదేశమున, శూద్రుడొకడు రాజువేషము ధరించి, ఒక ఆవును ఎద్దును కాళ్లతో తన్నుచుండెను. ఎద్దువాని హింసలకు తాళలేక ఒంటికాలితో కుంటు చుండెను. ఆవుకూడా వాని బాధల కోర్వజాలక కన్నీరు కార్చుచు, మలమూత్రములు విసర్జించుచు 'అంబా' అని అరచుచుండెను. అతి దారుణ, హృదయ విదారకమైన ఆదృశ్యమును గాంచినంతనే పరీక్షిత్తునకు ఆగ్రహావేశములు ముంచుకు రాగా ఉగ్రమూర్తయ్యెను. విల్లు చేతబూని పరుగున అచ్చోటి కరుదెంచెను.

"ఓయీ ! కఠినాత్ముడా ! ఎవరు నీవు? అమాయకులు, బలహీనులు అయిన నోరులేని మూగ జీవులను అన్యాయముగ యేల శిక్షించుచుంటివి? నేనీ దేశమునకు ప్రభువును. ధర్మమును రక్షించి, అందరిని రక్షించవలసిన బాధ్యత నాయందున్నది. నీవు శిక్షార్హుడవు. నిన్నుపట్టి వధింతును." అని సింహముపగిది గర్జించెను.

"ఓ వృషభరాజమా ! ఎవరు నీవు ? నిన్ను జూడ దేవతామూర్తివలె కనుపట్టు చున్నావు? మూడుకాళ్లను పోగొట్టుకొని ఒంటికాలిపై నడచుటకు కారణమేమి? నీకిట్టివ్యధను కలిగించిన దెవరు? దుష్టశిక్షణ శిష్టరక్షణ నాకర్తవ్యము. నీకీ దుస్థితి కలిగించిన వానిని తక్షణమే కడతేర్చి నీకష్టమును తీర్చెదను. నీవు దుఃఖించవలదు. ఏ మోసగానివల్లను భయములేకుండగ చేయుదును. కనుక అట్టి యధముడెవడో తెలియపలుకుము." అని వృషభరాజమును ప్రశ్నించెను.

అంతట వృషభేంద్రము," రాజేంద్రా ! నీవు మహాజ్ఞానివి. ధర్మాధర్మములు బాగుగనెరిగిన ధర్మజ్ఞుడవు. నాకీ దుర్గతి గలిగించినవానిని నీవేగుర్తించి, కార్యము చక్కబరుచుము." అని బదులు పలికెను.

వృషభము చెప్పిన మాటలయందలి అంతరార్థమును పరీక్షిత్తు గ్రహించెను. ధర్మదేవతయే యీవృషభమని తెలిసికొనెను. ధర్మదేవతకు తపస్సు, శౌచము, దయ సత్యము, అనునవి నాలుగు పాదములు, కృతయుగములో ధర్మదేవత నాలుగు

పాదములతోడను, త్రేతాయుగములో మూడు పాదములతోడను, ద్వాపరయుగములో రెండు పాదములతోడను నడచినది. ప్రస్తుతము కలియుగము ప్రవేశించనున్నది. మూడుకాళ్లను పోగొట్టుకొని, సత్యమనెడి ఒంటికాలిపై నడువనున్నది. కలిపురుషుడు ఆ ఒక్క పాదమును గూడా లేకుండగ చేయవలెనని ప్రయత్నించుచున్నాడు. కలి ప్రవేశంవల్ల ధర్మదేవత, భూదేవత అనుభవించుచున్న కష్టములను, దుఃఖమును పరీక్షిత్తు తెలిసికొనెను. అక్రమవర్తనులైన ప్రభువులు ఈ భూమినేలనున్నారని గ్రహించెను. ధర్మదేవతను, భూదేవతను అనునయవచనముల నోదార్చి, కలిని హతమార్చదలిచి, కరవాలము నెత్తెను.

అంతట కలిపురుషుడు భయమున గడగడ వణకెను. దిక్కుతోచనివాడై పరీక్షిత్తు పాదములబడి రక్షించుమని ప్రార్థించెను. "శరణాగతరక్షణము పాండవులకు పరమ ధర్మం. కనుక నిన్ను క్షమించి విడచుచున్నాను. ధర్మానికి నిలయమైన పరమపవిత్రమైన యజ్ఞభూమి ఈ బ్రహ్మావర్తదేశం. నీవు వున్నచోట అసత్యం, అధర్మం, అలక్ష్మి, చౌర్యం, లోభం, కపటం, కలహం, దంభం మున్నగు అవలక్షణములన్నియు తాండవం చేస్తాయి. కనుక తక్షణం యిచ్చోటు విడచిపొమ్ము" అని రాజు ఆజ్ఞాపించెను.

అపుడు కలిపురుషుడు భయకంపితుడై, "ఓరాజా ! క్షమించుము. నా ప్రార్థన వినుము. దయతో నేనుండవలసిన ప్రదేశమును చూపుము. అట్టి బాధ్యత నీయందు ఉన్నది. నీ ఆజ్ఞకు బద్ధుడనై యుందును." అని వేడుకొనెను. అతని ప్రార్థనను వినిన పరీక్షత్తు, " ఓయీ ! జూదము, పానము, స్త్రీలు, హింస - ఈ నాలుగు ఉన్న ప్రదేశములు నీకు ఆవాసము. అందు నివసింపుము "అని నిర్దేశించెను. అయితే జూదం ఉన్నచో అసత్యము, మద్యమున్నచో మదము, స్త్రీలున్నచో కామము, హింస యున్నచో క్రౌర్యము చోటుచేసికొనును." కనుక అన్నింటికి నిలయమైన మరియొకప్రదేశమును తెలుపుమని కలి అడిగెను.

పరీక్షిత్తు మరల ఆలోచించి, "కలిపురుషా ! సువర్ణము నీకు తగినచోటు. బంగారమున్న చోట అసత్యం, మదం, కామం, క్రౌర్యం, రజస్సు అనగా రజో గుణం అను అయిదు గుణాలుండును. సువర్ణమును ఆశ్రయించి యుండుము." అని పలుక, కలి పురుషుడు రాజాజ్ఞను తలదాల్చి అందుండి వెడలిపోయెను. అటు పిమ్మట ధర్మదేవతకు తపస్సు, శౌచము, దయ అను పాదములను సమకూర్చి, తన నగరమున కేగెను. పరీక్షిత్తు ఉన్నంతకాలము కలిపురుషుడు ఈ పుడమిపై కాలూనక భయమున అణగిమడగి యుండెను. రాజ్యపాలనము ధర్మయుతముగ సాగెను.

ఒక సమయమున పరీక్షిత్తు వేటకు వెళ్లెను, అడవిలో చాల కాలము వేటాడి అలసెను. దానికి తోడుగ దాహము, ఆకలి బాధించడం మొదలయ్యేను. నీటికొరకు పలుతావులు వెదకెను. కాని నీరులభించలేదు. అలా సంచరించుచుండగా ఒక ఆశ్రమము కనుపించెను. లోనికి ప్రవేశించ, అచట ఒక ముని కంటబడెను. అతడు శమీకముని. ఇంద్రియములను, ప్రాణములను నిగ్రహించి నిశ్చల తపోనిష్ఠయందు ఉండెను. పరీక్షిత్తు మునిని త్రాగుటకు జలమిమ్మని కోరెను. ముని పలుకలేదు. అతనికి బాహ్య జ్ఞానములేదు. అందువలన రాజు మాటలను వినలేదు. కనులు తెరువలేదు. రాజుకు అంతులేని ఆగ్రహము వచ్చెను. ఎవరియందు కోపము చూపని పరీక్షిత్తునకు ఆనాడేలనో ఆవేశం కట్టలు త్రెంచుకొన్నది. రాజునైన తననే అవమానించునా యని అహంకారంతో యుక్తాయుక్తములు మరచినవాడై, సమీపంలో చచ్చిపడియున్న పామును బాణపుకొనతోనెత్తి శమీకముని కంఠమునవైచి తిరిగి హస్తినకు చేరెను.

అటుమీదట శమీకముని కుమారుడు శృంగివచ్చెను. అతనివెంట తోటి మునికుమారులు కొందరుండిరి. బాలుడయ్యును శృంగి కడుతేజోసంపన్నుడు. తపోనిష్ఠయందున్న తండ్రి కంఠమున మృతసర్పమును చూచి కోపమున మండిపడెను. పరీక్షిత్తే యింతటి నీచకార్యముచేసి యుండునని శృంగి తెలుసుకొనెను. "నా తండ్రిని అవమానించిన పరీక్షిత్తు నేటికి ఏడవదినమున పాముకాటుచే మరణించుగాక" అని ఘోరముగ శపించెను. అటుల కఠోరశాపమిచ్చి, తండ్రికి జరిగిన అవమానమును తలచుకొని పెద్దపెట్టున నేడ్వసాగెను.

కొంతకాలమునకు కుమారుని రోదనపుధ్వని వినిన శమీకుడు మెల్లగా కన్నులుతెరచెను. మెడలోవున్న సర్పకళేబరమును తీసి ఆవలపారవైచెను. కుమారుని వలన జరిగిన సమాచార మంతయు నెరింగెను. జరిగిన దానికి మిక్కిలి విచారించెను. భగవద్భక్తుడు, సదాచార సంపన్నుడు, జ్ఞానియైన పరీక్షిన్మహారాజును బాలుడైన తనపుత్రుడు శపించినందులకు మిగుల విచారించెను. తొందరపాటుచర్యగ భావించి తనయుని మందలించెను. విప్రశాపము వ్యర్థముగాదు . గావున," యికపై పరీక్షిత్తును భగవంతుడే రక్షించుగాక" యని బాలుడొనరించిన మహాపరాధమును మనమున చింతించుచు, రాజు తనయెడ గావించిన దుష్కృత్యమును మనమున యెంత మాత్రము తలచక మిన్నకుండెను.

హస్తినాపురమునకు చేరుకున్న పరీక్షిత్తు తీవ్రమైన మానసిక సంక్షోభమునకు లోనయ్యేను. తానొనరించిన మహాపరాధమును తలచితలచి విచారించెను. అంతులేని

అశాంతితో అలమటించెను. మతిబోయినవాని విధమున సంచరించసాగెను. అటులుండ ఒకదినమున శమీకుని శిష్యుడు రాజుచెంతకు వచ్చి శృంగిశాపమిచ్చిన విధమును తెలియబలికెను. తక్షకుడను పాముకాటుచే మరణము తప్పదని చెప్పెను.

పరీక్షిత్తు వానిమాటల నాలకించెను. ఎంత మాత్రము చలించలేదు. మనో నిబ్బరము నశించలేదు. ధైర్యము సడలలేదు. మీదుమిక్కిలి బ్రతుకుపై విరక్తి భావము ప్రబలమయ్యెను. రాజ్యభోగములందు, ఐహికవాంఛలందు శాపఫలితముగా వైరాగ్య భావము లభించినందులకు మిగులానందించెను. శ్రీమహావిష్ణు పాదపద్మములే తనకిక శరణ్యమని నిశ్చయించుకొనెను. విష్ణుపాదోద్భవము పరమపవిత్రమగు భాగీరథిలో స్నానమాడి పరిశుద్ధుడయ్యెను.

అట్టి సమయమున మహాతపస్సంపన్నులైన బ్రహ్మర్షులు, దేవర్షులు, రాజర్షు లచ్చటి కరుదెంచిరి. అందు అత్రి, వసిష్ఠుడు, చ్యవనుడు, శరద్వంతుడు, అరిష్టనేమి, భృగువు, పరాశరుడు, పరశురాముడు, భరద్వాజుడు, అంగిరసుడు, అగస్త్యుడు, అర్ష్టిషేణుడు, మేధాతిథి, దేవలుడు, గౌతముడు, మైత్రేయుడు, ఇధ్మవాహనుడు, ఇంద్రప్రమదుడు, వ్యాసుడు, నారదుడు మున్నగువారుండిరి. పరీక్షిత్తు పరమభక్తితో వారికి ప్రణమిల్లి, పూజించి, ఉచితాసనముల ఆశీనులగావించి గౌరవించెను.

"మహాత్ములారా ! నాపూర్వపుణ్యవశమున తమరు నన్ననుగ్రహించ వచ్చినారు. నేను కడు ధన్యుడను. తమ అనుగ్రహ విశేషమువలన నాకు ఇంచుక భక్తి, జ్ఞానం అలవడినవి. ఎంతో కాలమునుండి ఐహిక భోగబంధములనుండి ఎపుడెపుడు బయట పడుదునా యని ఎదురుచూచుచుంటిని. అయ్యది శ్రీహరి బ్రాహ్మణ శాపరూపమున అనుగ్రహించినాడు. మహాప్రసాదముగా స్వీకరించితిని. నాకు పరిపూర్ణ వైరాగ్యము కలిగినది. ఎంతమాత్రము సందేహములేదు. నాకిక శ్రీమన్నారాయణుడే శరణ్యం. మిమ్ములందరిని ప్రణమిల్లి వేడుకొనుచున్నాను. తక్షకుడు నన్ను కాటు వేయుగాక. ఈ అవసాన దశలో మీరు విష్ణుకథలు వీనులార వినిపించి పవిత్రుని చేయుడు. రాబోవు జన్మలందును ఎల్లపుడు భగవద్భక్తి, పరమభాగవతానురక్తి, బ్రాహ్మణులమైత్రి కలుగునట్లు దయాళులై అనుగ్రహించుడు." అని పరీక్షిన్మహారాజు ప్రార్థించెను.

అటుల ప్రార్థించి, స్వాంతమున యెట్టి చింతనలులేక, రాజ్య భారమును తన కుమారుడు జనమేజయునకు అప్పగించి, పరమ పవిత్ర గంగానదీతీరమున దర్భలు పరపించెను. వాటిపై ఉత్తరాభి ముఖుడైకూర్చుండి ప్రాయోపవేశ దీక్షను స్వీకరించెను.

ఆసమయమున దివియందు దేవదుందుభులు నెడములేకమ్రోగ, దేవతాగణములు పుష్పవృష్టి కురిపించిరి. మహర్షులు హర్షపులకాంకితులై పలువిధముల పరీక్షిత్తును ప్రియవచనముల ఆశీస్సులతో ప్రశంశించిరి. వారందరు మహారాజు దేహత్యాగం చేయువరకు అచ్చటనే ఉండుటకు నిర్ణయించుకొనిరి.

అంత నాసమయమున వ్యాసభగవానుని పుత్రుడు శుకయోగి అరుదెంచెను. పదహారేండ్ల ప్రాయుడు, అవధూతయైన శుకయోగిని గాంచినంతనె మునులెదురేగి స్వాగత వచనములతో గొనివచ్చి కూర్చుండచేసిరి. పరీక్షిత్తుకూడ శుకయోగీంద్రుని తగిన విధముగా పూజించి, సపర్యలతో సంతుష్టుని గావించెను. అంతట పరీక్షిత్తు పరమభక్తిప్రపత్తులతో కరములుమోడ్చి శుకయోగీంద్రుని యిట్లు ప్రార్థించెను.

"ఓ బ్రహ్మర్షీ ! మీ దర్శనభాగ్యం మహామహులకు సైతమసాధ్యము. అట్టి తమరు నన్ను తరింపచేయుటకు నాకు అతిధులైరి. ఇది నాపూర్వపుణ్యఫలము. నా పాపములన్నియు పటాపంచలైనవి. మీ రెందును ఆవుపాలు పితుకునంత కాలము గూడ నిలువరు. అట్టి తమ రాకవలన కృతార్థుడనైతిని. నేనిపుడు దేహత్యాగ మొనర్చుటకు సంసిద్ధుడనై యుంటిని. నాకిపుడు కర్తవ్యము బోధించి తరుణోపాయమునకు మూలమైన తత్వమునుపదేశించుడు."

పరీక్షిత్తు ప్రార్థనమునకు శుకయోగీంద్రుడు పరమానందభరితుడై భాగవత పురాణమును వినిపించెను. మోక్షము నాశించువాడు హరికథలను శ్రద్ధతో వినవలెను. ప్రాణావసానదశయందు హరియందు భక్తి గలిగి, హరినామకీర్తనము చేసిన మోక్షము ప్రాప్తించును. అదొక్కటే మోక్షసాధనమునకు ఉత్తమ మార్గము. ప్రమత్తుడగువాడు జీవితకాల మంతయు నిరుపయోగముగ గడుపును. కాని కాలము విలువ తెలిసికొని క్షణకాలమైనను మనస్సును హరియందు లగ్నముచేసి చింతించినచో జీవితము ధన్యమగును. సర్వశుభములు చేకూరును. ఒక్క ముహూర్తకాలము శ్రీహరియందు భక్తినిలిపి ధ్యానించి ముక్తినందిన మహనీయులెందరో గలరు.

"ఓ రాజా ! మృత్యువు ఆసన్నమైనదని విచారించకు. చేయునదేమి గలదని దిగులు చెందకు. నీకింకను ఏడుదినములు గడువున్నది. ఈ ఆయుఃపరిమాణమందు నీవు సునాయాసముగా మోక్షమును సాధించుకొనవచ్చును. నా తండ్రి వ్యాస మహనీయుడు నాకుపదేశించిన మహాభాగవత రహస్యమును నీకు బోధింతును." అనుచు మహాభాగవత పురాణమును వినిపించుచు అందలి భక్తియోగమును వివరించెను.

## 13. భక్తి యోగమందలి ముఖ్యాంశములు

1. అరిషడ్వర్గములను జయించి, ఇంద్రియములను నిగ్రహించుట.

2. చిత్తమును భగవద్రూపధ్యానమందు లగ్నమొనర్చుట.

3. పరుగులు తీయుచున్న నదీప్రవాహము మహాసముద్రమందు లీనమై పరవశించి శాంతి పొందినట్లుగ, మనస్సు శాంతిపొందిన స్థానమే శ్రీమహావిష్ణువు యొక్క పరమపదమని తెలియుము. అట్టి స్థానము కేంద్ర బిందువు.

4. రజోగుణము, తమోగుణము మనస్సును ఆవరించినపుడు చిత్తక్షోభమునకు కారణమగును. అట్టి సమయమున ధారణయోగముచే నిరోధించవలెను. ధారణ యోగంవలన శ్రీహరియందు భక్తియోగం కలుగును.దాని మూలమున పరంధాముని దర్శింపసాధ్యమగును.

5. విశ్వమంతయు విష్ణుమయము. పూర్వము బ్రహ్మాదులు ఆవిరాట్పురుషుని ధ్యానించి కృతార్థులైరి.

6. బ్రహ్మ నారదునకు బోధించిన పరబ్రహ్మతత్వమును వివరిస్తూ సమస్త లోకముల సృష్టి క్రమమును తెలిపెను.

7. భగవంతుని అవతారములు అనంతములు. అట్టి అవతారముల విశిష్టతను వివరించెను. అన్ని అవతారములందు శ్రీకృష్ణావతారము మిక్కిలి గొప్పదని తెలిపెను. దాని విశిష్టలక్షణమును, అవతారతత్వమును నిరూపించెను. ఇంకను కాల స్వరూపమును, యుగధర్మములను బోధించెను.

వ్యాసుడు వివరించిన ఖగోళ భూగోళ శాస్త్ర విజ్ఞానము అత్యద్భుతము. నేటి విజ్ఞానవేత్తలకు, శాస్త్రజ్ఞులకు అంతుపట్టని, అర్థముకాని మహత్తరవిషయములు అనేకములున్నవి. అయ్యవి భావనాశక్తికి అందవు. ఊహాశక్తికి అతీతములు.

## 14. విదురుడు

మహాభారత చరిత్రలో విదురునకు ఒక ప్రత్యేక విశిష్టస్థానము కలదు. విదురుని సర్వకాలములకు సమస్త మానవాళికి ఆదర్శమైన పాత్రగా రూపకల్పన గావించినాడు శ్రీవ్యాసభాగవానుడు. నిజముగ వ్యాసుని దూరదృష్టి అనన్య సామాన్యము, మహాద్భుతము. విదురుడు ఒక దాసిగర్భమున వ్యాసుని వలన జన్మించినాడు. ధృతరాష్ట్రునకు తమ్ముడీతడు.

ఒక సమయమున ధర్మమూర్తియైన యముడు మాండవ్యముని వలన శాపగ్రస్తుడై, విదురుడుగా పుడమియందు జన్మించెను. కావుననే నీతికి, ధర్మానికి, న్యాయమునకు మారుమూర్తిగా పేరందినాడు విదురుడు. పుత్రవ్యామోహమున ధృతరాష్ట్రుడు పాండవులయెడ జరుగుచున్న అన్యాయములను, అక్రమాలను హర్షించగ, విదురుడు వానిని తీవ్రముగ నిరసించి ఖండించినాడు. న్యాయమును, నీతిని ప్రబోధించినాడు. ధృతరాష్ట్రునకు ఎన్నో హెచ్చరికలు చేసి, నీతులు బోధించినాడు. కురుపాండవ యుద్ధసమయమున, విదురుడు ఎవరిపక్షమునను చేరకుండగ తీర్థయాత్రలకు వెళ్ళినాడు. యుద్ధమందు జరిగెడి మారణకాండ చూడ నిచ్చగించక అట్లుచేసెను. యుద్ధానంతరము ధృతరాష్ట్రునకు వైరాగ్యమునుపదేశించి, తపోభూములకు పంపినాడు. శ్రీకృష్ణ నిర్యాణమును గురించి గూడ వినిన తదుపరి, తానుగూడ హిమవత్పర్వత ప్రాంతములకేగి, అచ్చట యోగాగ్నిలో తనువుచాలించెను. మహానీతిశాస్త్రవేత్త, మహాజ్ఞాని అయిన విదురుడు బోధించిన నీతులు లోక ప్రసిద్ధము. అవి 'విదురనీతి' గా ఖ్యాతిగాంచెను. అందలి నీతులు అన్నికాలములందును అన్ని మతముల వారికి, అన్నిజాతుల వారికి సమాదరణీయమై ప్రామాణికమై ప్రకాశించు చున్నవి. విదురుని ముఖకమలము నుండి వెలువడిన ధర్మము, సత్యము, నిత్యములగు నీతులను కవిత్రయములో ఒకడగు తిక్కన సోమయాజి రమ్యాతి రమ్యముగ మానవాళికి తన ఘంటమునుండి అందించి చరితార్థుడాయెను. అట్టినీతి పద్యములను కొన్ని ఇచట పేర్కొనడమైనది.

**క॥ జనులకు నొడబాటగు విధమున నడచుచు లోకనింద్యముల నుడుగుచు**
**మీదని యొకని కలిమి కలరుచు మనుజులతో బొంది పొసగి మనుటొప్పునృపా.**

ఓ రాజా! అందరకు నమ్మతమగు మార్గమున చనుట మిగుల శ్రేయోదాయకము. లోకులు నిందించెడి కార్యములను తక్షణము విడువవలెను. పరుల సంపదలనుజూచి అసూయచెందక సంతసించవలెను. ప్రజలందరితో స్నేహము పెంచుకొని, అందరు మెచ్చుకొనులాగున నేర్పుగ ప్రవర్తించగలుగుట కీర్తిదాయకము.

**క॥ కోపము నుబ్బును గర్వము నాపోవక యునికియును దురభిమానము**
**నిర్వ్యాపారత్వమునననవి కాపురుష గుణంబులంద్రు కౌరవనాథా!**

ఓ కౌరవనాథా ! కోపము, ఆడంబరము, గర్వము, తృప్తిలేకయుండుట, దురభిమానము, నిర్వ్యాపారత్వము (ఏపనిలేకుండుట) ఈ గుణములారును కుత్సితమతుడైనవాని లక్షణములుగా పెద్దలు వాకొనుచున్నారు.

**క. ధనమును విద్యయు వంశంబును దుర్మతులకు మదంబు బొనరించునుస**
**జ్జనులైన వారి కడకువయును వినయము నివియతెచ్చు నుర్వీనాథా!**

ఓ రాజా ! అధిక ధనసంపద, ఉన్నతవిద్య, గొప్పవంశము, దుష్ట బుద్ధి గలవారి యందు మదమును, అహంకారమును పెంపు చేయును. ఈ మూడు లక్షణములే సజ్జనులందు వినయ విధేయతలను, నమ్రతాభావమును వృద్ధిపరచును.

**క. అరిది విలుకాని యుజ్జ్వలశర మొక్కని నొంచు, దప్పిచనినంజను నే**
**ర్పరియైన వాని నీతిస్ఫురణము పగరాజు నతని భూమింజెరచున్.**

ఓరాజా ! నేర్పరియైన గొప్ప విలుకాడు బాగుగ గురిచేసి వదలిన అతని బాణము ఒక్కని మాత్రమే చంపును. ఒక్కొక్క సమయమున అది గురితప్పి చెడినను చెడవచ్చును. కాని ధర్మనిరతుడైన వానిమాట ఒక్కటైనను, పగవాడైన రాజును, అతని వంశమును, రాజ్యమును హరించివేయును.

**క. క్షమియించువారిగని చాలమివెట్టుదు రైననుం దలంప ననూన**
**క్షమయు కడుమెఱయు తొడ, ఉత్తమ రూపము గోరువారు తాల్తురుదానిన్.**

క్షమాగుణ సంపత్తి గలవానిని జూచి, అసమర్థుడని, పౌరుష హీనుడని తలచి గేలిచేయుదురు. కాని నిజమాలోచించిన క్షమాగుణమే పురుషునకు మిగుల ప్రకాశవంతమైన ఆభరణము. ఉత్తములైనవారు అట్టిగుణమును విడువక ధరించి యుందురు.

**క. పురుషుండు రెండు తెఱగుల ధర నుత్తముడనగ బరుగు దానెయ్యెడలం,**
**బరుషములు పలుకకునిక్ దురితంబులు వొరయుపనులు దొఱకుట కతనన్.**

లోకమునందు పురుషుడు రెండు విధములుగా కీర్తింపబడుచున్నాడు. ఎట్లనగ, కఠినముగ మాటలాడ కుండుట వలనను, పాపకృత్యములు చేయకుండుట వలనను.

**క. చెల్లియుండియు సైరణ సేయునతడు బేదవడియును నర్థికి బ్రియముతోడ**
**దనకుగలభంగి నిచ్చునతండు పుణ్యపురుషుడని చెప్పిరార్యులు కురువరేణ్య**

ఓ కురుసార్వభౌమా ! సమర్థత గలిగియు దోషులను శిక్షింపక క్షమియించి విడుచు వాడును, బీదరికముచే దుర్భర దారిద్ర్యబాధను అనుభవించుచుండియు తనకు గలిగి నంతలో యాచకునకు ప్రేమమున యిచ్చువాడును పురుషులందు పుణ్యాత్ముడని ఆర్యులు చెప్పుదురు. అనగా అట్టివాడు పురుషోత్తముడని భావము.

**తే. తగిన వేషంబు, తనుతానుపొగడుకొనమి, నొచ్చియును గీడుపలుకమి**
**యిచ్చి వగవ కునికి, తనకెంత నడవకయున్న బధము దప్పకుండుట**
**నడవడి కొప్పు సేయు.**

తగినట్టి వేషధారణము, తనను తాను పొగడుకొని ఆనందించుట, బాధలలో వుండియు పరులకు కష్టము, హాని కలిగించు విధముగా మాటలాడకుండుట, మెప్పుకొరకు ఒరులకుయిచ్చి, తదుపరి విచారించుట, కష్టములెన్ని చేకూరినను ధర్మమార్గము వదలక ప్రవర్తించుట మున్నగు లక్షణముల వలన మానవుని ప్రవర్తనము మిగుల ప్రకాశించును.

**క. తనువున విఱిగిన యమ్ముల ననువున బుచ్చంగవచ్చునతినిష్ఠురతన్**
**మనమున నాటినమాటలు వినుమెన్నియుపాయములను వెడలునె యధిపా!**

ఓ రాజా! శరీరమున గ్రుచ్చుకొనిన పదునైన బాణములను నేర్పుతో వెలువరించి బాధను నివారింపవచ్చును. కాని మనస్సును విశేషముగ నొప్పించి కలవరపరచిన మాటలు రూపుమాపుటకు అనువగు ఉపాయము లేమియును లేవు.

## 15. మైత్రేయుడు

విదురుడు తీర్థయాత్రలు చేయు సమయమున, మైత్రేయుడను మునిని దర్శించెను. ఆ మునివలన విదురుడు భగవత్తత్వాన్ని గ్రహించెను. అంతేగాక ఆత్మ జ్ఞానమును పొందెను. యోగులుసైతము తెలియజాలని రహస్యములెన్నింటినో ఆ మహనీయుని వల్ల తెలిసికొనెను. బ్రహ్మదేవుని జన్మరహస్యం, కాలముయొక్క స్వభావ లక్షణము, సృష్టివిధానవిజ్ఞానము మున్నగు అంశములను మైత్రేయమహాముని వివరించెను.

శ్రీమహావిష్ణువుయొక్క నాభికమలమునుండి బ్రహ్మ ఉద్భవించెను. సమస్త లోకములను వీక్షించుటకుగాను బ్రహ్మకు నాలుగు ముఖములేర్పడెను. కనుకనే

వానిని చతుర్ముఖుడనిరి. బ్రహ్మ ఎన్నోవేలసంవత్సరములు ఘోరతపమాచరించి శ్రీమన్నారాయణుని అనుగ్రహాన్నిపొంది, భగవత్తత్వాన్ని గ్రహించెను. సమస్త జీవరాసులను, లోకములను సృష్టించు శక్తి సామర్థ్యములను పొందగలిగెను.

బ్రహ్మ తూర్పుముఖము నుండి ఋగ్వేదము, దక్షిణముఖము నుండి యజుర్వేదము, పశ్చిమముఖమునుండి సామవేదము, ఉత్తరముఖమునుండి అధర్వణ వేదము ఉద్భవించినవి. అటులే ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, పురాణేతిహాసములైన పంచమవేదము, శిల్ప వాస్తుశాస్త్రములు ప్రాదుర్భవించెను. సనకసనందన, సనత్కుమార, సనస్సుజాతులను బ్రహ్మ సృజించెను. వారు సృష్టిప్రవృత్తిని చేగొనక, కేవలము మోక్షకాములై ప్రవర్తించిరి. అంత చతుర్ముఖుడు తన ఆత్మసమానులైన మానసపుత్రులను సృజించెను. అంగుష్టమునుండి దక్షుడు, తొడనుండి నారదుడు, నాభినుండి పులహుడు, కన్నులనుండి క్రతువు, ముఖమునుండి అంగిరసుడు, ప్రాణమునుండి వసిష్ఠుడు, హృదయమునుండి మరీచి, కుడిచేతినుండి ధర్మము. వెన్నునుండి కర్దమప్రజాపతి అవతరించిరి. కర్దమునిభార్య దేవహూతి. అయినను బ్రహ్మయూహించినట్లు సృష్టిజరగలేదు. అంతట చతురాననుడు దీర్ఘముగ నాలోచించెను. అపుడాతని శరీరము రెండుభాగములుగచీలెను. కుడిభాగమునుండి స్వాయంభువమనువు, ఎడమభాగమునుండి శతరూప అనెడి స్త్రీ జనించిరి. వారిరువురు దంపతులైన కారణమున ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడను యిరువురు పుత్రులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి అను పుత్రికలు ముర్వురు కలిగిరి. ఆకూతి రుచికుని, దేవహూతి కర్దముని, ప్రసూతి దక్షుని వివాహమాడిన కారణమున వీరి సంతతి జగత్తుఅంతయు వ్యాపించెను. ఈ విధముగ ప్రజాభివృద్ధి జరిగినదని మైత్రేయుడు విదురునకు వివరించెను. కాలప్రమాణమును గూర్చిన జ్ఞానముగూడ మహనీయుడు విదురునకు తెలియజేసెను.

## 16. జయవిజయులు

వైకుంఠమున శ్రీమహావిష్ణుమందిరమున ద్వారపాలకులిద్దరు కలరు. వారు జయవిజయులు. నిరంతరము వారు శ్రీహరి పాదపద్మములను సేవించుచుందురు. భగవంతుని అనుగ్రహముపొంది గొప్ప మహిమ గలవారైరి.

ఒక దినమున సనకసనందనాదులు విష్ణుసందర్శనార్థము వైకుంఠమున కరుదెంచిరి. వారు బ్రహ్మమానసపుత్రులు. వారు వైకుంఠము ప్రవేశించి ఆరు

ద్వారములు దాటి, ఏడవద్వారముకడకు చేరిరి. అపుడు శ్రీమహావిష్ణువు శ్రీమహాలక్ష్మితో గూడి కేళీమందిరమున వినోదించుచుండెను. బాలురరూపమున యున్నమునులు దిగంబరులై మందిరమును ప్రవేశింపబోయిరి. అచ్చటనేయున్న జయవిజయులు వారినడ్డగించి, తేలిక భావమున గేలిచేసి తూలనాడిరి. నిష్కాములైన మునులను అవమానించిరి.

అంతట మునులాగ్రహించి, "పాపములకు నిలయమైన భూలోకమున పుట్టుడని" కఠోరముగ శపించిరి. సనకసనందనుల శాపమునకు జయవిజయులు మిగుల భయకంపితులై, మునుల పాదములపైవ్రాలి, క్షమించి రక్షింపుడని ప్రార్థించిరి. "ముని శ్రేష్ఠులారా! ఎక్కడ జన్మించినను, మాకు భగవద్భక్తి, భగవన్నామస్మరణము సర్వకాలములందు విడువక యుండునట్లు అనుగ్రహించుడు" అని వేడుకొనిరి.

అపుడా సమయమున విష్ణువచ్చట కరుదెంచెను. మునులను భక్తితో నమస్కరించి పూజించెను. విషయము తెలిసికొని జయవిజయు లొనరించిన అపరాధమును మన్నించమని వేడుకొనెను. వారును శ్రీహరిని పెక్కు విధముల నుతించి వెడలిపోయిరి.

జయవిజయులు, "దేవా ! అజ్ఞానులమై, అహంకారముతో మునులను అవమానించి, అపరాధ మొనరించినాము. మీయెడ ఎంతో అపచారము చేసినాము. మేము మిమ్మువిడచి బ్రతుకజాలము. ఈ యెడబాటు భరింపజాలము. ఏదోవిధమున మమ్ము అనుగ్రహించ వేడుచున్నాము." అని ప్రార్థించిరి.

అంతట శ్రీమన్నారాయణుడు, "ఓయీ! మునులశాపము తిరుగు లేనిది. అనుభవించక తప్పదు, పూర్వమొక సమయమున లక్ష్మీదేవినికూడా మీరు అవమానించగ,ఆమె మిమ్ములను శపించినది. కనుక శాపం జరిగి తీరవలసినదే. మీరు మూడుజన్మలెత్తి నాకు బద్ధశత్రువులై,అనేక దుష్కార్యము లాచరింతురు.తుదకు నాచే హతులై తిరాగి నాలోకమును చేరుకొందురు.కనుక విచారింపవలదు." అని వారల నోదార్చెను.

మరుక్షణమందే జయవిజయులు మునీశ్వరుల శాపవశమున కృతయుగములో దైత్యవంశములందు హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగను,త్రేతాయుగమున రావణ కుంభకర్ణులుగను, ద్వాపరమున శిశుపాల దంతవక్త్రులుగను జన్మించి, శ్రీమహావిష్ణువు నెడ బద్ధవైరులై చరించిరి. బ్రాహ్మణులను, మునులును, మునిపత్నులను,స్త్రీలను

పలువిధములు పీడించి వేధించిరి. యజ్ఞయాగాదులకు విఘ్నమొనరించి దైవ దూషణము గావించిరి. దేవతలనుసైతము హింసించిరి. విష్ణువిరోధులైరి.

అంత శ్రీమన్నారాయణుడు వరాహావతారమున హిరణ్యాక్షుని, నరసింహావతారమున హిరణ్యకశిపుని, రామావతారమున రావణకుంభకర్ణులను, కృష్ణావతారమున శిశుపాల దంతవక్త్రులను వధించెను. అనంతరము జయవిజయులు మూడు జన్మలలో శాపమనుభవించి, తిరిగి వైకుంఠమును చేరిరి.

## 17. హిరణ్యాక్షుడు

స్వాయంభువుడు బ్రహ్మదేహమునుండి జనించెను. అతని భార్య రూప. ఆ దంపతులు ప్రజాభివృద్ధి చేయపూనుకొనిరి. వారికపుడు ఒక సమస్య యేర్పడెను.

బ్రహ్మ ప్రారంభమున ప్రళయకాల జలమునంతటిని త్రాగెను. అనంతరము సృష్టి ప్రారంభించెను. అపుడు భూమియంతయు, జలముతో నిండియుండెను. అట్టి సమయమున స్వాయంభువునకు ప్రజాభివృద్ధి చేయుటకు ఆటంకము కలిగెను. వెంటనే బ్రహ్మవద్దకువెళ్లి, తనకు కలిగిన యిబ్బందిని వివరించెను. తాను సృష్టించు సంతతికి యోగ్యమగు స్థలమును చూపుమని ప్రార్థించెను. అపుడు పరమేష్టికి ఉపాయము తోచినదికాదు. రసాతలమునుండి పృథివిని ఉద్ధరించుమార్గము తెలియలేదు. వెంటనే శ్రీమన్నారాయణుని ధ్యానించెను. అంతట బ్రహ్మ నాసికనుండి శ్వేతవరాహము జన్మించెను. అది కేవలము బొటనవ్రేలు ప్రమాణము కలిగి యుండెను. తెల్లనికాంతులు వెదజల్లుతూ ఆవరాహము క్షణకాలంలో గొప్ప గజ రూపమును దాల్చెను. శంఖచక్రగదాద్యాయుధములుగలిగి శ్రీమహావిష్ణుచిహ్నములతో ప్రకాశించెను. జగద్రక్షణార్థం శ్రీమన్నారాయణుడే యజ్ఞవరాహమూర్తియై అవతరించెనని బ్రహ్మాది దేవతలు గ్రహించిరి. దేవదేవుని వారందరు పలురీతుల నుతించిరి. అంతలోనే పర్వతాకారుడై మేఘమువలె గర్జించెను. భయంకరమైన దంష్ట్రలు గలిగి ఘుర్ఘరధ్వనితో జగములను ప్రతిధ్వనింపచేసెను. వాలము గిరగిరత్రిప్పుచు జలములో ప్రవేశించెను. ఆకాశమునకెగురును. మెడమీది కర్కశరోమములను కదలించెను. ధగధగమెరయుచున్న నేత్రకాంతులను దిక్కులనిండ ప్రసరింపచేసెను. పలువిధముల సంచరించుచు దేవతలకు, యోగులకు, మునులకు ఆనందమును, దుష్టదానవకోటికి భయాందోళనలు కలిగించుచుండెను. అటులావిధముగా జగద్రక్షకుడైన జగన్నాథుడు భువినుద్ధరించు క్రమంలో సంచరించు

చుండగ, దేవకంటకుడు, మహాభుజబలగర్వితుడు, లోకకంటకుడైన దానవశ్రేష్ఠుడైన హిరణ్యాక్షుడు బ్రహ్మాండమైన గదాయుధమును గిరగిర త్రిప్పుచు యజ్ఞవరాహమూర్తి యైన శ్రీమహావిష్ణువు నెదుర్కొనెను.

## 18. హిరణ్యాక్షుని జననము

కశ్యప ప్రజాపతిభార్య దితి. ఈమె దక్షుని పుత్రిక. కశ్యపునకు అదితి, వినత, కద్రువ మున్నగుభార్యలు కలరు. దితికి రాక్షసులు, అదితికి దేవతలు జన్మించిరి. దితికి ఒకదినమున కామోద్రేకము కలుగ, వెంటనే భర్తవద్దకేగెను. అపుడది సంధ్యా సమయం. కశ్యపుడు ధ్యాననిమగ్నుడై యుండెను. నియమవ్రతుడై యున్న భర్తను, తన కోర్కెను తీర్చుమని యడిగెను. సంతాన భిక్ష పెట్టుమని ప్రార్థించెను. అంత కశ్యపుడు, "దేవీ ! ఇది సంధ్యాసమయం. సంగమమునకిది సమయముగాదు. క్షణకాలమాగుము. నీ కోర్కెతీర్తును" అని వారించెను. కాని దితి విన్నదిగాదు. భర్తను వత్తిడిచేసెను. సంగమమును అభిలషిస్తూ నిర్బంధమొనర్చెను. విధినికాదని తప్పించు కొనుట ఏరితరము? చేయునదిలేక దితితో సంగమించి ఆమెకోర్కెను తీర్చెను.

కశ్యపుడు స్నానమూడి శుచియై ధ్యాననిమగ్నుడాయెను. దితియు జరిగిన ఆవేశపూరిత అవివేకచర్యకు సిగ్గుచెందెను. దుఃఖించి, భర్తను సమీపించి క్షమించమని వేడుకొనెను.

అంత కశ్యపుడు భార్యనోదార్చెను. గతజలసేతుబంధమన్నట్లు జరిగిన కార్యమునకు యిపుడు విచారించిన ప్రయోజనము లేదు. విధికృతము. జరిగినదేదో జరిగినది. అసుర సమయమున నన్ను కూడినందులకు నీకు దైత్యులు జన్మింతురు. వారు మిగుల క్రూరులై లోకకంటకులగుదురు. నీ పుత్రులందు ఇద్దరు మాత్రము ముల్లోకవాసులను పీడింతురు. శ్రీమహావిష్ణువు వారలను సంహరించును. కాని నీకొక మనుమడు కలుగును. అతడు విష్ణుభక్తుడై వంశమునకు వన్నెతెచ్చును. పరమ భాగవతోత్తముడగును. కావున విచారము మానుము. కర్మానుభవము తప్పదు. ధైర్యము వహింపుము." అని భార్యనూరడించెను.

దితి భర్తమాటలువిని తృప్తిచెందెను. కొంతకాలమునకు దితి గర్భముధరించెను. నూరుసంవత్సరములు గడిచినను, ఆమె ప్రసవించలేదు. పైగా గొప్పతేజస్సు వెలుబడి దిక్కులనిండ వ్యాపించెను. ఆ తేజస్సు సూర్యచంద్రులనుగూడా కప్పివైచెను. అంతట

దేవతలు భయమంది బ్రహ్మవద్దకేగి, ఈ యుపద్రవమును నివారింపుమని ప్రార్థించిరి. బ్రహ్మవారి మాటలువిని, "దేవతలారా! దితిగర్భమున ఇద్దరు రాక్షసులు జన్మించగలరు. జయవిజయులు శాపఫలితముగ జన్మించ నున్నారు. వారు లోక కంటకులగుదురు. శ్రీహరి వారిని సంహరించి అందరిని రక్షించగలడు. మీరు భయములుడిగి నిశ్చింత నుండుడు." అని పలుక, మహర్షులు, దేవతాగణములు సంతసమున వెడలిరి.

దితికి పుత్రులిద్దరు కలిగిరి. ఆ సమయమున మహోత్పాతములనేకములు పొడసూపెను. పర్వతములదిరెను. భూమి కంపించెను. దిక్కులు మంటలతో నిండెను. భయంకరముగ గాలివీచెను. మహావృక్షములు మొదలంటకూలెను. చుక్కలు రాలెను. తోకచుక్కలు పుట్టెను. సముద్రములు అల్లకల్లోలమై భయంకరముగ ఘోషించెను. సూర్య చంద్రగోళములందు పరివేషము లేర్పడెను. మేఘములురిమి రక్తమువర్షించెను. నక్కలు, గుడ్లగూబలు వికారముగ అరచెను. దేవాలయములందు దేవతా విగ్రహముల కన్నులనుండి నీరు ద్రవించెను. గోవుల పొదుగులనుండి పాలకు బదులుగ రక్తపుధారలు స్రవించెను. గ్రహరాసులు గతులు తప్పెను. మహర్షులు, దేవర్షులు, మునులు, దేవతలు మున్నగు వారందరు భయకంపింతులైరి. రానున్న ప్రమాదము నూహించుకొని ఆందోళన చెందిరి. కశ్యపుడు తమ పుత్రులకు హిరణ్యకశిప, హిరణ్యాక్షులని పేరిడెను.

దితిపుత్రులలో హిరణ్యాక్షుడు రెండవవాడు. అతని మెడలో వైజయంతి అను పుష్పమాలకలదు. వీనికి యుద్ధకండూతిమెండు. గొప్పయుద్ధవీరుడు. దేవతలుసైతము వీనితో యుద్ధము చేయజాలక పారిపోయిరి. ముల్లోకములైన స్వర్గ, మర్త్యపాతాళ లోకవాసులు కూడా హిరణ్యాక్షునితో పోరాడ శక్తి జాలనివారైరి. మదోన్మత్తుడైన దానవుడు గదాదండము గిరగిర త్రిప్పుచూ సముద్ర జలములందు ప్రవేశించెను. వీరవిహారముచేయుచు వరుణుని రాజధానియైన విభావరీపురముచేరి, వరుణుని యుద్ధమునకు రమ్మని పిలిచెను. వరుణుడంత, " ఓదానవేశ్వరా! నీతో పోరాడ నేను సమర్థుడనుగాను. నీకు సరితూగు వీరుని చూపెదను. అతనితో పోరాడి నీశౌర్యమును ప్రదర్శింపుము. అతడు విష్ణుమూర్తి. వైకుంఠమున గలడు. అతని నెదిరించుము.

వేగమెపొమ్ము. నీయభీష్టము నెరవేరును. నీ కార్యము చక్కబడును. అని చెప్పినంత, హిరణ్యాక్షుడు మిగుల సంతసించి వైకుంఠమునకు బయలుదేరెను.

వానికి గగనమార్గమున పోవుచున్న నారదుడెదురయ్యెను. రణోత్సాహమున పోవుచున్న హిరణ్యాక్షుని, "దానవవీరా ! యెవరితో రణమొనర్ప నీవేగుచుంటివి? ఆమందభాగ్యుడెవరు?" అని ప్రశ్నించెను.

"వైకుంఠమున గల విష్ణువుతో పోరాడనేగుచుంటిని." అని దానవ వీరుడు గర్వమున బదులుపలికెను.

అంత నారదుడు, "ఓయీ ! నీ ప్రయత్నము వ్యర్థము. ప్రస్తుతము విష్ణుమూర్తి వైకుంఠమున లేడు. పాతాళమునగలడు. నీకు సామర్థ్యమున్నచో పాతాళమునకు పొమ్ము. నీ కోరిక తీరును." అని పలుక, హిరణ్యాక్షుడు మహోత్సాహమున పాతాళమున కేగెను.

అచ్చట కోటిసూర్యప్రభలతో వెలుగొందుచున్న వరాహమును గాంచెను. అది పర్వతాకారమున అత్యంత భయంకరముగ నుండెను. యజ్ఞవరాహరూపము ధరించిన శ్రీమహావిష్ణువు తన దంష్ట్రాగ్రముతో రసాతలమున మునిగి యున్న భూతలమును పైకి లేవనెత్తుచుండెను.

అది గాంచిన దానవుడు ఆదివరాహమూర్తిని గేలిచేయుచు, అనేక విధముల తూలనాడెను. యుద్ధమునకు రమ్మని రోషమున కవ్వించెను. అంతట వరాహస్వామి కోపోద్దీపిత మానసుడై భూమిని జలముల నుపరితలమున నిలిపెను. దాని యందు తన ఆధారశక్తిని నిలిపి, కదలనీయక స్థిరముగనుంచెను. అది చూచిన బ్రహ్మాది దేవతలు యజ్ఞవరాహమూర్తిని వేభంగుల సన్నుతించిరి. అంతట స్వామి మణిమయ భూషణములు, కవచాదులు ధరించి, గదాదండమును బూనెను. మదగర్వితుడైన హిరణ్యాక్షునెదిరించెను. వారిరువురినడుమ భయంకర యుద్ధము చాలకాలము కొనసాగెను. బ్రహ్మాదులు అచ్చటికేతెంచి, యుద్ధమును వీక్షించిరి. రాక్షసాధముని వెనువెంటనే సంహరింపుమని యజ్ఞవరాహుని వేడుకొనిరి. రాక్షసుడు మాయ లనేకములు ప్రదర్శించెను. శ్రీమహావిష్ణువు వాని మాయలన్నింటిని చెదరగొట్టి, చక్రాయుధముచే హిరణ్యాక్షుని సంహరించెను. రాక్షసుడంత హాహాకారములు చేయుచు మహాపర్వతముపగిది నేలగూలి ప్రాణములు వీడెను. బ్రహ్మాదిదేవతలు స్వామిని స్తోత్రముచేయ దేవదుందుభులు మారుమ్రోగెను. దివి నుండి పుష్పములు వర్షించెను. లోకములన్నియు శాంతించ, శ్రీమహావిష్ణువు వరాహరూపము విడచి వైకుంఠమును చేరెను.

# 19. కపిలాచార్యుడు

కర్దముడు బ్రహ్మసృష్టించిన ప్రజాపతులలో ఒకడు. ఆ ముని ఆశ్రమము సరస్వతీ నదీతీరమున గలదు. ఆతడు పదివేలసంవత్సరములు ఉగ్రతపమాచరించి శ్రీమన్నారాయణుని అనుగ్రహప్రాతుడయ్యెను. ఈతని భార్య దేవహూతి. ఈమె స్వాయంభువమనువుపుత్రిక. కర్దమ దేవహూతులకు తొమ్మిదిమందికుమార్తెలు, కుమారుడొకడు కలిగిరి. కుమారునిపేరు కపిలుడు. కపిలుడు శ్రీమన్నారాయణుని అంశమున జన్మించెను. అతడు సాంఖ్యయోగమునందు ఆచార్యుడై జగద్విఖ్యాతి గాంచెను. కపిలుని జననసమయమున దేవదుంధుభులు మ్రోగ, పూలవానలు కురిసెను. దేవతాగణములు, మహర్షులుమున్నగు మహనీయులు జయజయ ధ్వానములతో కీర్తించిరి.

కర్దముడు తన తొమ్మండ్రుగురు పుత్రికలను క్రమముగ కళను మరీచికి, అనసూయను అత్రికి, శ్రద్ధను అంగీరసునకు, హవిర్భూవును పులస్త్యునకు, గతిని పులహునునికి, క్రియను క్రతువునకు, ఖ్యాతిని భృగువునకు, అరుంధతిని వసిష్ఠునకు, శాంతిని అధర్వుణునకు యొన గూర్చి వివాహము లొనర్చెను. వారును సంతసమున తమతమ ధర్మపత్నులతో వారివారి ఆశ్రమములకుచనిరి. భగవంతుడు తనకు పుత్రుడుగా జన్మించినందులకు కర్దముడు మిగులానందించెను. సంసారబంధములను త్రెంచుకొని ముక్తి మార్గమును అన్వేషించుచు తపోభూములకేగెను. కపిలుడును అనంతర కాలమున తల్లియగు దేవహూతికి ముక్తిమార్గముపదేశించెను. ఆత్మ స్వరూపమును, పిండోత్పత్తి క్రమమును, జీవునకు గలిగెడి బంధములు మున్నగు రహస్య విషయములనెన్నింటినో వివరించెను. తొలిసారిగా సాంఖ్యాతత్వమును ప్రతిపాదించిన మహనీయుడు కపిలుడు. అయ్యది అన్నికాలములవారికి మార్గదర్శకమై ప్రఖ్యాతిగాంచినది. అనంతరము కపిలాచార్యుడు ఈశాన్యదిశగాపోయి, సముద్రతీర ప్రాంతమున నివాసమేర్పరచుకొని యోగమందుండెను. దేవహూతియు సాక్షాత్తు భగవంతుడైన తన కుమారుని దివ్యబోధనలవలన ప్రభావితురాలై తపోయోగమున భగవత్సాయుజ్యమును చేరుకొనెను. దేవహూతి సిద్ధిచెందిన పుణ్యక్షేత్రము సిద్ధాశ్రమము. ముల్లోకవాసులకు పవిత్రపుణ్యస్థలం సిద్ధాశ్రమము. కపిలుడు ప్రతిపాదించిన సాంఖ్యాతత్వమును అసురి, పంచశిఖుడు మున్నగు మహనీయులు లోకమున వ్యాపింపచేసిరి.

# ౨౦. దక్షయజ్ఞం

బ్రహ్మ సృజించిన ప్రజాపతులలో దక్షుడు ముఖ్యుడు. ప్రజాపతులందరు ప్రజాభివృద్ధి గావించిరి. విస్తారముగ ప్రజలను అభివృద్ధి గావించిన వారిలో దక్షుడు అగ్రగణ్యుడు. స్వాయంభువమనువునకు ముగ్గురు పుత్రికలు గలిగిరి. వారు దేవహూతి, ఆకూతి, ప్రసూతి అనువారు.

కర్దముడు దేవహూతిని పెండ్లాడెను. ఆకూతి రుచియను వానిని పెండ్లాడగ, వారికి విష్ణుమూర్తి యజ్ఞుడనుపేర పుత్రునిగను, లక్ష్మీదేవి దక్షిణ అనుపేరుతో పుత్రికగను జన్మించిరి. స్వాయంభువమనువు యొక్క మనుమడు క్రతువు. దక్షిణను వివాహము చేసికొనెను. వారికి పెక్కుమంది సంతతిగలిగెను, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు మనువు సంతతివారు. వీరు మహాబలాఢ్యులు, భగవద్భక్తులు. ధర్మమును రక్షిస్తూ స్వాయంభువమన్వంతర కాలమందు ధరామండలమును పాలించిరి. ప్రసూతి దక్షప్రజాపతిని పరిణయమాడెను. వారి సంతతి ముల్లోకము లందు అధికసంఖ్యలో వ్యాపించిరి.

కర్దముని కుమార్తె అనసూయ అత్రిమహామునిని పెండ్లాడెను. అత్రిసంతాన మాశించెను. కాని బ్రహ్మ ఆదేశానుసారము భార్యతో గూడి ఋక్షమను కులపర్వత ప్రాంతము చేరెను. అచ్చట ఆశ్రమము నిర్మించుకొని, వాయు భక్షణము గావించుచు నూరుసంవత్సరములు ఉగ్రతపమాచరించెను. అంత త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ప్రత్యక్షమై తమతమ అంశలతో ముగ్గురు పుత్రులు జన్మింతురని వరమనుగ్రహించి అదృశ్యులైరి. అనంతర కాలమున వారికి బ్రహ్మ అంశమున చంద్రుడు, విష్ణు అంశమున దత్తాత్రేయుడు, రుద్రాంశమున దుర్వాసుడు జన్మించిరి. అంగీరసునకు శ్రద్ధకు బృహస్పతిమున్నగువారు గలిగిరి.

పులస్త్యునకు హవిర్భుక్కులకు అగస్త్యుడు, విశ్రవసులు జనించిరి. విశ్రవసునకు ఇలబిలయందు కుబేరుడు జన్మించెను. అతడు యక్షగణములకు అధిపతి అయ్యెను.

విశ్రవసు రెండవభార్య అయిన కేశినియందు రావణ, కుంభకర్ణ, విభీషణులు, శూర్పణఖ పుట్టిరి.

క్రతువు - క్రియలకు వాలఖిల్యాది మహామునులు అరువదిమంది జనన మందిరి. అరుంధతి వసిష్ఠులకు సురోచి, విరజుడు మున్నగు తొమ్మండుగురు పుత్రులు

గలిగిరి. వసిష్ఠుని మరొక భార్యయందు శక్తి ముఖపుత్రులు గలిగిరి. భృగువు ఖ్యాతులకు ధాత, విధాతయను పుత్రులును శ్రీయను పుత్రికయు కలిగెను. ధాత విధాతలు, మేరువను మునీంద్రుని కుమార్తెలగు అయతి, నియతులను వివాహ మాడిరి. అయతియందు మృకండుడు, నియతియందు ప్రాణుడు జనించిరి. మృకండునకు మార్కండేయుడు, ప్రాణునకు వేదశిరుడు కలిగిరి. వేదశిరుని కుమారుడు శుక్రాచార్యుడు.

దక్షప్రజాపతికి ప్రసూతియందు పదహారు మంది కుమార్తెలు గలిగిరి. అందు పదముగ్గురిని ధర్మునకొసగి వివాహమొనర్చెను. అందు చివరి భార్యయగు మూర్తికి నరనారాయణులు జన్మించిరి. వారు భగవత్స్వరూపులైన మహర్షులు. వారే ద్వాపర యుగమందు కృష్ణార్జునులుగ అవతరించిరి.

దక్షప్రజాపతి కుమార్తెలలో ఒకరైన స్వాహాదేవి అగ్నిహోత్రుని వివాహమాడెను. దక్షుని చివరికుమార్తెసతీదేవి.దక్షుడు సతీదేవిని శివునకొసగి కల్యాణము చేసెను. కాని దక్షుడు అహంకారి. అల్లుడైన శంకరునితో విరోధించి, తన కుమార్తె సతీదేవిని అవమానించి, కోరి కష్టములను కొనితెచ్చుకొనెను.

ఒకానొక సమయమున మరీచాది ప్రజాపతులు సత్రయాగం చేయపూనిరి. ఆయాగమును దర్శించు నిమిత్తము దేవతలు, మహామునులు ఎందరో నేతెంచిరి. దక్షప్రజాపతికూడ సపరివారసమేతుడై నరుదెంచెను. అందరు లేచినిలబడి దక్షుని గౌరవించిరి. కాని బ్రహ్మ మహేశ్వరులు మాత్రం గౌరవించరైరి. దక్షుడు కోపోద్రిక్తు డయ్యెను. బ్రహ్మకుమాత్రం నమస్కరించి గౌరవించి, పరమశివుని సభామధ్యమున సభ్యుల సమక్షమున పలువిధముల దుర్భాషలాడెను. అంతేగాక, "ఇంకనుండి ఇంద్రాదులతో పాటుగ హవిస్సులందు శివునకు భాగము అందకుందుగాక," అని కఠినముగ శపించి దక్షుడు సభనుండి వెడలిపోయెను.

అట్లు దక్షుడు ప్రవర్తించి శపించినను శంకరుడెంతమాత్రము ఆగ్రహించలేదు. ఒక్క మాటైనను పరుషముగ పలకలేదు. కాని నందీశ్వరునకు మాత్రము కోపము కట్టలుదెంచుకొనెను. పట్టరాని ఆగ్రహము ముంచుకొచ్చెను.

"సభాసదులారా ! దక్షుడు తుచ్ఛము, నశ్వరము అయిన సంపదలు అధికారము చూచుకొని మదాంధుడై లోకపూజ్యుడు, కల్యాణప్రదుడైన పరమేశ్వరుని నిందించి శపించి మహాపరాధము చేసినాడు. అచిరకాలమందే ఈతడు మేషముఖుడై పశువుపగిది ప్రవర్తించుగాక." అని శపించెను.

అటుమీదట మునులను గాంచి, " ఓయీ! మునులారా! మదగర్వితుడై దక్షుడు శివనిందచేయుచుండ వీనులవిందుగ వినుచుండియు, నోరు మెదపక మౌనమూని మిన్నకుండినారు. దక్షుని పక్షమువహించిన మీరందరూ, బ్రాహ్మణులయ్యును, విద్యల నభ్యసించి ఉదరపోషణార్థం యాచకులై వర్తింతురుగాక" అని విప్రులను శపించెను.

బ్రాహ్మణులను నిష్కారణముగ నంది శపించినందులకు భృగుమహర్షి మిక్కిలి మండిపడెను. "ఓయీ నందీ ! కారణమించుకయులేక బ్రాహ్మణులను శపించి అపచారమొనర్చినావు. కనుక నా ప్రతిశాపము వినుము.

"కేవలము శివుని మాత్రమే కొలుచు వారందరు వేదవిరుద్ధకర్మ లాచరించుచూ పాషండులగుదురుగాక" అని మారుపలికెను. అటు మీదట పరమేశ్వరుడు తన పరివారముతో సభనుండి వెడలిపోయెను. మరీచ్యాదులు సత్రయాగమును వేయి సంవత్సరములాచరించిరి.

మామా అల్లుళ్లమధ్య వైరము నానాటికి అభివృద్ధిచెందుచుండెను. దక్షుదనేక యాగములుచేసియు శివుని ఆహ్వానించలేదు. హవిర్భాగం అర్పించలేదు. ఒక్క శివుడుదక్క మిగిలిన దేవతాగణములు, మునులు, మహర్షులు, బంధుమిత్రులు సపరివారసమేతముగ నరుదెంచి, దక్షుడుచేయు యాగమునందు పాల్గొనుచుండిరి.

దక్షుడు వాజపేయమనుయాగమును మహావైభవముగా చేయ ప్రారంభించెను. బృహస్పతియాగము ప్రారంభించెను. ముల్లోకవాసులు వచ్చిరి. శంకరునకు ఆహ్వానములేదు. తన తండ్రి గొప్పయాగము చేయుచున్నట్లు సతీదేవి వినెను. దక్షాధ్వరమును చూడవలెనని సతీదేవికి కోరిక జనించెను. జనించిన కోరిక బలముకాగా, సతీదేవి భర్తను సమీపించి నమస్కరించి యిట్లుపలికెను.

"ప్రాణేశ్వరా ! మాతండ్రి గొప్ప యాగము చేయుచున్నట్లు వింటిని. మీ యిరువురిమధ్య బద్ధవైరమున్న విషయము నేనెరుగుదును. అందువలన మనలను ఆహ్వానించలేదు. అయినను యజ్ఞము చూడవలెనను కోరిక నన్ను వేధించుచున్నది. దాని నెపమున నామాతృమూర్తిని, తోబుట్టువులను, బంధువర్గమును కన్నులార గాంచవలెన నెడి ఆశ మిన్నగనున్నది. కనుక మన్నించి అనుమతించిన పోయి వత్తును." అని పతిదేవుని అర్థించెను.

అంత పరమశివుడు మందహాసముతో, "సతీ ! నీ వాడినమాటలు సత్యదూరము గాదు. కానీ నీతండ్రి అధికారదర్పమున విర్రవీగుచున్నాడు. అహంకారముతో

ప్రవర్తిల్లుచు, తారతమ్యము లెరుగకున్నాడు. అదియును గాక నీ తండ్రి మనలను ఆహ్వానించక అవమానించినాడు. అట్టియెడ నీవచ్చటికేగుట మర్యాదగాదు. మద గర్వమున నిన్ను అవమానించవచ్చును. నిన్ను అవమానించిన నన్ను అవమానించిన యట్లే యగును. అద్దానిని నేను సహించజాలను. మంచి మర్యాదలేని ప్రదేశమున కేగుట ఉచితముగాదు. పైగా పిలువనిపేరంటమునకు వెళ్లిన నీవు చులకనగుదువు. కావున వెళ్లవలదు" అని పలికెను.

కాని సతీదేవి పరమేశ్వరుని మాటలు వినకుండెను. వెళ్ళవలెనని పట్టుబట్టెను. శంకరుడును కాదనజాలక మారు పలుకలేదు. ముందు కాలమున జరుగనున్న కార్యము మనమునదలచి, "నీయిష్టం. నీవు వెళ్ళవచ్చు. కానీ నేనుమాత్రం రాను," అని చెప్పెను.

సతీదేవి కొంతతడవు చింతించి పుట్టినింట జరుగువేడుకను కాంచవలెననెడి కాంక్ష బలీయము కాగా బయలుదేరెను. సతీదేవి యొంటరిగ బయలుదేరగ, ప్రమథ గణమంతయు, మంగళవాయిద్యములతోడను, వాహనములతోడను అమె ననుసరించిరి. సర్వాభరణభూషితయై సర్వాలంకరణశోభితయై, సతీదేవి నందివాహన మధిరోహించి సాగెను.

సతీదేవి వృషభవాహనారూఢయై దక్షుని యజ్ఞవాటికకు చేరెను. దేవతలు మునులు యింకను మరెందరో యజ్ఞమును వీక్షించుచుండగ, అంతటను వేదఘోష వినవచ్చుచుండెను. సతీదేవి అదృశ్యముగాంచి మిగుల సంతసించెను. మనమున ఆనందమునిండ ఉప్పొంగెను. పరమేశ్వరుని అర్ధాంగి సతీదేవిని చూచిన వారందరు ఆనందించిరి, తల్లి, తోబుట్టువులు బంధు వర్గము మున్నగు వారందరు సంతసించిరి. ఆదరమున పలుకరించి, కుశల ప్రశ్నలతో ముంచెత్తిరి. కాని తండ్రి దక్షుడు మాత్రము కన్నెత్తి చూడలేదు. పలుకరించలేదు. దానితో సతీదేవి మనస్సు చివుక్కుమనెను. తలవంపులయ్యెను. అవమాన భారంతో ఆమెమనస్సు బరువెక్కెను. ఆపాదమస్తకం దహించుకు పోయెను. మాతృమూర్తి ఆదరణ, బంధుమిత్రుల ప్రియవచనములు ఆమెను శాంతింపచేయకుండెను. లోకారాధ్యుడైన తన భర్తను ఆహ్వానించక జరుపుచున్న యజ్ఞము వ్యర్థమని తలచెను. యాగమును చూడ మనస్కరించలేదు. ఆపాదమస్తకము కోపముతో నిండెను. కన్నులనుండి అగ్నికణములు జలజలరాలెను. జగన్మాతకు జరిగిన అవమానమునకు రుద్రగణమంతయు అపరరుద్రులైరి. సతీదేవి రోషారుణనేత్రయై దక్షుని పలువిధముల నిందించెను. "తనను, తనభర్తను

అవమానించినందులకు తగిన ఫలమనుభవింతు"వని దక్షుని కఠినముగ శపించెను. తల్లి, తదితరులు చేయబూనిన పూజలు, సన్మాన సత్కారములు స్వీకరించలేదు. అన్నింటిని తిరస్కరించెను. ఆవేశ పూరితులైన రుద్రానుచరులనందరిని నివారించెను.

అవమానమును భరించజాలనిదయ్యెను. తనువును చాలించవలెనని నిర్ణయించెను. "అగ్నిబడి దగ్ధమై పవిత్రురాలనగుదు"నని నిశ్చయించెను. సభనందున్న వారిని చురచురజూచెను. ఆచూపులు భరింపజాలక అందరు మిగుల భయమందిరి. గజగజవణకిరి. జగన్మాత చూపులు ముల్లోకములను దహించి వేయుచున్నట్లుండెను.

అంతట పరమేశ్వరి దర్భలను నేలపైపరచి, వానిపై ఆశీనురాలయ్యెను. చిత్తమును పరమశివుని పాదపద్మములందు లగ్నమొనర్చి నవరంధ్రములను బంధించెను. మహాయోగులకు సైతము నసాధ్యమగు యోగసాధనమొనర్చెను. సతీదేవి దేహము నుండి మంటలెగసెను. అగ్నిజ్వాలలో ఆ దేవిశరీరము భస్మ మాయెను. ఆ సమయమున ముల్లోకములు కంపించెను. హాహాకారములు జనించెను. భూతకోటి యంతయు గడగడలాడెను. ప్రమథులందరు ఆయుధములుచేబూని అందున్న వారలనందరిని హతమార్చనుంకించిరి. అంత భృగుమహర్షి మహర్షులను, మునులను రక్షింపదలచి అభిచారహోమముచేసెను. అంతట ఋభనాములైన దేవతలనేకులు పుట్టుకొచ్చి, కొరవులనుచేబూని రుద్రానుచరులను తరిమి గొట్టిరి.

పరమశివునకీ విషయము తెలిసెను. అపరిమితముగ కోపము ముంచుకొచ్చెను. మహోగ్రదగ్రుడై ప్రళయతాండవము చేయసాగెను. శిరస్సు నందలి జటనొకదాని నూడబెరికి పుడమిపైకొట్టి ప్రళయగర్జన మొనర్చెను. జటనుండి భగభగ భుగభుగ మంటలు గ్రక్కుచు వీరభద్రుడు పుట్టుకొచ్చెను. సహస్రబాహువులు, భయంకర దంష్ట్రములు, కాలమేఘసదృశమైన దేహము, భూమ్యాకాశములు వ్యాపించిన విశ్వరూపము, ప్రళయాగ్నిజ్వాలలు వెడలుగ్రక్కుచున్న త్రినేత్రములు త్రిశూలాది వివిధాయుధములు గలహస్తములు కంఠమున కపాలమాలలు గలిగి వీరభద్రుడు భయంకరాకారుడైయుండెను. పరమేశ్వరునకు సాష్టాంగదండ ప్రణామము చేసి, "ప్రభూ! ఏమి ఆజ్ఞ" అని వినమ్రుడై ప్రశ్నించెను.

"ఓయీ! వీరభద్రా! దక్షాధ్వరమును ధ్వంసమొనరింపుము. ఏశక్తియు నిన్నెదిరింపజాలదు. నాఅంశతో జనించినందున నీవు సర్వము జయించగలవు, పొమ్ము" అని ఆజ్ఞాపించెను.

అంత వీరభద్రుడు భయంకరముగ కేకలిడుచు దక్షుని యజ్ఞశాలను చేరెను. అతని అరపులకు సమస్తలోకములు తల్లడిల్లెను. అందుగల దేవతలు, మునులు మున్నగు వారందరు భయకంపితులైరి. దక్షుడుసైతము భీతమనస్కు డయ్యెను. వీరభద్రుడు వివిధరూపములతో, పలువిధ ఆయుధములతో యజ్ఞశాలను ధ్వంస మొనర్చెను. దేవతా గణములను, మునులను పట్టి దండించెను. మునిపత్నులు, సురాంగనలు భయమున పరుగులు తీసిరి. యజ్ఞవాటికలో వీరభద్రుడు వీరవిహార మొనర్చెను. నందీశ్వరుడు, చండీశ్వరుడు, మణిమంతుడు, శృంగి, భృంగిమున్నగు ప్రముఖులు ఇంద్రాదిదేవతలను, సూర్యచంద్రులను, మున్నగువారిని బంధించిరి. ప్రమథుడొకడు భృగుమహర్షిని బంధించి, వాని మీసములూడబెరికెను. వేరొకడాతని కన్నులను లాగివైచెను. మరొకడు సూర్యుని పండ్లనూడదన్నెను. వీరభద్రుడావిధముగ దక్షాధ్వరమును ధ్వంసమొనర్చి, దక్షుని శిరస్సున ఖండించి, మహోదానందమున కైలాసమున కేగెను.

బ్రహ్మ, విష్ణువులు మాత్రము దక్షాధ్వరమునకు రాకుండిరి. శివుని పరాభవించిన కారణమున వారు యజ్ఞమునకు రారైరి. పరాభవింపబడిన దేవతలు, మునులు మున్నగు వారందరు బ్రహ్మ విష్ణువులను దర్శించి, తమగోడును చెప్పుకొనిరి.

అంత పరమేష్ఠి, "అయ్యలారా ! పరమేశ్వరుని కోపాగ్ని చల్లార్ప నేరితరము గాదు. విశ్వకల్యాణ ప్రదుడైన విశ్వేశ్వరుని అవమానించినవారికి యిట్టి దుర్గతి వాటిల్లుట తథ్యము. కావున మనమందరము పరమశివుని కడకేగి ఆ మహనీయుని శరణుగోరుదము," అని పలుక, అందరు పరమేశ్వరుని దర్శించి, అపరాధము మన్నించి క్షమించుమని ప్రార్థించిరి. వేదసూక్తములతో ఆకల్యాణప్రదుని స్తుతించిరి.

దేవాదిదేవా! పరమశివా! సర్వలోకారాధ్యుడవీవు, సర్వమునకాధార భూతుడవు. సురశ్రేష్ఠుడవు, అట్టినీకు అపచారమొనర్చి, తగిన శాస్తి ననుభవించినారు. దక్షుడు శిక్షను పొందినాడు. నీకు హవిర్భాగములేక యెట్టియాగము నెరవేరదు. పరిపూర్ణత చెందదు. ఎప్పటివలె నీకు హవిర్భాగం లభించుగాక," అని చతుర్ముఖుడు పరమశివుని శాంతింపచేసెను.

భోళాశంకరుడు శాంతించి ప్రసన్నుడయ్యెను. అందరిని దయాళుడై అనుగ్రహించెను. దక్షుని కంఠమునకు మేషముయొక్క శిరస్సునుతెచ్చి అతికించి బ్రతికించెను. సూర్యునకు దంతములు ప్రసాదించెను. దక్షయజ్ఞమున మరణించిన

వారందరు పునర్జీవులైరి. యజ్ఞవాటిక పూర్వశోభలతో శోభిల్ల, దక్షుడు తన అపరాధమును మన్నించి క్షమించుమని పరమశివుని పాదములంటి ప్రార్థించెను. దక్షుని యజ్ఞము యథావిధి ముగిసెను.

ఆ సమయమున యజ్ఞవాటిక నుండి శ్రీమహావిష్ణువు చతుర్భుజముల తోడను. శంఖచక్రగదాద్యాయుధములతోడను ఆవిర్భవించెను.

ఓయీ దక్షా ! శివునకును, నాకును బేధములేదు. ఇరువురమొక్కటే. శివుని అవమానించినచో అది నన్నవమానించిన యట్లే యగును. శివనిందకు మించిన అపరాధము వేరొండులేదు. ఆ అపరాధమునకు వెనువెంటనే శిక్షతప్పదు. ఎట్టి వారైనను దానిని తప్పించుకొనజాలరు." అని దక్షప్రజాపతిని హెచ్చరించెను. అనంతరము యెల్లరును నిజవాసములకు సంతోషమున చనిరి.

## 21. ధృవుడు

స్వాయంభువమనువు కుమారుడు ఉత్తానపాదుడు. ఉత్తానపాదునకు సునీత, సురుచి అను ఇద్దరు బార్యలు కలరు. సునీత పెద్దభార్య. సద్గుణ సంపన్నురాలు. ఆమెకు ధృవుడు అను పుత్రుడు కలిగెను. చిన్న భార్య సురుచి. ఉత్తముడనువాడు సురుచి కుమారుడు. చిన్న భార్య సురుచి యందు రాజుకు ప్రేమానురాగములధికము. అందుచే పెద్దభార్య సునీతపట్ల అనాదరణము చూపెడివాడు. ధృవుని యందును ప్రేమాభిమానములు సన్నగిల్లెను.

ఒక దినమున ఉత్తానపాదుడు చిన్నభార్యపుత్రుడైన ఉత్తమునితొడపై కూర్చుండ పెట్టుకొని ముద్దాడుచుండెను. అపుడు బాలుడైన ధృవుడువచ్చి తండ్రితొడపై కూర్చుండ బోయెను. కాని తండ్రి వానిని ఆదరమున దరిచేర్చుకొనలేదు. చెంతనే యున్న సురుచి ధ్రువుని చీదరించుకొని, పసివాని చెయ్యిపుచ్చుకొని ఆవలకులాగెను.

"ఓరీ! నీవు అధముడవు. తండ్రి యొడిలో కూర్చొను అధికారము, అర్హత నీకు లేదు. ఒక అధమురాలి గర్భమున జన్మించినందున నీకట్టి గౌరవ మర్యాదలు దక్కవు. నీకు రాజ్యార్హతయులేదు. రాజ్యార్హత గలిగినవాడే తండ్రి యొడిలో కూర్చొనుటకు అర్హుడు." అని పలువిధముల దుర్భాషలాడెను.

సవతితల్లి పలుకులు పసివాని మనస్సును గాయపరచెను. అవమానముతో అతని హృదయము దహించి వైచెను. తండ్రిగూడ భార్య మాటలను విని మిన్న

కుండెను. ఇక బాలుడు క్షణమైన అచ్చట నిలువలేదు. వెంటనే తల్లి వద్దకేగి విషయము వివరించి విలపించెను. జరిగిన దంతయు తెలిసికొని ఆమెయు కడుదుఃఖించెను.

"నాయనా ! జరిగిన దానికి విచారించకు. ఇందెవరి దోషములేదు. అంతయు మనకర్మ. అధైర్యపడకు. నేను చెప్పినవిధముగ ప్రవర్తించుము. అంతయు మేలగును. లోకబాంధవుడు, జగద్రక్షకుడైన శ్రీమన్నారాయణుని ఆరాధించుము. మున్నెందరో ఆదేవదేవుని భజించి తరించినారు. నీకష్టములు తీర్చగలవాడు అపరంధాముడొక్కడే." అని సునీత పుత్రునోదార్చెను. ముక్కుపచ్చలారని బాలుడు మనస్సును ధృడపరచుకొని అన్నిబంధములు త్రెంచుకొని వనములకేగెను. అపుడా బాలునివయస్సు అయిదు సంవత్సరములు మాత్రమే.

లోకమున ప్రతిబిడ్డకు ప్రధమగురువు తల్లి. తరువాత తండ్రి, అటుపై ఆచార్యుడు అందుకే "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అను ఆర్యోక్తి. తల్లిని మించిన దైవముగాని, గురువుగాని, యితరము వేరులేదు. కనుకనే ధ్రువునకు తల్లియే మునుముందుగ గురువై జ్ఞానోపదేశముచేసి, ముక్తిమార్గమును చూపి మార్గదర్శకురాలయ్యెను.

అడవుల బడిపోవు ధ్రువునకు నారదుడెదురయ్యెను. బాలుని ప్రశ్నించి విషయము తెలిసికొనెను. అంతనారదుడు, "వత్సా! నీవు బాలుడవు, అభము శుభము తెలియని అమాయకుడవు, వనమున తపమాచరించుట సామాన్య విషయముగాదు. మహాయోగులకు సైతము అసాధ్యమైన కృత్యము, ప్రస్తుతము నీకది తగినదిగాదు. కొంతకాలము ఓర్పు వహించుము. తగిన సమయము వచ్చినపుడు తపము చేయవచ్చును. తిరిగి గృహమునకు పొమ్ము. " అని పలికెను. కాని ధ్రువుని నిర్ణయము మారలేదు. తపమాచరించుటకే ధృడచిత్తుడై యుండెను.

"మహాత్మా ! నా కోరిక మన్నించుడు. తమరు బ్రహ్మమానసపుత్రులు. పరమ భాగవతోత్తములు. త్రికాలవేదులు కనుక నాకు కర్తవ్యము బోధించుడు. పరమోత్కృష్టమైన ఉత్తమపదము పొందవలెనను, నాఆకాంక్షను తీర్చుడు." అని ధ్రువుడు వినమ్రుడై మునిని ప్రార్థించెను.

బాలుని మాటలకు నారదుడు మిగుల సంతసించెను. "బాలకా! నీ దీక్ష మిగుల కొనియాడ దగినది. ముల్లోకవాసులు మెచ్చదగినది. నీతల్లి బోధించినట్లు నిశ్చల మనస్కుడవై శ్రీహరిని ధ్యానించుము." అనుచు నారదుడు బాలునకు వాసుదేవుని

ద్వాదశాక్షరమంత్ర ముపదేశించి, తపోనిష్ఠవిధులను బోధించెను. పిమ్మట ధ్రువుడు నారద మహర్షికి ప్రదక్షిణ దండప్రణామములాచరించి, తపమాచరించుటకు మధువనమున కేగెను.

ఉత్తానపాదుడు, తన కుమారుడు ధ్రువుడు తపోవనములకేగినాడని తెలిసి చాల దుఃఖించెను. అనేక విధముల పుత్రునిదలచి వాపోయెను. తన భార్య అనుచిత ప్రవర్తనమునకు మిగుల పశ్చాత్తాపమందెను. అంత ఒకనాడు నారదమహర్షి రాజుకడకరుదెంచెను. ధ్రువుని విషయము తెలిపెను. దేవతలకు, మహాయోగులకు సైతము అసాధ్యమగు మహత్తరకార్యమును సాధించి ముల్లోకవాసులచే కీర్తింప బడునని రాజునోదార్చెను. కాని ఉత్తానపాదుడు పుత్రునితలచిదలచి దుఃఖించెను. రాజ్యాది భోగములందు విరక్తుడై యుండెను.

ధ్రువుడు మధువనమందు నారదుని ఆదేశానుసారము తపోదీక్షను స్వీకరించెను. పండ్లు, ఆకులు, నీరు, గాలి గ్రహించుచు కఠోరతపమాచరించెను. అటుల కొంత కాలము పిమ్మట ఉచ్ఛ్వాస నిశ్వాసములు నిరోధించి, పంచప్రాణములు బిగియపట్టి ఒంటికాలుపై శిలాప్రతిమవలె నిలుచుండి నిర్మలమనస్కుడై శ్రీహరిని గూర్చి తపమొనరించెను. అటులెన్నోయేండ్లు గడచెను. అటుపై కాలిబొటనవ్రేలుపై నిలుచుండి ధ్యాననిమగ్నుడయ్యెను. అపుడాతని తపోమహిమకు లోకములన్నియు గడగడవణకెను. ప్రాణికోటి భయకంపితమయ్యెను. దేవతలు మునులు మున్నగు వారందరు శ్రీమహావిష్ణువు కడకేగి లోకములను రక్షింపుమని శరణుజొచ్చిరి. శ్రీమన్నారాయణుడు వారికభయమొసంగి, భయమునుడిపి పంపెను. అటు మీదట శ్రీమహావిష్ణువు గరుడవాహనారూఢుడై శంఖచక్రాద్యాయుధములు ధరించి ధ్రువుని ముంగిట ప్రత్యక్షమాయెను.

శ్రీహరిని దర్శించిన ధ్రువుడు పరమానంద భరితుడాయెను. కన్నుల నుండి ఆనందభాష్పములు జలజలరాలెను. అంజలిఘటించి సాష్టాంగదండప్రణామము లాచరించెను. శ్రీమన్నారాయణుని కీర్తించుటకు మాటలు రాకుండెను. అంతట శ్రీహరి శంఖముచే ధ్రువుని కపోలభాగము స్పృశించెను. వెనువెంటనే బాలునకు దివ్యజ్ఞానముదయించెను. వేదసూక్తములతో శ్రీమహావిష్ణువును పలువిధముల కీర్తించెను.

అంత శ్రీమహావిష్ణువు మిగుల సంతసించెను. "వత్సా ! నీ యభీష్టము సిద్ధించినది. నీవు లోకోత్తరపురుషుడవై వెలుగొందగలవు. సూర్యచంద్రులకు, సమస్త

గ్రహరాసులకు ఆధారభూతుడవగుదువు. నక్షత్రరూపమున ప్రకాశించగలవు. నీవు అరువదివేల సంవత్సరములు రాజ్యపాలనము గావించి, నా అనుగ్రహప్రభావముచేత సర్వోత్తమస్థానము పొందగలవు. అటుపై గ్రహ నక్షత్రాది జ్యోతిశ్చక్రమునకు నీస్థానము ఆధారమగును. నీవు ధ్రువనక్షత్రనామమున ప్రఖ్యాతుడవగుదువు." అని ఆశీర్వదించి శ్రీహరి అంతర్ధానుడయ్యెను.

ధ్రువుడు శ్రీహరి అనుగ్రహమునుపొంది నగరమునకు బయలుదేరెను. మార్గ మధ్యమున ఉత్తానపాదుడు భార్యలు, పుత్రుని వెంటనిడుకొనివచ్చి ధ్రువుని ఆదరమున ఆహ్వానించెను. రాజువెంట మంత్రులు బంధుమిత్రులు మంగళవాద్యములు బంగరు పల్లకి నుండెను. నగరమునకు చేరిన పిదప ఉత్తానపాదుడు ధ్రువునకు రాజ్యపట్టాభిషేకము గావించి, రాజ్యభారము అప్పగించెను. ధ్రువుడు శిశుమారుని కుమార్తెయగు భ్రమిని, వాయుపుత్రి అయిన ఇలను పెండ్లాడెను.

ధ్రువుని సోదరుడు ఉత్తముడు హిమవత్పర్వత ప్రాంతములకు వేటనిమిత్తము చని అచ్చట యక్షులవలన చంపబడెను. పుత్రుని వెదకుచు అతనితల్లి సురుచి వనములకేగి, అచ్చటనే మరణించెను. తన తమ్ముని సంహరించిన యక్షులను శిక్షించుటకు ధ్రువుడు వారిపై యుద్ధము చేయబోయెను. యక్షులనేకులను సంహరించెను. అంతట ధ్రువుని తాతగారు స్వాయంభువ మనువు వానికడకేతెంచి, హింసమానుమని నయవచనములు బోధించెను. తాతగారి మాటల మన్నించి ధ్రువుడు యుద్ధము విరమించెను. యక్షుల ప్రభువైన కుబేరునితో మైత్రి గావించుకొని సంతసించెను.

అనంతరము ధ్రువుడు అరువదివేల సంవత్సరములు రాజ్యమును ధర్మబద్ధముగ పాలించి, సమస్త భోగములను భవించెను. రాజ్యసంపదలను, ఐహికవాంఛలను త్యజించి బదరీ వనమునకేగెను. అపుడు విష్ణుదూతలగు సునందుడు, నందుడు అనువారు దివ్యవిమానము గొనివచ్చిరి. దేహత్యాగమొనర్చు కాలమాసన్నమైనదని ధ్రువుడు నిశ్చయించెను. ధ్రువుడంత స్వచ్ఛంద మరణమునుపొంది భౌతికదేహమును త్యజించెను. అపుడాతని తల్లి సునీతయు దివ్య విమానము నధిరోహించెను. సమస్త దేవతాగణము, మహర్షులు, మునులు పలుతెరగుల కీర్తించుచుండగ, ధ్రువుడు సమస్త గ్రహమండలములను, సప్తర్షి మండలమును అతిక్రమించి, ఉత్తరదిశయందు గల అత్యున్నతము, సత్యము, నిత్యము అయిన ధ్రువపదమునందెను. ధ్రువుడు

స్వయంప్రకాశకుడు. నిర్మలుడు, శాశ్వతుడు నిత్యప్రకాశకుడు, ఆ సమయమున దేవదుందుభులు మ్రోగెను. గంధర్వాది గణములు గానముచేయ, పూలవానలు కురిసెను.

ధ్రువనక్షత్ర దర్శనము పుణ్యప్రదము, సకల పాపహరము, సమస్త శుభములు కలిగించును. కనుకనే నూతన వధూవరులకు ధ్రువనక్షత్రమును చూపుచుందురు. మరణమాసన్నమైనవారికి, కీడుమూడిన వారికి ధ్రువనక్షత్ర దర్శనము కలుగదని పెద్దలు చెప్పుచుందురు. ఖగోళశాస్త్రమందును, కాలగణనమందును ధ్రువనక్షత్రం అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకొన్నదనుటలో ఎట్టి సందియము లేదు. సముద్ర యానము చేయువారికి రాత్రులందు ధృవ నక్షత్రము ప్రయాణ సౌకర్యము కలిగించును.

ధ్రువచరిత్రను ముఖ్యముగా ఉదయ సాయం సమయములందు, కవి పండితులు, విప్రశ్రేష్ఠులుగల సభలందును, పూర్ణిమ, అమావాస్య పర్వదినము లందును, గ్రహణ, సంక్రమణాది పుణ్యకాలములందు, శ్రవణానక్షత్ర దినము లందును, సప్తమితిధియు, ఆదివారములందును పఠించినను, శ్రవణము చేసినను సర్వవిధ సౌభాగ్యములు, ఆయురారోగ్యములు, భగవద్భక్తియు, శ్రీహరి అనుగ్రహ ప్రాప్తియు చేకూరును.

## 22. పృధుచక్రవర్తి

ధ్రువుని వంశజుడైన పృధుచక్రవర్తి మిగుల ప్రసిద్ధుడు. వేనుడనురాజు పరిపాలనాకాలమందు ప్రజలు కష్టములనుభవించిరి. రాజు దుష్కార్యముల నెన్నింటినోజేసెను. మునులను, బ్రాహ్మణులను అనేకవిధముల బాధించెను. యజ్ఞ యాగాదులు సాగనివ్వలేదు. అధర్మము మితిమీరి ప్రబలెను. ధర్మము నుద్ధరించు మని మహామునులు, బ్రాహ్మణోత్తములు వేనరాజును పలువిధముల ప్రార్థించిరి. కాని వారివిన్నపములను రాజు పెడచెవినిపెట్టెను. అంత మునులాగ్రహించి వేనరాజును కఠినముగ శపించగ, అతడు గతించెను. రాజుకు సంతానములేని కారణమున రాజులేక రాజ్యము అరాజకమయ్యెను. రాజ్యమున చోరబాధ అధిక మయ్యెను. అనేకములైన భయోత్పాతములు పెచ్చుపెరిగెను. అంతట మునులందరు యోచించిరి. పరిష్కారముగ వేనుని మృతకళేబరము నుండి సృష్టి చేయవలెనని నిశ్చయించిరి. వేనుని తొడను మథించగ, అందుండి వికృతాకారుడు జనించెను.

అతడు బాహుకుడు. నిషాదులకు మూలపురుషుడు. రాజ్య పరిపాలనకు అర్హుడుకాడని భావించిమునులు వేనుని బాహువులను మధించిరి. అపుడు స్త్రీ పురుషులిర్వురు ఉద్భవించిరి. వారు భగవంతుని అంశతో జన్మించినందున దివ్యతేజో మూర్తులై వెలుగొందిరి. వారేపృథువు, అర్చులు. ఇరువురు పెండ్లాడి దంపతులైరి. అపుడు గంధర్వులు గానమొనర్చిరి. సిద్ధులు పుష్పవృష్టికురిపించిరి. దేవతలు, మునీశ్వరులు వివిధ రీతులకీర్తించిరి. మహర్షులు, మునులు గంగాజలముతో వారిని అభిషేకించిరి. పృథువు పట్టాభిషిక్తుడుకాగా, దిక్పతులు అమూల్యములైన కానుకలు, దివ్యాయుధములు అందించిరి. పృథువు ధర్మమును రక్షించుచు, రాజ్యపాలనము గావించెను. లక్ష్మీనారాయణులపగిది అఖండకీర్తి నార్జించిన పృథుమహారాజు ఘనకార్యముల నెన్నింటినో సాధించెను.

పృథువు రాజ్యమునకు వచ్చిన తొలిరోజులలో ప్రజలు అమిత బాధలు అనుభవించిరి. తినుటకుతిండి త్రాగనీరు లేక ప్రజలు నకనకలాడిరి. రాజ్యమున కరవు కాటకములు వికటాటట్టహాసములొనెర్చెను. పంటలుపండక విపరీత విషమ పరిస్థితి దాపరించుటకు కారణమును గూర్చి పృథుచక్రవర్తి దీర్ఘాలోచనము చేసెను. భువిపై ఓషధులు లేకుండుటయే ఇందుకు ముఖ్యకారణమని గ్రహించెను. అందుల కాతనికి భూమిపై అమితమైన ఆగ్రహము కలిగెను. కోపముతో మండిపడుచు పృథివిని సంహరించుటకు పూనుకొనెను. వింట శరసంధానము గావించి ప్రయోగింప సిద్ధముకాగా, భూదేవి భయకంపితయై, గోరూపముధరించి పరుగులు తీయసాగెను. పృథువుకూడ దానిని తరుముచు పోసాగెను. భూదేవి సమస్తలోకములు పరిభ్రమించెను. యెవ్వరు తనను రక్షించువారు గానరారైరి. చివరకు చేయునదిలేక, భూదేవి తనను రక్షించుమని రాజునే ప్రాధేయపడెను. సంహరించవలదని ప్రార్థించెను. అంతరాజు, "ఓయీ ! నీవు ఓషధులన్నింటిని గర్భమందుంచుకొని నాఆజ్ఞమీరి ప్రవర్తించినావు. అందు మూలమున ప్రాణికోటి యంతయు భరించరాని బాధల ననుభవించుచున్నారు. కనుక యికనైనను నీ బాధ్యత గుర్తించి ప్రజలను రక్షించుము. లేకున్న నిన్ను సంహరింతును." అని గంభీరముగ పలికెను.

అంతట భూదేవి, " ఓ రాజా ! పూర్వపురాజులు లోకపాలనపట్ల శ్రద్ధ చూపరైరి. అందువలన జీవనాధారములైన ఓషధులన్నియు దుష్టులపాలై నశించగ, నేను వానిని స్వీకరించితిని. కాలగమనంలో క్రమంగా అవన్నియు క్షీణించినవి. కావున నాపై నాగ్రహించక నేనుచెప్పిన విధముగా చేయుము. గోరూపములో వున్న నాకు ఒక

దూడను యిమ్ము. పాల పాత్రను, పాలు పితుకువానిని సిద్ధము చేయుము. నేనపుడు క్షీరరూపములో సమస్త ఓషధులనివ్వగలను. పర్వతములు, కొండలు, గుట్టలతో నిండియున్న నన్ను నీపరాక్రమము నుపయోగించి సమతలము చేయుము. వర్షధారలను నాయందు యిముడ్చుకొని, సమస్త ప్రాణికోటికి ఉపయోగింతును" అని సమయోచితమగు యోచనము చెప్పెను.

పృథుచక్రవర్తి గోరూపధారియైన భూదేవి చెప్పినమాటలు శ్రద్ధగనాలించెను. అందలి సత్యమును గ్రహించెను.

1. స్వాయంభువమనువును దూడగ యొనర్చెను. తన హస్తములను క్షీర పాత్రగను, తాను పాలు పితుకువాడయ్యెను. పొదుగునుండి పాలుపిండి భూమి యంతటను చల్లెను. అపుడు వెనువెంటనే ఓషధులు పుట్టుకొచ్చెను.

2. దేవతలు మునులు గోక్షీరము నుండి తమకు కావలసిన వస్తు సముదాయమును పొందిరి.

3. వసిష్ఠాది మహామునులు బృహస్పతిని దూడగను, ఇంద్రియములను క్షీరపాత్రగ యొనరించి ఛందోమయమైన పాలను పితికిరి.

4. దేవతలు దేవనాథుడైన ఇంద్రుని గోవత్సముగజేసి, స్వర్ణపాత్రలందు అమృతమును పితికిరి.

5. దానవులందరు గూడి ప్రహ్లాదుని దూడగయొనర్చి, ఇనుపపాత్రలలో గౌడి, పైష్టి, మాధ్వి అనుత్రివిధములైన మద్యము నిచ్చుపాలను పొందిరి.

6. గంధర్వులు, విశ్వావసును వత్సముగ చేసి 'పద్మ' మను పాత్రలో వాఙ్మాధుర్యమునిచ్చెడి క్షీరమును దండిగ దండుకొనిరి.

7. పితృ దేవతలు సూర్యభగవానుని దూడగయొనర్చి, మట్టిపాత్రలలో పాలు పితికిరి. తద్వారా అన్నము లభించును.

8. సిద్ధులు కపిలుని వత్సగ మార్చిరి. ఆకాశమును పాత్రగ చేసిరి. అణిమాద్యష్ట సిద్ధులు చేకూర్చు పాలను గ్రహించిరి.

9. విద్యాధరులు, ఆకాశగమనమువంటి విద్యలొసగెడి పాలను పిదుగుకొనిరి.

10. మాయావులు కొందరు మయుని దూడగజేసి ఇంద్రజాలాది విద్యలనిచ్చెడి పాలను పొందిరి.

11. యక్ష, రాక్షస, భూత, పిశాచాదులు రుద్రుని వత్సగను, కపాలమును పాత్రగనుజేసి మత్తును గలిగించెడి మద్యమువంటి రక్తమునిచ్చు పాలు పిండుకొనిరి.

12. సర్పములన్నియు తక్షకుని వత్సగజేసి రంధ్రములనెడి పాత్రలో విష రూపమైన పాలను పితుకుకొనిరి.

13. పశువులు శివుని వాహనమైన నందీశ్వరుని దూడగజేసి, అరణ్యమను పాత్రయందు తృణాదులను, చిన్నజాతి మొక్కలను యిచ్చెడి పాలను పొందెను.

14. పర్వతములు హిమవంతుని దూడగయొనర్చి, పర్వత సానువులనే పాత్ర యందు గైరికాది దాతువులను సమకూర్చెడి పాలను గ్రహించెను.

ఆ విధముగ ఎవరికివారు తమకవసరమగు వస్తువులను, పదార్థములను భూమి నుండి గ్రహించిరి. పృథుమహారాజు భూదేవిని జూచి మిగులానందించెను. తన కన్న కుమార్తెను చూచుకొన్న విధముగ భూమాతను ప్రేమాభిమానములతో ఆదరించెను. మిట్టలు గుట్టలు చదునుచేసి పుడమిని బాగుచేయగ, సమస్త పంటలతో సస్యశ్యామలమై పృథివి ప్రకాశించెను. కరవు కాటకములు లేక ప్రజలు సుఖ సంతోషములతో ఆనందించిరి. పృథువు ప్రజలకు వలసిన గ్రామములను, పట్టణములను నిర్మించి యిచ్చెను. ప్రజలకు యీవిధముగ సౌకర్యములు కల్పించిన ప్రభువులలో పృథువు ప్రథముడు. అనంతరము పృథుచక్రవర్తి సరస్వతీ నదీతీరమందు గల బ్రహ్మావర్తమనే సిద్ధక్షేత్రమందు నూరు అశ్వమేధములు చేయసంకల్పించెను. తన ఆశయము ప్రకారము తొంభైతొమ్మిది యాగములు నిర్విఘ్నముగ నిర్వహించెను. అంతటితో దేవతలందరు సంతృప్తులైరి. చివరిదైన నూరవయాగం ప్రారంభించి చేయుచుండగా దేవేంద్రునకు ఈర్ష్యాసూయలుద్భవించెను. నూరు యాగములు నిర్వహించినచో తనను మించి పోవునని భయమందెను. సహనము నశించెను. ఎటులైనను యాగమునకు విఘ్నము కల్పించవలెనని పూనుకొనెను. మాయోపాయముచే యాగాశ్వమును అపహరించెను. ఇంద్రుని కుతంత్రమును అత్రిమున్నగు మునులు కనిపెట్టిరి. పృథుచక్రవర్తిచేత అభిచారహోమములు చేయించనెంచిరి. ఆహోమము చేసినచో ఇంద్రుని గుట్టు రట్టగును. అంతట బ్రహ్మ అచ్చటి కరుదెంచి, ఆ ప్రయత్నమును అపుచేయించెను. పృథువు హోమము చేయవిరమించెను.

చతురాననుడు, "రాజా ! నీవు తొంభైతొమ్మిది యాగములు విజయవంతముగ ముగించినావు. నీకు ఇంద్రునితో దీటగు కీర్తిప్రతిష్ఠలు లభించినవి. నూరవయాగము నీవు చేయనవసరములేదు." అని పృథువునకు హితము పలికెను.

అనంతరము శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై రాజుకు తత్త్వ జ్ఞానమును బోధించెను. సనకాది మహామునులు మోక్షప్రాప్తికి అవసరమగు పరతత్త్వముపదేశించిరి. అనంతరము పృధుచక్రవర్తి చాలసంవత్సరములు అపర మహావిష్ణువువలె రాజ్య పాలనము చేసి, తుదకు సర్వముత్యజించి తపోభూములకు చనెను. అచ్చట నిశ్చల మనస్కుడై పెక్కు సంవత్సరములు తపమాచరించి, తుదకు విష్ణుసాయుజ్యమందెను. పృధుచక్రవర్తిభార్యఅర్చి అగ్నిజొచ్చి దగ్ధమై భర్తననుసరించెను.

ఇహపరసాధనమైనది పరమపుణ్యప్రదమైన పృధుచక్రవర్తి చరిత్రము ప్రతి యొక్కరు అవశ్యము పఠింప దగినది. ఈ చరిత్రము పరమపావనమైన దనుటలో సందియమిసుమంతయును లేదు. ఇందు ప్రముఖముగ గోవు యొక్క ప్రశస్తి గ్రహించదగినది.

## 23. ప్రియవ్రతుడు

ప్రియవ్రతుడు స్వాయంభువ మనువు పుత్రుడు. ఉత్తానపాదుని సోదరుడు. తొలుత నారద మహర్షివలన ఆత్మజ్ఞానము వడసి సర్వసంగపరిత్యాగియై తపో భూములకు జనెను. కొంత కాలమైన తదుపరి బ్రహ్మప్రత్యక్షమై గృహస్థాశ్రమమును స్వీకరించుమని బోధించగ, వివాహమాడి, గృహస్థుడై, పెక్కు సంవత్సరములు రాజ్యపాలనము గావించెను. ప్రియవ్రతుని భార్య బర్హిష్మతి. ఈమె విశ్వకర్మని కుమార్తె. ఈ దంపతులకు పదిమంది పుత్రులుదయించిరి. వారిలో అగ్నీధ్రుడు, కవి, మేధాతిథి మున్నగు పుత్రులును, ఊర్జస్వతి అనుకుమార్తెయు ముఖ్యులు, ప్రియవ్రతునకు రెండవ భార్య యందు ఉత్తముడు, తామసుడు, రైవతుడు అను పుత్రులు ముప్వురు కలిగిరి. ఊర్జస్వతి శుక్రుని పెండ్లాడగ దేవయాని అను పుత్రిక కలిగెను.

ప్రియవ్రతుడు భగవదంశతో జన్మించెను. వనభూములకేగి తపమాచరించి మహిమలెన్నింటినో సంపాదించెను. ఎన్నో అద్భుతసిద్ధులు, శక్తులు లభ్యమయ్యెను, ఎంతటి ఘనకార్యమైనను సాధించగల సమర్థుడాయెను.

సూర్యుడు మేరుపర్వతమును ప్రదక్షిణముచేసి వచ్చుటచే, భూమండలము నందు అర్ధభాగము వెలుతురుగను, మిగిలిన అర్ధభాగము చీకటిగను యేర్పడు చుండెను. అందువలన రాత్రింబవళ్ళు అను విభాగము సంభవమాయెను. ప్రియ వ్రతునకు ఒక ఆలోచనకలిగెను. సూర్యగమనము వలన యేర్పడుచున్న చీకటి ప్రాంతమునుగూడ వెలుగు చేయవలెననెడి కోరిక మనమున బలముగ స్థిరపడెను.

వెనువెంటనే ఇష్టదైవము నుపాసించి, సూర్యుని రథమును బోలిన తేజోవంతమైన స్వర్ణరథమును పొందెను. ప్రియవ్రతుడు దివ్యరథము నధిరోహించెను. సూర్యుడు ఉత్తరమునపయనించునపుడు తాను దక్షిణదిశలో పయనించెను. భగవానుడు దక్షిణమున ప్రయాణముచేయునపుడు తాను ఉత్తరదిక్కున పయనించెను. అటులాతడు ఏడు పర్యాయములు సూర్యుని అనుసరించి, రెండవ సూర్యునివలె ప్రకాశించుచు ప్రదక్షిణములు చేసెను. అపుడు రథచక్రముల రాపిడికి సప్తచారికలేర్పడెను. ఆచారికలు అగడ్తలాయెను. ఆ యగడ్తలే సప్తసముద్రములయ్యెను. అకారణముచే భూమి యేడుఖండములుగ విభజింపబడెను. అవి జంబూ, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కరములను నామములతో ప్రసిద్ధములైనవి. సప్తసముద్రములు, సప్తద్వీపములను అనుసరించి ఉన్నవి. ప్రస్తుతము మన భరతవర్షము జంబూద్వీప మందున్నది.

ప్రియవ్రతుడు అనంతరకాలమందు తనపుత్రుల నేడుగురను, సప్తద్వీపములకు రాజులనుగా నియమించెను. ప్రియవ్రతడు ఆవిధముగా నదీనదములు పర్వతములు, కొండలు, అరణ్యములు, వనభూములు మున్నగు వానిచే యిబ్బంది కలుగకుండగ భూమిని ధర్మయుతముగ విభజించి, పదునొకండుకోట్ల సంవత్సరములు పృథ్వినేలెను. అంత్యమున సర్వముత్యజించి తపోదీక్షబూని, గంధమాదన పర్వతముపై దేహము త్యజించి పరమపదమును పొందెను.

## 24. భరతుడు

ప్రియవ్రతుని కుమారుడు అగ్నీధ్రుడు జంబూద్వీపమును పాలించెను, అతని భార్య పూర్వచిత్తి. ఆమెయొక అప్సరసకాంత. వారికి నాభి, కింపురుషుడు, హరివర్షుడు, ఇలావృతుడు రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అనుతొమ్మండుగురు పుత్రులు గలిగిరి. అగ్నీధ్రుడు తన కుమారులకు రాజ్యమును పంచియిచ్చెను. వారును వారివారి నామములను, రాజ్యభాగములకిడి పాలించసాగిరి.

నాభి భార్యమేరుదేవి. విష్ణువు వారికి పుత్రుడుగా జన్మించెను. ఆతడు ఋషభుడు. అతడు అద్భుతశక్తి సంపన్నుడు, తన శక్తిచే వర్షము కురిపించి ఇంద్రుని గర్వమణచెను. దేవేంద్రుని పుత్రికయైన జయంతి ఋషభుని భార్య. వారికి నూరుగురు కుమారులు గలిగిరి. గుణములందును, శక్తియందును వారందరు తండ్రికి సమానులు. అందు జ్యేష్ఠుడు భరతుడు, అతడు మిగుల ప్రసిద్ధుడు, ఈధరామండలమును పాలించుటచే,

దీనికి భరతవర్షమని పేరువచ్చెను. పరమ భాగవతోత్తముడైన భరతుడు విశ్వరూపుని పుత్రికయైన పంచజనిని వివాహమాడి, పుత్రులైదుగురను పొందెను.

భరతుడు పితృపితామహులవలె ధర్మబద్ధమగును, ప్రజానురంజకముగను పదివేల సంవత్సరములు భూమినేలినాడు. యజ్ఞయాగములు, సత్కర్మలనేకము లాచరించెను. పరమపురుషుడైన శ్రీమన్నారాయణుని పాదపద్మములను తన హృదయకమలమున నిలుపుకొని, స్మరించుచు, ఆరాధించుచు, అర్చించుచు కాలము సాగించెను. తుదకు రాజ్యభారమును పుత్రుల కప్పగించి విరక్తుడయ్యెను. సర్వము త్యజించి, పులహమహర్షి ఆశ్రమమైన సాలగ్రామ ఆశ్రమమునకుచనెను. అచ్చట చిన్నకుటీరము నేర్పరచుకొని శేషజీవితమును భగవదారాధనమున గడపెను. లేడిచర్మమును వస్త్రముగా ధరించెను. తులసీ దళములచేతను, వివిధ పుష్పాదుల చేతను శ్రీహరిని పూజించెడివాడు. పరమభక్తుడై భరతుడు బ్రహ్మజ్ఞాని ఆయెను.

ప్రతి నిత్యము భరతుడు చక్రనదిలో స్నానము చేయుచుండెను. అపుడొక ఆడులేడి నీరుత్రాగుటకు నదీతీరమునకు వచ్చెను. అది నిండుగర్భమునయుండెను. అపుడొక భయంకర సింహనాదము విని, లేడి భయమున గడగడవణకెను. పిరికిదై, బెదరిపోయి, చెంగుచెంగున దుముకుచు పారిపోవ మొదలిడెను. అదురునకు దానికి గర్భస్రావమయ్యెను. అదిగూడ గమనించక మృగము నదినిదాటి, ఒక పర్వతగుహను ప్రవేశించి, మరణించెను. గర్భస్రావమునుండి చిన్నలేడి వుద్భవించెను.

ఆ లేడికూన నదీజలములబడి ప్రవాహమున కొట్టుకొనిపోవు చుండెను. భరతుడు దానినిగాంచెను. అతని హృదయముకరుణతో నిండెను. దయార్ద్రహృదయుడై భరతుడు లేడిపిల్లను పట్టుకొని, సేదదీర్చెను. ఆహారమునిచ్చి రక్షించెను. ఆశ్రమమునకు గొనిపోయి, పసిబిడ్డను లాలించిపోషించునట్లుల దానిని అతిప్రేమమున సాకసాగెను. అదియు క్రమముగ పెరిగి భరతునకు అత్యంత ప్రేమపాత్రమయ్యెను.

భరతునకు క్రొత్త బంధమేర్పడెను. భగవంతుని యందు బుద్ధికుదురుటలేదు. పూజలు, ధ్యానముతగ్గెను. అంతయు దైవలీల, లేడిపిల్లే భరతునకు లోకమయ్యెను. పరోపకారం, శరణాగతరక్షణ పరమధర్మములు. భూతదయ అన్నింటికి మించిన ధర్మమని భావించెను. క్షణమైనను దానిని విడచియుండెడివాడు కాదు. లేడిపిల్లయు అటులే ప్రవర్తించుచుండెను.

అటుల కాలముగడచుచుండెను. ఎన్నోయేడులు గతించెను. భరతునకు అవసానదశ సమీపించెను. ఆ దశయందును ఆతనికి మృగముపై మమకారము

తగ్గినదికాదు. దానిని చెంతనే యుంచుకొనెను. తాను గతించినపిదప లేడికూనను క్రూరమృగమేదియైన బట్టి బాధించి, చంపునేమో యను భీతమనస్కుడై తల్లడిల్లుచు ప్రాణములు విడచెను.

తదుపరి జన్మలో భరతుడు మృగమై జన్మించెను. కాని పూర్వజన్మ పుణ్యకర్మ విశేషముచే, అతనికి పూర్వజ్ఞానము కలిగెను. పూర్వజన్మను తలచుకొని మిగుల దుఃఖించెను. అవివేకముచేత లేడిపిల్లను చేరదీసి భ్రష్టుడ నైతినని చింతించెను. తల్లియైన మృగిని త్యజించి సాలగ్రామక్షేత్రమైన పులహాశ్రమమును చేరెను. ఎవరి తోడను సంబంధము పెట్టుకొనక, అనవరతము భగవంతుని స్మరించుకొనుచు, ఆహారపానీయములు వర్జించి, నదీ జలము లందు ప్రవేశించి ప్రాణత్యాగమొనర్చెను. అటుల భరతుడు మృగశరీరమును త్యజించెను.

## 25. జడభరతుడు

భరతుడు మరుసటి జన్మమున శిష్టాచారసంపన్నుడైన ఒక విప్ర గృహమున జననమందెను. అపుడాతడు జడభరతుడని ప్రసిద్ధుడయ్యెను. బ్రాహ్మణుడు అంగిరస గోత్రీకుడు. అతనికి ఇరువురు భార్యలు. పెద్దభార్యకు పుత్రులు తొమ్మండుగురు గలిగిరి. చిన్న భార్యకు కవలలు జన్మించిరి. అందు ఒకమగ, ఒకఆడ. ఆమగపిల్లవాడు భరతుడు. భరతుడే జడభరతుడుగ ప్రద్ధుడాయెను. భరతునకు పూర్వజన్మ జ్ఞానముండెను. అందువలన సంబంధ బాంధవ్యములకు దూరముగ నుండెను. భవబంధములందు దగుల్కొని మరల జన్మఫలం అనుభవించవలసి వచ్చునని భయ మొంది ప్రాపంచిక బంధములకు దూరమగుచుండెను. ఎల్లవేళల భగవద్ధ్యానము, హరినామస్మరణము, హరికథలు వినుట మున్నగు కార్యకలాపములందు నిమగ్నుడై యుండెడివాడు. చూపరులకాతడొక వెర్రివాడు. అందరాతనిని పిచ్చివానిగ తలచి గేలిచేయుచుండిరి. అది తెలిసి తండ్రి చాల విచారించెను. ఉపనయనాది సంస్కారములు నిర్వర్తించెను. వేదశాస్త్రములు బోధింపప్రయత్నించెను. కాని వాని ప్రయత్నములన్నియు వ్యర్థములయ్యెను. అనంతరము తండ్రి మరణించెను. తల్లి భర్తతోపాటు సహగమనముచేసెను. అంత సవతితల్లి దిక్కయ్యెను. కాని వారు భరతుని, ఒక పిచ్చివానిగ, వ్యర్థునిగ చూచెడివారు.

ఎట్టి విషయమందును ఆశలేక యుండువాడు. అయినను వారాతనిని చాల కష్టములపాలు చేసిరి. పలువిధముల హింసించిరి. కడుపునిండుగ అన్నపానీయములు

యిచ్చెడి వారుగాదు. వెట్టిచాకిరి చేయించెడివారు. అయినను మారు బలుకక, ఓర్పుగ భరించెడివాడు. బ్రహ్మజ్ఞానమును ఉపాసించువాడు. కనుకనే సుఖ దుఃఖములు, శీతోష్ణములు, ఉచ్చనీచములు, మానావమానములు అన్నియు ఆతనికి ఒక్కటే, భేదభావములేదు. అన్నింట అతీతుడు. అవధూత, నిమిత్తమాత్రుడు. స్నానసంధ్యాది కృత్యములులేవు. పరిశుభ్రమైన వస్త్రములు ధరించడు. నిద్రసుఖ మెరుగడు. బండలపై పరుండును. నివురుగప్పిన నిప్పువలె, మసిబారిన మణివలె ఆతని బ్రహ్మతేజస్సు బయటపడుటలేదు. కాని ఆతనియందు బ్రహ్మతేజః పుంజము నిక్షిప్తమై యుండెను.

ఆ సమయమున దొంగల నాయకుడొకడు గలడు. అతనికి సంతానములేదు. సంతతిగలిగినచో భద్రకాళీమాతకు నరబలి యిత్తునని మ్రొక్కెను. అటుతరువాత వానికొకపుత్రుడు గలిగెను. అపుడాతడు నరుని వెదకితెండని భటులనాజ్ఞాపించెను. వారు అందందు వెదకి, చివరకు భరతుని బంధించి గొనిపోయిరి. దొంగలరేడు మిగుల సంతసించి, భరతుని బలికి సిద్ధము చేసెను. భద్రకాళికి పూజలు ముగించి భరతుని సంహరించుటకు ఖడ్గము నెత్తెను.

బ్రహ్మజ్ఞానియైన భరతున కిదేమియు పట్టలేదు. ధ్యాననిమగ్నుడై అమ్మముందు ఆశీనుడైయుండెను. దారుణహింసాకాండకు జగన్మాత సహించకుండెను. మహాభీకరాకారరూపిణియై దేవి ప్రత్యక్షమయ్యెను. చోరప్రభువును, ఆతని అనుచరులను తృటికాలములో సంహరించెను. వారి రక్తము త్రాగెను. వారిశిరస్సులను చేతధరించి విలయతాండవమొనర్చి కొంతతడవునకు శాంతించెను. భరతుడు జగన్మాతకు నమస్కరించి స్తుతించెను. అనంతరము స్వస్థలము చేరుకొనెను.

ఒక సమయమున సింధు, సౌవీరశాధిపతి రహూగణుడు, ఇక్షుమతీనదీతీర ప్రదేశమునకు వేగముగ వెళ్లవలసివచ్చెను. పల్లకి మోయుటకు బోయలులేకుండిరి. బోయలను వెదకితెండని అధికారులను ఆజ్ఞాపించెను. అపుడు వారు వెదకుచువచ్చి భరతునిపట్టి గొనిపోయిరి. తోటి బోయలతో కలసి పల్లకిమోయుచుండెను. పల్లకి మోయు అభ్యాసములేనందున నడక సవ్యముగ సాగకుండెను. అదిగాంచి రాజు భరతుని హేళనచేసి మందలించెను. అందుకు భరతుడు బదులు పలుకలేదు. అందుచే రహూగణుడు అధికకోపమున భరతుని నిందించెను.

భరతుడు అందుకును యెట్టి విచారము, వికారము చెందలేదు. వేదాంత వచనములతో రాజును సమాధానపరచెను. ఎంతటి వానికిని కర్మానుభవము

తప్పదు. 'నా ప్రారబ్ధకర్మక్షయ నిమిత్తము పల్లకి మోయుచు నిన్ను సేవించుచుంటిని.' అని పలుక రాజుకు జ్ఞానోదయమయ్యెను. భరతుని మాటలయందలి పరతత్త్వమును గ్రహించెను. వెంటనే పల్లకిదిగి భరతుని పాదములపై వ్రాలి, తన అపరాధమును క్షమింపుమని ప్రార్థించెను.

జడభరతుడు రహూగణునకు తత్త్వోపదేశము గావించెను. ఆతని అజ్ఞానమంతయు సూర్యరస్మికి అవిరియైన మంచువలె నశించెను. తరువాత భరతుడు అవధూతగ సంచరించి, తుదకు శ్రీహరి సన్నిధానము చేరెను.

## ౨౮. అజామిళుడు

పూర్వకాలమున కన్యాకుబ్జనగరమందు "అజామిళుడు" అను బ్రాహ్మణుడు ఉండెడివాడు. అతడు ఒక దాసిని పరిణయమాడి భ్రష్టుడయ్యెను. కులాచారములు, ధర్మములు పరిత్యజించెను. జూదము, చౌర్యము, వంచన మొదలగు దుష్కార్యముల కలవడెను. కుటుంబపోషణార్థం అతడు చేయని దురాగతములు లేవు. సజ్జనులను, సాధుపుంగవులను హింసించెడువాడు. వానికి సంతానము పదిమంది. అందు కడగొట్టువాడు నారాయణుడు. అజామిళునకు నారాయణునిపై మక్కువ మెండు.

అజామిళుడు కాలగమనమున వృద్ధుడయ్యెను. అతని వయస్సు అపుడు ఎనుబది వసంతాలు. అయినను అతని మనస్సు భగవంతుని యందు మరలలేదు. చిన్న పుత్రుడు నారాయణుడే అతనికి ప్రాణం. తన పంచప్రాణములును ఆతని యందే లగ్నమొనర్చెను. అవసానదశ అవరించెను. యమభటులు వచ్చి చెంతనిలువ, అజామిళుడు మిగులభయమందెను. గడగడవణకెను. మురిపంపు ముద్దుకుమారుని "నారాయణా" అని బిగ్గరగ పిలచి ప్రాణములు విడచెను. అజామిళుడు భగవద్భక్తుడు కాకున్నను, అంత్యకాలమున "నారాయణా! నారాయణా!" యని విష్ణువును స్మరించినందున, విష్ణుభటులు వచ్చిచేరిరి. యమదూతలుకూడ వచ్చిరి.

యమభటులకు, విష్ణుభక్తులకు గొప్పవాదము జరిగెను. అజామిళుడు 'మావాడు, మావాడని' కీచులాడుకొనసాగిరి. అంత యమభటులు విష్ణుభక్తులతో, "అయ్యా! ఈ విప్రుడు మహాపాపి. అనేక పాపకార్యము లొనరించినాడు. నీచకార్యములు అంతులేక యొనరించినాడు. ఒక్క పుణ్యకార్యము ఒక్కనాడును చేసియెరుగడు. భగవంతుని స్మరించి యెరుగడు. అట్టి అధమునకు స్వర్గములభించుట ఎట్లు? మీకృత్యము కడువింతగ యున్నది" అనిరి.

అంతట విష్ణుభక్తులు "యమదూతలారా! శ్రద్ధగవినుడు. ఎట్టి మానవుడైనను అంత్యకాలములో నోరారా హరినామస్మరణము చేయుచో, వాడు జీవితకాలములో చేసిన ఘోరపాపములన్నియు పటాపంచలై నశించును. అజామిళుడు తలవని తలంపుగ" నారాయణా ! నారాయణా ! అని హరినామము స్మరించినాడు. అయ్యది కాకతాళీయమైనను భగవంతుడు మెచ్చినాడు. ఆర్తిగ ఎలుగెత్తి పిలచిన పిలుపుకు శ్రీమహావిష్ణువు అనుగ్రహించినాడు. ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీహరి అజామిళునకు పరమపదమొసంగదలచి మమ్ములను పంపినాడు. కనుక మీకు ఈతనియందు అధికారములేదు. మా మాటలయందు మీకు నమ్మకము కలుగకున్న మీప్రభువు నడిగి తెలుసుకొనుడు" అని పలుక యమదూతలు వెంటనే ధర్మస్వరూపుడైన యమధర్మరాజు చెంతకేగి, విషయమును వివరించిరి.

యమ ధర్మరాజు అంతయు సావధానముగ వినెను. విష్ణుతత్వమును, విష్ణుభక్తిని గురించి తనభటులకు వివరించెను. అంతియెగాక, విష్ణుభక్తులచెంతకు పోవలదని అజ్ఞాపించెను.

అజామిళుడు మహాజ్ఞానుడయ్యెను. తన జీవితమంతయు పాపకార్యాచరణము లతో వ్యర్థమైనందులకు మిగుల చింతించెను. శ్రీహరిని పలువిధముల కీర్తించెను. తదుకు విష్ణుదూతలు గొనివచ్చిన దివ్యవిమానమధిరోహించి వైకుంఠము చేరెను.

## 27. వృత్రాసారుడు - వృత్రాసురుడు

దేవతలకు గురువు బృహస్పతి. రాక్షసులకు శుక్రాచార్యుడు గురువు. వీరిద్దరు, విద్య, పాండిత్యాది గుణములందు సమానులే. దేవదానవుల మధ్య అభిప్రాయ భేదములున్నట్లు, శుక్ర బృహస్పతి నడుమను స్పర్ధలున్నవి. బృహస్పతి దేవతలను, శుక్రాచార్యుడు దానవులను రక్షిస్తూవుందురు.

ఒకనాడు ఇంద్రుడు మహావైభవముగా కొలువుదీరి యుండెను. అపుడు బృహస్పతి సభలోనికి ప్రవేశించెను. అధికార, ఐశ్వర్య అహంకార పూరితుడైన ఇంద్రుడు దేవగురువును గౌరవించలేదు. మర్యాదపూర్వకముగ ఆహ్వానించలేదు. అయినను బృహస్పతి ఎంతమాత్రము బాధచెందక, సభనుండి వెనుదిరిగి వెళ్ళెను. అది తెలిసిన దేవేంద్రుడు మనసున చాలవిచారించెను. ఆచార్యునియెడ గావించిన అపచారమువలన ఎట్టి యాపదరానున్నదో యని మనమున భయపడెను.

బృహస్పతి అనుగ్రహమును కోల్పోయిన దేవతలకు కొన్ని ఆపదలు, కష్టములు చుట్టుముట్టెను. రాక్షసులు కూడా యీ అవకాశమును తీసుకొని దేవతలపై చేలరేగిరి. ఇంద్రుడు కలవరపడెను. తన ఆధిపత్యమునకు ముప్పువాటిల్లునని భయభ్రాంతు డయ్యెను. వెంటనే బ్రహ్మచెంతకేగి, విషయమునెరింగించెను. పరమేష్టియు కొంత తడవు చింతించి, విశ్వరూపుని ఆశ్రయించుమని తరుణోపాయమును తెలిపెను.

ఇంద్రుడంతట విశ్వరూపుని దర్శించి, ఆచార్యపీఠము నలంకరింపు మని ప్రార్థించెను. తొలుత విశ్వరూపుడు అంగీకరించలేదు. కాని ఇంద్రుని వేడుకోలు మన్నించి అమరగురుపుగా నుండుటకు అంగీకరించెను.

విశ్వరూపుడు విష్ణుభక్తుడు. వైష్ణవ విద్యాబలసంపన్నుడు. దాని ప్రభావముతో అసురులను జయించవచ్చును అని వైష్ణవవిద్యను విశ్వరూపుడు ఇంద్రునకు బోధించెను. సర్వసంపత్కరము, సమస్త భయహరము అయిన శ్రీమన్నారాయణ కవచమహామంత్రమును దేవేంద్రునకుపదేశించెను. దాని ప్రభావముచే దానవుల నందరిని జయించి తనపదవిని నిష్కంటకము గావించుకొనెను.

విశ్వరూపుడు దేవతల ఆచార్యపీఠమందుండియు, రాక్షసులపట్ల పక్షపాతవైఖరి గలిగియుండెను. యజ్ఞయాగాదులందు హవిర్భాగములు అందచేయుచుండెను. దానిని ఇంద్రుడు సహించ జాలకుండెను. అందువలన తన ఆధిపత్యమునకు ముప్పు వాటిల్లునని తలచెను. పదవినిలుపుకొనుటకు ఎంతటి దుశ్చర్యకైనను వెనుదీయరు గదా ! ఆచార్యుడను గౌరవముగాని, అభిమానముగాని యించుకైనను యోచించక విశ్వరూపుని శిరస్సుల మూటినిఖండించి, సంహరించెను. దానితో ఇంద్రునికి బ్రహ్మహత్యాపాతకము చుట్టుకొనెను.

బ్రహ్మహత్యా పాతకమును ఇంద్రుడు ఒకసంవత్సర కాలమును అనుభవించెను. తరువాత ఆ పాపమును నాలుగు భాగములుగా చేసి భూమికి, జలమునకు, వృక్షములకు, స్త్రీలకు పంచి ఇచ్చెను. ఆ కారణమున భూమియందు ఊసర క్షేమ లేర్పడును. జలములందు నురగరూపమునను, వృక్షములందు బంకరూపమునను, స్త్రీలయందు ప్రతినెలలోను రజోరూపమునను (రజస్వల) నిలచియుండెను. అయితే బ్రహ్మహత్యాపాతకమువలన నష్టకష్టములు కలుగకుండునట్లు ఇంద్రుడు వానిని వరములుగ అనుగ్రహించెను.

1. భూమి ఎవరైనను త్రవ్వి గుంటలుచేసినచో, అవి తిరిగి తమంతట తామే పూడును. 2. జలముతమలో చేరిన ద్రవ్యమునకు వస్తుసముదాయమునకు రూపము, పరిమాణములందు వృద్ధియిచ్చును. 3. వృక్షములు ఎవరైనను వానినిఖండించినను తిరిగి తమంతట తాము చిగురించి వృద్ధిచెందును. 4. స్త్రీలు రజస్సువలన సంభోగ సుఖముల ననుభవించుటకును, సంతానోత్పత్తికి సహకరించును. ఇట్లు ఇంద్రుడు తన బ్రహ్మహత్యాపాతకమును పంచియిచ్చి, తాను అందుండి బయల్పడెను. విశ్వరూపుని త్వంద్రి త్వష్ట. తనకుమారుని చంపినందులకు ఇంద్రునిపై ఆగ్రహించి కోపాధిక్యముచే మండిపడెను. ఎటులైనను అమరనాథుని వధించగల వీరుని సృష్టిచేయవలెనని నిశ్చయించెను.

దారుణమైన మంత్రములతో అభిచారేష్టి (యాగము) చేసెను. అపుడు హోమాగ్నినుండి ఒక దివ్యపురుషుడు జన్మించెను. ఘోరమైన గొప్ప ఆకారము, కారునలుపు దేహఛాయ, నిప్పులు గ్రక్కెడి నేత్రములు, హస్తమున త్రిశూలము గలిగి యుండెను. దశదిశలు దద్దరిల్లునట్లు భయంకరముగ బొబ్బలిడుచు, విలయ తాండవము చేయుచు ప్రపంచ ప్రళయము సృష్టించు వానివలెనుండెను. ఆకాశ మంత ఎత్తునవుండి, గ్రహములను తారలను మ్రింగు వానివలె హాహాకారములు చేసెను. అతని నోరు గొప్పదంతములు గలిగి పర్వతగుహను బోలియుండెను. ముల్లోకములను ఒక్కసారిగమ్రింగు వానివలె భయమును కల్పించెను. అపుడాతని వృత్రాసురుడనిరి. ఆవికృతాకారుడైన వృత్రాసురుని గాంచి త్రిభువనములు గడగడలాడెను. ఎక్కడివారక్కడ దిక్కుతోచక పరుగులిడిరి. దేవతాగణములు దివ్యాస్త్రములతో వానితో పోరునకు దిగిరి. అస్త్రములన్నింటిని అసురుడు భంగ పరచెను. కొన్నింటిని మ్రింగివేసెను. దేవతలు ఇంద్రుడు భయమందిరి. వాని నెదిరించుట కష్టసాధ్యమని దలచిరి. వేరు తరుణోపాయముగానక, దేవేంద్రాదులు వైకుంఠముచేరి విష్ణుమూర్తిని శరణువేడిరి. దివ్యగీతముల స్తుతించిరి. అంత శ్రీమన్నారాయణుడు వారియందు దయగలవాడై వృత్రాసురుని సంహరించు ఉపాయము నుపదేశించెను.

"దధీచిఋషి మిగుల శ్రేష్ఠుడు, బ్రహ్మజ్ఞాని. గొప్పదాత. పరోపకార పరాయణుడు "అశ్వశిర"మనే బ్రహ్మవిద్యను అశ్వనీదేవతలకుపదేశించినాడు. నారాయణ కవచమును త్వష్టకు బోధించగ, అతడు దానిని తన కుమారుడైన విశ్వరూపునకు ఉపదేశించినాడు. మీరు తక్షణముబోయి ఆ మహనీయుని శరణుగోరుడు.

ఎటులైనను అతని యనుగ్రహము పొంది, అతని దేహమును త్యజించమని కోరుడు. అతని దేహముతో ఆయుధమొకదానిని తయారుచేయుడు, దానితో వృత్రాసురుని సంహరింపవచ్చును. అని విష్ణువు అసురసంహారమునకు కర్తవ్యము నుపదేశించెను.

అంత దేవేంద్రాదులు దధీచిమహర్షి చెంతకేగిరి. తమకు సంభవించిన ఆపదను వివరించి పాదములంటి శరణుకోరిరి. తమను రక్షించుటకు దేహత్యాగము చేయుడని ప్రార్థించిరి. మునియు వారిమాటల నాలకించెను. ఆర్తత్రాణ పరాయణుడగు దధీచి ముల్లోకములను కాపాడదలచి దేహము త్యజించుటకు అంగీకరించెను. యోగసమాధి నిష్ఠుడై, ఆత్మను పరబ్రహ్మమందు లీనమొనరించి దేహమును త్యజించెను. వెంటనే ఇంద్రుడు దధీచి వెన్నెముకనుండి, విశ్వకర్మ సహకారముతో మహత్తర ఆయుధమును చేయించెను. అదియే వజ్రాయుధము.

ఆ విధముగ దివ్యాయుధమును సంపాదించిన దేవేంద్రుడు దేవతలను వెంట నిడుకొని వృత్రాసురుని మీదకు యుద్ధమునకేగెను. దేవదానవులకు భయంకరముగ పోరు జగిగెను. దేవతలధాటికి తట్టుకొనజాలక రాక్షసులు పరుగులు తీసిరి. ఇంద్రుడు వృత్రాసురుడు ద్వంద్వయుద్ధమొనరించిరి. దానవుడు ఇంద్రునిపట్టి మ్రింగెను. కాని ఇంద్రుడు మరణించలేదు. నారాయణకవచం సురనాథుని రక్షించెను. అంత ఇంద్రుడు వజ్రాయుధముచే వృత్రాసురుని గర్భము చీల్చుకొని బయటపడెను. వజ్రాయుధముచే అసురుని శిరస్సు ఖండించెను. వృత్రుడు మరణించగ దేవతాగణములు సంతసించిరి. మునులు, ఋషులు మున్నగువారు సురనాథుని ప్రస్తుతించగ, అతని త్రిలోకాధి పత్యము స్థిరపడెను.

వృత్రాసురుని సంహరించినందులకు ఇంద్రునకు మరల బ్రహ్మహత్యాదోషము చుట్టుముట్టెను. దానివలన అతడశాంతికి గురయ్యెను. పాపభీతితో నలుదెసలకు పరుగులెత్తెను. అటుల వెయ్యి సంవత్సరములు స్వర్గము వదలివెళ్లెను. మానస సరోవరములో ఒక కమలము యొక్క నాళములో దాగుకొనెను. ఆసమయమున నహుషుడను చక్రవర్తి తన తపోబలముచే స్వర్గాధిపత్యము చేజిక్కించుకొనెను. ఐశ్వర్యమదాంధుడై ఇంద్రుని భార్యయైన శచీదేవిని కామించెను. తదుపరి నహుషుడు పదవీభ్రష్టుడై శాపగ్రస్తుడయ్యెను. శాపఫలితముగ సర్పాకృతిని పొందెను.

ఇంద్రుడు శ్రీహరిని ప్రార్థించెను. దేవదేవుని అనుగ్రహకారణమున, ఇంద్రుడు బ్రహ్మహత్యాపాతకమునుండి విముక్తుడాయెను. మహర్షులు అతనిచే అశ్వమేధ

యాగము యథావిధిగచేయించగ. శ్రీహరి కరుణచే ఆతని పాపములన్నియు తొలగెను. ఎట్టి శంకయులేక ఇంద్రుడు త్రిలోకాధిపత్యమును పొందిసుఖించెను.

## 28. చిత్రకేతువు

వృత్రుడు పూర్వజన్మమున బ్రహ్మవంశ సంజాతుడు. గొప్ప హరిభక్తుడు. అయినప్పటికి తమోగుణాధిక్యముచే దుష్కార్యములెన్నియో యొనర్చి కడు పాపాత్ముడయ్యెను.

పూర్వమున శూరసేన దేశమును చిత్రకేతువను రాజు పాలించెను. ఆతనికి భార్యలనేకులుగలరు. అయినను సంతానహీనుడు. రాజ్యభోగములెన్నియున్నను సంతానములేని కారణముచే సుఖశాంతులు లేకుండెను. సంతోషము కరవయ్యెను.

ఒక దినమున అంగిరసుడు అందందు సంచరించుచు, తలవని తలంపుగ చిత్రకేతును చూడవచ్చెను. మహారాజు మహర్షిని సాదరముగ నాదరించి, సకలవిధ మర్యాదలతో భక్తిప్రపత్తులపూజించెను. తనమనమునగల దుఃఖకారణమును చెప్పుకొనెను. మహర్షికి రాజుపై కరుణగలిగెను. రాజుచేత "త్వష్ట్ర" యాగము చేయించి, యజ్ఞప్రసాదమును, జ్యేష్ఠభార్యయైన కృతద్యుతికొసంగెను. ఒక పుత్రుడు కలుగునని ఆశీర్వదించి వెళ్లెను.

తరువాత కొంత కాలమునకు కృతద్యుతికి పుత్రుడొకడు గలిగెను. పుత్రోత్సాహముతో నిండిన చిత్రకేతువు రాజ్యమున పెద్దఉత్సవము జరిపించెను. రాష్ట్రప్రజలకు, విప్రులకు భూరి విరాళములిచ్చి సంతసపరచెను. లేకలేక కలిగిన కుమారుని యందును. భార్యకృతద్యుతిపైనను ప్రేమానురాగములు అధికమయ్యెను. క్రమముగ మిగిలిన భార్యలందు నిరాదరణ పెరుగసాగెను. ఆ కారణముచేత మిగిలిన భార్యలకు కుమారునిపై ఈర్ష్య అసూయలు ప్రబలమయ్యెను. రాకుమారుని అంతమొందించవలెనని దురాలోచన చేసిరి. ఒకనాడు బాలునకు ఆహారములో విషము కలిపి తినిపించిరి. రాకుమారుడు మరణించెను. మరణవార్తవిని రాజదంపతులు మితిమీరిన దుఃఖముతో రోదించిరి. కృతద్యుతి మొదలునరికిన వృక్షమువలె పుత్రశోకమున నేలవ్రాలెను. చిత్రకేతుమహారాజు మూర్ఛిల్లెను. కొంత తడవుకు తేరుకొని దంపతులు గోడుగోడున దుఃఖించిరి.

అపుడు అంగిరసుడు, నారదుడు అచ్చటి కరుదెంచిరి. శోకతప్తహృదయుడైన చిత్రకేతు మహారాజును ప్రియవచనముల నోదార్చెను. దారా పుత్రాదులు ఋణాను

బంధమని, వారి సంయోగ వియోగములకు దుఃఖించుట అజ్ఞానమని వేదాంత తత్త్వబోధచేసెను. దుఃఖముమరచి శ్రీహరి పాదపద్మములందు భక్తినిలిపి ప్రార్థించుమని హితము పలికెను. నారద మహర్షి రాజునకు సంకర్షణ విద్యను బోధించెను.

చిత్రకేతువునకు జ్ఞానోదయమయ్యెను. భగవంతునియందు భక్తి కుదిరెను. విరక్తుడై సంకర్షణ విద్యనుపాసించెను. భగవంతుడు ప్రత్యక్షమై దివ్యజ్ఞానమనుగ్రహించెను. అంతట చిత్రకేతువు సిద్ధపురుషుడాయెను. శ్రీహరి దివ్యనామ కీర్తనలు గానంచేస్తూ కులగిరి పర్వతప్రాంతమున విహరించసాగెను. వెంట భార్యలు కూడ యుండిరి. అటుల పెక్కుసంవత్సరములు గడచెను.

ఒక దినమున చిత్రకేతువు కైలాసమున కేగెను. అచ్చట పరమేశ్వరుడు పార్వతీ సహితుడైయుండ, ప్రమథగణములు, మహర్షులు రుద్రసూక్తులతో ప్రస్తుతించుచుండిరి. అపుడు అంబ మహేశ్వరుని అంకభాగమున ఆశీనురాలై యుండెను. కొలువున అదృశ్యముగాంచి చిత్రకేతువు పకపకనవ్వెను. కల్యాణమూర్తి, పరమశాంత చిత్తుడైన పరమశివుడు చిత్రకేతువొనర్చిన అనుచిత చర్యకు ఆగ్రహించ లేదు. కాని జగన్మాత పార్వతి ఆగ్రహించెను. నిండు సభామధ్యమున పరమేశ్వరుడు పరమేశ్వరిని తొడపై లజ్జ బిడియములేక యుంచు కొన్నందులకు చిత్రకేతువు నవ్వెను.

"ఓరీ ! అజ్ఞానీ ! ఈశ్వరతత్త్వము తెలియలేక అహంకారమున మమ్ము అపహాస్యము చేసితివి. అందుకు ఫలితముగా అసురుడవై జన్మింపు"మని శపించెను.

అంతట చిత్రకేతువునకు జ్ఞానోదయమయ్యెను. అపరాధమును మన్నించుమని అంబను ప్రార్థించెను. కాని అతడు హరిభక్తుడగుటచే శాపవిముక్తి అనుగ్రహించుమని మాత్రము అర్థించలేదు. దేహధారులకు సుఖదుఃఖములు మాయాకల్పితకర్మమే మూలమనితలచి, సభనుండి వెళ్ళెను. పార్వతీదేవి శాపకారణముగా చిత్రకేతు మహారాజు మరుజన్మమున వృత్రాసురునిగ జననమందెను.

## 29. భక్త ప్రహ్లాదుడు

అదితి, దితి అనువారు కశ్యపప్రజాపతికి భార్యలు. అదితికి దేవతలు, దితికి దైత్యులు జన్మించిరి. దానవులలో కొందరు పరమ భాగవతోత్తములు జన్మించి లోక పూజ్యులై ప్రకాశించిరి. అట్టివారిలో ప్రహ్లాదుడు ఆద్యుడు.

సనక సనందనాదుల శాపకారణముగా జయవిజయులు తొలిజన్మమున హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగ దితికి జన్మించిరి. శ్రీహరి వరాహావతారము దాల్చి

ప్రహ్లాదునకు అక్షరాభ్యాసము చేయనెంచి, హిరణ్యకశిపుడు చండామార్కుల వారిని రప్పించెను. దానవగురువైన శుక్రాచార్యుని పుత్రుడు చండామార్కులవారు. కుమారుని వానికప్పగించి సమస్త విద్యాపారంగతుని చేయుమని నియోగించెను. చండామార్కులవారు ప్రహ్లాదుని గురుకులమునకు గొనిపోయి విద్యాభ్యాసం ప్రారంభించి, విద్యాబోధనము సాగించెను. అతనికి తోడుగ అసురబాలకులు కొందరుండిరి. కాని ప్రహ్లాదుడు గురువు చెప్పిన విద్యలు చదువలేదు. అవన్నియు వ్యర్థములని తలచెను. పరతత్వాన్ని బోధించే చదువే నిజమైనచదువని గ్రహించెను. హరినామస్మరణమే పరమావధిగా నిశ్చయించుకొనెను. ఆటలందును, పాటలందును, తినుచును, త్రాగుచును, యెల్లవేళలందు, ఎల్లపనులందు హరినామస్మరణము, హరిధ్యానముతప్ప యితరములేక మెలగుచుండెను. అట్టి బాలునిచూచి తోటివారు, పిచ్చివానిగ భావించిరి. ఒకనాడు హిరణ్యకశిపుడు, తనపుత్రుని విద్యాపాటవాన్ని తెలియగోరి ప్రహ్లాదుని పిలిపించి, "నాయనా ! నీవు నేర్చిన విద్యలలో నీకిష్టమగు దానినిచెప్పినన్ను ఆనందింపచేయుము" అని ప్రశ్నించెను. అంత ప్రహ్లాదుడు, "తండ్రీ! సమస్త శాస్త్రములు చదివితిని. శాస్త్రార్థసారములు గ్రహించితిని. భగవంతుడొక్కడే. అట్టివాడు శ్రీహరి ఒక్కడు మాత్రమే. అతనిని స్మరిస్తూ, ధ్యానిస్తూ ఆపరంధాముని సన్నిధిని చేరుకోవడముతప్ప అన్యమేదియును లేదనెడి సత్యమును అంతరార్థమును గ్రహించితిని. పాపభూయిష్టమైన యీ సంసార కూపమునుండి బయటపడి విష్ణుపదము చేరేందుకు తపస్సు చేయడముగాక యితరసాధనోపాయములు లేవని తెలిసికొంటిని. జననమరణములతో కూడిన సంసారబంధములను త్యజించవలెనని యెరింగితిని". అని మందస్మిత వదనారవిందుడై పలికెను.

కుమారుని మాటలకు హిరణ్యకశిపుని గుండెలు గుభిల్లున అదరెను. తన విరోధిపక్షము వారెవరో రహస్యముగా బాలునకు దుర్బోధలుచేసి వుందురని భావించెను. బాలునిబుద్ధి వక్రమార్గమున పోవుచున్నదని గ్రహించి కలతచెందెను. ఎటులైనను పుత్రునిశిక్షించి బాగుగ చదివించదలచెను. గురువులను మందలించెను. తనయుని బాగుగ దండించి మంచిచదువు చెప్పుడని గట్టిగ శాసించెను. ప్రహ్లాదుని గూడ బుజ్జగించియు, లాలించియు మంచివిద్యలునేర్చి వంశప్రతిష్ఠను నిలుపుమని హెచ్చరించెను. "విష్ణువు మనకు విరోధి. విరోధిని కీర్తించడము, నుతించడము నీకు తగదు. అది మనకు తగిన కార్యముగాదు. నేనే భగవంతుడను. నన్నుమించి

వేరు భగవంతుడులేడు. నాకంటే వేరు ధర్మములేదు. నన్నే కీర్తించి స్మరించుము" అని హితము పలికెను.

గురువు చండామార్కులు బాలుని గొనిపోయి, కట్టు దిట్టమైన ఏర్పాట్లు విధించి ప్రహ్లాదునకు విద్యలు గరుప ప్రారంభించెను. దండనీతిని, రాజనీతిని బోధించెను. బెత్తముచేబూని ప్రహ్లాదునకు విద్యాబోధన ప్రయత్నము సాగించెను.

కొంతకాలము తరువాత ఒకనాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని పిలిపించెను. కుమారుని ప్రేమమున దగ్గరకు తీసికొని, తన తొడపై కూర్చుండ బెట్టుకొని లాలించి, బుజ్జగించి, "నీవు చదివిన అంశములలో నేదేని ఒక్క దానిని చెప్పి నన్ను ఆనంద పరచుము" అని ఆదరమున బలికెను.

ప్రహ్లాదుని ప్రవర్తనలో మార్పులేదు. శ్రీహరిని పలుతెరగుల కీర్తించి, విష్ణు మహిమలను గొనియాడెను. భగవంతునిసేవించు నవవిధభక్తిమార్గములను వల్లిస్తూ భక్తిమార్గాన్ని వివరించెను. అదివిన్న హిరణ్యకశిపునకు పట్టరాని ఆగ్రహము కట్టలు త్రెంచుకొని ప్రవహించెను. గురువులను దుర్భాషలతూలనాడెను. చండా మార్కులును, "ఇందు తమతప్పిదము అణుమాత్రమైన లేదనియు, సహజముగనే వీనికిట్టి తత్త్వము అబ్బినదనియు తనను మన్నించి క్షమించుడనియు" వేడుకొనెను. అంత హిరణ్య కశిపుడు మిగుల రోషారుణనేత్రుడై, తొడపైనున్న పుత్రుని ఆవేశముతో క్రిందకు పడద్రోసెను. భటులను పిలచి, 'వీడు విరోధివర్గమువాడు. కులద్రోహి. వంశనాశకుడు. విష్ణువు నాకు ప్రబలశత్రువు. కనుక వీడును నాకుశత్రువే. శత్రువును ఉపేక్షింపతగదు. శత్రుశేషముండరాదు. వీనిని తక్షణము గొనిపోయి తుదముట్టించుడు." అని ఆజ్ఞాపించెను.

వికృతరూపులు, అతిభయంకరాకారులైన రాక్షసులు, బిగ్గరగ కేకలిడుచు, ఐదేండ్ల బాలుడైన ప్రహ్లాదుని గొనిపోయి శూలములతో పొడిచి చంపజూచిరి. కానిబాలుడు చిత్తమును పరమాత్ముడైన హరియందు లగ్నమొనరించి హరినామ స్మరణముచేసిన కారణమున మరణించలేదు అని హిరణ్యకశిపుడు మదపుటేనుగులచే త్రొక్కించెను. విషసర్పములచే కరపించెను. పర్వత శిఖరములనుండి క్రిందకు పడద్రోయించెను. కాలకూట విషమును త్రాగించెను. ఆహార పానీయములనివ్వలేదు. సలసలక్రాగు తైలభాండముల ముంచి హింసించెను. భగభగమండెడి అగ్నిగుండముల పడ వేయించెను. అనేక మారణోపాయములను చేయించెను. ఎన్ని చేసినను శ్రీహరిభక్తాగ్రేసరుడైన

ప్రహ్లాదుడు చెక్కు చెదరలేదు. రవ్వంతైనను కందలేదు. వన్నెచెడినవాడు గాదు. అలుపుగాని, ఆరాటముగాని, భయముగాని, ఆర్తిగా రక్షింపుమని వేడుకొనుటగాని చేయలేదు. బాధ చెందలేదు. ప్రాణాపాయము సంభవించలేదు. చిత్రహింసలెన్ని పెట్టినను ప్రహ్లాదుడు హరిభక్తి విడువలేదు. బాలుడు ఎంతకు చావకుండుటకు హేతువు అంతుచిక్కక హిరణ్యకశిపుడు విసిగి వేసారినాడు. "అర్భకుడు వీనియందుగల ప్రభావమేమి? మరణించకుండుటకు కారణమేమై యుండును? వీనితోటివైరమువల్ల నాకే మృత్యువురానున్నదా?" అని దానవరాజు భీతిచెందెను. చిత్తక్షోభమున క్రుంగెను.

అంత చండామార్కుడు దానవపతికి నచ్చచెప్పి ఊరడింపు కలిగించెను. బాలుని యొప్పించి వాని మనస్సుమార్చెదనని నమ్మబలికి, తన వెంట ప్రహ్లాదుని గొని పోయెను. సామ దాన భేద దండోపాయముల ప్రహ్లాదుని మనస్సును మరల్చుటకు ప్రయత్నించెను. అయినను ప్రహ్లాదుని వైఖరిలోను, ప్రవర్తనమందును మార్పులేదు. హరిభక్తి దినదినమునకు అధికమగు చుండెను. తానేగాక తోటి బాలురనుగూడ హరిభక్తులుగా చేయుచుండెను. వారికి భక్తితత్వముపదేశించెను. పరతత్వరహస్యములు యెరింగించెను. అంతట గురువులు ఆశ్చర్యమంది, "ప్రహ్లాదా ! మహాజ్ఞానులకు సైతము అంతుపట్టని ఈ తత్త్వజ్ఞానాన్ని నీవెట్లు పొందగలిగితివి? ఆ రహస్యాన్ని వివరించు" మని ప్రహ్లాదుని ప్రశ్నించిరి. ప్రహ్లాదుని జనన రహస్యం ఒక పరమాద్భుతమైన చరిత్రము. ఆవిషయాన్ని ప్రహ్లాదుడు వారికి తెలియబలికెను.

హిరణ్యకశిపుడు మందరగిరిపై పెక్కుసంవత్సరములు తపస్సుచేసెను. అప్పుడతని దేహము శిథిలమైనదని అందరు భావించిరి. దేవతలు సంతసించిరి. ఇంద్రుడపుడు దానవులపై దండయాత్ర సాగించెను. రాజ్యమున దానవరాజులేని కారణముగా హిరణ్యకశిపుని భార్యయైన లీలావతిని చెరబట్టి బలాత్కారముగా గొని పోయెను. అపుడామె గర్భవతి. తనను రక్షించువారులేక భోరుభోరున విలపించెను. లీలావతి ఆర్తనాదములను అటువైపుగా వచ్చుచున్న నారదమహర్షి వినినాడు. "లీలావతి పరమ పతివ్రత. అందునా గర్భవతి. గర్భవతిని చెరబట్టి హింసించుట మహాపాపకార్యము. కావున ఈమెను విడువు"మని ఇంద్రునకు నారదుడు హితము బలికెను. కాని ఇంద్రుడు నారదుని మాటలు వినలేదు.

"నారదా ! ఇపుడీమెయందు గల గర్భస్థశిశువు దేవతలకు విరోధియైన హిరణ్యకశిపుని విషబీజము. వాడువృద్ధి పొందుచున్నాడు. వాడు జన్మించినచో చాల

ప్రమాదము వాటిల్లును. కావున ఈమెను ప్రసవించువరకు నాచెంతనుంచి అటు మీద వదలుదును.” అని అమరనాథుడు పలికెను.

అంత నారదుడు “ఓ సురేంద్రా ! నీ ఆలోచనము సరియైనది గాదు. లీలావతి పరమసాధ్వి. గొప్ప గుణవంతురాలు. ఈమె గర్భమున పరమభాగవతోత్తముడు వృద్ధి చెందుచున్నాడు. అతడు పాపరహితుడు. నిర్మలహృదయుడు. నీవెంత ప్రయత్నించినను బాలుడు మరణించడు. కావున నామాటవిని, ఈమెను విడిచి పుచ్చుము”. అనెను. ముని మాటలకు ఇంద్రుడు మనసు మార్చుకొని లీలావతిని విడచిచనెను.

నారదుడామెను తన ఆశ్రమమునకు గొనిపోయి, భయమునుబాపి, ఊరట గలుగచేసెను. “అమ్మా! నాచెంతనీకెట్టి భయము, ఆపదయుండదు. నీ భర్త తిరిగి వచ్చినవెనుక నీవు క్షేమముగ వెళ్ళవచ్చును.” లీలావతియు పరమభక్తితో మునిని సేవిస్తూ దేవర్షియాశ్రమమున క్షేమమున యుండెను. నారదమునియు ఆమెకు పరతత్వాన్ని బోధించి, జ్ఞానోపదేశముగావించెను. ఆసమయమున గర్భమందున్న శిశువు మునిబోధనలు సర్వముగ్రహించి జ్ఞానమునుపొందెను. అకారణమువల్ల ప్రహ్లాదుడు మహాజ్ఞానియై, హరిభక్తుడాయెను. ప్రహ్లాదుడు కారణజన్ముడు. ఆతని యందు విష్ణుతత్వము అణువణువున నిక్షిప్తమైయుండెను.

అటుమీదట హిరణ్యకశిపుడు బ్రహ్మనుండి వరములనుపొంది తన పట్టణమునకు చేరుకొనెను. అపుడు నారదుడు లీలావతిని దానవేశ్వరునకు అప్పగించెను. పిమ్మట లీలావతి ప్రహ్లాదునకు జన్మనిచ్చెను. ఈ కథనంతను ప్రహ్లాదుడు చెప్పగా గురువు చండామార్కుడు – రాక్షసబాలకులువిని ఆశ్చర్యమందిరి. పరిస్థితిని తెలిసికొనిన చండామార్కుడు ప్రభువువద్దకేగి మొత్తము వివరించెను.

అది వినిన హిరణ్యకశిపుడు రోషావేశముతో ఉడికిపోయెను. అపర రుద్రుడై ఆగ్రహముతో కుమారునిగాంచెను. “ఓయీ కులనాశకా! నా ఆజ్ఞలేక దిక్పతులుకూడా అణుమాత్రమైనను కదలుటకు గడగడలాడుదురు. త్రిభువనములుసైతము భయమున అల్లాడును. అట్టినన్నుజూచి రవ్వంతయు భయమందవు. మరెవ్వరి అండచూచుకొని నీవిట్లు ప్రవర్తిల్లుచుంటివి? వేగతెలుపు” మని గద్దించి పలికెను. అపుడు భక్తుడైన ప్రహ్లాదుడు వినమ్రుడై కరములుమోడ్చి, “తండ్రీ ! నాకును, నీకును, ఈ సమస్త భూతకోటికి ఆశ్రీమన్నారాయణుడే అండయైయున్నాడు. సమస్తలోకములకు, భువన

భాండమునకు ఆ శ్రీహరే ఆధారమైయున్నాడు. లోకములన్నింటిని సృష్టించి, పాలించి, లయముచేయు వాడాతడే. అతడు, సర్వాంతర్యామి. ఈ సృష్టిసమస్తము అతని అధీనమై యున్నది. కనుక ఓ తండ్రీ ! ఈ సత్యమును, తత్వాన్ని గ్రహించి అసుర భావమును విసర్జించి ప్రవర్తించుము. అంతఃశత్రువులగు అరిషడ్వర్గములను జయించి, జితేంద్రియుడవు గమ్ము". అని హితవు బలికెను.

బాలునిమాటలు వినిన హిరణ్యకశిపుడు భగ్గున మండిపడినాడు. "నీమాటలు కడువింతగ నున్నవి. నీవు మృత్యువును చేజేతుల కొనితెచ్చుకొనుచున్నావు. నీవు చెప్పెడిహరి ఎక్కడున్నాడు ! ఎందుదాగియున్నాడు? ఎడీ? ఎడీ? చూపుము. నాకు పరమశత్రువును చూపుము. ఎక్కడదున్నాడురానీవిష్ణువు?" అని గ్రుడ్లెర్రజేసి ఆవేశంతో కుమారుని ప్రశ్నించినాడు హిరణ్యకశిపుడు.

"తండ్రీ ! అక్కడ ఇక్కడ అన ఏమి? ఎక్కడైనను శ్రీహరి ఉన్నాడు. నీవుకోరి ఎక్కడ చూచినా శ్రీహరి అందుకలడు. నీలో వున్నాడు. నాలో ఉన్నాడు. ఎందైనా ఉన్నాడు." అని ప్రహ్లాదుడుపలుక, హిరణ్యకశిపుడు క్రోధావేశముతో ఊగిపోయినాడు. కన్నులు అగ్నిగోళములుగా భగభగమండగ, పళ్లు పటపట కొరికెను. చేతిలోని ఖడ్గమును విచిత్రరీతుల త్రిప్పినాడు. దిక్కులదరునట్లు హూంకరించినాడు. "ఓరీ! అర్భకా ! నీహరి ప్రతిచోట వున్నాడని పొగరున వదరుచున్నావు. అటులైన, ఈ సభాస్థలియందలి ఈస్తంభమున ఉన్నాడా?" అని దిక్కులు పిక్కటిల్లపలికెను.

"సందేహములేదు. అందును విష్ణువు వున్నాడు" అని ప్రహ్లాదుడు నిర్భయముగా పలికెను. ఆ మాటలకు హిరణ్యకశిపుడు మిక్కిలి రోషముతో తటాలున సింహాసనము నుండిలేచి, మిక్కిలి బలాతిశయముతో పిడికిలి బిగించి స్తంభమును బలముగ గ్రుద్దెను.

ఆ మరుక్షణములో, అత్యంత ప్రళయ భీషణఘోష జనించెను. బ్రహ్మాండ భాండము బ్రద్దలగుచున్నట్లు భయంకర ధ్వనులుపుట్టెను. భూమి కంపించెను. కులపర్వతములదిరెను. దశదిశలు విపరీతపు ధ్వనులతో మారుమ్రోగెను. కోటిసూర్య ప్రభలతో కన్నులుచెదరు కాంతులుద్భవించెను. ఉన్మత్తుని పగిది హిరణ్యకశిపుడు సభామండపమున అటునిటు తిరుగాడెను. స్తంభమునుండి శ్రీమహావిష్ణువు నృసింహ రూపుడై ఆవిర్భవించెను. ఆ ప్రళయభయంకర రూపమును వర్ణించనేరితరము? తేరిచూడనేరివశము? ఆ రూపము నరమృగేంద్ర రూపము. అటునరుడుగాదు. ఇటు మృగముగాదు. ప్రళయాగ్నిజ్వాలలై మండుచున్న నేత్రములు, భయంకరములైన

దంష్ట్రములు, పర్వతగుహనుబోలిన వదనగహ్వరము, వాడియైన ఖడ్గములవంటి నఖములు, తీక్షణమైన జిహ్వాగ్రము, నిడుపాటి రోమములు, గొప్ప బలోన్నతమైన దేహము, శంఖ, చక్ర, గదాద్యాయుధములతో నొప్పు చతుర్బాహువులు, అట్టి ఆ భయంకర రూపమును గాంచిన హిరణ్యకశిపుడు కొంతతడవు ఆశ్చర్యచకితుడై, మృత్యువే ఈరూపములో వచ్చినదని భయమొందెను. అయినను వీరుడైన దానవుడు గదను చేబూని స్వామిని ధైర్యమున నెదుర్కొనెను. నరసింహరూపుడైన విష్ణువుతో కొంతతడవు పోరాడినాడు. కాని శ్రీహరి ఆదైత్యేంద్రుని గబాలున నేర్పున పట్టుకొని సంహరించ నిర్ణయించుకొనెను. అది రాత్రి పగలుగాని సంధ్యాసమయము. ఇంట బయటగాని ద్వారముమీద, ఏ ఆయుధముగాని ధరించక పదునైన చేతిగోళ్లతో నింగినేలగాని తనతొడలను పూనికగ అమర్చికొని, స్వామి వరములకు అతీతమైన విధమున, హిరణ్యకశిపుని ఉదరమునుచీల్చి సంహరించెను. పేగులను మెడలో జందెముగా ధరించెను. దానవేంద్రుని రక్తము కడుపారగ్రోలి, లోకభీకరలీల హిరణ్యకశిపుని అంతము గావించెను. అంతేగాక తనపైకి దండెత్తి వచ్చిన దానవుల నందరిని సంహరించెను. ప్రళయభయంకర గర్జన చేయుచు, భూమికంపించునట్లు చిందులుత్రొక్కుచు, విలయతాండవము చేయుచు యథేచ్ఛగా విహరించెను.

హిరణ్యకశిపుని వధించినందులకు ఇంద్రాదిదేవతాగణములు, ఋషులు బ్రహ్మమహేశ్వరులు సంతసమున అచ్చటకరుదెంచిరి. కాని ఎవరును ఆస్వామి దరిచేరజాలరైరి. దూరమున నిలచి వేదసూక్తములతో దేవదేవుని స్తుతించిరి. ఉగ్రనృసింహమూర్తిని శాంతింప చేయుమని లక్ష్మీదేవిని ప్రార్థించిరి. కాని ఆమెయు స్వామి దరిచేరవెరచి మిన్నకుండెను.

అంత బ్రహ్మ ప్రహ్లాదుని చేరబిలచి 'నాయనా! నీ తండ్రి నిమిత్తము అవతరించిన పురుషోత్తముని శాంతింపచేయుము. అందుకు నీవేసమర్థుడవు. శ్రీహరి ఉగ్ర తేజమును ఉపసంహరింపచేయుము. అటులగాదేని లోకములన్నియు నశించి పోగలవు." అని చెప్పగ, పరమభక్తుడైన ప్రహ్లాదుడు, శ్రీహరిచెంతనిలచి, భక్తిపార వశ్యముతో వేభంగుల స్వామిని కీర్తించెను. యోగులకు సైతము అంతుతెలియని విధముగా, స్వామి పరతత్వాన్ని అనేక రీతుల గానము చేసెను. భక్తవత్సలుడైన శ్రీహరి శాంతించెను. ప్రసన్నవదనుడై "ఓయీ ! ప్రహ్లాదా ! నీభక్తి అగణ్యమైనది. ఏదేని వరము కోరుకొను" మని పలికెను.

"దేవాదిదేవా ! కామాది అరిషడ్వర్గాదులకు లోనుగాక, నిరంతరము, నీ పాద పద్మములపై భక్తికలిగి, అది నిత్యమై, సత్యమై నాహృదయమున స్థిరముగ నిలచి యుండునట్లు వరమనుగ్రహించుము. అంతకుమించి నాకింకేమియువలదు." అని ప్రహ్లాదుడు శ్రీహరిని ప్రార్థించెను.

"వత్సా ! అట్లే అగునుగాక, మరియు నీవు నాభక్తులలో ఆద్యుడవగుదువు. అనగా మునుముందుగ కొనియాడబడుదువు. పరమభాగవతోత్తముడవుగా ముల్లోకవాసులచే కీర్తింపబడుదువు. కాని కొన్నిసంవత్సరములు, ధర్మము నాలుగు చెరగులస్థిరముగ వ్యాపింప రాజ్యపాలనముజేసి, సుఖింపుము, నీకారణముగ, నీ పితృపితామహులందరికి మోక్షమును కలిగించుచున్నాను. నీవలన నీదైత్యకులము, పావనమైనది." అని పలికెను. శ్రీహరి అనుగ్రహాశీస్సులకు తగినవిధముగ ప్రహ్లాదుని మహర్షులీ విధముగ కీర్తించిరి.

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుకశౌనకభీష్మదాల్భ్యాన్ ।
రుక్మాంగదార్జున వసిష్ట విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి ॥

శ్రీమహావిష్ణువును ప్రహ్లాదుడు అనేకరీతుల పూజించి సంతసింప చేయగ, శ్రీలక్ష్మితోగూడి హరి వైకుంఠమున కరిగెను. బ్రహ్మాది దేవతలు ప్రహ్లాదుని దానవ రాజ్యమునకు అభిషిక్తునిజేసి, ఆశీర్వదించి, వారివారి లోకములకు జనిరి. ప్రహ్లాదుడు అనేక సంవత్సరములు ధర్మయుతముగా రాజ్యపాలనముగావించి, పరమ భాగవతోత్తముడుగా కీర్తిగాంచి, తుదకు విష్ణుపదమును పొందెను.

ప్రహ్లాదుని భార్యదమని. ప్రహ్లాదుని కుమారుడు విరోచనుడు. వీనికుమారుడు బలిచక్రవర్తి. బలిచక్రవర్తి గొప్పదాతగా ముల్లోకములందు ఖ్యాతిగాంచెను. బలిచక్రవర్తి చరిత్రను వేరుగ తెలిసికొందము.

## ౩౦. గజేంద్ర మోక్షము

పాలసముద్రము మధ్యభాగమున త్రికూటాద్రియను గొప్పపర్వతమొకటిగలదు. అది పదియోజనములవెడల్పు. పదియోజనములపొడవుగలిగి మూడుశిఖరములతో విరాజిల్లు చుండెను. అందొకటి స్వర్ణ శిఖరము, రెండవది రజతశిఖరము, మూడవది

అయసశిఖరము. ఆ శిఖరములు మూడును అత్యున్నతమై యుండి, చిత్రవిచిత్రము లైన ధాతువుల కాంతిపుంజములతో శోభిల్లుచు, దశదిశలను ప్రకాశవంతము చేయుచుండును.

త్రికూటాద్రిపై పలువిధములైన ఫలవృక్షములు, పూలచెట్లు, లతలు లెక్కకుమించి యుండెను. సెలయేరులు జలపాతములు, నదీనదములు, సరస్సులు గలిగి చూపరులను ఆనందపరచుచుండును. గుహాలయములెన్నో గలవు. వివిధ రకముల పక్షులు కలకల ధ్వనులుచేయుచు వీనులవిందొనర్చుచుండును. సింహశార్దూలాది మృగములకు కొదువలేదు. మదమత్తేభములు విచ్చలవిడిగ సంచరించుచుండును. దేవతలు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, అప్సరసకాంతలు వినోదార్థము విహరించు చుందురు. పర్వతమును అనుకొనియున్న మహారణ్యము వన్యమృగములకు ఆవాసమై యుండెను.

ఒకానొక సమయమున ఏనుగుల గుంపు పర్వతప్రాంత పరిసరములందు యధేచ్ఛగ విహరించెను. దప్పిక తీర్చుకొనుటకు అవన్నియు సమీపమందుగల సరోవరమున ప్రవేశించెను. గజరాజు, భార్యలు, సంతానము సరస్సునందు ప్రవేశించి మధురజలములను తృప్తిగ త్రాగినవి. తొండములతో నీరుపీల్చి పైకిచిమ్ముచు, మీద చల్లుకొనుచు ఆడుకొన్నవి. మనసార క్రీడించినవి. నీటిలో మునుగుచు, తేలుచు, ఈదులాడుచు వివిధరీతుల విన్యాసములు ప్రదర్శించుచు వినోదించి విలాసముగ సంచరించెను. మదగజముల త్రొక్కిడుకు సరోవరమంతయు కల్లోలమయ్యెను. అందుగల మీనాదిజలచరములు భయమున దూరదూరములకు పరుగులెత్తెను. కొన్ని ఎగిరెగిరిదుమికెను. కొన్ని భయముతో నలువైపులకు చెదరిపోయినవి. అటుల గజరాజు తనపరివారముతో సరోవరమును కల్లోలపరచుచుండెను.

ఆ సమయమున పెద్దమొసలి యొకటి మహావేగముతోవచ్చి గజరాజు పాదమును రాహువు సూర్యుని గ్రహించినట్లుగ గట్టిగపట్టెను. గజరాజు కాలును విదలించెను. కాని మొసలి తనపట్టు విడువలేదు. గజరాజు మకరిపట్టునుండి తప్పించుకొనజాలక అటునిటుకదలక నిలబడిపోయెను. తమ ప్రభువునకు గలిగిన ఆపదగాంచి ఏనుగులన్నియు పెద్దపెట్టున ఘీంకారధ్వనులు చేయుచు ఆక్రోశించెను. పర్వతములు ప్రతిధ్వనించునటుల బొబ్బలిడెను. దశదిశలు మదగజసమూహము చేయు భయంకరధ్వనులకు మారుమ్రోగెను. మొసలి తనపట్టు సడలనీయక

గజరాజును నీటిలోనికి లాగుచుండెను. గజము దాని పట్టునుండి తప్పించుకొను ప్రయత్నములో కొలను బయటకు లాగుచుండెను. అటుల కరిమకరుల మధ్య పోరాటము వేయిసంవత్సరములు నిరంతరాయముగసాగెను.

క్రమముగ గజేంద్రుని బలదర్పములు క్షీణించెను. జవసత్త్వములు సన్నిగిలి అడుగంటెను. అటుల గజేంద్రుడు క్రమక్రమముగ హీనశక్తుడగుచుండ, జలము నందలి మకరేంద్రుని శక్తి అధికమగుచుండెను. గజరాజు ప్రాణావశిష్టుడయ్యెను. కడప్రాణములతో కొట్టు మిట్టాడుచుండెను. రక్షించువారులేక దిక్కుతోచనివాడాయెను. అవసానదశ ప్రాప్తించినదని నిశ్చయించుకొనెను. ఇక తనను రక్షించి దరిజేర్చువాడు భగవంతుడొక్కడే యని తలచెను. పరంధాముడైన భగవంతుని శరణజొచ్చెను. ఆరాటముమాని, ఆపరంధాముని పలురీతుల కీర్తించెను.

"ఓ పురుషోత్తమా! ఆర్తత్రాణపరాయణా! మహాబలాఢ్యుడనని మదగర్వమున యింతవరకు మకరితో పోరాడితిని. నాశక్తి నశించినది. గర్వము సర్వము హరించినది. జవసత్వములన్నీ అడుగంటినవి. ఓ కాలస్వరూపా! కాలప్రభావముచే నాకీ దీనదశ ప్రాప్తించినది. ధైర్యములేదు. శక్తిలేదు. ప్రాణములు శోషిల్లుచున్నవి. ఓ శ్రీమన్నారాయణా ! దీనరక్షకా ! జగన్నాథా ! నీవు కరుణామయుడవు. శరణాగత రక్షకుడవు. ఆర్తత్రాణపరాయణుడవు. నీవుతక్క నాకిక దిక్కువేరులేదు. ఓ దేవాదిదేవా! ఈశ్వరా! నామొరాలించుము. వేగమెవచ్చి ఈదీనుని రక్షింపుము." అని గజరాజు వైకుంఠేశ్వరుని వేభంగుల ప్రార్థించెను.

గజేంద్రుని ఆర్తనాదం ఆర్తత్రాణపరాయణుడగు వైకుంఠవాసునకు వినిపించి వెంటనే బయలుదేరెను. గరుత్మంతుడువచ్చి చెంతనిలచెను. శంఖచక్రాది ఆయుధములు హస్తములందు చేరెను. విష్ణుమూర్తి గరుడవాహనారూఢుడై బయలుదేర, లక్ష్మీదేవి, మునిబృందారకాదులు వెంటనడువ జగద్రక్షుడుడైన శ్రీమన్నారాయణుడు గజేంద్రుని సమీపించి నిలచెను. అల్లంత దూరముననే గజరాజు జగన్నాథునిగాంచెను. హర్షపులకాంకితుడై, తనతొండమును పైకెత్తి పరమాత్మునకు నమస్కరించెను. కన్నులనుండి ఆనందభాష్పములు జాలువారగ వేభంగుల పరంధాముని కీర్తించెను.

శ్రీమహావిష్ణువు చక్రాయుధముచే మొసలి కంఠమును దునుమాడి, గజేంద్రుని మొసలిబారినుండి రక్షించెను. అపుడు దేవదుందుభులు ఘనముగ మ్రోగెను. దివి

నుండి పూలవాన కురిసెను. గంధర్వులు మృదుమధురముగ గానముచేయ, అప్సరస కాంతలు నాట్యమాడిరి. చక్రాయుధముచే సంహరింపబడిన మకరేంద్రుడు శాప విముక్తుడై గంధర్వరూపమున నిలచెను. అదిగాంచిన వారందరు ఆశ్చర్యమందరి. శ్రీహరికి సాష్టాంగ దండప్రణామములాచరించి, పలురీతుల నుతించిరి.

గజేంద్రుడును శ్రీమన్నారాయణునకు భక్తిమీర మ్రొక్కినమస్కరించెను. దివ్య స్తోత్రముల స్తుతించగ, జగన్నాథుడు గజరాజుకు విష్ణుపదమనుగ్రహించి అంతర్ధానుడయ్యెను.

## 31. కరి మకరుల పూర్వజన్మవృత్తాంతము

పూర్వము హుహూవు అను గంధర్వుడు కలడు. అతడు గొప్ప హరిభక్తుడు, అతడొకనాడు తన భార్యలతో గూడి ఒక సరోవరములో జలక్రీడలాడుచుండెను. ఆ సమయమున దేవలుడనుముని స్నానార్థమచ్చటికి వచ్చి స్నానము చేయుచుండెను. గంధర్వుడు బుద్ధిహీనుడై మునిపాదముపట్టి నీళ్ళలోనికిలాగి అవహేళన చేసెను. అంతట ఆ ముని కోపమున రుద్రుడై, “ఓరీ ! నీవు మదాంధుడవై నన్ను అవమానించితివి. నీవు మరుజన్మలో ‘మకరి’ వై పుట్టుదువుగాక” యని శపించెను. గంధర్వుడు తన పొరపాటును క్షమింపుమని ప్రార్థించెను.

అంతట దేవముని కరుణించి, “ఓయీ! నీవొక గజరాజునుపట్టి జలములందు లాగి బాధింతువు. అప్పుడు శ్రీహరి చక్రాయుధముచే నిన్ను ఖండించి, కరిని రక్షించును. అంతటనీకు శాపవిముక్తి యగును.” అని గంధర్వుని అనుగ్రహించెను. మునిశాపము ప్రకారము గంధర్వునకు మకరిరూపము తొలగెను.

గజేంద్రుడు గతజన్మమున ఇంద్రద్యుముడను ద్రవిడదేశపు రాజు. అతడు గొప్ప హరిభక్తుడు. విష్ణుపూజాతత్పరుడు. తపోదీక్షబూని మలయాచలమున ఆశ్రమము నిర్మించుకొని. మౌనవ్రతము వహించి హరిని పూజించుచుండెను. ఆ సమయమున అగస్త్య మహర్షి అచటికేతెంచెను. నిష్ఠయందున్న ఇంద్రద్యుమ్నుడు మునిని పలుకరించలేదు. గౌరవించనులేదు. అందులకు అగస్త్యుడు కోపమున మండిపడెను. “మదగర్వమున మగగజమువలె ప్రవర్తించితివి గాన నీవు మదగజముగ జన్మింతువని శాపమిడెను. కాని ఇంద్రద్యుమ్నుడు విష్ణుపూజా తత్పరుడుగాన పూర్వజన్మ స్మృతిగలిగి హరిని స్మరించి విష్ణువు యొక్క అనుగ్రహము పొంది ముక్తిని పొందెను.

పరమ పవిత్రమైన చరిత్ర గజేంద్రమోక్ష కథ. శ్రీమహావిష్ణువు యొక్క మహిమను వర్ణించిచెప్పెడి ఈ పుణ్యకథ పఠించినను, వినినను సర్వశుభములు, సంపదలు గలుగును. శ్రీహరిపై భక్తి, జ్ఞానములు తథ్యముగ లభించును.

శ్రీహరి పాదపద్మములను సేవించినవారు ఎట్టివారైనను, ఏ జాతివారైనను, ఏ తెగకు చెందినవారైనను మోక్షార్హులగుదురు. సర్వప్రాణులు, జీవులు, మానవులు అను తరతమ భేదములేదు. అందుకు తార్కాణముగ ఈకథయందు కరిమకరులు, రామాయణమున గుహుడు, శబరులు. పక్షులలో జటాయువు, రాక్షసులందు కబంధుడు, మారీచసుబాహువులు, వానరములందు వాలి సుగ్రీవులు, అంజనేయుడు, దానవులందు ప్రహ్లాద, విభీషణులు మున్నగువారు. కనుక సర్వమానవ సమానత్వము, సర్వజీవుల సమత్వము ప్రదర్శించుట భగవంతుని నిత్యనైమిత్తికచర్య. ఎవరియందు పక్షపాత బుద్ధిలేదు. ధర్మరక్షణము శ్రీహరి ప్రధానకర్తవ్యము.

## ౩౨. క్షీర సాగరమథనము

పూర్వమొక సమయమున దేవదానవులకు ఘోర సంగ్రామము జరిగెను. అందు చాలమంది దేవతలు ప్రాణముల నెడబాసిరి. అది యటులుండగా, ఇంద్రుడొక సమయమున తన వాహనమైన ఐరావతము నధిరోహించి వచ్చుచుండగా, దుర్వాస మహర్షి సురనాథునకు పుష్పహారమొకటి కానుకగానిచ్చెను. ఐశ్వర్యమదోన్మత్తుడైన ఇంద్రుడు దానిని గౌరవమున ధరించక, తృణీకారభావముతో మాలను ఏనుగు కుంభస్థలముపై పడవేసెను. అది దానిని భువిపై విసరికొట్టి పాదములతో త్రొక్కి పాడుచేసెను. అదిగాంచి దుర్వాసుడు మిగులాగ్రహించెను.

"ఓయీ ! ఇంద్రా ! మమ్ములను నిష్కారణముగ అవమానించినావు. ఈ కారణముగ నీ సంపదలన్నియు నశించగలవు. నీ త్రిలోకాధిపత్యము నశించును. భ్రష్టుడవగుదువు" అని దారుణముగ శపించెను. శాపఫలితముగ ఇంద్రుని అధికారము, ఐశ్వర్యము నశించెను. యజ్ఞయాగాదులు ఆగిపోయెను. దానవులవలన పరాజితులైన దేవతలు నిస్తేజులై నిర్వీర్యులై దిక్కుతోచనివారై అల్లాడుచుండిరి. దిక్పాలురందరు చింతాక్రాంతులై యుండిరి. అంత దేవతలందరు బ్రహ్మచెంతకేగి తమ దుస్థితిని విన్నవించుకొనిరి. పరమేష్టియు వారి దీనాలాపములువిని. ఇట్టి తరుణమున మనలను సంరక్షింపగల వాడు శ్రీహరి ఒక్కడే." అని పలికి వారలను తోడ్కొని శ్రీమన్నారాయణుని చెంతకేగెను. అందరు శ్రీమహావిష్ణువును పరిపరి

విధముల స్తుతించిరి. జగన్నాథుడును వారిని కరుణించి, వారికొక తరుణోపాయము నెరింగించెను.

"అయ్యలారా ! ప్రస్తుతము మీకిప్పుడు చెడుకాలము. ఓర్పు వహించుడు. రాక్షసులతో తగవుమాని సంధిచేసికొని పొందు గలిగియుండుడు. అమృతమును సాధించ గలిగిన కష్టములన్నియు తొలగును. దానిని సాధించుటకు మీరు ఉభయులు శ్రమించవలయును." దానవులకు నచ్చజెప్పి యీకార్యమునకు వారితోడ్పాటును సంపాదించుకొనుడు. ఎటులైనను దానవులను అంగీకరింపచేయుడు. సర్వ ఓషధులకు ఆవాసమైన మందరపర్వతమును కవ్వముగను, సర్పములకు రాజైన వాసుకిని త్రాడుగను యొనర్చి, క్షీరసాగరమును మధించుడు. అందుండి అమృతము ఉద్భవించును. అమృతము మీకు లభించునట్లు నేజేయుదును. అమృతపానమువలన మరణముండదు. నా సహాయ సహకారములు మీకెల్లవేళల యుండగలవు." అని శ్రీహరి వారికి ఉపాయముపదేశించెను.

శ్రీహరి చెప్పిన మాటలకు దేవతలు సంతుష్టులై సంతసమున వెళ్లిరి. భగవానుడు చెప్పినవిధముగ దానవులను సమాధానపరచిరి. అమృత పానము వలన తమకు మరణముండదని వారు సంతసించి, క్షీరసాగర మధనమునకు సంసిద్ధులైరి. రాక్షస ప్రభువగు బలిచక్రవర్తియు అందులకు సమ్మతించెను.

దేవదానవులు క్షీరసాగరమును మధించుటకు ఉద్యమించిరి. మందర పర్వతమును పాలకడలియందు నిలుప నేరితరము? దేవదానవులు చాలశ్రమించిరి. ఆ ప్రయత్నములో చాలమంది ప్రాణములు గోల్పోయిరి. పలువురు క్షతగాత్రులైరి. ఆచర్య వారికసాధ్యమయ్యెను. దిగులుపడి దిక్కుతెలియని వారైరి. అంత శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమయ్యెను. మరణించిన వారిని తిరిగి బ్రతికించెను. గాయపడిన వారిని బాగొనర్చెను. అందరికి ధైర్యము కలుగచేసెను. ఆ మహా పర్వతమును అవలీలనెత్తి గరుత్మంతుని మూపునయుంచగా, ఆపక్షిరాజము సునాయాసముగా గొనిపోయి పాలసముద్రములో వుంచెను.

అనంతరము వాసుకి యను సర్పరాజును ప్రార్థించి తెచ్చి కవ్వమునకు త్రాడుగ అమర్చినట్లు పర్వతమునకు అమర్చిరి. దేవతలంతా సర్పముయొక్క తలభాగమును పట్టుకొనిరి, దానవులు తోకను పట్టుకొనుటకు నిరాకరించిరి. అది తమకు అవమాన కరమని భావించిరి. అంతట విష్ణుమూర్తి, సలహామేరకు దేవతలు సర్పముయొక్క

తోకను, రాక్షసులు శిరోభాగమునుపట్టి మధింపసాగిరి. కాని పర్వతము సముద్రములో మునిగి పోవుచుండెను. దేవదానవులు పర్వతము మునిగిపోవుచున్నందుకు దరితోచక విచారమున మునిగిరి, శ్రీహరి అంతట కూర్మావతారముదాల్చి,పాలసముద్రములో ప్రవేశించి, పర్వతమును వీపున ధరించి, పర్వతము సులువుగ తిరుగుటకు ఆధార భూతుడాయెను. అదిగాంచిన బ్రహ్మాదిదేవతలు విష్ణుమూర్తిని పరిపరివిధముల నుతించిరి.

క్షీరసాగరమథన సమయమున సముద్రము అల్లకల్లోలమయ్యెను, అందుగల మత్స్యకూర్మాది జలచరములన్నియు భీతిచే నలుదెసలకు పరుగులెత్తెను. సముద్రము నుండి మొదటగ హాలాహలము పుట్టినది. అదిభయంకరమగు విషము. మహోగ్రరూపమున దశదిశలు వ్యాపించెను. దాని ప్రభావమునకు భయమంది దేవతలు పరమశివునిచేరి మొరలిడిరి. పరమేశ్వరుడు వారి మొరాలించి, భయంకర విషమును అరచేతిలోనికి గ్రహించి మ్రింగి తన కంఠమున బంధించెను. అందుచే శివుని కంఠమున మచ్చయేర్పడెను. కనుకనే పరమశివుని గరళకంఠుడనిరి.

తరువాత కడలిని మధించగ కామధేను వుద్భవించెను. అది యజ్ఞయాగాదులకు ఆధారమైనది. దానిని మహర్షులు గైకొనిరి. తరువాత ఆవిర్భవించిన ఉచ్చైశ్రవమను శ్వేతాశ్వమును అసురాధిపుడైన బలిచక్రవర్తి స్వీకరించెను. తరువాత అవిర్భవించిన ఐరావతమును ఇంద్రుడు గ్రహించెను. అటుపై పారిజాత వృక్షము జనించెను. అది కోరిన కోరికలను తీర్చెడి కల్పవృక్షము. అతిసౌందర్య విలాసితులగు అప్సరాంగనలు జన్మించిరి. అనంతరము జగన్మాత లక్ష్మీదేవి జననమందెను. సర్వలక్షణ సంపన్నుడు, సర్వవ్యాపకుడు, పురుషోత్తముడు, దివ్యమంగళవిగ్రహుడు అయిన శ్రీమహావిష్ణువు లోకమాత లక్ష్మీదేవిని స్వీకరించి, వక్షఃస్థలమున ధరించి గౌరవించెను.

అనంతరము సాక్షాత్తు భగవత్స్వరూపుడు, ఆయుర్వేదదర్శనుడు అయిన ధన్వంతరి ఆవిర్భవించెను. ఆతని హస్తకమలములందు "అమృతకలశము" ఉండెను. దానవులు దానిని వేగముగ గ్రహించి దూరముగ పరుగుతీసిరి. అది గాంచిన దేవతలు తమశ్రమ వ్యర్థమాయెనని దిగులున క్రుంగిరి. విష్ణువు వారినోదార్చి అమృతము యెటులైనను తమకు దక్కునట్లు చేయుదునని ధైర్యమిచ్చెను.

అటుల అభయమొసంగిన శ్రీమహావిష్ణువు ముల్లోకములను మోహమున ముంచివేయు మోహినీరూపము ధరించెను. త్రిభువన మోహనమూర్తి దానవుల

ముందు ప్రత్యక్షమాయెను. ఆ మోహినిరూపము గాంచినంతనే దానవుల కళ్లుచెదిరెను. మోహమున పరవశించిరి. మదాంధులైన రాక్షసులకు కామోద్రేకముపొంగి కట్టలు త్రెంచుకొనెను. ఆమెను కామించి, మోహినిచుట్టు గుమికూడిరి. అమృత పానము విషయము మరచిరి. మైమరిచి ఒకరినొకరు నెట్టుకొనుచు, త్రోసికొనుచు కలహింప మొదలిడిరి. మోహిని రూపమున యున్న విష్ణువు వగలు, వన్నెలు, చిన్నెలు ప్రదర్శించి అందరిని పరవశింపచేసెను. ఎవరికివారు మోహినిని పొంది సుఖించవలెనని మోహావేశమున మునిగిరి. తరువాత తెలివిగలిగి ప్రవర్తించిరి.

అంతవారు, "ఓ సౌందర్యవతీ ! మేమందరము సోదరులము, మేమంతా ఒక్కటే. ఒక దివ్యమైన పదార్థము గురించి మేము పోటీపడుచుంటిమి. మాలోమాకు పరస్పరము భేదము, కలహము లేకుండగ, దానిని సమముగ పంచి, మాతగవు తీర్చుము." అని కోరిరి.

మోహిని వారి కోరికను మన్నించెను. వారందరిని సమ్మతింపచేసెను. వారి నుండి అమృతకలశమును గ్రహించెను. అమృతభాండమును వయ్యారములొలక బోయుచు చంకనిదుకొనెను. మోహినీదేవి ఆదేశానుసారము అందరు స్నానములు చేసి పరిశుభ్ర వస్త్రములు ధరించి శుచులైరి. గోబ్రాహ్మణులను, దేవతలను, దిక్పాలురను భక్తిశ్రద్ధల నర్చించిరి. విప్రశ్రేష్ఠులకు భూరిదక్షిణలొసగి సంతృప్తులచేసిరి. ఒక సువిశాల ప్రాంగణమున దర్భాసనములు పరచుకొని తూర్పుదిశకు అభిముఖులై దేవదానవులు బారులుదీరి కూర్చుండిరి. మోహినీదేవి అమృతకలశమును చంకనిదుకొని వంపు సొంపులు, తళుకుబెళుకులు, వయ్యారపు నడకలు, సర్వజగత్తునే మోహింపచేయు ఓరచూపులు, హావభావములు ప్రదర్శించుచు అందరిని మత్తున ముంచెను. దానవులు విష్ణుమాయలో మునిగిరి. దేవతలు మాత్రము జగన్నాటక సూత్రధారియగు విష్ణు లీలలను గ్రహించి నెమ్మదిగయుండిరి. అటుల మోహినీదేవి దానవులను మోహ పరవశులనుచేసి. అమృతమును దేవతలకుపంచెను. జరుగుచున్న మాయను, మోసమును మందబుద్ధులైన అసురులు గ్రహించజాలరైరి. కాని రాహువను అసురుడు జరుగుచున్నమాయను గ్రహించి, మాయారూపమునవచ్చి దేవతల పంక్తిలో కూర్చుండెను. కాని వాని మోసమును సూర్యచంద్రులు గ్రహించి విష్ణువునకు తెలిపిరి. విష్ణువంత చక్రాయుధముచే వాని శిరస్సు ఖండించెను. అప్పటికే అమృతపానము చేసినందున వాడు మరణించలేదు. వాడు సూర్యచంద్రులను మ్రింగుచు పీడించ సాగెను. ఆ కారణముగ లోకమున సూర్యచంద్రగ్రహణము లేర్పడినవి.

అటుల అమృతమును పంచిన పిమ్మట శ్రీమహావిష్ణువు మోహిని అవతారమును చాలించి, నిజరూపమున వైకుంఠము చేరెను. తుదకు విష్ణువుచేసిన మాయోపాయమును గ్రహించిన దానవులు చేయునదిలేక మిగులవిచారించిరి.

దేవతలపై పగబూనిన దానవులు వారిపై యుద్ధమునకు దిగిరి. ఇరువురినడుమ భయంకర సంగ్రామము జరిగెను. అమృతపానముచే దేవతలు మిగుల బలవంతులైరి. వారి తేజః ప్రతాపములముందు దానవులు శక్తిహీనులైరి. యుద్ధమున దేవతలెవ్వరును మరణించలేదు. రాక్షసులు మాత్రము మృత్యురహితులైన దేవతలచే వధింపబడిరి. కొందరా విధమున యుద్ధములో ప్రాణములు కోలుపోవ, కొందరు పారిపోయి ప్రాణములు రక్షించుకొనిరి.

శ్రీమహావిష్ణువు మోహిని అవతారము విశ్వమునే మోహింపజేసెను. నిరంతరతపోనిష్ఠాగరిష్ఠుడైన పరమశివుడు సైతము ఆదివ్య సుందరరూపము గాంచి వరవశుడైనట్లు వ్యాసభగవానుడు వర్ణించెను. అట్టితరి తదన్యుల విషయము వేరుగచెప్పనేల? శ్రీమహావిష్ణువు దివ్యమహత్తును తెలిపెడి క్షీరసాగరమథన చరిత్రము చదివినను, వినినను అమరత్వము సిద్ధించుట తథ్యము.

## 33. బలి చక్రవర్తి

హిరణ్యకశిపుడు దానవకుల సార్వభౌముడు. అతనికి ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు అను నల్వురు పుత్రులును, సింహిక అను పుత్రికయు గలిగిరి.

ప్రహ్లాదుని భార్య దమని. వారికి వాతాపి, ఇల్వలుడు జన్మించిరి. వారిద్దరు రాక్షస ప్రవృత్తి గలవారు. అగస్త్యుడు తన తపోప్రభావముచే వాతాపి, ఇల్వలులను కడతేర్చెను. ప్రహ్లాదుని మరియొక కుమారుడు విరోచనుడు. విరోచనుని కుమారుడు బలి. అనగా బలి ప్రహ్లాదుని మనుమడు.

శివభక్తులందు అగ్రగణ్యుడైన బాణుడుకూడా ప్రహ్లాదుని వంశీయుడే. దుర్జన వంశమందును సజ్జనులు, సచ్ఛీలురు జననమందు చుందురు. ఆ కారణముచే ఆవంశముద్ధరింపబడుటయేగాక ఖ్యాతి గాంచును.

అమృతపానము చేసిన దేవతలు రాక్షసులను యుద్ధమున ఓడించుటయే గాక, చాలమందిని సంహరించిరి. మిగిలినవారు తమ కులగురువైన శుక్రాచార్యుని శరణు జొచ్చిరి. శుక్రాచార్యుడు వారిననుగ్రహించి, రణమున మరణించిన రాక్షసులనందరిని

'మృతసంజీవిని' అను విద్యచే బ్రతికించెను. దానవ ప్రభువైన బలికూడ పునర్జీవితు డయ్యెను. తమ జాతికి సంభవించిన దుర్గతికి మిగుల చింతించెను. ఎటులైనను దేవతలను జయించి సమస్తసంపదలను వశపరచుకొని తనప్రతిభను చాటుకొన వలెనని తలచెను. అతని మనోగతము తెలిసిన శుక్రాచార్యుడు బలిచేత "విశ్వజన్మామకం" అను మహత్తర యాగమును చేయించెను. అపుడు హోమాగ్నినుండి దివ్యరథముద్భవించెను. దానికి సింహధ్వజము, అశ్వములు అమరియుండెను. తాతగారైన ప్రహ్లాదుడు ప్రత్యక్షమై బలికి బంగరుధనుస్సు, అక్షయతూణీరములు, దివ్యకవచము, పుష్పమాల బహూకరించి, ఆశీర్వదించెను. కులగురువైన శుక్రాచార్యుడు బలికి మహత్తరమైన శంఖమునిచ్చెను.

అంతట బలి సర్వశక్తి సంపన్నుడై సర్వము సమకూర్చుకొని స్వర్గముపై దండెత్తెను. ఇంద్రుని రాజధానియైన అమరావతిని ముట్టడించెను. దానవులధాటికి దేవతలు తల్లడిల్లిరి. ఎదురు నిలువలేక పరాజితులైరి. ఇంద్రుడు భయకంపితుడై తనగురువైన బృహస్పతి చెంతకేగి వాటిల్లిన ముప్పును వివరించెను. తమకు రక్షణోపాయము తెలుపమనివేడెను.

బృహస్పతి కొంచెమాలోచించెను. "ఓయీ ! ఇంద్రా ! బలి శుక్రాచార్యుని అనుగ్రహముచే బలమును పుంజుకొనినాడు. ప్రస్తుతము వారిని గెలువనసాధ్యము. కొంతకాలము ఓర్పువహించుము. మంచికాలము వచ్చువరకు వేచియుండుము." అని బృహస్పతి ఇంద్రునకు హితము పలికెను. దేవేంద్రుడు చేయునదిలేక సమస్త బృందారకులతో స్వర్గమును విడచివెళ్లెను.

బలిచక్రవర్తి స్వర్గమునాక్రమించి ఇంద్రపదవిని అలంకరించెను. విశ్వవిజయుడై సమస్తభోగభాగ్యములను అనుభవించెను. రాక్షసులు అదుపులేక విచ్చలవిడి సంచరించిరి. శుక్రాచార్యుడు బలిచక్రవర్తిచే అశ్వమేధయాగములను నూరింటిని నిరాటంకముగ, నిర్విఘ్నముగ నిర్వహింపచేసెను. అంతట బలిచక్రవర్తి కీర్తి దశదిశల వ్యాప్తిచెందెను.

అదితి తన పుత్రులకు సంభవించిన దురవస్థకు మిగుల దుఃఖించెను. శోక తప్తహృదయయై భర్త కశ్యపుని చెంతకేగి తన దీనావస్థను వివరించెను. ఎటులైనను తనపుత్రులకు పూర్వవైభవము లభించునట్లు చేయుమని అర్థించెను. కశ్యపుడు అదితికి "పయోవ్రతం" అను పుణ్యవ్రతము చేయుమని వ్రతవిధాన మంతయు వివరించెను.

ఆమెయు భర్తచెప్పిన విధముగ వ్రతమును నియమనిష్టలతోడను, భక్తితోడనాచరించి, వాసుదేవుని పూజించెను. అంతట శ్రీహరిప్రత్యక్షమై వరము కోరుమని అదితిని అడిగెను. అంత ఆమె తనపుత్రుల కష్టములు తొలగించుమని కోరెను. శ్రీమహావిష్ణు వంత, "అమ్మా ! నేను నీగర్భమున నీకుమారునిగ జన్మింతును. అపుడు దేవతలను రక్షించి ఉద్ధరింతును. "అని పలికి అదృశ్యుడాయెను. అటు పిమ్మట కొన్నినాళ్ళకు అదితి గర్భమున శ్రీమహావిష్ణువు అవతరించెను. అపుడాబాలుడు వామనావతారుడు. చాల పొట్టివాడు. కనుకనే బాలుని వామనమూర్తి యనిరి. భాద్రపదశుద్ధద్వాదశీ శ్రవణానక్షత్రము వామనుని జననముహూర్తము. వామనుని జననకాలమున సురలు, భూసురులు మిగులానందించిరి. దివియందు దేవదుందుభులు సంబరమునమ్రోగెను. పూలవానలు ఎడములేక కురిసెను. ఎన్నియో శుభచిహ్నములు పొడసూపెను. అదితికశ్యపులు కుమారునిగాంచి మిగులానందించిరి.

వామన మూర్తికి ఉపనయనాది సంస్కారములు శాస్త్రోక్తముగ నిర్వహించిరి. సరస్వతి బ్రహ్మలు. సప్తర్షులు మున్నగువారు బ్రహ్మచారికి దండకమండలములు. కృష్ణాజినము లందజేసి సంతసింపచేసిరి. సాధారణముగ ఉపనయనముతో జన్మ సంస్కరింపబడును. శుచిత్వము పొందును. దేవ పితృకార్యములాచరించుటకు అర్హత వచ్చును.

బలిచక్రవర్తి ధర్మయుతముగా పరిపాలనచేయు చుండగ, సర్వులు సుఖసంతోష ములతో, సర్వసౌఖ్యములు అనుభవించుచు సంతుష్టులైయుండిరి. సత్యసంధుడని, సత్యమూర్తియని, దానపరుడని, ధర్మప్రభువని ముల్లోకవాసులచే కీర్తింపబడుచుండెను. కృతయుగములో బలిచక్రవర్తికి సమానుడగు దాత వేరొకడు లేడని యశస్సుపొందెను.

వామనరూపమునయున్న శ్రీమహావిష్ణువు బలిచక్రవర్తి యొక్క దాతృత్వ గుణమును పరీక్షింపగోరెను. ఒకనాడు వటువురూపముతో బలిచెంతకుచనెను. ఆ సమయమున దానవరాజు యజ్ఞదీక్ష యందుండెను. నర్మదా నదీతీరమందు "భృగవత్సనామక క్షేత్రమున" యాగము నిర్వహింపబడుచుండెను. శుక్రాచార్యుడు యజ్ఞమునకు అధ్వర్యము వహించెను.

వామనుడు యజ్ఞశాలను ప్రవేశించెను. మౌంజిగలయజ్ఞోపవీతం, కృష్ణాజినం, ఛత్రము, దండకమండలములధరించి, కోటిసూర్యప్రభలతో వామనుడు ప్రకాశించు చుండెను. శుక్రాచార్యుడు తన శిష్యపరివారముతో వామనమూర్తికెదురేగి గౌరవ

పురస్కారాదులచే ఆహ్వానించి, ఉచితాసనమున ఆశీనుని గావించెను. బలిచక్రవర్తి అర్ఘ్యపాద్యాదులచే అర్చించెను. పాదప్రక్షాళనము చేసి, పవిత్ర పాదోదకమును శిరస్సున చల్లుకొనెను.

"మహాత్మా! బ్రాహ్మణోత్తమా! మీరాక వలన నేను, నావంశము పావనమైతిమి. నాపితృదేవతలు తరించిరి. నాయాగము ఫలించినది. ఓ బ్రహ్మణ్యమూర్తీ! తమ కోరిక తెలుపుడు. అదెట్టిదైనను మనమునందెట్టి శంకలేక సంతోషమునతీర్చి తమను సంతృప్తుని గావింతును." అని బలిచక్రవర్తి పలికెను.

అంతట శ్రీహరి బలిచక్రవర్తియొక్క ఔదార్యమునకు సంతసించి, దానవేశ్వరుని పరిపరివిధముల ప్రస్తుతించెను. "ఓరాజా! పరమభాగవతోత్తముడైన ప్రహ్లాదుని వంశమున జన్మించి గొప్పకీర్తిని గడించినావు. ధర్మప్రభువని, దానగుణమున శ్రేష్ఠుడవని ఖ్యాతినందితివి. నాకు 'మూడు' అడుగుల భూమిని దానమిమ్ము. దానిని గైకొని సంతృప్తుడనై వెళ్లుదును." అని పలికెను.

వామనుని మాటలకు బలి ఆశ్చర్యమందెను. వింతకోరికకు తనలోతాను నవ్వుకొనెను. "ఓయీ! విప్రోత్తమా! నీకోరిక కడువింతగ నున్నది. నీవు కోరినచో సప్తద్వీపములనైన జంకులేకయివ్వగలను. కనుక నా అర్హతకు తగినవిధముగ మరేదైన కోరుకొనుము." అని బలిచక్రవర్తి పలుక, వామనుడు, "రాజా! నీవనినట్లు నాకు ఇతరములేమియు వలదు. "మూడు" అడుగుల నేల జాలును. వానినిచ్చినచో నేపోదును. అని శ్రీహరి పలికెను. విప్రవటువు మాటలకు బలిచక్రవర్తి వేరుగ మాటాడక, దానమిచ్చుటకు సంసిద్ధుడై స్వర్ణ జలకలశమును గైకొనెను.

శుక్రాచార్యుడు దివ్యజ్ఞానముచే సర్వము తెలిసికొనెను. వచ్చినవటువు సామాన్య విప్రబాలకుడుకాడు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువే ఈరూపమున వచ్చెనని గ్రహించెను. అంత ఆచార్యుడు, "ఓయీ! రాజా! తొందరపడవలదు. ఈ వచ్చిన బాలకుడు మానవమాత్రుడుగాడు. శ్రీమహావిష్ణువే వామనరూపుడై, దేవతలను రక్షింపదలచి వచ్చినాడు. ఈ దానమువలన నీకు గొప్పకీడు రానున్నది. దానవవంశమునకే ఆపదమూడనున్నది. ఈవటువు కోరిన మూడు అడుగులభూమి అతి స్వల్పమని తలచితివి కాబోలు. అది స్వల్పముగాదు. అట్లని భావించినచో అది నీభ్రాంతిమాత్రమే యగును. ఈ బాలుడు తన మూడు అగుడులతో ముల్లోకములను ఆక్రమించగలడు. దానితో నీవు, నీరాజ్యము, సంపదలు సర్వముకోల్పోదువు. అంత త్రిలోకాధిపత్యమును

దేవతలకు చెందగలదు. నామాటనమ్ముము. నాపలుకులందలి సత్యము గ్రహించి దానము నాపుము. వద్దు." అని గట్టిగ నొక్కివక్కాణించెను.

అంత బలిచక్రవర్తి, "గురుదేవా ! ఆడితప్పుట మావంశమునలేదు. అసత్యము పలుకలేను. అసత్యమునకు మించిన మహాపాపము వేరొక్కటిలేదు. అసత్యముపలికన నాకు, నాకీర్తికి, నావంశమునకు తీరని కళంకమాపాదించును. ఆచార్యవర్యా! ఆడితప్పుట నావశముకాదు. అదియునుగాక, యాచకునిగ వచ్చినది శ్రీమహావిష్ణువని పలుకుచున్నారు. ఆ జగన్నాథుడే యాచకుడై వచ్చినచో అంతకుమించిన అదృష్టము మరేమున్నది. నేను నాసర్వస్వము కోల్పోయినను నేను వెనుకాడను. ఈదానము త్రికరణశుద్ధిగ యిచ్చి తీరుదును. ఎవరేమి చెప్పినను మాటతప్పువాడను గాను,“ అని దానమిచ్చుటకు సర్వాత్మన సిద్ధమాయెను.

బలిచక్రవర్తి నిర్ణయమునకు శుక్రాచార్యుడు కోపోద్రిక్తుడై, "నీవు గురువును ధిక్కరించి ప్రవర్తించుచున్నావు. గురుధిక్కారఫలితముగ అచిరకాలముననే సర్వసంపదలు గోల్పోదువుగాక," యని కఠోరముగ శపించెను. అటుల శపించినను బలిచక్రవర్తి తనమనోనిశ్చయమును మార్చుకొనలేదు.

బలిచక్రవర్తి వామనునకు భూదానము చేయుటకు పూనుకొనెను. భార్య వింధ్యావళి బంగరుపాత్రతో పవిత్రజలము పోయుచుండ, వామనమూర్తి పాద పద్మములనుకడిగి, జలమును తమ శిరస్సున చల్లుకొనిరి. దానజలమును వటువు హస్తములో మంత్రపూర్వకముగ ధారవోసెను. అపుడు దేవదుందుభులు మ్రోగ, దివినుండి పుష్పములు వర్షించెను. దేవతాగణములు, గంధర్వవిద్యాధరులు బలిచక్రవర్తిని ప్రశంశించిరి. అంతలోనే వామనుడు తన రూపమును పెంచసాగెను. భూమ్యాకాశములునిండెను. వామన రూపములోనున్న శ్రీహరి త్రివిక్రమావతారుడై ప్రకాశించెను. దేవతాది దివిజగణములు, మహర్షులు, మునులు వేదసూక్తములతో స్తుతించి ప్రణమిల్లి నమస్కరించిరి.

అంత శ్రీమహావిష్ణువు ఒక అడుగుతో భూమండలమును, రెండవ పాదము ఆకాశమండలమును ఆక్రమించెను. మూడవ అడుగుమోపుటకు అణుమాత్రమైనను స్థానములేకుండెను. అపుడు శ్రీహరి "వత్సా ! నీవు యిచ్చిన దానమునకు రెండు అగుడులకే భూనభోంతరాళములు సరిపోయినవి. ఇక మూడవ అడుగునకు చోటు చూపుము." అని బలిని ప్రశ్నించెను.

ఆ మాటలకు బలి, "ఓ దేవాదిదేవా ! నేనాడిన మాట తప్పువాడనుగాను. నీవు మూడవఅడుగు నాశిరమునందుంచుము." అని పలుక శ్రీమహావిష్ణువు మిగుల సంతసించెను. "ఓయీ ! నీదానవ్రతము నన్నేగాక త్రిభువనవాసులను ఆశ్చర్య చకితులను గావించినది. నీవు కొన్ని సంవత్సరములు సుతలములో వుండి అటు మీదట సావర్ణిమన్వంతరమున ఇంద్రుడవై త్రిలోకాధిపత్యమును స్వీకరింతువు. నీవు నాభక్తులలో నొకడవై ప్రకాశింతువు. "అని బలిని పాతాళమునకు పంపెను. తరువాత త్రిలోకాధిపత్యమును ఇంద్రునకొసగి దేవతాగణమును కాపాడెను.

బలిచక్రవర్తి కడుధర్మమూర్తి, పుణ్యమూర్తి, సత్యసంధుడు, దానశీలాది సుగుణములెన్నియో గలిగిన మహనీయుడు. రాజ్యపాలన యందును నీతిని ధర్మమును రక్షిస్తూ ప్రజలందరిని సుఖసంతోషములతో ఆనందింపచేసిన ఉత్తముడు.

శ్రీ మహావిష్ణువు దుష్టశిక్షణ, శిష్టరక్షణ నిమిత్తము అనేక అవతారములుదాల్చి ప్రవర్తించుచుండును. అయితే ఎన్నియోసుగుణములు గలిగిన బలిచక్రవర్తిని నిగ్రహించుటలో ఆంతర్యమేమి ? కేవలము దేవతలయందు పక్షపాతమా? ఆశ్రిత పక్షపాతమా? ఇందు నిగూఢమైన ధర్మమేమి? అని అనుమానము కలుగుట సహజము.

భగవంతుని చర్యలందు ధర్మాధర్మములు నిర్ణయించుటకు మన బుద్ధిసూక్ష్మత చాలదు. ఎందుకనగ ఆ మహనీయుడు ధర్మస్వరూపుడు. ఆతని కృత్యములందలి ధర్మసూక్ష్మము యోగిపుంగవులకే అంతుదొరకదు. భగవంతుడు ధర్మపక్షపాతి. ధర్మమును రక్షించును. ధర్మమునుద్ధరించును.

## 34. మత్స్యావతారము

భగవంతుడు సర్వభూతహితుడు. సర్వభూతమయుడు. సర్వాంతర్యామి. కనుకనే వివిధ రూపములలో భువినవతరించి లోకోద్ధరణము గావించినాడు. ఇపుడీ కథ యందు శ్రీహరి మీనరూపధారియై ధర్మమునుద్ధరించెను.

ఒక కల్పాంత సమయమున బ్రహ్మనిద్రించెను. అపుడు జగత్ప్రళయము సంభవించెను. లోకములన్ని నీటమునిగెను. అపుడు బ్రహ్మముఖకమలమునుండి వేదములు వెలువడెను. హయగ్రీవుడనే దానవుడు వేదములను అవహరించగా, వానిని ఉద్ధరించునెపముతో శ్రీహరి మత్స్యావతారము ధరించెను.

సత్యవ్రతుడను మహర్షి జలమును మాత్రమే ఆహారముగ గ్రహించి తపమాచరించుచుండెను. ఒకనాడాముని కృతమాలాతీరమున భగవానునకు తర్పణ మిచ్చుచుండగ, ముని దోసిలిలోనికి చిన్నచేపవచ్చెను. ముని దానిని వెంటనే నీటిలోనికి వదలెను.

అంతట చేప మనుష్యభాషణమున, "ఓమహర్షీ! నన్ను పెద్దచేపలు మ్రింగునను భయముతో నిన్నాశ్రయించితిని. కాని నీవు దయమాలి నీటిలో విడచితివి. ఇది నీకు ధర్మమా? నీచర్యన్యాయ సమ్మతమా" అని పలికెను. దాని దీనాలాపములకు మునిహృదయము ఆర్ద్రమయ్యెను. దానిపై దయగలిగి, చేపను గైకొని, తన కమండలములో భద్రపరచి ఆశ్రమమునకు చేరెను. అచిరకాలముననే చిన్నచేప ఆశ్చర్యకరముగ పెద్దదాయెను. దానికి కమండలము చాలదయ్యెను. అపుడాచేప, "స్వామీ ! నాకీ కమండలము నివసించుటకు చాలకున్నది. నన్నేదేని పెద్దదానిలోనికి మార్పు చేయుము." అని వేడెను. మునియు వెంటనే దానినొక పెద్దపాత్రలో వుంచెను. కొలది సమయమునకు ఆపాత్రయు చాలనంతగ చేపపెరిగెను. అంతనాముని, దానిని గోనిపోయి ఒక సరోవరములో వదలెను. మరుక్షణముననే ఆమీనము సరోవరము మించి, బ్రహ్మాండమంతగా పెరిగెను. కొలను అంతట నాక్రమించెను. సత్యవ్రతునకు మిగుల ఆశ్చర్యమయ్యెను. ఏమిచేయవలెనో తోచకుండెను. చివరకు సముద్ర జలములందు విడచుటకు నిశ్చయించి, సముద్రములోవిడచెను. అపుడా మత్స్యము అందులకంగీకరించలేదు.

"ఓదయామయా ! సాగరజలములందు భయంకరమగు మొసళ్ళు ఇతర జంతు జాలములుండును. అవి నన్నుపట్టి భక్షించును. కనుక మరియొక ప్రదేశమున రక్షణకల్పించి నన్నుకాపాడుము." అని మత్స్యము వేడుకొనెను.

సత్యవ్రతునకు అమితాశ్చర్యము కలిగెను. ఏమిచేయుటకు తోచలేదు. అంతటాముని, "మహనీయా! నీవు సామాన్యుడవుగాదు. చూచుచుండగనే అంతంతగ అనంతముగ పెరిగి బ్రహ్మాండమునే ఆక్రమించుచుంటివి. ఆలోచించిచూడ మత్స్యరూపము ధరించిన భగవంతుడవే. ఎంతమాత్రము సందియములేదు. జగన్నాథుడైన శ్రీమన్నారాయణుడవే." అని ప్రణమిల్లెను.

అపుడా మత్స్యము, "ఓ మునీశ్వరా ! నామాటలు శ్రద్ధగ వినుము. ఈనాటికి పదియవదినమున ముల్లోకములు మున్నీట మునిగిపోవనుండెను. అపుడొక

పెద్దనావను నీవద్దకు పంపుదును. నీవు మాత్రము ఓషధులను, పలువిధములైన బీజములను సమకూర్చుకొని, సప్తర్షులతో గూడి, ఆనావనెక్కి మహోర్ణవములో సంచరించుము. అపుడు పెనుతుఫాను సంభవించును. నావ మునిగిపోయి కొట్టుకొని పోకుండగ వాసుకనుసర్పమును త్రాడుగచేసి, నాకొమ్మునకు బంధించుము. అపుడు జలములందు ఈదుచు, నావనులాగుచు తిరుగాడుదును. అపుడు నేనెవరినో, నామహిమెట్టిదో నీకుతెలియగలదు." అని పలికెను.

మత్స్యము చెప్పిన విధమున జలప్రళయము సంభవించెను. నావయువచ్చెను. సత్యవ్రతుడు సప్తర్షులతోగూడి, ఓషధులు, బీజములు గూర్చుకొని పెద్దనావను ప్రవేశించెను. వాసుకి అనుత్రాటితో నావను చేపకొమ్ముకు కట్టెను. ప్రళయప్రభంజనము వీచెను. అంతయు జలమయము. ఆమహోర్ణవమందు మత్స్యావతారుడైన శ్రీమహా విష్ణువు నావనులాగుచు కడుచిత్రవిచిత్రముగ సంచరించెను. అపుడు సత్యవ్రతునకు శ్రీహరి ఒకసంహితను బోధించెను. అదియే మత్స్యపురాణము. అది సాంఖ్య యోగ క్రియాన్వితమైన పురాణము. ఆ ప్రళయాంతమున శ్రీహరి హయగ్రీవుడను రాక్షసుని సంహరించి, ఆతడపహరించిన వేదములను గొనివచ్చి బ్రహ్మకొసగెను.

ఆ సత్యవ్రతుడు పదవమన్వంతరకాలములో వివస్వంతునకు శ్రాద్ధదేవుడను నామమున పుత్రుడై జన్మించి, శ్రీమన్నారాయణుని ఆదేశానుసారము వైవస్వత మనువుగ ప్రసిద్ధుడాయెను.

## 35. మార్కండేయుడు

భృగుమహర్షి కుమారుడు విధాత. ఆతని పుత్రుడు మృకండుడు. మృకండుని భార్య తనూజ. ఆ పుణ్య దంపతులకు సంతానము లేదు. పుత్రసంతతి కొరకు మృకండుడు హరిహరులను గూర్చి తపము చేయగా, ఒకపుత్రుడు కలిగెను. ఆతనికి మార్కండేయుడని పేరుపెట్టెను.

మృకండుడు మార్కండేయునకు ఉపనయన సంస్కారముచేసి, గాయత్రీ మంత్రము నుపదేశించెను. మార్కండేయుడు వేదవేదాంగములు అభ్యసించి గొప్ప ప్రావీణ్యము సంపాదించెను. తపస్సు నాచరించుటలో పరిపూర్ణుడయ్యెను. ఎల్లపుడు చేతిలో జపమాల ధరించి, భిక్షను తెచ్చుకొనును. ముందుగ గురువునకు భిక్షనొసగి, మిగిలిన దానిని తాను భుజించువాడు. భిక్ష లభించని దినమున పస్తులుండెడివాడు.

భగవంతునియెడ గాఢభక్తిగలిగి పూజించువాడు. మహాయోగులకు సైతము సాధ్యము గాని అతని ప్రవర్తనము అందరిని ఆశ్చర్యపరచినది. బ్రహ్మాదిదేవతలకు కూడా మార్కండేయుని భక్తితత్పరత ఒక అద్భుతముగా తోచెను. ఆగాధభక్తియే మార్కండేయుని మృత్యుంజయునిగా యొనర్చెను.

మార్కండేయుని మనస్సు ఎల్లపుడు యెట్టి అల్లకల్లోలములు లేక, అతి ప్రశాంతమైన సరస్సువలె నుండెడిది. శ్రీమన్నారాయణుని గురించిన ఆలోచనలే అతని మనస్సునందు నిండియుండెడివి. అట్టి పరమభక్తుని సుస్థిరతపశ్శక్తిపై ఇంద్రునకు సందేహము కలిగెను. సందేహముతో బాటుగ ఈర్ష్య అంకురించెను. మార్కండేయుని నిశ్చలతపశ్శక్తిని భంగము చేయబూనెను. అప్సరసలను, మన్మథుని ఉసిగొలిపి పంపెను. వారును మార్కండేయుని దరిచేరి పలువిధముల వారిశక్తి యుక్తులు ప్రదర్శించి రెచ్చగొట్టిరి. కాని మార్కండేయుని తీవ్రతపశ్శక్తిముందు అవి యన్నియు నిష్ప్రయోజనములయ్యెను. అగ్ని జొచ్చిన శలభములపగిది మన్మథ బాణములన్నియు దగ్ధమయ్యెను. అది తెలిసిన ఇంద్రుడు నిరాశచెందెను. అంత జరిగినను మార్కండేయుడు శాంతచిత్తుడై వారిని క్షమించెను.

అంత శ్రీమన్నారాయణుడు నరనారాయణుల రూపముతో మార్కండేయునకు దర్శనమిచ్చెను. మార్కండేయుడు వారలనుగాంచి అత్యంత ఉత్సాహముతో నిలు చుండెను. వారిపాదములపైబడి మ్రొక్కెను. అతని నేత్రములు ఆనందాశ్రువులతో నిండెను. స్వాగతము పలికి, అర్ఘ్యపాద్యముల నిచ్చి ఆశీనులను గావించెను. సుగంధభరిత పుష్పములతో పూజించి పలువిధముల ప్రార్థించెను.

"ప్రభూ ! నీదగు దివ్యరూపము దర్శించి ధన్యుడనైతిని. లోకకల్యాణము నిమిత్తము నీవు ద్వంద్వ రూపములు ధరించుచున్నావు. ఈ లోకమంతటను వ్యాపించి యున్నావు. నీవు బ్రహ్మవు, మహేశ్వరుడవు, నాలోని ఆత్మవునీవు. మనోవాక్కాయ కర్మలకు, ఇంద్రియములకు ప్రభుడవీవు. ఈచరాచరజగత్తు సర్వము నీఅధీనమున యున్నది. సృష్టి, స్థితి, లయలకు కారణభూతుడవీవు. అట్టి నీపాదములచెంత ఆశ్రయము నిమ్ము. నీపాదస్పర్శకు మించిన సంపద వేరొక్కటిలేదు. ఓ అదిపురుషా! నీకు నమస్కారము. దేవాదిదేవా ! నమోవాకములు గొనుము. నన్ను అనుగ్రహించుము.

నరనారాయణులు మార్కండేయుని పూజలను, ప్రార్థనమును చిరునవ్వుతో స్వీకరించిరి. "భక్తా! నీ నిశ్చలభక్తి నిన్ను సిద్ధ పురుషుని గావించెను. మాకు మిక్కిలి

సంతోషముకలిగినది. నీవుకోరువరమును ప్రసాదించగలము. కోరుకొనుము" అని పలికిరి. అంత మార్కండేయుడు, "మిమ్ము దర్శించిన పిమ్మట నాకు వేరు విషయములపై ఆశలేదు. కాన మానవుని మనస్సులో చోటు చేసికొన్న అజ్ఞానమునకు మూలమైన మాయను గురించి తెలియజేయగోరుచున్నాను. దయచేసి దానిని తెలుపుడు." అని కోరెను. "అట్లే యగుగాక, త్వరలోనే భగవంతునిమాయ నీకు తెలియును." అని పలికి నరనారాయణులు బదరికాశ్రమమునకు చనిరి.

మార్కండేయుడు పుష్పభద్రానదీతీరమున ఆశ్రమమందు వసించుచుండెను. అనవరతము శ్రీమన్నారాయణుని దివ్యనామస్మరణమున కాలము గడుపుచుండెను. ఒక నాడు పెద్దగాలివానవచ్చెను. వర్షధారలచే భూమియంతయు నిండిపోయి మహా సాగరమువలె కనుపట్టెను. తిమింగలములు, పెద్దపెద్ద జలచరములు, మొసళ్ళు మాత్రముతప్ప, యితరములేమియు కానరాకుండెను. సముద్రపుహోరు తీవ్రముగ నుండెను. అంతలోనే విచిత్రముగ భూమి అదృశ్యమయ్యెను. గుట్టలు, కొండలు, పర్వతములు నీటమునిగి పోయెను. లోకములు, దేవతలు, నక్షత్రములు, గ్రహరాసులు నీట కలిసిపోవుచుండెను. భయంకరమైన గాఢాంధకారము ఆవరించెను. ఆవిచిత్ర పరిణామముగాంచి మార్కండేయుడు భయవిహ్వాలుడాయెను. కాని తాను మృత్యుంజయుడనన్న విషయము తెలిసియు, తాను కూడా మరణించనున్నానని తలచి భీతిచెందెను.

మార్కండేయుడు మృత్యువును జయించిన విధమొక విచిత్రగాథ, మార్కండేయుడు హరిహరుల వరప్రసాదమున జన్మించెను. కాని అతని ఆయుర్దాయము పదహారు సంవత్సరములుమాత్రమే. అయుఃపరిమితిమీరగనే యమధర్మరాజు వచ్చెను. మార్కండేయుని ఉసురులు గైకొనుటకు పాశమును అతనిపై వైచెను. అపుడు మార్కండేయుడు పరమేశ్వరుని ఆశ్రయించగ, పరమశివుడు యముని నిగ్రహించి బాలుని మరణమునుండి రక్షించెను. అంతేగాక చిరంజీవిగమ్ము" అని ఆశీర్వదించి అనుగ్రహించెను. అందుచేత మార్కండేయుడు చిరంజీవి. మరణభీతిలేదు.

అంతలో ఆ మహనీయుడు అల్లంత దూరములో అశ్వత్థవృక్ష మొకదానిని చూచెను. దాని ఆకుపై ఒకశిశువు పండుకొని నిద్రించుచున్నట్లుండెను. బాలునిచుట్టు వలయాకారముగ కాంతిచక్రము ఆవరించియుండెను. ఆ కాంతి చీకట్లను పారద్రోలు చుండెను. బాలుని వదనము అతిసుందరముగ నుండెను. అతని పెదవులపై

చిరునవ్వులు చిందుచుండెను. బాలుడు తనపాదము బొటనవ్రేలును పెదవులతో చప్పరించుచున్నట్లుండెను. ఆ దృశ్యము గాంచిన మార్కండేయుడు తన్మయత్వ మొందెను. అతడు శిశువు దగ్గరకు చేరెను. అశిశువు శ్వాసను లోనికి లాగుచున్నట్లు దోచెను. అంతలో శిశువు ఉచ్ఛ్వాసముతో మార్కండేయుడు లోనికి ప్రవేశించెను.

శిశువు గర్భములో మార్కండేయుడు చిత్రవిచిత్రములైన దృశ్యములను గాంచెను. పదునాలుగు భువనభాండములను, సూర్యచంద్రులను, నక్షత్రములను, దేవతలను, చరాచరసర్వజగత్తును గాంచెను. చిత్రగిరిపై తన ఆశ్రమమును గాంచెను. అంతలో శిశువు నిశ్వాసముతో మార్కండేయుడు బయటకువచ్చెను. సముద్ర జలములపై తేలియాడుచుండెను. శిశువుకూడ తేలియాడుచుండెను. బాలునిదరిచేరి ఆలింగనముచేయ ప్రయత్నించెను. కాని బాలుడు అంతలోనే అదృశ్యుడాయెను. అశ్వత్థవృక్షము, సముద్రము, జలము, అలలు, హోరుధ్వనులు అన్నియు అదృశ్య మయ్యెను. మార్కండేయుడు తన ఆశ్రమమందే యుండెను. ఈ విచిత్ర సంఘటన లన్నియు మనమున తలచుచు సమాధినిష్ఠలోనికి చేరుకొనెను.

అపుడు పార్వతీపరమేశ్వరులు ఆకసమున సంచరించుచుండిరి. పార్వతీదేవి మార్కండేయుని జూచి, పతితో, "మార్కండేయుని అనుగ్రహించి ఆశీర్వదించుమని గోరెను. దేవికోరిక మన్నించి పరమేశ్వరుడు పార్వతీసహితుడై మార్కండేయుని ముంగిట ప్రత్యక్షమయ్యెను. మార్కండేయుడు ఆదిదంపతులను గాంచి పరమానంద భరితుడై ప్రణమిల్లి ప్రార్థించెను. పరమేశ్వరుడు, "ఓయీ ! నీవు శ్రీమన్నారాయణుని అనుగ్రహముచే విష్ణుమాయను గ్రహించినావు. నీవు చిరంజీవివై వర్ధిల్లగలవు. నీచే భగవత్కథలను విని ప్రజలెల్లలు తరింతురు." అని మార్కండేయుని ఆశీర్వదించి అదృశ్యులైరి.

హరిహరులచే ఆశీస్సులందిన నాటి మార్కండేయుని పరమ ఋషిశ్రేష్ఠుడైన మార్కండేయుని స్మరించినంత మాత్రమున, సర్వపాపములు హరించుటయేగాక, మోక్షప్రాప్తియు సిద్ధించుననుటలో సందియములేదు.

## 36. సూర్య - చంద్రవంశములు

వైవస్వతమనువు వంశమున జన్మించిన పుణ్యచరితుల మూలముననే సూర్య వంశపురాజులు, చంద్రవంశపురాజులు వృద్ధిచెందిరి. వీరు అనేక ఘనకార్యములు చేసి లోకప్రసిద్ధులైరి. కల్పాంతకాలమున శ్రీమన్నారాయణుడు విశ్వమంతయు

వ్యాపించియుండెను. ఆ సమయమున ఆ భగవానుని నాభినుండి స్వర్ణకమలమొకటి ఉద్భవించెను. అందుండి చతుర్ముఖబ్రహ్మ జన్మించెను.

బ్రహ్మమానసపుత్రుడైన మరీచికి కశ్యపుడు జన్మించెను. దక్షప్రజాపతి పుత్రికయగు అదితిని కశ్యపుడు పెండ్లాడగ, ఆమె యందు వివస్వంతుడు గలిగెను. వివస్వంతునకు అతనిభార్య సంజ్ఞకు శ్రాద్ధదేవుడు జన్మించెను. ఆశ్రాద్ధదేవుడే వైవస్వతుడను నామమున ప్రస్తుతము మనువుగా కీర్తిగాంచెను.

వైవస్వతునిభార్య శ్రద్ధ. వారికి ఎంతకాలమునకు సంతతి కలుగలేదు. వైవస్వతునిచేత, కులగురువైన వసిష్ఠుడు మైత్రావరుణీష్టి అనుయాగము చేయించెను. వైవస్వతుడు పుత్రసంతానమును అభిలషించగ, భార్యశ్రద్ధ పుత్రికను కోరుకొనెను. ఆకారణముచేత శ్రద్ధయందు అందాలరాశి, కుందనపు బొమ్మవంటి పుత్రిక జన్మించెను. ఆమె పేరు ఇళ. అందుకు వివస్వతుడు విచారించెను. అందుకు కారణమును వసిష్ఠుని ప్రశ్నించెను. వసిష్ఠుడు దివ్యజ్ఞానముతో జరిగిన విషయమును తెలిసికొనెను. యజ్ఞసమయమున హోతచేసిన కృత్యమువలన యిట్లు జరిగినదని వివరించెను. అంత వసిష్ఠుడు తన తపోప్రభావముచే ఇళను పురుషునిగ మార్పు చేసెను. ఇళ పురుషుడయ్యెను. అపుడాతడు సుద్యుమ్నుడను పేరుతో ప్రసిద్ధుడాయెను. వసిష్ఠుడొనర్చిన ఈకార్యమునకు వివస్వతుడు మిగులానందించెను.

ఒక దినమున సుద్యుమ్నుడు పరివారముతోగూడి వేటనిమిత్తము ఉత్తరదిశ కేగెను. అచ్చట మేరుపర్వతమునకు దిగువ బాగమున "కుమారవన' మను వనము గలదు, ఆవనమును సుద్యుమ్నుడు తనవారితో ప్రవేశించెను. వెంటనే వారందరు స్త్రీలుగ మార్పుచెందిరి. వారి అశ్వములుగూడ ఆడగుర్రములయ్యెను. ఈ విచిత్ర పరిణామమునకు అందరు ఆశ్చర్యమందిరి. ఒకరినొకరు చూచుకొని దిక్కుతోచని వారైరి.

అట్లు జరుగుటకు కారణము లేకపోలేదు. ఒక సమయమున పార్వతీ పరమేశ్వరులు ఆ వనమున శృంగారక్రీడల ఆనందించుచుండిరి. అదే సమయమున మహర్షులు మహేశ్వరుని సందర్శనార్థమై అరుదెంచిరి. వారి రాకను గమనించి ఉమాదేవి లజ్జచే వస్త్రములు ధరించెను. పరమేశ్వరుడు భవానితో రతికేళి యందున్నాడని గ్రహించి ఋషులు వెనుదిరిగి వెళ్ళిరి. కాని పార్వతీదేవి మనస్సు కలతలచెంగినట్లు శంకరుడు గ్రహించెను. అంత శంకరుడు." ఇకమీదట

కుమారవనములో అడుగిడిన పురుషుడెవ్వరైనను స్త్రీలుగ మారుదురుగాక" అని శపించెను. అదిమొదలు పురుషులెవ్వరు వనమును ప్రవేశించరు. అది తెలియక వచ్చినందులకు సుద్యుమ్నునకు ఈ పరిణామము జరిగెను. అటుల స్త్రీరూపము పొందిన సుద్యుమ్నుడు. "సుద్యుమ్న" అనుపేరున వనమందు సంచరించుచుండెను.

సుద్యుమ్న ఒకనాడు చంద్రుని కుమారుడైన బుధుని ఆశ్రమమును చేరెను. బుధుడు మిగుల సౌందర్యవంతుడు. అతని సౌందర్యమునకు సుద్యుమ్న మోహమున జిక్కెను. బుధుడును ఆమె సౌందర్యాది లక్షణములకు ముగ్ధుడై ఆమెను వరించెను. వారిద్దరు రతిక్రీడల ఆనందించిన కారణమున వారికి పుత్రుడు కలిగెను. ఆతనిని పురూరవుడనిరి. పురూరవుడు చంద్రవంశమువాడు.

సుద్యుమ్నుడు తనకు స్త్రీత్వం ప్రాప్తించినందులకు విచారించుచు, తన గురువైన వసిష్ఠుని ప్రార్థించెను. వసిష్ఠుడును వెంటనే పరమేశ్వరుని దర్శించి, సుద్యుమ్నుని అనుగ్రహించమని వేడుకొనెను. శివుడంత, తనశాపం వ్యర్థము కారాదని తెలిపెను. అయితే సుద్యుమ్నుడు ఒకమాసము పురుషునిగను, రెండవమాసము స్త్రీగ నుండునట్లు వరమునిచ్చెను. అటుల కాలము గడచుచుండ, అతనికి ఉత్కలుడు, గయుడు, విమలుడు అను పుత్రులు ముచ్చురు గలిగిరి. వారు ఉత్తరభారతమును పాలించిరి. కాలగమనమున సుద్యుమ్నుడు వృద్ధుడయ్యెను. తనరాజ్యభారమును పురూరవునకు అప్పగించి తపోభూములకు చనెను. వైవస్వతుడు తనపుత్రుని దుస్థితికి మిగుల వ్యథచెందెను. మరల పుత్రప్రాప్తికై యమునా నదీతీరమున నూరుసంవత్సరములు శ్రీహరినిగూర్చి తపమాచరించెను. తపఃఫలితముగ భగవంతుని అనుగ్రహము గలిగెను. అతనిభార్య శ్రద్ధయందు ఇక్ష్వాకుడు, నృగుడు, శర్యాతి, దిష్టుడు, కరూశకుడు, అరిష్యంతుడు, వృషధ్రుడు, నభగుడు, కవి అనుకుమారులు జన్మించిరి.

ఇక్ష్వాకుడు సూర్యవంశమునకు మూలపురుషుడు. సత్యవ్రతుడైన హరిశ్చంద్రుడు, రఘువు, అజుడు, దశరథుడు, శ్రీరాముడు మున్నగు వారందరు ఇక్ష్వాకువంశజులే. పురూరవుని వలన చంద్రవంశము వృద్ధి చెందెను. ఈ విధముగ సూర్యచంద్ర వంశములు అభివృద్ధి చెందినవి.

## 37. సుకన్య

శర్యాతియనువాడు వైవస్వంత మనువుపుత్రులందు ఒకడు. అతడు వేదవేదాంగ పారంగతుడు. శర్యాతికి సుకన్య అను పుత్రిక జన్మించెను. ఆమె మిగుల సౌందర్యవతి.

ఒక దినమున శర్యాతి తనకుమార్తెను వెంటనిడుకొని వనమునకేగెను. అచ్చట చ్యవన మహాముని ఆశ్రమమునుగాంచెను. సుకన్య వనమునగల పుష్పఫల వృక్షములు, పొదరిండ్లు వినోదముగ గాంచుచు సంచరించుచుండెను. అందొక ప్రదేశమున పెద్దపుట్టనుచూచెను. పుట్టనుండి మిణుగురుపురుగులవలె ప్రకాశించు రెండు జ్యోతులను గాంచెను. బాల్యచాపల్యముచే సుకన్య ఒకపుల్లతో వానినిపొడిచెను. వెంటనే వానినుండి రక్తముగారెను. రక్తము చూచినంతనే ఆమెకు భయము, ఆశ్చర్యము గలిగెను. అదేసమయమున శర్యాతి పరివారజనులకు మలమూత్రములు బంధించెను. వచ్చినఆపదకు కారణము తెలియక శర్యాతియు కలవరపడెను. అంతట భయమున సుకన్య తానొనరించిన అవివేకపు చర్యను తండ్రికి తెలిపెను. తండ్రియు మిగుల చింతించెను.

చ్యవనుడను మునీంద్రుడు అచట తపము చేసికొనుచుండెను. కొంత కాలమునకు ఆతనిచుట్టు పుట్టపెరిగెను. అపుడా పుట్టనుండి మునికన్నులు మాత్రము మిలమిల మెరయుచు కనిపించెను. అవి నేత్రములని తెలియక అమాయకత్వమున సుకన్య ముల్లుచే వానిని పొడిచెను. బాలిక మునిపట్లచేసిన అపచారకారణముగ, రాజు పరివారజనులకు అట్టి ఆపదముంచుకొచ్చెను.

విషయము తెలిసిన మహారాజు, జరిగిన అపరాధమునకు చాల భయాందోళనములు పొందెను. తన కుమార్తె తెలియక చేసిన అపచారమును మన్నించి రక్షించుమని మునిని ప్రార్థించెను. అపచారమునకు ప్రాయశ్చిత్తముగ తన గారాలపట్టి సుకన్యను మునిసేవలకు సమర్పించుకొని, శర్యాతి తన నగరమునకు వెళ్లెను. మునియు రాజును అనుగ్రహించి మన్నించెను.

ఒక దినమున అశ్వనీదేవతలు చ్యవనముని ఆశ్రమమునకు విచ్చేసిరి. మునివారలను మిగులభక్తితో పూజించెను. తన దీనదశను వారలకు వివరించెను. తనకు యౌవనమును, ఆరోగ్యమును, సౌందర్యమును ప్రసాదింపుడని వేడుకొనెను. వారును అందులకంగీకరించి, తమకు సోమపానములో భాగము కల్పించుడని కోరిరి. అట్టి అవకాశము కలిగింతునని చ్యవనుడు వారిని సమ్మతింప చేసెను.

సమీపమున ఒకసరస్సును కల్పించిరి. దానికి సిద్ధసరస్సని పేరిడిరి. అశ్వనీ దేవతలు తమతోపాటుగ చ్యవనమునిని అందు ముంచి తేల్చిరి. ఆశ్చర్యముగ మునికి యౌవనసౌందర్యములు, తేజస్సు లభించెను. అశ్వని దేవతలు, చవ్యనుడు ముగ్గురు రూపసౌందర్యాది గుణములందు ఒకే రూపునయుండిరి. సుకన్య వారిలో తనభర్తను

గుర్తించజాలక కలవరమందెను. తన పతిదేవుని అనుగ్రహించి దయచూపుడని అశ్వనీ దేవతలను ప్రార్థించెను. దేవవైద్యులు సుకన్య పతివ్రతా ధర్మమునకు మిగుల సంతసించి చ్యవనున కామె కొసంగిరి. చ్యవనమహాముని అదిమొదలు నవమోహనాకారుడై సుకన్యతో సురలోక భోగములనుభవించుచుండెను.

శర్యాతి ఒక యాగముచేయ సంకల్పించి తన కుమార్తెను, అల్లుని ఆహ్వానించుటకు ఆశ్రమమున కరుదెంచెను. అపుడు తన అల్లుని గుర్తించజాలక పరపురుషునిగ తలచెను. కుమార్తెను అనుమానించి వ్యథచెందెను. తండ్రి భావము గ్రహించిన సుకన్య పూర్వచరిత్రను వివరించగ, శర్యాతి మిగుల సంతసించెను. చ్యవనుడు అల్లునిచేత బృహత్తర యాగమును నిరాటంకముగ నిర్వహింపచేసెను. అశ్వనీదేవతలకు సోమపానములో భాగముకల్పించి తన వాగ్దానమును నిలుపు కొనెను. వారికి భాగము కల్పించినందులకు ఇంద్రుడాగ్రహించి వజ్రాయుధముచే చ్యవనుని చంపబూనెను. చ్యవనుడు తన తపఃప్రభావముచేత ఇంద్రుని చేతిని స్తంభింపచేసెను. అటు మీదట చ్యవనుని మహిమనుగుర్తించిన ఇంద్రుడు పశ్చాత్తాప మంది అశ్వనీదేవతలకు సోమపానములో భాగముకల్పించుటకు అంగీకరించెను.

శర్యాతికి ఆనర్తుడను పుత్రుడు గలడు. ఆనర్తుని కుమారుడు రైవతుడు. ఆతడు సాగరమధ్యమున కుశస్థలి అనునగరము నిర్మించుకొనెను. రైవతునకు నూర్గురు కుమారులు, ఒక కుమార్తె గలిగెను. ఆమె పేరు రేవతి. రైవతడు తనకన్యకు తగిన వరుని అన్వేషించుచు, పుత్రికను వెంటనిడుకొని బ్రహ్మచెంత కేగి తన కోరికను విన్నవించెను. అంత బ్రహ్మ,"ఓయీ! రాజా! నీవు భూలోకమునుండి నావద్దకు చేరుసరికి ఇరువదియేడు చాతుర్యుగములు గడచినవి. నీవారందరు గతించినారు. నీవారెవ్వరు భూలోకమునలేరు. ఆదిశేషుని అంశతో భువిపై బలరాముడు అవతరించినాడు. ఆతడు నీపుత్రికకు తగినవరుడు. కుమార్తెను బలరామునకిచ్చి పరిణయముచేయుము." అని ఆనతీయ రైవతుడు తనపుత్రికను బలరామున కొసంగి అతి వైభవముగ పెండ్లి జరిపెను. అనంతరము సర్వముత్యజించి రైవతుడు తపోభూములకేగెను.

## 38. అంబరీషుడు

వైవస్వతమనువు కుమారులలో నభగుడొకడు. అతనికుమారుడు నాభాగుడు. నాభాగుడు బ్రహ్మజ్ఞాని. నైష్ఠికుడు. గొప్పవిద్వాంసుడు. నాభాగునిపుత్రుడే అంబరీషుడు. అంబరీషుడు భక్తాగ్రేసరులలోనొకడు. ఆతనిచరిత్రము జగత్ప్రసిద్ధమైనది.

భూమండలమంతటికి అంబరీషుడు ప్రభువు. అయినను తుచ్ఛము, అనిత్యము లగు రాజ్యభోగాలను ఆశించలేదు. ఐహిక లౌకిక భోగభాగ్యములను తృణప్రాయముగ నెంచి, నిరంతరం హరినామస్మరణము చేయుచుండువాడు. శ్రీహరినర్చించుట, హరికథలు వినుట, హరిభక్తులను సేవించుట అంబరీషుని వ్రతచర్య. విష్ణు ప్రీతికరమైన వ్రతములు, దానధర్మములు లెక్కకుమించి యొనర్చెను. ప్రతికార్యము స్వార్థములేక భగవదర్పణముగా చేసెడివాడు.

అంబరీషునకు ఏకాదశవ్రతము అత్యంత ప్రీతికరమైనది. ఏకాదశినాడు ఉపవశించి, హరిని భక్తిప్రపత్తుల పూజించడము, ద్వాదశినాడు విష్ణుప్రీతిగ పారణచేసి, హరిభక్తులకు, బ్రాహ్మణోత్తములకు అన్నదానము ఘనముగ చేయడము అంబరీషునకు వ్రతచర్య. అంబరీషునిభార్య మహాపతివ్రత. హరిభక్తులను భర్తవలెనే భక్తిశ్రద్ధలతో అరాధించెడిది. విష్ణుదేవుని అర్చించెడిది.

అంబరీషునిభక్తికి శ్రీమహావిష్ణువు మెచ్చెను. ఆత్మరక్షణార్థము, శత్రుశిక్షణ నిమిత్తము శ్రీమహావిష్ణువు తన సుదర్శనచక్రమును అంబరీషున కొసగెను. విష్ణువు నుండి సుదర్శన చక్రమును పొందినభక్తుడు వేరొక్కడులేడు. అటులే అంతటి అఖండ రాజ్యసంపదను గలిగిన చక్రవర్తియునులేడు.

ఒకానొక సమయమున అంబరీషుడు పత్నీసమేతుడై ఏకాదశీవ్రతము చేయబూనెను. ఒక సంవత్సరకాలము మహానిష్ఠతో వ్రతమును ఆచరించెను. వ్రతము ముగియుకాలమున, కార్తీకమాసమునందు త్రిరాత్రోపవాసము చేసెను. మరునాడు ద్వాదశి తెల్లవారకముందుగనే కాళిందీనదిలో స్నానముచేసి, నిత్యకర్మానుష్ఠానములు ముగించెను. అటుపిమ్మట మధువనమునకువెళ్లి విష్ణుదేవుని భక్తితో పూజించెను. బ్రాహ్మణశ్రేష్ఠులకు గోదాన, భూదాన, హిరణ్య, వస్త్రదానములు, భూరిదక్షిణలతో నొసగి సంతుష్టిపరచెను. మహావైభవముగా అన్నసంతర్పణముచేసి, పారణకు పూనుకొనెను.

అపుడాసమయమున దుర్వాసమహర్షి అతిధిగ అంబరీషునివద్దకేతెంచెను. దుర్వాసుడు మహాకోపిష్టి. ఎంతటిచిన్న లోపముగాని, పొరపాటుగాని సహించడు. కఠోరముగ శపించును. అంబరీషుడు మునిని సముచితరీతిని పూజించి, ఆతిథ్యము స్వీకరించుమని వేడుకొనెను. మునియు అంగీకరించెను. స్నానాది నిత్యకృత్యములు ముగించుకొను నిమిత్తము యమునానది కేగెను. స్నానమాడి మాధ్యాహ్నికములు

ముగించుకొని, ధ్యాననిష్ఠలో నిమగ్నుడయ్యెను. ఎంతకు మునిరాడయ్యెను, అకాల మగుచుండెను.

మునిరాకకు జాగగుచుండెను. అంబరీషునకు ఆందోళనమధికమయ్యెను. పెద్ద సంకటస్థితిలో చిక్కినాడు. మునిరాకపోవుట, ద్వాదశిఘడియలు మించనుండుట అంబరీషునకు ఏమిచేయుటకు తోచినదికాదు. ద్వాదశిఘడియలు దాటుటకు పూర్వము పారణము చేయకున్నచో వ్రతఫలముదక్కదు. చేసిన క్రతువంతయు వ్యర్థమగును. పోనీపారణము చేయుదమన్న అతిథినివదలి పారణము చేయరాదు. పరమభక్తుడగు అంబరీషునకు ధర్మసంకటము ప్రాప్తించినది. పెద్దఅగ్నిపరీక్ష అయినది. అటుల దీర్ఘకాలముయోచించి తుదకు జలపారణము మాత్రముచేసి, మునిరాకకు నిరీక్షించసాగెను.

తరువాత దుర్వాస ముని వచ్చి తానురాకుండగనే అంబరీషుడు జలప్రాసనము చేసినట్లు దివ్యదృష్టివలన తెలిసికొనెను. తనను అవమానపరచెనని కోపమున మండిపడెను. అందుకు "తగిన ఫలితమనుభవింతువుగాక" అని పలుకుచు ఆగ్రహమున తలనుండి జడనొకదానిన నూడపెరికి అంబరీషునిపై ప్రయోగించెను. అదియు కాలాగ్నిజ్వాలలతో మండుచు మహావేగమున అంబరీషునిమీదకు దూసుకొనివచ్చెను. అపుడాసమయమున అంబరీషుడు అన్యచింతన లేమియు లేనివాడై శ్రీహరిని ధ్యానించుచుండెను. భక్తుని రక్షణార్థము విష్ణువు అనుగ్రహించిన చక్రాయుధము వెనువెంటనే బయలుదేరి, దుర్వాసుడు ప్రయోగించిన మహాగ్ని జ్వాలలను నిర్మూలించెను. అంతటితోనాగక చక్రాయుధము, మునిని బరిమార్చుటకు అతనివెంటబడెను. దుర్వాసునకు అపుడేమిచేయవలెనో తోచక, ప్రాణములు కాపాడుకొనుటకు దిక్కులవెంటబడి పరుగులుతీసెను. ముల్లోకములు చుట్టివచ్చెను. దిక్పాలురను వేడుకొనెను. వారు దానిని నివారింప శక్తిలేదని పలికిరి. బ్రహ్మ, మహేశ్వరులను దర్శించెను. విష్ణుతేజము నెదుర్కొన తమవల్లకాదని పలికిరి. తుదకు వైకుంఠమునకేగి శ్రీమహావిష్ణువును శరణుజొచ్చెను.

అంతట శ్రీహరి, "ఓ మహర్షీ ! నేను భక్తపరాధీనుడను. నాకంటే నాభక్తులు అధికశక్తి సంపన్నులు. అయినను బుద్ధిపూర్వకముగా నాభక్తునకు అపకారము కలుగజేసితివి. కావున నిన్ను కాపాడగలిగినవాడు నాభక్తుడేగాని, నేనుగాదు. వెంటనే అంబరీషుని చెంతకేగి, ఆ భక్తుని శరణువేడుకొనుము. ఆ భాగవతోత్తముడే నిన్ను

రక్షించగలడు" అని మునికి హితవు బలికెను. అపుడు వేగమె దుర్వాసుడు అంబరీషుని కడకేతెంచి తనను రక్షింపుమని వేడుకొనెను. అపరాధమును మన్నించుమని ప్రార్థించెను. కరుణాంతరంగుడు, శాంతచిత్తుడు, పరమభక్తుడు అయిన అంబరీషుడు దుర్వాసమహర్షిని రక్షింపవలసినదిగా సుదర్శనాయుధమును వేభంగుల స్తుతించెను. అపుడాశక్తి శాంతించి దుర్వాసుని విడిచివైచెను. అంతట దుర్వాసుడు మిగుల సంతసించెను. అంబరీషుని భక్తిశ్రద్ధలకు, మహిమకు ముని మిగులానందించి కీర్తించెను. అంబరీషుడెంతమాత్రము గర్వించలేదు. మహర్షిని గౌరవించి యథావిధిగ పూజించి, భోజనమిడి సంతృప్తుని గావించెను.

చక్రాయుధము దుర్వాసుని వెంబడించడము, ఆయుధము మునియు లోకములు సంచరించడము మున్నగుకృత్యములకు ఒక సంవత్సరకాలము పట్టెను. అంతకాలము అంబరీషుడు భుజించలేదు. కేవలము జలములు మాత్రము గ్రోలి వ్రతదీక్షను రక్షించెను. అటుతరువాత దుర్వాసమునీంద్రునకు భోజనమిడి, అనంతరము తాను భుజించెను.

అటుల పరమభక్తాగ్రేసరుడైన అంబరీషుడు శ్రీహరి పవిత్రపాదాబ్జంబులను అనవరతము సేవించుచు, ధర్మయుతముగ రాజ్యపాలనముగావించెను. తుదకు తన కుమారునకు రాజ్యభారము అప్పగించి తపమాచరించుటకు వనభూములకేగెను. విష్ణుభక్తిమహిమను వర్ణించెడి అంబరీషుని చరిత్రము చదివినను,వినినను శుభప్రదము, మోక్షదాయకము. అనంతరము అంబరీషుడు వైకుఠమును చేరెను. అంబరీషుని పుత్రుడు హరితుడు. ఆతని కుమారుడు యవనాశ్వుడు. యవనాశ్వుని సుతుడు ఆంగిరసుడు. వీరి విశేషాంశములు మరియొకచోట తెలుపబడెను.

## 39. మాంధాత

సూర్యవంశపు మహాపురుషులలో ఇక్ష్వాకుడు కడుప్రసిద్ధుడు. ఈతనికి నూర్గురు కుమారులు. వారు వివిధప్రాంతములు పాలించిరి. ఆ వంశమందే మాంధాత జన్మించెను. చక్రవర్తులతో అతడు గొప్పవాడు.

మాంధాత తండ్రి యవనాశ్వుడు. అతనికి నూర్వురు భార్యలున్నను ఎవరి యందును సంతతిలేదు. మహర్షులు మాంధాతచే పుత్రకామేష్టి చేయించెను. యజ్ఞము జరుగుచున్న సమయములో అతనికి దాహమయ్యెను. అది అర్ధరాత్రి సమయము.

అందరు నిద్రించుచున్న సమయమది. యజ్ఞకలశములోని నీటినిత్రాగి దాహము తీర్చుకొనెను. తెల్లవారెను. పాత్రలో నీరులేని కారణము తెలియక ఋషులు ఆందోళన పడిరి. వెంటనే దివ్యదృష్టివలన విషయము తెలిసుకొని మిన్నకుండిరి. దైవవిధిని తప్పింపనేరివశము?

మంత్రజలమును పానముచేసిన ఫలితముగ యవనాశ్వుని ఉదరము చీల్చుకొని బాలుడొకడు వెలువడెను. బాలుడు ఆకలిచే రోదించసాగెను. ఇంద్రుడపుడు తన వ్రేలును బాలుని నోటిలో నుంచగ, బాలుడు దానిని కుడిచెను. ఆ కారణముగ బాలుడు మహాబలవంతుడయ్యెను. బాలునకు మాంధాతయను పేరుగలిగెను. పొట్ట పగిలిన యవనాశ్వుని ఋషులు మరణించకుండగ రక్షించిరి.

మాంధాత శౌర్యసాహసములు గలవాడు. తన పన్నెండవ యేటనే రాజ్యమునకు వచ్చి సమస్త రాజ్యములను జయించెను. సప్తద్వీపావలయుత భూమండలమును ఏకఛత్రాధిపత్యముగ నేలిన విక్రమోపేతుడు. రావణాసురుని యుద్ధమున బంధించిన సాహసోపేతుడు.

మాంధాతభార్య బిందుమతి. ఆమె శశిబిందు పుత్రిక. ఈ దంపతులకు పురుకుత్సుడు, అంబరీషుడు, ముచికుందుడు అనుముగ్గురు పుత్రులుగలిగిరి. ఇందు ముచికుందుడు మహాయోగి. తపఃసంపన్నుడు. మాంధాతకు కలిగిన పుత్రికలు అయిదు వందల మందిని, 'సైబరి' అను ముని పెండ్లాడెను. మాంధాత యజ్ఞముల నెన్నింటినో నిర్వర్తించి, అంత్యమున శ్రీమన్నారాయణుని యనుగ్రహమును పొందెను.

## 40. త్రిశంకుడు

మాంధాతకుమారుడు పురుకుత్సుడు. పురుకుత్సుని ఏడవతరమువాడు సత్యవ్రతుడు. ఒక దినమున సత్యవ్రతుడు ఒక వివాహితస్త్రీని బలాత్కరించి గొని వచ్చెను. తండ్రి త్రిధన్వుడు, తనయుడొనర్చిన అనుచితకార్యమునకు మండిపడెను. కుమారుని పట్టణమునుండి బహిష్కరించెను. సత్యవ్రతుడంత తండ్రిని, "ఎందుపోదును? ఎట్లు బ్రతుకుదును?" అని ప్రశ్నింప, "శునకమాంసముతిని ఛండాలునితో కలసిపొమ్ము" అని కోపమున బలికెను. అంత సత్యవ్రతుడు రాజ్యము విడచి వెళ్ళెను.

తరువాత ఒకసమయమున, త్రిధన్వుని రాజ్యమున గొప్పకరవు సంభవించెను. భయంకరమైన క్షామము కారణముగ ప్రజలు తినుటకు తిండి, త్రాగుటకు నీరు

లభించక చాలకటకట బడిరి. ఆసమయమున విశ్వామిత్ర మహర్షియు ఆరాజ్యమందే యుండెను. మునియు, తనబిడ్డలు ఆకలిమంటకు అల్లాడిరి. ఆకలిబాధ భరింపజాలక తనకుమారునే, కంఠమునకు త్రాడు బంధించి, పురవీధులలో త్రిప్పుచూ, "అయ్యా! పుణ్యాత్ములు మమ్ము పోషించగలిగిన పోషించుడు. లేదామాకు నూరు గోవులనైన నిండు." అని బిగ్గరగ అరువసాగెను.

రాష్ట్రమున క్షామము సంభవించగ వసిష్ఠుడు రక్షిస్తూవచ్చెను. సత్యవ్రతునకు మాత్రము వసిష్ఠునిపై కోపము కలిగెను. రాష్ట్రమువదలి తండ్రి పొమ్మన్నసమయమున వసిష్ఠుడు ఒక్కమాటయు మాటాడక తండ్రిపక్షము వహించి మిన్నకుండుటయే వసిష్ఠునిపై కోపకారణము. అందువల్ల విశ్వామిత్రుని పక్షమునచేరి, వసిష్ఠుని గోవునుచంపి విశ్వామిత్రునకు ఆహారముగ నివ్వదలచెను. సత్యవ్రతుడు తానుతలచిన విధముగ గోవును చంపెను. కాని ఆ సమయమున తనకు ఆకలిబాధవేధించు చున్నందున, ఆగోమాంసమును తానేభక్షించెను. ఆవిషయము తెలిసిన వసిష్ఠునకు సత్యవ్రతునిపై కోపము ముంచుకొచ్చెను. అంతనాముని, "ఓరీ భ్రష్టుడా! ముందుగ నీతండ్రికి కష్టముకలిగించు పనిచేసి వాని ఆగ్రహమునకు గురైతివి. గురువు గోవును వధించి ఘోరపాపానికి పాలుపడితివి. చివరగా గోమాంసముభక్షించి పతితుడవైతివి. అటుల నీవు మూడు పాపములొనర్చి మూడు విధములైన హృదయ శంకువులు ఆపాదించుకొంటివి. కావున నీవు త్రిశంకుడవైతివి." అని శపించెను. అందువలన నాటి నుండి సత్యవ్రతుడు త్రిశంకుడనుపేరు పొందుటయేగాక చండాలత్వమునుగూడ పొందెను.

అంత త్రిశంకుడు, తన చండాలత్వమును తొలగించి బొందితో స్వర్గము కల్పించుమని వసిష్ఠునకు బద్ధవిరోధియైన విశ్వామిత్రుని ప్రార్థించెను. విశ్వామిత్రుడు అందులకంగీకరించి త్రిశంకునిచే ఒక మహాయాగమునుచేయించెను. యాగమునకు వసిష్ఠాది మహర్షులు రాకుండిరి. అయినను పట్టుదల వహించి విశ్వామిత్రుడు యాగము పరిసమాప్తమొనర్చెను. తపోమహిమను ధారపోసి త్రిశంకుని స్వర్గమునకు పంపెను. త్రిశంకుడు మహాపాపాత్ముడు. స్వర్గమునయుండ యనర్హుడని ఇంద్రుడు స్వర్గము నుండి క్రిందకు త్రోసెను. త్రిశంకుడు స్వర్గమునుండి తలక్రిందులుగా పడుచుపెద్దగ కేకలిడుచు, రక్షించుమని విశ్వామిత్రుని ప్రార్థించెను. అంత విశ్వామిత్రుడు, భూమ్యాకాశములమధ్య గగనమున నిలిపెను. అంతరిక్షములో నొక ప్రదేశమున ఆగెను. ఆ స్థానమును "త్రిశంకుస్వర్గము" అనిరి.

త్రిశంకుని పుత్రుడు హరిశ్చంద్రుడు నిత్య సత్యవ్రతుడగుటచే అతడు సత్యహరిశ్చంద్రుడని ప్రసిద్ధుడాయ్యెను.

## 41. హరిశ్చంద్రుడు

హరిశ్చంద్రుడు సూర్యవంశపురాజు. త్రిశంకుని కుమారుడు. అయోధ్యా నగరమునకు ప్రభువు. హరిశ్చంద్రుని భార్య చంద్రమతి. ఉత్తమ సాధ్వి. వీరి తనయుడు లోహితాశ్వుడు. హరిశ్చంద్రుడు నిత్యసత్యవ్రతుడు. సత్యవ్రతులలో హరిశ్చంద్రుడు అగ్రతాంబూలము నందుకొన్న శ్రేష్ఠుడు.

ఒక సమయమున ఇంద్రునిసభలో, భూలోకమున 'సత్యసంధుడు' ఎవరను ప్రశ్నవచ్చెను. వసిష్ఠుడంత, "హరిశ్చంద్రుడని" సమాధానమిచ్చెను. విశ్వామిత్ర వసిష్ఠులకు బద్ధవైరమున్న కారణముగ, వారిద్దరకు గొప్ప వాదులాట జరిగెను. ఆడినమాట తప్పడని వసిష్ఠుడు పలికెను. ఎటులైనను హరిశ్చంద్రునిచే అబద్ధ మాడింతునని విశ్వామిత్రుడు ప్రతినబూనెను. అంతటితో నాటి సభముగిసెను.

తరువాత ఒకదినమున విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని దర్శించవచ్చెను. వచ్చినమునిని అర్ఘ్యపాద్యాదులతో పూజించి కుశల ప్రశ్నలతో తృప్తునిగావించెను. అటుపై తమరు వచ్చిన కార్యము తెలుపుమని కోరెను. విశ్వామిత్ర మహర్షి, " ఓరాజా! నేనొక యాగముచేయతలచితిని. అందులకు ధనముకావలెను. అందుకై నీవద్దకు వచ్చితిని." అనునంత హరిశ్చంద్రుడు సంతోషముగ కోరినంత ధనమునిచ్చెను. ముని సంతసించెను. "రాజా! ధనమునీవద్దనే వుంచుము. అవసరముగలిగినపుడు గైకొందును." అని విశ్వామిత్రుడు వెడలిపోయెను.

హరిశ్చంద్రుడు ఒకదినమున వేటనిమిత్తము అడవులకేగెను. వేటముగిసిన పిదప రాజు తనవారితో ఒకచోటచేరి విశ్రమించెను. ఆ సమయమున, విశ్వామిత్రుడు పంపగా ఇరువురుమాతంగకన్యలువచ్చిరి. వారు తమనృత్యగాన కళానైపుణ్యములు ప్రదర్శించి రాజును ఆనందపరచిరి. రాజు వారలకు కానుకల నొసగబోవ, వారు వానిని గ్రహించక నిరాకరించిరి. మీదుమిక్కిలి తమ్ము వివాహమాడుమని కోరిరి. ధర్మవ్రతుడైన ప్రభువు వారి కోరికను త్రోసిపుచ్చెను. వారును నిరాశచే దిరిగివెళ్ళిరి. అటుపిమ్మట విశ్వామిత్రుడు మాతంగకన్యలను వెంటనిడుకొనివచ్చి, కన్యలను వివాహమాడుమని రాజును వత్తిడిచేసెను. హరిశ్చంద్రుడు, "మహర్షీ! నన్ను

క్షమించుడు. నేను ఏకపత్నీవ్రతుడను. నాకొక వంశోద్ధారకుడగు పుత్రుడు గలడు. కనుక ధర్మముతప్పి చరించను. అవసరమైనచో రాజ్యమునైన త్యజింతునుగాని ధర్మవిరుద్ధముగ ప్రవర్తించను." అని బదులు పలికెను.

సమయము దొరికినందులకు మహర్షి సంబరపడి, "అటులైనచో రాజ్యమును విడువుము" అని పలుక, వెంటనే హరిశ్చంద్రుడు రాజ్యమంతటిని మునికి ధార వోసెను. భార్యచంద్రమతి, కుమారుడు లోహితాస్యుడు వెంటనడువ, హరిశ్చంద్రుడు కట్టుబట్టలతో నగరమునుండి బయలుదేరెను. అంతవిశ్వామిత్రుడు, యాగధనమిమ్మని హరిశ్చంద్రుని నిలదీసెను.

"అయ్యా ! నేను రాజ్యసర్వస్వము కోల్పోయిన నిర్ధనుడను. అయినను ఆడిన మాట తప్పను. నాకు కొంత వ్యవధి నొసంగిన. మీధనమును ఏదోవిధముగ చెల్లింతును. నామాటనమ్ముడు. 'అని రాజు మహర్షిని వేడుకొనెను. మహర్షియు అందులకు అంగీకరించి, తనశిష్యుడగు నక్షత్రకుని హరిశ్చంద్రునివెంట బంపెను. అంతట రాజు భార్యాబిడ్డలతో నగరమువిడచి, అడవులకేగెను. ఆ సమయమున పురప్రజలు కన్నీరు మున్నీరుగ విలపించిరి. రాజ్యము విడచిపోవలదని వేడుకొనిరి. అయినను సత్యవ్రతమును పాటించి హరిశ్చంద్రుడు భార్యాబిడ్డలతో రాజ్యమును త్యజించివెడలెను.

అడవులలో నక్షత్రకుడు వారిని పలుకష్టములపాలుగావించెను. ధనమునివ్వనని చెప్పిన వెళ్ళిపోదునని వేధించెను.హరిశ్చంద్రుడు అన్నియు ఓర్పున భరించెను. అసత్యమాడనని నొక్కివక్కాణించెను. అంతులేని కష్టములనుభవించెను. చివరకు భార్యా బిడ్డలతో హరిశ్చంద్రుడు కాశీపట్టణము చేరెను. మౌనిఋణము తీర్చుటకు భార్యచంద్రమతిని విక్రయించెను. కాలకౌశికుడను బ్రాహ్మణుడు చంద్రమతిని కొనెను. వచ్చిన ధనమును నక్షత్రకునకొసగెను. అయినను విశ్వామిత్రుని ఋణము తీరలేదు. అపుడు తానుకూడ ఒక ఛండాలునకు అమ్ముడుబోయి అతని వద్ద సేవకావృత్తికి యొడంబడెను. నగరశ్మశానములో కాటికాపరిగా నియమితుడై, కాటిలో రేయింబవళ్ళు ఊడిగము చేయుచుండెను.

అట చంద్రమతి కాలకౌశికుని యింట దాసిగ సేవలు చేయుచుండెను. కాలకౌశికుని భార్య కలహకంఠి కడుగడుసరి. చంద్రమతిని, కుమారుడు లోహితుని పలువిధముల రాపాడుచు ఇంటిచాకిరి చేయించుకొనుచుండెను. అయినను

పరమసాధ్వి, మహాపతివ్రత చంద్రమతి విప్రునియింట అణగిమణగి యూడిగము చేయుచుండెను.

ఒకనాడు లోహితుడు దర్భలు, సమిధలు తెచ్చుటకు అడవికిచనెను. విధివశమున పాముకాటుచే లోహితుడు మరణించెను. అదితెలిసిన చంద్రమతి దుఃఖించుచు నడిరేయి అడవికేగెను. పుత్రవియోగమునకు మిగులరోదించెను. అయినను చేయునదిలేక పుత్రుని శవమును మోసికొని దహనసంస్కారము చేయుటకు శ్మశానముచేరెను. కాటికాపరిగాయున్న హరిశ్చంద్రుడు, శవదహనమునకు కాటిసుంకము చెల్లింపుమని వత్తిడి చేసెను. సుంకము చెల్లించుటకు తనవద్ద చిల్లిగవ్వయు లేదని చంద్రమతి చెప్పెను. విధినిర్వహణధర్మమునకు కట్టుబడిన హరిశ్చంద్రుడు, "మెడలోవున్న మంగళసూత్రమును తెగనమ్మి కాటిసుంకము చెల్లింపు" మని కటువుగ పలికెను. ఆసన్నివేశమున ఒకరినొకరు తెలిసికొనిరి. కుమారుడు మరణించినందులకు హరిశ్చంద్రుడు యెంతో చింతించెను. అయినను సేవకావృత్తి యందుగల యాతడు నిస్సహాయుడు. స్వామికార్యము, విధినిర్వహణము ఆతనిని బంధించి అస్వతంత్రుని చేసినవి. "ఏదియేమైనను కాటిసుంకము చెల్లింపక తప్పదు. నగరమునకు పోయి మాంగల్యము నేవెలకైనను తెగనమ్మి ధనముగొనిరమ్ము. సుంకము చెల్లింపనిదే శవదహనము జరుగదు. కావున అలసింపక వేగమె పోయిరమ్ము" అని భార్యతో పలికెను. చంద్రమతియు ప్రస్తుతము తన హీనదశకు మిగులదురపిల్లెను. చేయునదిలేక దుఃఖించుచు బయలుదేరెను.

దారిలో చంద్రమతికి మరో యాపద సంభవించెను. కాశీపట్టణపు రాజకుమారుని దొంగలెవరో హత్యచేసి, నగలు అపహరించి పారిపోవుచుండిరి. రాజభటులు వారిని వెంబడించగ, దొంగలు నగలమూటను చంద్రమతిచెంత జారవిడిచి పారిపోయిరి. రాజభటులువచ్చి చంద్రమతిని దోషిగ అనుమానించి రాజాస్థానమునకు గొనిపోయిరి. హత్యానేరము, దొంగతనము చంద్రమతిపై మోపబడెను. పాపపుణ్యమెరుగని పరమసాధ్వీరత్నమగు చంద్రమతికి మరణశిక్ష విధింపబడెను. శిక్షను అమలు పరచుటకు ఆమెను కాటికాపరిగానున్న హరిశ్చంద్రున కప్పగించిరి. నిరపరాధి, ఉత్తమఇల్లాలు, పతివ్రతాశిరోమణి అయిన తనభార్యను తానే శిరచ్ఛేదనము చేయవలసి వచ్చెను. విధిఎంత క్రూరమైనది? చాల విచారించెను. అయినను కార్యనిర్వహణయందు స్వపరభేదములు చూపరాదు. ధర్మము తప్పరాదు.

తనకర్తవ్యమును నెరవేర్చుటకు సంసిద్ధుడై కరవాలముచే భార్యకంఠమును తెగనరికెను. కాని హరిశ్చంద్రుని ఖడ్గము చంద్రమతి కంఠమున పుష్పహారమై ప్రకాశించెను.

అంత ఇంద్రాదిదేవతలు, పార్వతీ పరమేశ్వరులు, విశ్వామిత్రుడు, వసిష్ఠుడు మున్నగువారు అచ్చటికి చేరుకొనిరి. కష్టములెన్ని కల్పించినా హరిశ్చంద్రుడు సత్యవ్రతమును వీడలేదు. అతనిచేత అసత్యమును పలికించలేకపోతినని విశ్వామిత్రుడు తన ఓటమిని అంగీకరించెను. అపుడు దేవతలు హరిశ్చంద్ర చక్రవర్తిపై పుష్పవృష్టి కురిపించిరి. లోహితుడు తిరిగి బ్రతికెను. అందరు ఆనందించిరి.

## 42. హరిశ్చంద్రుని గూర్చిన మరి కొన్ని విశేషములు

హరిశ్చంద్రునకు సంతతిలేని కారణముగ నారదుని ఆదేశానుసారము వరుణ దేవుని ప్రార్థించెను. వరుణదేవుడు ప్రత్యక్షముకాగా, తనకు పుత్రుని అనుగ్రహింపుమని వేడుకొనెను. మరియు తనకు పుత్రసంతతి కలిగినచో, అతనిని యాగమున నరమేధముగ అర్పింతునని వరుణునకు వాగ్దానమొనర్చెను. వరుణదేవుని అనుగ్రహముతో హరిశ్చంద్రునకు పుత్రుడు కలిగెను. అతనికి రోహితుడని పేరిడెను. కాని వరుణునకిచ్చిన మాట ప్రకారము తనపుత్రుని యజ్ఞపశువుగ యొనర్చి యాగము చేయుట యందు హరిశ్చంద్రుడు జాగుచేయసాగెను. వరుణుడువచ్చి అడిగినను ఏదోనెపమున యాగముచేయక దాటవేయుచుండెను.

రోహితుడు విషయము తెలిసికొని ఆత్మరక్షణార్థము నగరమువదలి అడవుల బడిపోయెను. అది తెలిసిన వరుణుడు ఆగ్రహించి హరిశ్చంద్రునకు 'మహోదరం' అను వ్యాధిని కల్పించెను." వ్యాధిగ్రస్తుడై హరిశ్చంద్రుడు మిగుల బాధచెందసాగెను. రోహితునకు తండ్రి వ్యాధితో బాధచెందుచున్నాడని తెలిసెను. తండ్రిని చూడవలెనని అయోధ్యకు తిరిగి వచ్చుచుండగ, దారిలో ఇంద్రుడు వృద్ధబ్రాహ్మణ వేషములో ఎదురయ్యెను. రోహితుని నిలువరించి, విషయము తెలిసికొనెను. అంత, "బాలకా! ఒక సంవత్సరకాలము భూపర్యటనముచేసి తీర్థయాత్రలుచేసిరమ్ము, అట్లొనరించినచో నీతండ్రి పరిపూర్ణ ఆరోగ్యవంతుడగును." అని చెప్పినంత, రోహితుడు వెనుతిరిగి తీర్థయాత్రలు చేయబోయెను. అటుల పుణ్యక్షేత్రములు, పవిత్రతీర్థములు సేవించి అయోధ్యకు వచ్చుచుండగ, మరల ఇంద్రుడు వృద్ధబ్రాహ్మణ వేషమున దారిలో నెదురయ్యెను, మరల ఒకసంవత్సరము భూపర్యటన చేసి రమ్మని హితవు బలికెను. ఆ విధముగా ఇంద్రుని ఆదేశానుసారము ఆరు సంవత్సరములు గడచెను.

చివరకు రోహితుడు అజగర్తుడను బ్రాహ్మణుని ఒప్పించి, అతనిపుత్రులందు ఒకడైన శునశ్శేపుని గొనివచ్చి తండ్రికి సమర్పించెను. అంతట రాజు శునశ్శేపుని యజ్ఞపశువుగ యొనర్చి యాగము ప్రారంభించెను. శునశ్శేపుడు విశ్వామిత్రుడు ఉపదేశించిన మంత్రమును అనుష్ఠించగ, ఇంద్రాదిదేవతలు సంతసించి ప్రత్యక్షమైరి. నరబలి లేకయె యాగము పరిసమాప్తమాయెను. శునశ్శేపుడు రక్షింపబడెను. అతనికి చిరంజీవిగ వరమొసంగిరి. హరిశ్చంద్రునికూడ మన్నించి, అతని జలోదరమును వరుణదేవుడు నివారించి సంపూర్ణ ఆరోగ్యమును ప్రసాదించెను. హరిశ్చంద్రుడు కౌశికుని వద్ద బ్రహ్మవిద్యను అభ్యసించి బ్రహ్మజ్ఞాని అయెను. శునశ్శేపుని కౌశికుడు తనదత్తపుత్రునిగ గ్రహించెను. తుదకు హరిశ్చంద్రుడు రాజ్యసంపదలను త్యజించి, తపోవనములకేగి, అచ్చట భౌతికదేహమునువీడి మోక్షమందెను.

## 43. సగరుడు

హరిశ్చంద్రుని కుమారుడు రోహితుడు. రోహితునకు జంపుడు జన్మించెను. జంపునకు సుదేవుడు కలిగెను. సుదేవునకు విజయుడు, విజయునకు రురుకుయును, అతనికి వృకుడును, వృకునకు బాహుకుడును వరుసగ జననమందిరి. బాహుకునకు సగరుడు గలిగెను. సూర్యవంశపు చక్రవర్తులలో సగరుడు ప్రసిద్ధుడు.

శత్రురాజులైన హైహయులు యుద్ధమున బాహుకునోడించి రాజ్యమును వశపరచుకొనిరి. అంత బాహుకుడు భార్యతోగూడి రాజ్యమువీడి అడవులపాలాయెను. కొంతకాలమునకు రాజు మరణించగ, బాహుకునిభార్య భర్తతో సహగమనమునకు సిద్ధపడెను. కాని అపుడామె గర్భవతి, ఔర్వుడు అనుముని గర్భవతియైనస్త్రీ ప్రాణత్యాగ మొనర్చుట పాపహేతువని నచ్చచెప్పి, సహగమనమును నివారించెను. రాణిని తన ఆశ్రమమునకు గొనిపోయి కాపాడెను. కాని రాణి సపత్నులు మత్సరమతులై జలము నందు గరళము కలిపి, ఆమెచే త్రాగించిరి. కాని ముని తపఃప్రభావము రాణి గర్భమును రక్షించెను. గర్భస్థశిశువు మరణించలేదు. తరువాత ఆమె ఒక పుత్రునకు జన్మనిచ్చెను. గరళముతో పుట్టిన బాలుని 'సగరు'డనిరి.

సగరుడు పెద్దవాడై శస్త్రాస్త్రయుద్ధవిద్యలునేర్చి గొప్ప వీరుడయ్యెను. శత్రు రాజులను ఓడించి, తండ్రి కోల్పోయిన రాజ్యమును తిరిగి కైవసమొనర్చుకొనెను. సగరుడు చక్రవర్తియై భూమండలమంతటిని పాలించెను. గొప్ప విష్ణుభక్తుడై అశ్వమేధ యాగములనేకములు నిర్వహించెను.

సగరునకు సుమతి, కేశి అను భార్య లిద్దరుండిరి. సుమతికి అరవైవేలమంది పుత్రులును, కేశికి ఒక కుమారుడుగలిగెను. వీరందరు కడుదుష్టులు, దుర్మార్గము లెన్నింటినో చేసిరి. దేవతలను మునులను బాధించిరి. సాధుజనులను హింసించిరి. వీరి బాధలు తాళజాలక దేవతలు మహర్షులు బ్రహ్మచెంతకేగి మొరపెట్టుకొనిరి. అంత పరమేష్ఠియు, "కొంతకాలము ఓపిక పట్టుడు. వీరందరు కపిలమహర్షిని చంపబూనుదురు. అపుడు అరువదివేలమంది నశింతురు." అని పలుక, అందరు తృప్తి చెందిరి.

కేసిని కుమారుడు అసమంజసుడు. ఇతడుగూడ దుండగములనెన్నింటినో చేసెను. అయోధ్యానగరవీధులలో ఆటలాడుకొను పిల్లలను గొనిపోయి సరయూ నదిలో ముంచెడివాడు. వారు ఊపిరాడక గావుకేకలిడి రోదించుచుండ ఆనందించెడి వాడు. అతనివన్నియు రాక్షస కృత్యములు.

అసమంజసుడు పూర్వజన్మమున ఒకయోగి. కాని దురాశ పీడితుడై యోగ భ్రష్టుడయ్యెను. అరణ్యమున సంచరించుచుండగా అతనికి ధనపురాశి గానుపించెను. దానికి పిశాచమొకటి కావలిగానుండెను. అసమంజసుడు ఆశతో ధనమును గ్రహించబోవ, భూతము అడ్డగించెను. అపుడది, "ఓయీ! నేను మిక్కిలి ఆకలిగొని యుంటిని. నీవు ఒక గోవును సంహరించి, దాని మాంసమును తెచ్చియిచ్చి నాఆకలి తీర్చుము. అంత ధనమును నీకు సమర్పింతును." అని భూతము పలుక అట్లేనని ధనమును గైకొని పోయెను. కాని పిశాచమునకు యిచ్చినమాటను చెల్లించకయే మరణించెను. తదుపరి జన్మమున సగరునకు పుత్రుడుగా జననమందెను. కాని ఆపిశాచము అతనిని విడువక, సమయము వచ్చినపుడు ఆవహించుచునే యుండెను. అందువలననే అట్టిక్రూరకృత్యములు చేయుచుండెను. అతని ఘాతుకచర్యలు భరించలేక, బాధితులందరు సగరుని చెంతకేగి మొర పెట్టుకొనిరి. అంత సగరుడు తనపుత్రుడైన అసమంజసుని నగరమునుండి వెడలగొట్టెను. అటు తరువాత అతడు అడవులబట్టి తిరుగుచు, ఒకానొక సమయమున పిశాచము బారినపడి మరణించెను. అంశుమంతుడు అసమంజసుని పుత్రుడే. అంశుమంతుడు మిగుల గుణవంతుడు. దైవభక్తి మెండుగగలవాడు.

ఒక సమయమున సగరచక్రవర్తి అశ్వమేధయాగముచేయ సంకల్పించెను. యాగాశ్వమునువిడచి, తనపుత్రులు అరువదివేలమందిని దానివెంట పంపెను. యాగాశ్వమును రక్షించుచు, దానిని మరల భద్రముగ గొనిరమ్మని ఆజ్ఞాపించెను.

అదిదేశదేశములు తిరిగెను. చివరకు సముద్రతీరమున పరుగిడుచు, యాగాశ్వము సముద్రజలములందు ప్రవేశించగ, సాగరమందలి జలమంతయు అడుగంటెను.

అదే మంచి సమయమని దలచి ఇంద్రుడు, అశ్వమును రసాతలమునకు చేర్చుమని వాయుదేవుని పురిగొల్పెను. వాయుదేవుడును అశ్వమును గొనిపోయి రసాతలములో తపస్సమాధియందున్న కపిలమహర్షి ఆశ్రమమునకు గొనిపోయి, మునిచెంత కట్టివైచెను.

సగరపుత్రులకు అశ్వముజాడ తెలియలేదు. దానికొరకు అందందు వెదకి వేసారి తండ్రిచెంతకేగి అశ్వము కనుపించలేదని చెప్పిరి. అశ్వము లేకుండగ వచ్చినందులకు రాజు వారిపై మిగుల కోపించెను. ఎటులైనను అశ్వమును వెదకి పట్టుకొనిరండని కఠినముగా ఆజ్ఞాపించెను. సగరపుత్రులు చేయునదిలేక మరల బయలుదేరి, యాగాశ్వమును వెదకుటకు సముద్రమంతయు రసాతలము వరకు త్రవ్విరి. అపుడచ్చట వారు కపిలమునిని గాంచిరి. వాని చెంత యాగాశ్వమును కనుగొనిరి. అశ్వమును అపహరించి, తెలియని వానివలె దొంగజపము చేయు చున్నాడని సగరపుత్రులు మునిపై నాగ్రహించి, అంతము చేయ సమకట్టిరి. అనేక విధముల దురుక్తులాడిరి.

అపుడు భగవత్స్వరూపుడైన కపిలమునికి తపోభంగమాయెను. మౌని కన్నులు తెరచి చూచినతోడనే అతనికన్నుల నుండి అగ్నిజ్వాలలు వర్షించగ, సగరపుత్రులందు ఆహుతైరి. వారి భస్మరాసులు పెద్ద పర్వతమువలె నిలచెను.

అట్లు తన పుత్రులందరు కపిలముని నేత్రాగ్నిజ్వాలలకు భస్మమై నశించినారను వార్తను నారదమహాముునివలన విని సగరచక్రవర్తి కడుదుఃఖించెను. అంత అసమంజసుని కుమారుడైన అంశుమంతుని యాగాశ్వమునకై పంపెను. అంశుమంతుడు గుణనిధి, సజ్జనుడు, దైవభక్తుడు, పెద్దలయందు భక్తిశ్రద్ధలు గలవాడు. తన పినతండ్రులేర్పరచిన సొరంగము ద్వారా రసాతలము ప్రవేశించి పరిసరములు వెదకను. కొండగుట్టలవలె పడియున్న తన పినతండ్రుల భస్మరాసులనుగాంచి మిగుల చింతిల్లెను. సమీపమున కపిలమహర్షిని, చెంతనేయున్న అశ్వమునుగాంచెను. కపిలమహర్షిని సమీపించి అంశుమంతుడు అమిత భక్తి శ్రద్ధలతో పాదాభివందన మాచరించి, ముకుళితహస్తుడై పరిపరివిధముల మహామునిని స్తుతించెను.

అంత కపిలమహాముని ప్రసన్నుడై యాగాశ్వమును గొనిపొమ్మని అనుజ్ఞనిడెను. "నీ పినతండ్రులు పవిత్రులై పితృలోకమున సుఖించవలెనన్నచో పవిత్ర గంగా

జలమును గొనితెమ్ము. అంతకుమించి వేరు మార్గములేదు". అని ఆనతిచ్చెను. అంశుమంతుడు మరలమరల కపిలమహామునికి ప్రదక్షిణ నమస్కారములాచరించి, యజ్ఞాశ్వమును గైకొనితెచ్చి తాతగారికొసగెను. సగరుడు అశ్వమేధమును ముగించెను. అనంతరము సగరచక్రవర్తి సర్వభోగములు త్యజించెను. రాజ్యభారమును అంశుమంతునకప్పగించి తపోనిష్ఠాగరిష్ఠుడై దేహముచాలించి విష్ణుపదము చేరెను.

సగరపుత్రులు త్రవ్విన కారణముగా సముద్రమునకు "సాగర" మనిపేరు సార్థకమయ్యెను. అంశుమంతుడు తనవారికి ఉత్తమగతులు కల్పించుటకు చాల సంవత్సరములు తపమాచరించెను. అతని ఆశయము నెరవేరలేదు. కాని కాలధర్మమొందినాడు. తరువాత అతని పుత్రుడు దిలీపుడుకూడ గంగను రప్పించి, పితామహాదులకు సద్గతులు కల్పించవలెనని విశ్వప్రయత్నముచేసెను. కాని అతని ప్రయత్నము ఫలించలేదు. అటుమీదట దిలీపుని పుత్రుడైన భగీరథుడు దానిని సాధించి లోకమున ప్రసిద్ధుడాయెను.

## 44. భగీరథుడు

దిలీపుని కుమారుడు భగీరథుడు. అతడు గంగను భూమిమీదకు గొని వచ్చుటకు చాలకాలము ఉగ్రతపమాచరించెను. దేవతాగణములు, మహర్షులు సైతము అతని తపోదీక్షకు ఆశ్చర్యమందిరి. అంతట గంగాదేవి ప్రత్యక్షమై భగీరథుని కోరికను మన్నించెను.

'ఓయీ రాజా ! నేను భూమి మీదకు వచ్చునపుడు నా ప్రవాహవేగమును భరించగలవారెవ్వరు గలరు?" అట్టివాడు మహనీయుడై ఉండవలెను. నేను భూమి మీదకు వచ్చిన పిదప పాపకర్ములు నాలోస్నానమాడి వారిపాపములన్నియు నాకు సంక్రమింపజేసి, వారు పరిశుద్ధులగుదురు. ఆ పాపములన్నియు నేను భరించవలసి వచ్చును. కనుక ఈసందేహములకు నీసమాధానమేమి?' అని గంగాదేవి ప్రశ్నించెను.

అంత భగీరథుడు, "అమ్మా ! గంగాభవానీ ! నీవు విష్ణుపాదములందు ఉద్భవించిన కారణముగా, నీకెట్టి మాలిన్యములుగాని, పాపములుగాని అంట జాలవు, ఈ చరాచరజగత్తుకు ఆధారభూతుడు శంకరుడు. ఆ సర్వేశ్వరుడే నిన్ను భరించగల సమర్థుడు. కనుక నామొరాలకించి భూమిని చేరుము" అని ప్రార్థించెను. వెనువెంటనే భగీరథుడు శంకరుని అనుగ్రహముకొరకు పరమశివుని గురించి

కఠోరతపస్సు చేసెను. పరమేశ్వరుడును భగీరథుని తపస్సునకుమెచ్చి, అతని అభీష్టము నెరవేర్ప అంగీకరించెను. అటుల గంగను, శివుని సమ్మతింపచేసి ఆచక్రవర్తి సఫల మనోరథుడయ్యెను.

విష్ణు పాదోద్భూతమైన గంగ స్వర్గమునుండి మహావేగముతో పృథివిపై దుముకుచుండ శంకరుడు గంగాదేవిని తనశిరమున భరించి, జటాజూటమున బంధించెను. అంత పరమశివుడు గంగాధరుడుగా ప్రసిద్ధుడయ్యెను. శివుని శిరము నుండి గంగ ప్రవాహముగజారి ప్రవహింపసాగెను. అంత భగీరథుడు తన రథము నందు ముందుపోవుచుండ, గంగయు వానిననుసరించి ప్రవహించెను. హిమవత్పర్వము దాటి గంగాభవాని భూలోకము ప్రవేశించెను. మార్గమధ్యమున, "జహ్నుడు" అను మునీశ్వరుడు యాగము చేయుచుండెను. గంగా ప్రవాహము ఆముని యజ్ఞవాటికను ముంచెను. అపుడాముని కోపించి, గంగాజలమునంతటిని పుక్కిటబట్టిబంధించెను. భగీరథుడంత జహ్నుని పరిపరి విధముల ప్రార్థింప, అతడును కరుణించి, గంగను తనచెవినుండి విడిచెను. అంత గంగకు 'జాహ్నవి' అని పేరు గలిగెను.

అనంతరము భగీరథుడు గంగను రసాతలమునకు గొనిపోయి, తనపితరులు పడియున్న భస్మరాసులను తాకించెను. పవిత్రగంగాజలము సోకినంతనే, సగరపుత్రులందరు పరమపవిత్రులై ఉత్తమగతులు పొందిరి.

భగీరథుడు ఎన్నోకష్టములకెదురొడ్డి గంగను భూలోకమునకు గొనివచ్చి ముల్లోకవాసులచే కీర్తింపబడెను. భగీరథుని ప్రయత్నము వలన గంగ భూలోకమును చేరినందున, దానికి "భాగీరథి" అనుపేరును ప్రసిద్ధమైనది.

అయోధ్యను పాలించిన ఋతుపర్ణుడు ఈవంశమున జన్మించనవాడే. అతడు "అక్షహృదయము" అనువిద్యలో గొప్పపండితుడు. ఋతుపర్ణునిచెంతనే నలుడు బాహుకుడనునామమున వంటలవాడుగ పనిచేసెను. ఆసమయమందే ఋతుపర్ణుడు అక్షహృదయవిద్యను బాహుకునకునేర్పి అతనినుండి అశ్వహృదయవిద్యను అభ్యసించెను. ఇదే వంశమున ఖట్వాంగుడను మహనీయుడు జన్మించి చక్రవర్తి అయ్యెను. ఖట్వాంగుడు గొప్పవిష్ణుభక్తుడు. తుదకు విష్ణువు అనుగ్రహము పొంది పరమపదమును పొందెను.

ఖట్వాంగుని పుత్రుడు దీర్ఘబాహువు. దీర్ఘబాహువునకు రఘువు జన్మించెను. రఘుమహారాజుకుమారుడు అజమహారాజు. అజమహారాజుకు దశరథుడు. దశరథునికి శ్రీరాముడు, లక్ష్మణ భరతశత్రుఘ్నులు జన్మించిరి.

వ్యాసమహర్షి వాల్మీకి విరచిత రామాయణ గాధను భాగవతమందు సంక్షిప్తముగా వివరించినాడు. శ్రీరాముని వంశమెంతవరకు వ్యాప్తి చెందిన విషయమును వ్యాసభగవానుడు భాగవతమునందు వివరించెను.

శ్రీరాముని పుత్రులు లవకుశులు కుశుని కుమారుడు సుమిత్రుడు, ఆరాజుతో ఇక్ష్వాకువంశము అంతరించెను.

## 45. శ్రీరాముడు

రాముడు శ్రీమహావిష్ణువుయొక్క అవతారము. రావణుని దురాగతములనుండి దేవతలను, మానవులను రక్షించుటకు భగవంతుడు దశరథుని పుత్రునిగ భువిపై నవతరించెను. శ్రీహరి తనవగు అంశలతో రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులుగ దశరథుని భార్యలగు కౌసల్య సుమిత్ర, కైకేయిలందు పుత్రులుగ అవతరించెను. రాముని భార్యసీత సాక్షాత్తు శ్రీమహాలక్ష్మియే. జనకమహారాజ పుత్రికగ అవతరించెను.

శ్రీరాముడు విశ్వామిత్రుని యాగమును నిర్విఘ్నముగ ముగింపచేసెను. ఆ సమయమున మారీచుని మదమడంచి, సుబాహుని వధించెను. అటుపై మిధిలానగరముచేరి, జనకుని యింటనున్న శివునివింటిని ఎక్కుపెట్టి విరచెను. జానకిని పరిణయమాడి సీతారాముడై అయోధ్యకు అరుదెంచెను. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు వరుసగా ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తులను వివాహమాడిరి. కల్యాణ రాముడు సీతాసమేతుడై అయోధ్యకు వచ్చుచుండ, పరశురాముడు మార్గమధ్యమున యెదురయ్యెను. రాముడు పరశురాముని నెదిరించి ఆతనికి గర్వభంగమొనర్చెను.

దశరథుడు చిన్నభార్యకైకకు ఇచ్చిన వరముల కారణముగ రాముడు పదునాలుగేడులు వనవాసము చేయుటకు భార్యసీతతో బయలుదేరెను. లక్ష్మణస్వామియు వారలవెంట బయలుదేరెను. శ్రీరాముడు వనవాసము చేయుటకు ఎట్టి విచారము, మనోవికారము చెందలేదు. పరమయోగులు దేహమును త్యజించు నట్లు రాజ్యమును, భోగభాగ్యములను, బంధువర్గమును, అయోధ్యానగరమును, అంత్యంత ప్రియులగు నగరవాసులను విడచి వనములకేగెను.

అరణ్యములోనుండగ, రావణుని సోదరి శూర్పణఖను, ఆమెకు కలిగిన పాపచింతనలకు, కురూపినిచేసి రాముడు శిక్షించెను. రావణుని ప్రతినిధులైన ఖర, దూషణ, త్రిశరులు మునులను, ఋషులను వేధించుచుండిరి. రాముడు ఆముగ్గురను, సేనను యుద్ధమున నెదుర్కొని సంహరించెను.

తన ప్రతినిధులను, పదునాలుగువేల రాక్షసవీరులను సంహరించినందులకు రావణుడు శ్రీరామునిపై మండిపడి ప్రతీకారము తీర్చుకొనదలచెను. సీతా వ్యామోహితుడై రావణుడు సీతను అపహరించవలెనని నిశ్చయించెను. మారీచుని ప్రోత్సహించి, బంగరు మాయలేడి రూపముధరించుమనట్లు యొప్పించెను.

మారీచుడు మాయామృగరూపముదాల్చి శ్రీరాముని ఆశ్రమపరిసరములందు సంచరించసాగెను. సీతాదేవి, దానినిగాంచి, దాని అందచందములకు వ్యామోహిత అయ్యెను. దాని నెటులైనను పట్టితెమ్మని రాముని కోరెను. రాముడు తనభార్య ముచ్చటనుదీర్ప ధనుర్బాణములుధరించి లేడివెంటబడెను. కొంతదూరము లేడిని వెంబడించినతదుపరి, అది రాక్షసమాయయనిగ్రహించెను. వెంటనే రాముడు లేడిపై బాణముప్రయోగించెను. బంగరులేడి రూపములోనున్న మారీచుడు మరణించెను.

అదనుచూచి రావణుడు మాయావేషమునవచ్చి సీతనపహరించుకొనిపోయెను. సీతజాడతెలియక రాముడు సీతకై మిగుల విచారించెను. అంతట రామలక్ష్మణులు సీతకొరకు అరణ్యమంతయు వెదుకనారంభించిరి. దారిలో వారికి జటాయువు ఎదురయ్యెను. జటాయువు దశరథునకు ఆప్తమిత్రుడు.రావణునితోపోరాడి రెక్కలుతెగి, క్షతగాత్రుడై మరణావస్థయందుండెను. జటాయువు రావణునితో పోరాడిన కారణమును వివరించి, మరణించెను. శ్రీరాముడు జటాయువునకు అంత్యక్రియలు నెరవేర్చి, తిరిగి సీతాన్వేషణమునకు ముందుకుసాగెను. సీతావియోగదుఃఖమును రాముడు భరించలేకుండెను. లక్ష్మణుడు రామునిచెంతనే యుండి అన్నతో శాంతివచనములుపలికి నూరడించుచుండెను.

రామలక్ష్మణులు సీతను అన్వేషించుచుండిరి. మార్గమందు వారికి కబంధుడను రాక్షసవీరుడు తారసిల్లెను. వాడు రామలక్ష్మణులచే హతుడాయెను. కంబంధుడు మరణించుచు, సుగ్రీవుని సమాచారము తెలియచేసెను. అంత రామలక్ష్మణులు ఋష్యమూకపర్వతముచేరి సుగ్రీవునితో చెలిమిచేసికొనిరి. అతని సోదరుడైనవాలిని రాముడు వధించెను. ఆసమయమున అంజనాపుత్రుడైన అంజనేయునితో పరిచయ మాయెను. హనుమంతుడు రామునకు పరమభక్తుడాయెను. హనుమంతుడు సాగరమునుతరించి, లంకను ప్రవేశించెను. సీతజాడ తెలిసికొనెను. లంకనుదహించి, తిరిగి వచ్చి జానకి సమాచారమును రామునకు తెలిపి, శోకముపశమింప చేసెను. సుగ్రీవుడు వానరసైన్యమునుతోడ్కొని బయలుదేరెను. రామలక్ష్మణులు వారితో దక్షిణ

సముద్రము చేరిరి. సముద్రుడు సహకరించనందులకు రాముడు అతనిపై ఆగ్రహించెను. సముద్రుని దర్పమొనర్చుటకు బాణము సంధించెను. అంతట సముద్రుడు ప్రత్యక్షమై రాముని శరణుగోరెను. సాగరమధ్యమున సేతువునిర్మించుటకు సహకరింతునని రాముని శాంతింపచేసెను. అటుపై వానరులు సముద్రమందు లంకకు సేతువునిర్మించిరి.

సేతువు నాధారముగ, వానరసేనాసమూహము లంకను ప్రవేశించెను. అంతకుముందుగనే రావణునిచే పరాభవింపబడిన విభీషణుడు రాముని శరణుజొచ్చి, సుగ్రీవాదులతో కలసియుండెను. నగరములో వానరసైన్యము బీభత్సము సృష్టించిరి. దానితో రావణుడు మండిపడెను. శత్రుసైన్యమును నిర్జింప కుంభ, నికుంభ, ధూమ్రాక్ష, దుర్ముఖ, సురాంతక, నరాంతకులను పంపెను. వారు యుద్ధమున మరణించిరి. తరువాత తన కుమారులైన ఇంద్రజిత్తాదులు, సోదరుడు కుంభకర్ణుడు రామలక్ష్మణులతో పోరి మరణించిరి. సుగ్రీవుడు, హనుమంతుడు, నీలుడు, అంగదుడు, జాంబవంతుడు మున్నగువానరవీరులు రామలక్ష్మణులకు అండగనిలచి సహకరించుచుండిరి.

చివరకు రావణుడు రథారూఢుడై రణరంగమున ప్రవేశించెను. రామునకు స్వర్గాధిపతియైన ఇంద్రుడు మాతలినిచ్చి తనరథమును పంపెను. రామరావణ యుద్ధము అతిఘోరముగ జరుగుచుండెను. దానిని పరికించుటకు స్వర్గవాసులు గగనమున బారులుదీరి నిలచిరి. భయంకరయుద్ధమున రాముని బ్రహ్మాస్త్ర ప్రయోగమునకు రావణుడు హతుడయ్యెను. రావణాది ప్రముఖులకు విభీషణుడు అంత్యక్రియలు జరిపెను. సీత రామాజ్ఞమేరకు అగ్నిజొచ్చి, పునీతయై భర్తను సంతసింప చేసెను.

శ్రీరాముడు విభీషణుని లంకారాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసెను. రాముడు సీతను గైకొని లక్ష్మణసహితుడై అయోధ్యానగరముచేరెను. సుగ్రీవుడు, హనుమంతుడు, విభీషణుడు మున్నగువారు శ్రీరాముని అనుసరించిరి.

అన్నరాకకై మునివేషధారియైన భరతుడు వేచియుండెను. శ్రీరామునకు ప్రతినిధిగా భరతుడు అయోధ్యానగరమును పాలించుచు, నందిగ్రామములో నుండెను. బంగరు సింహాసనమున శ్రీరాముని పాదుకలనుంచి రాజ్యము పాలించుచు భక్తియుతుడై అన్నగారి రాకకై నిరీక్షించుచుండెను.

అన్నగారిరాకను తెలిసికొన్న భరతుడు, రామపాదుకలను శిరమున నిడుకొని, రామలక్ష్మణులను కలసికొనెను. పేదపండితులు వేదమంత్రములను పఠించుచుండగ భరతుడు శ్రీరాముని కలసెను. శ్రీరాముడు తమ్ముడు భరతుని ఆనందాతిశయములతో కౌగిలించెను. అనంతరము శ్రీరాముడు అయోధ్యానగరముచేరి, మహావైభవముగ పట్టాభిషిక్తుడయ్యెను. శ్రీరాముడు యజ్ఞయాగాదులు పెక్కింటిని నిర్వహించి, ఆదర్శప్రభువుగ రాజ్యము పాలించెను. అటుల రాజ్యపాలనము సాగుచుండ ఒక పౌరుడు సీతారాములనుగూర్చి నిందారోపణముగావించి మాట్లాడెను. అది వినిన శ్రీరాముడు సీతను పరిత్యజించుటకు నిర్ణయించెను. పౌరులకు తృప్తికలిగించుటయె ప్రధానలక్ష్యముగా రాముడు భావించెను. సీతను సౌమిత్రిచే విడువ పంపెను. కారడవుల దిగవిడిచినపుడాసాధ్వి గర్భవతి.

అడవులందు దుఃఖితయైయున్న సీతామాతను వాల్మీకిమహర్షి తన ఆశ్రమమునకు గొనివచ్చెను. ఆజగన్మాతను కన్నబిడ్డవలె పోషించి రక్షించెను. ఒక శుభదినమున సీతమ్మ కవలలకు జన్మనిచ్చెను. ఆకవలలిద్దరు లవకుశులు.

వాల్మీకిమహర్షి బాలకులకు విద్యాబుద్ధులు నేర్పెను. తానురచించిన రామాయణమును అభ్యసింపచేసెను. లవకుశులు రామాయణ గానముచేయుచు, అయోధ్యానగరముచేరిరి. శ్రీరాముడు వారి గానము విని ముగ్ధుడాయెను. బాలకులు తనపుత్రులని గ్రహించెను. మహాపతివ్రతయైన సీతనుజూడ వాల్మీకి ఆశ్రమమున కేతెంచెను. అచ్చట మహాసాధ్వీసీతను చూచి మనమున ఆనందించెను.

అపుడు సీతాదేవికి అగ్నిపరీక్ష జరిపెను. ఆ పరీక్షయందు జగన్మాత తన పాతివ్రత్య మాహాత్మ్యమును త్రిభువననాసులకు వెల్లడి గావించి, తనతల్లియైన భూమాత గర్భములో లీనమయ్యెను. బ్రహ్మాదిదేవతలు, దివినుండి పుష్పవృష్టి కురిపించిరి. దేవదుందుభులు మహోత్సాహమునధ్వనించ, నారదాది మహర్షులు దివ్యగానముల లక్ష్మీస్వరూపిణి లోకమాతను కీర్తించిరి.

అంత శ్రీరాముడు తన బిడ్డలగు, లవకుశులతో అయోధ్యానగరము చేరెను. శ్రీరాముడు పదునొకండువేల సంవత్సరములు ప్రజానురంజకముగ రాజ్యపాలనము చేసి, వైకుంఠమును ప్రవేశించెను.

## 46. తారాశశాంకము - తారచంద్రులు

దేవతలకు గురువు బృహస్పతి. అతడు బ్రహ్మజ్ఞాని. గొప్పతపస్వి. దేవ పురోహితుడు. జడలుగట్టిన శిరోజములు, బాగుగ పెరిగిన గడ్డము మీసములు, మెడలో రుద్రాక్షమాలికలు, దేహమునిండ విభూతిరేఖలు, చేతులందు దండక మండలములు. ఇవి ఆ మహనీయుని రూపులేఖావిలాసములు. మరియు వయోవృద్ధుడు.

బృహస్పతి భార్య తార. ఆమె మిగులసౌందర్యవతి. అతిలావణ్యవతి. మరియు యవ్వనపుపొంగున ప్రకాశించెడి రూపురేఖావిలాసములయొప్పెడి అందాలరాశి.

బృహస్పతి దేవగురువైన కారణమున, యజ్ఞయాగాదులందు పాల్గొనుచూ జపతపాదులందు ప్రొద్దుగడపుచు సంసార సంబంధమగు భోగములందు అనురక్తి అసక్తి లేక యుండువాడు. ముని భార్యతార భర్తకు శుశ్రూషలు వేళతప్పక ఆచరించు చుండెడిది. కాని తారకు భర్తవలన యధేచ్ఛగ రతిక్రీడల ననుభవించు అదృష్టము లేకుండెను. అయినను మనసును అదుపునందుంచుకొని భర్తను సేవించుచుండెను. దేవగురువు బృహస్పతిచెంత శిష్యులు అనేకులుండెడివారు. ఒక సమయమున బృహస్పతి చంద్రుని శిష్యునిగ స్వీకరించెను. చంద్రుడు విద్యనభ్యసించుటకై బృహస్పతి ఆశ్రమమునకు వచ్చెను.

చంద్రుడు అత్రిమహాముని అనసూయలకు బ్రహ్మాఅంశమున జన్మించెను. రూపమున చంద్రుడు మిగుల చక్కనివాడు. తార చంద్రునిచూచెను. అతని రూప యౌవనములకు ఆమెచిత్తము చలించెను. దేహము మదనతాపమున క్రాగెను. తనకు తగినవాడని చంద్రుని మోహించెను. భర్త ఆశ్రమమందు లేని సమయమున చంద్రునకు వశురాలై రతిక్రీడల సుఖించెను. ఫలితముగ తార గర్భవతాయెను. గర్భవతి అయినతారను చంద్రుడు తనతో గొనిపోయెను. అనంతరము విషయము తెలిసిన బృహస్పతి చంద్రునితో స్పర్ధబూని పోరునకు సిద్ధమయ్యెను. ఇరువురినడుమ గొప్ప సంగ్రామమయ్యెను. అది పెరిగి పెరిగి దేవదానవ రణముగ పరిణమించెను. దానవుల గురువైన శుక్రాచార్యుడు చంద్రుడుచేసిన పనిని సమర్థించగ, దానవులందరు చంద్రుని పక్షమున చేరిరి. అంత బ్రహ్మ కల్పించుకొని చంద్రుని మందలించి, తారను బృహస్పతికి అప్పగించెను.

కొంత కాలమునకు తార చక్కనిపిల్ల వానిని గనెను. మరల పిల్లవాని కొరకు చంద్రబృహస్పతులు పోరునకు దిగిరి. బ్రహ్మ, ఋషులు మున్నగువారు ఇరువురను విచారించి, వాస్తవమును తెలుసుకొనిరి. పిల్లవాడు చంద్రునివలన కలిగినందున, బాలుని చంద్రునకప్పగించిరి. ఆ బాలుడే బుధుడు. బుధుడు సౌందర్యాది లక్షణము లందు చంద్రునకు సాటియైనవాడు. చంద్రుడు నవగ్రహములలో నొకడై ప్రకాశించుచున్నాడు.

## 47. పురూరవుడు

చంద్రుని కుమారుడు బుధుడు. బుధునకు ఇళయందు పురూరవుడు జన్మించెను. అతడు చంద్రవంశపురాజు. షట్చక్రవర్తులలో పురూరవుడు ఒకడు. ఆతని రాజధాని ప్రతిష్ఠానపురము. ఇది గంగ యమునల సంగమస్థానమున గలదు.

దేవదానవులకు యుద్ధము సంభవించినపుడు పురూరవుడు ఇంద్రునిపక్షమున పోరి, దేవతలకు విజయము చేకూర్చెడివాడు. అకారణముగ ఇంద్రునకు పురూరవునిపై అభిమానము, గౌరవమధికము. అందువలన ఆచక్రవర్తి ముల్లోకములలో యథేచ్ఛగ సంచరించెడివాడు.

దేవలోక అప్సరసలందు ఊర్వశి కడుసౌందర్యవతి. పురూరవుడు ఊర్వశిని మోహించెను. దేవసభలో నారదునివలన పురూరవుని శౌర్యబలాది గుణములనువిని ఊర్వశికూడా అతనిని వలచెను.

ఒకానొక సమయమున వరుణుని శాపకారణముగ ఊర్వశి భూలోకమున జన్మించెను. పురూరవుని పట్టణమున ఊర్వశి విహరించసాగెను. ఆమెనుగాంచిన పురూరవుడు, ఆమెనుమోహించి, తన మదనతాపము తీర్చుమని కోరెను. అంతట ఊర్వశి కొన్ని షరతులను విధించెను.

"రాజా! నాకు మేకపిల్లలు రెండు వున్నవి. అవి నాకు ప్రాణసమానములు. వాటిని రక్షిస్తూవుండవలెను. నాకు ఆహారము ఘృతము మాత్రమే. కనుక నెయ్యినే ఆహారముగా యిచ్చుచుండవలెను. సంభోగ సమయములందు మినహా, నీవు యితర సమయములందు వస్త్రవిహీనుడవై దిసిమొలతో నాకు కనుపించరాదు. ఈ నియమములు మూడును అతిముఖ్యములు. వీనియందు ఏది భగ్నమైనను నిన్ను విడనాడిపోదును. వీనికి అంగీకరించినచో, నీకు భార్యగనుందును." అని ఊర్వశి షరతులను వివరించెను.

ఊర్వశి విధించిన నియములకు పురూరవుడు అంగీకరించి, ఆమెను వివాహ మాడెను. ఇరువురూ సుందరవనములందును, దేవతా ఉద్యానవనములందును విహరించుచు చాలకాలము విచ్చలవిడిగ సంచరించిరి. అంతలో ఊర్వశికి శాప విముక్తి కాలము చేరువయ్యెను. ఆమెను తిరిగి స్వర్గమునకు రప్పింపదలచి, ఇంద్రుడు గంధర్వులనుపంపెను. వారు ఒకరాత్రివేళ వచ్చి మేకపిల్లలను అపహరించి గొనిపోవు చుండిరి. అంత నవి బిగ్గరగ అరువసాగెను. వాని కేకలువిన్నపురూరవుడు, వానిని రక్షించుటకు బయలుదేరెను.

ఆ సమయమున పురూరవుడు ఊర్వశితో రతిసలుపుచుండెను. ఆతొందరలో అతడు వస్త్రములు ధరించకయే పరుగుతీసెను. గంధర్వులను పారద్రోలి మేకలను రక్షించిగొనివచ్చి ఊర్వశిని సంతోష పరచెను. కాని దిసిమొలతో కనుపించినందున, నియమభంగమైనదని దలచి, ఊర్వశి పురూరవుని విడచి ఇంద్రసభకు వెళ్ళెను. ఊర్వశి యెడబాటు భరింపజాలక పురూరవుడు మతి భ్రమించిన వానివలె సంచరించసాగెను. అట్లు తిరుగాడుచుండగా కురుక్షేత్రములో ప్రియురాలు ఊర్వశి అగుపించెను. తనతో రమ్మని పలురీతుల అర్థించెను. కాని ఊర్వశి అతని మాటలు వినలేదు. తాను గర్భవతిననియు, ఒకసంవత్సరము వేచియుండుమనియు చెప్పెను. సంవత్సరము గడువు ముగిసినంతనే పురూరవుడు మరల ఊర్వశిచెంతకేగెను.

అంత ఊర్వశి గంధర్వులను ప్రార్థించమని చెప్పగా, అతడు గంధర్వులను ప్రార్థించెను. గంధర్వులు సంతసించి అతనికి ఒక అగ్నిపాత్రనిచ్చి, మంత్రము నుపదేశించి, మంత్రవిధులను నిర్వర్తించిన నీవు ఊర్వశిని చేరగలవని పలికిరి.

పురూరవుడు ఆపాత్రను ఒకవృక్షమూలమున పూడ్చి ఆరాత్రి యంతయు భార్యను గురించి ఆలోచించసాగెను. ఊర్వశిని మనమున తలపోయుచు కొంతతడవు గడపెను. చివరకువిసిగి, అది ఊర్వశికాదనిభావించి, దానినచ్చటనే విడచిపోయెను. నగరము చేరినతరువాతగూడ ఊర్వశిని గురించి మనోవ్యధ అనుభవించెను. అట్లు చాలకాలము గతించెను.

ఒకదినమున రాజు స్వప్నమున వేదత్రయమును దర్శించెను. వెంటనే అరణ్యమునకేగి అగ్నిస్థాలినుంచిన ప్రదేశమున చూచెను. అచ్చట ఆపాత్ర కనుపించలేదు. అపుడు పురూరవుడు రెండుఅరణులను గైకొని వేదమంత్రములను పఠించుచు మథించసాగెను. అందుండి జాతవేదసుడనుఅగ్ని యుద్భవించెను.

పురూరవుడు దానిని మూడుభాగములు చేసెను. వానిని త్రేతాగ్నులందురు. అవి దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆవహనీయము అనునవి. ఈవిధముగా పురూరవుడు అగ్నినిసంతానముగ పొంది, ఉత్తమలోకములకేగెను.

ఊర్వశికారణముగ ఆ చక్రవర్తికి అయువు, శ్రుతాయువు, సత్యాయువు, రయుడు, విజయుడు, జయుడు అను ఆరుగురు పుత్రులు కలిగిరి.

హోత్రకుని పుత్రుడు జహ్నువు. ఈతడు గొప్ప తపస్సంపన్నుడు, గంగపై నాగ్రహించి, జలమునంతటిని అరచేతిలోనికి గ్రహించి పుక్కిటిపట్టిన ప్రతిభావంతుడు జహ్నుడు. తరువాత భగీరథుని మొరాలించి, గంగను చెవినుండి వదలెను. కనుకనే గంగకు 'జాహ్నవి' అనుపేరు కలిగెను. ఈతని వంశమువాడే గాధిరాజు. గాధికి జన్మించినవాడు విశ్వామిత్రుడు.

## 48. పరశురాముడు

గాధిరాజు జహ్నుని వంశమున జననమందెను. ఆరాజు కుమార్తె సత్యవతి, ఆమె మిగుల సౌందర్యవతి. ఋచికుడు అనుముని సత్యవతిని వివాహమాడదలచి, తన అభిమతమును గాధిరాజుకు తెలియ చేసెను. గాధిరాజుకు ముని వాంఛితము నచ్చలేదు. ఇష్టములేదని చెప్పినచో మహామహిమాన్వితుడగు ముని ఆగ్రహించునేమో యని భయమందెను. అందువలన ఒకషరతువిధించెను. చెవిమాత్రము నలుపుగ యుండి మిగిలిన దేహమంతయు తెలుపుగలిగిన వేయి అశ్వములను నీయగలిగినచో నాకన్యనిచ్చి పరిణయమొనరింతునని పలికెను. అసాధారణమైన కోరిక గాధిరాజు కోరినను ఋచికుడు వెనుకాడక, రాజుకు తన అంగీకారము తెలిపెను.

ఋచికమహర్షి వెళ్లి వరుణదేవుని ప్రార్థించి, అసాధ్యమైన తన కోరికను తెలిపెను. వరుణుడు సహస్రశ్వేతాశ్వముల నను్రగహించెను. వెంటనే వానిని గొనివచ్చి గాధిరాజుకు సమర్పించగా, ఇక చేయునదిలేక సత్యవతిని ఋచికున కొసంగి పెండ్లి జరిపించెను. వరమనుకుమారి అయిన సత్యవతి భర్తయెడ మిక్కిలి ప్రేమానురాగములు గలిగి సేవించుచుండెను. ముని సత్యవతి పతిభక్తికి మిగుల సంతసించి, ఏదేని వరముకోరమని అడిగెను. అంత సత్యవతి, తనకు, తనతల్లికి పుత్రసంతతిని ప్రసాదింపుమని భర్తనుకోరెను. ఋచికుడు అందులకంగీకరించెను.

సత్యవతికి, అత్తగారికి పుత్రులు గలుగుటకు ఋచికుడు యజ్ఞమొకదానిని నిర్వహించెను. మంత్రపూరితములైన జలమును రెండు కలశములలో నింపి,

హవ్యములను అమర్చెను. ఎవరు ఏ పాత్రలోని నీరు త్రాగవలెనో, ఏహవ్యము స్వీకరించవలెనో వివరించెను. సత్యవతి ఒకమేడిమ్రానును, ఆమె తల్లి రావిమ్రానును కౌగిలించవలసినదిగ అనతిచ్చి తాను స్నానార్థము నదికేగెను.

మునిచెప్పిన దానికి భిన్నముగ వ్యవహారము జరిగెను. తీర్థకలశములు, భుజించవలసినహవ్యములు తారుమారాయెను. అట్లే సత్యవతి రావిమ్రానును, ఆమె తల్లి మేడిమానును కౌగిలించిరి. అనంతరము ఋచికమునివచ్చి, అంతయు తాను చెప్పిన దానికి భిన్నముగ జరిగినదని తెలిసికొనెను. వ్యత్యాసముగ జరిగిన దానికి ముని విచారించెను. దైవవిధినినెవరు మార్చగలరు?

అంత మహర్షి భార్యను పిలచి, "సాధ్వీ ! నీకు జన్మించు పుత్రుడు బ్రాహ్మణు డయ్యును, క్షత్రియోచిత స్వభావుడై వుండును. వీరోచితకృత్యములనే చేయును. నీ తల్లికి, సకల విద్యాపారంగతుడగు బ్రాహ్మణశ్రేష్ఠుడు జనించును. అంతయు దైవనిర్ణయం" అని పలికెను.

అంతట సత్యవతి, "నాథా ! మీరు తపోధనులు. ఎంతకైనను సమర్థులు. సౌమ్యుడు, సదాచారవంతుడు అయిన పుత్రుని అనుగ్రహించుడు. దుడుకు స్వభావుడైన పుత్రుడు నాకు వలదు." అని ప్రార్థించెను. మునియు కొంతతడవు యోచించి, "నీ కుమారుడుగాక, నీ మనుమడు అట్టిస్వభావుడై జన్మించును." అని సత్యవతిని ఓదార్చెను. మునిమాటలకు సత్యవతి కొంత ఉపశమించెను.

ఋచికునికి సత్యవతియందు జమదగ్ని జన్మించెను. జమదగ్ని పెరిగి పెద్దవాడై గొప్పమహర్షి అయెను. జమదగ్ని భార్యరేణుక. ఈమె 'రేణు' అనునాతని పుత్రిక. వీరికి పరశురాముడు జనించెను. పరశురాముడు విష్ణువు అంశలో అవతరించెను. ఈతని ఆయుధము పరశువు. పరశువనగా గొడ్డలి. కనుకనే అతనికి పరశురాముడని పేరు గలిగెను.

జమదగ్నితల్లి సత్యవతి విశ్వామిత్ర మహర్షికి సోదరి. ఆ కారణమున, విశ్వామిత్రుడు జమదగ్నికి మేనమామ యగును. అందువల్ల ఇరువంశములకు సన్నిహిత బాంధవ్యమేర్పడెను. సత్యవతి గొప్ప పతివ్రత. తన పాతివ్రత్యమహిమచేత కౌశికి నదిగా ఏర్పడి లోకపావనియని ప్రసిద్ధిగాంచెను. రేణుకా జమదగ్నులకు పుత్రులైదుగురు జన్మించిరి. వారు సుమనుడు, వసువు, వసుషేణుడు, రుమణ్వంతుడు, రాముడు. వారిలో కడగొట్టువాడు పరశురాముడు. భృగువంశ సంజాతుడగుటచే పరశురామునకు భార్గవరాముడని ప్రసిద్ధ నామముగలదు.

పరశురాముడు హిమాలయముకేగి, అనేక సంవత్సరములు శంకరునిగూర్చి ఉగ్రతపమాచరించెను. అంత పరమేశ్వరుడు ప్రత్యక్షమై, ప్రీతుడై "పరశువు"ను ఆయుధముగ నొసంగి, యింకను దివ్యశస్త్రాస్త్రములనేకములు అనుగ్రహించెను.

హైహయవంశపురాజు కార్తవీర్యార్జునుడు. అతడు కృతవీర్యుని పుత్రుడు. అతని రాజధాని మాహిష్మతీపురము. అది వింధ్యపర్వత ప్రాంతమున నర్మదానదీతీరమున గలదు. దత్తాత్రేయుని భక్తుడైన కార్తవీర్యార్జునుడు, దైవాను గ్రహముచే అనేక శస్త్రాస్త్రములు పొందెను. దైవశక్తి సంపన్నుడేగాక, గొప్ప బాహుబలాఢ్యుడై అనేకములగు విజయముల సాధించెను. అతనికి సహస్రబాహువులు గలవు. అరివీర భయంకరుడైన రావణాసురునెదిరించి జయించెను. అంతేగాక బంధించి తెచ్చి తనగృహమున వుంచిన మహావీరుడు. త్రిభువనములందును ఆవీరుని బలపరాక్రమములు ప్రసిద్ధికెక్కెను.

కార్తవీర్యుడు ఒకసమయమున తనపరివారముతో వేటకేగెను. అనంతరము జమదగ్ని ఆశ్రమమునకు రాగా, మహర్షి కార్తవీర్యుని గౌరవించి మర్యాదలు చేసెను. తన చెంతనున్న కామధేనువు మహిమతో రాజుకు, అతని పరివారమునకు చక్కని విందునిచ్చెను. విందారగించి అందరు సంతృప్తులైరి. కార్తవీర్యుడు కామధేనువు యొక్క మహిమను తెలిసినవాడై, ధేనువును తన కిమ్మని కోరెను. అతని కోరికను జమదగ్ని నిరాకరించగ, అతనికి కోపము ముంచుకొచ్చెను. కార్తవీర్యుడు మహర్షిని అగౌరవపరచి, కామధేనువును బలాత్కారముగ భటులచే గొనిపోయెను.

ఆ సమయమున పరశురాముడు ఆశ్రమమందు లేడు. తరువాత విషయము తెలిసికొని ఆగ్రహమున మండిపడెను. పరశువును, ధనుర్బాణములను చేబూని కార్తవీర్యుని రాజ్యమున కేగెను. ఇరువురినడుమ ఘోరసంగ్రామము జరిగెను. కార్తవీర్యుని శక్తియుక్తులు, బలపరాక్రమములు పరశురామునిచెంత పనికి రానివయ్యెను. విష్ణ్వంశసంభూతుడైన పరశురాముడు కార్తవీర్యుని వేయిచేతులను నరికెను. తుదకు ఆతనిశిరస్సునుగూడ పరశువుచే ఖండించి అంతమొందించెను. కామధేనువును గొనివచ్చి తండ్రికప్పగించెను. రాజును సంహరించుట పాపహేతువగు నని తండ్రిపలుక, తండ్రి నాజ్ఞగైకొని ఒక సంవత్సర కాలము తీర్థయాత్రలు గావించి, తన పాపమును నివారించుకొనెను.

ఒక సమయమున జమదగ్ని భార్యరేణుక నీటినితెచ్చుటకు గంగానదికేగెను. అపుడు చిత్రరథుడనుగంధర్వుడు అప్సరకాంతలగూడి జలక్రీడలాడుచుండెను.

అవినోదమును వీక్షించుచు వచ్చిన కార్యము మరచి కొంతజాగు చేసెను. అలస్యమునకు ఆగ్రహించిన మహర్షి తల్లినివధించమని పుత్రుల నాజ్ఞాపించెను. తల్లినివధించుట మహాపాపమని వారు తండ్రి ఆజ్ఞను పాలించరైరి. అంతజమదగ్ని పరశురామునిపిలచి, "నాయాజ్ఞను పాటించని సోదరులను, తల్లిని సంహరించు" మని ఆనతిచ్చెను. పరశురాముడెంత మాత్రము సంకోచింపక, సోదరులను, మాతృమూర్తిని పరశువుచే ఖండించెను. జమదగ్ని తన పుత్రుని మెచ్చుకొని సంతసమంది, ఏదైన వరము కోరుకొమ్మనెను.

"తండ్రీ ! నా మాట మన్నించి నాసోదరులను, తల్లిని బ్రతికించుడు. ఇంతకు మించి నాకేమియు వలదు" అని పరశురాముడు తండ్రిని కోరగ, "అట్లే అగుగాక" అని అందరిని బ్రతికించెను. పరశురాముడు వారలను గాంచి మిగులసంతసించెను.

కార్తవీర్యుని చంపినందులకు అతని పుత్రులు పదివేల మంది హైహయులు పరశురామునిపై పగబూనిరి. పరశురాముడు ఆశ్రమమందులేని సమయముచూచి, వారందరు ఆశ్రమముప్రవేశించి, తపమాచరించుచున్న జమదగ్ని శిరస్సును ఖండించిపోయిరి. పతి వియోగదుఃఖము భరింపజాలక రేణుక దుఃఖసాగరమున మునిగెను. ఆ సమయమున పరశురాముడువచ్చి విషయము తెలిసినవాడై మహోగ్రదగ్రుడయ్యెను. పెల్లుబికిన రోషావేశమున, "తన తండ్రి మరణమునకు కారకులైన క్షత్రియులను లోకమున లేకుండచేయుదు"నని దారుణ ప్రతినబూనెను. వెంటనే పరశువునుచేబూని 'మాహిష్మతీ' నగరము ప్రవేశించి హైహయులందరిని నిర్ధయగ సంహరించెను. నగరమునుగాల్చి బుగ్గియొనర్చెను. అంతటితో ఆగక భార్గవరాముడు క్రోధారుణలోచనుడై క్షత్రియవంశజుల నందరిని నిర్మూలించుటకు, ఇరువదొక్కమారులు దాడియొనర్చి రాజులనందరిని సంహరించెను. అతనిధాటికి తాళలేని రాజులుకొందరు స్త్రీరూపములుధరించి, గాజులు తొడుగుకొని మగువల మాటున దాగికొనిరి. అట్లుదాగిన రాజులలో దశరథమహారాజు ఒకడు. క్షత్రియులను సంహరించగ బారిన నెత్తురుటేరులు అయిదు మడుగులుగా ఏర్పడెను. వారి రక్తపు ధారలతో పరశురాముడు పితరులకు తర్పణవిధులను నెరవేర్చెను. ఆ అయిదు రక్తపుమడుగులకు 'శమంతపంచకము' అనిపేరు. కురుపాండవులకు జరిగిన మహాసంగ్రామము వీని సమీపముననే జరిగెను. ఆ ప్రదేశమును 'కురుక్షేత్ర' మనిరి. భార్గవరాముడు తనతండ్రిశిరమును మొండెమును ఒకచోట చేర్చి యజ్ఞమొకటి ఘనముగ జేసెను. యజ్ఞప్రభావముచే ముని మరల బ్రతికెను. అనంతరమున

మహర్షి నక్షత్రమండలమున సప్తర్షులలో యొకడై ప్రకాశించెను. పరశురాముడు యజ్ఞయాగములనేకములు చేసెను. భూమండలమునగల పుణ్యక్షేత్రములను, తీర్థములను దర్శించి సేవించెను.

శ్రీమహావిష్ణువు కౌసల్యాదశరథులకు పుత్రుడై జన్మించెను. శివధనుర్భంగము గావించి, జనకుని కుమార్తె జానకిని పరిణయమాడి అయోధ్యకు తిరిగి వచ్చుచుండెను. తనకు గురువు, ఆరాధ్యదైవము అయిన శివునివింటిని విరచి, శివాపరాధము గావించెననితలచి పరశురాముడు కోపించి శ్రీరామునెదుర్కొనెను. దశరథుడు తనకుమారుని మన్నించి కాపాడుమని ప్రార్థించెను. కాని పరశురాముడు వినక రాముని నిలువరించెను. "నాధనువు నెక్కుపెట్టి నీప్రతాపముచూపు"మని తన ధనువును రామునకిచ్చెను. భగవత్స్వరూపుడైన శ్రీరాముడు అవలీలగా వింటిని సంధించి, పరుశురాముని తేజస్సు హరించెను. అంతటితో రాముని అవతార పురుషునిగా నెరింగి, తన రాజసతామస ప్రవృత్తులను త్యజించి, శాంతచిత్తుడై తపమాచరించు నిమిత్తము మహేంద్రపర్వతము చేరెను. పరశురాముడు చిరంజీవియై, రాబోవు మన్వంతరమున సప్తర్షులలో నొకడై విరాజిల్లును.

## 49. నహుషుడు

పురూరవుని కుమారుడు ఆయువు. అతనికి నహుషుడు, క్షత్రవృద్ధుడు, రజిరంభుడు, అనేనుడు, అనంగుడు అనుపుత్రులు అయిదుగురు కలిగిరి. అందు క్షత్రవృద్ధుని సంతతికిచెందిన శౌనకుడు గొప్ప మునిగా ప్రసిద్ధుడు, ఆవంశమందే ధన్వంతరి, కువలయాశ్వుడు జనించిరి. కువలయాశ్వుని కుమారుడు అలర్కుడు. అతడు నిత్యయౌవనముతో అరువదారువేల సంవత్సరములు రాజ్యపరిపాలనము గావించెను.

ఆయువుని కుమారుడు నహుషుడు క్రతువులనేకములాచరించి ప్రసిద్ధి గాంచెను. నహుషుని భార్య ప్రియంవద. యజ్ఞయాగాదులు పెక్కు చేసిన కారణముగా నహుషునకు స్వర్గలోకాధిపత్యము లభించెను. అదేసమయమున ఇంద్రుడు స్వర్గమును విడచివెళ్లెను. అందుచే నహుషుడు ఇంద్రపదవినధిష్ఠించెను. స్వర్గాధిపతియైన నహుషునకు అధికారమదగర్వము కన్నులకెగదట్టెను. దేవతలను, మహర్షులను లెక్కచేయక అవమానపరచెను. ఇంద్రుని భార్యయైన శచీదేవిని కామించి, ఆమెను తనవద్దకు గొనిరమ్మని ఆజ్ఞాపించెను. అందులకు శచీదేవి మిగుల కలత చెంది

విలపించెను. దేవగురువైన బృహస్పతి ఆమెకు ఒకఉపాయము చెప్పెను. దాని ప్రకారము నహుషుడు పల్లకిలో కూర్చొని, సప్తమహర్షులు పల్లకిమోయుచుండగ శచీదేవిచెంతకు బయలుదేరెను. కామమోహితుడైన నహుషుడు మహర్షులను కాలితో నదిలించసాగెను. అంత్యకాలము సమీపించినందుననే వీనికిట్టి దుర్బుద్ధి కలిగినదని మహర్షులు భావించి, చేయునదిలేక పల్లకిమోయుచుండిరి. మదాంధుడైన నహుషుని పాదము అగస్త్యమహామునికి తాకెను. వెంటనే మహర్షి మండిపడి "ఓయీ! దుర్మతీ! కామాంధుండవై మహర్షులను అవమానించుటయేగాక, పల్లకిమోయుచున్న నన్ను కాలితోతన్ని ఘోరఅపచార మొనరించితివి. దానికి ఫలితముగ అధికారమును గోలుపోయి, పతనమై భూలోకమున ఒక సర్పముగా పడియుందుము" అనికఠినముగ శపించెను.

నహుషుడు తప్పును గ్రహించి, తన అపరాధమును మన్నించి క్షమించమని మునిని ప్రార్థించెను. అంత అగస్త్యుడు, "ఓయీ ! నీ ప్రశ్నలకు సమాధానము నెవ్వరైన చెప్పగలిగినచో, నీకు శాపవిముక్తి యగును." అని శాపవిమోచనవిధమును తెలిపెను. వెంటనే నహుషుడు స్వర్గమునుండి భూలోకమునకు పతనమై ఘోరారణ్యమున గొప్పసర్పాకృతిని పొందెను.

పాండవులు అరణ్యవాసముచేయుచున్న సమయమున, సర్పరూపములోనున్న నహుషుడు భీముని పట్టి బంధించెను. మహాబలుడైన భీముడు అజగరము బారినుండి తప్పించుకొన జాలడయ్యెను.

ధర్మరాజు తమ్మునివెదకుచువచ్చి, సర్పముచేజిక్కిన భీమునిజూచి మిగుల విచారించెను. తమ్ముని విడచి పుచ్చి పుణ్యము కట్టుకొమ్మని ధర్మజుడు సర్పమును వేడుకొనెను. అపుడాసర్పము, "ఓరాజా! నాప్రశ్నలకు సరియగు సమాధానములు చెప్పగలిగితివేని, భీమునివిడుతు" నని బదులుపలికెను.

అంతటాసర్పము ధర్మజుని చాలకఠినమైనప్రశ్నల నడిగెను. అవి ధర్మబద్ధమైనవి. వానినే యక్షప్రశ్నలందురు. ధర్మసూక్ష్మములు బాగుగనెరిగిన ధర్మజుడు వానిప్రశ్నలకు సరియగు సమాధానములిచ్చెను. అంతట నహుషునకు శాపవిమోచ నమయ్యెను. నహుషునకు సర్పరూపముపోయి, నిజరూపమువచ్చెను. నహుషుడు ధర్మరాజును కొనియాడి, బ్రహ్మజ్ఞానమంది పుణ్యలోకములు చేరెను.

# 50. యయాతి

చంద్రవంశపు రాజులలో యయాతి సుప్రసిద్ధుడు, ఇతడు నహుషుని కుమారుడు. యాయాతిచక్రవర్తి శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని పెండ్లాడెను. దేవయాని మిగులసౌందర్యవతి. వృషపర్వుని పుత్రిక. శర్మిష్ఠ దేవయానికి మిత్రురాలు. వృషపర్వుడు దానవరాజు.

ఒకదినమున దేవయాని శర్మిష్ఠలు వనవిహారమునకు వెళ్లిరి. వారితో చెలికత్తెలు కూడవుండిరి. అందరు అటపాటలతో కొంతకాలముగడపి, ఒకకొలనులో జలక్రీడ లారంభించిరి. అదే సమయమున పార్వతీపరమేశ్వరులు గగనమున విహరించు చుండగా, కన్యలందరు సిగ్గుచెందిరి. వేగముగ ఒడ్డునుచేరి వారివారి వస్త్రములు ధరించిరి. అతొందరలో పొరపాటున దేవయాని చీరను శర్మిష్ఠ ధరించెను. అందుకు దేవయాని కోపమున మండిపడెను. అందరి సమక్షమున శర్మిష్ఠను నీచాతినీచముగ నిందించి ఆడిపోసికొనెను. కులముపేరిడి ఆక్షేపించెను. దేవయానిమాటలకు శర్మిష్ఠయు ఆవేశమున పలువిధముల తూలనాడి, దేవయాని నొక పాడుపడ్డనూతిలో పడద్రోసి, చెలులతోగూడి నగరము చేరెను.

నూతిలో పడినదేవయాని బయటపడు మార్గముతెలియక రోదించసాగెను. అట్టి సమయమున వేటకై యయాతిమహారాజు వచ్చి, అబల అర్తనాదమువినెను. వెంటనే నూతిచెంతకేగిచూడ ఒక చక్కనియువతి వివస్త్రయై విలపించుచుండుట గాంచెను. అతని మనసు జాలితో నిండెను. తనభుజముపైనున్న ఉత్తరీయమును ఆమెకు ధరించమని యిచ్చెను. తనచేతిని లతాంగికి అందించి పైకిలాగి రక్షించెను. తనను ప్రాణాపాయమునుండి రక్షించిన యయాతిని గాంచినంతనే దేవయానికాతనిపై ప్రేమ కలిగెను. అతనిని వివాహమాడవలెనని నిశ్చయించుకొని. తన గాథనంతటిని వివరించెను. మరియు దేవయాని, "మహారాజా! మీరు నాపాణిని గ్రహించి కాపాడినారు. ప్రాణిగ్రహణము వివాహమునకు చిహ్నము. కావున మీరే నాపతిదేవులు. మిమ్ములనుదక్క అన్యులను పెండ్లాడను." అని తన నిశ్చితాభిప్రాయమును చెప్పెను.

యయాతి దేవయాని మాటలువిని ఆమెని పెండ్లాడుటకు సంశయించెను. దానవగురువగు శుక్రాచార్యుడు ఆగ్రహించునని భయమందెను. "ఓ సుందరీ ! నీవు బ్రాహ్మణకన్యవు. నేను క్షత్రియుడను. మన వివాహము ! ధర్మవిరుద్ధమని, ఆమెకోరికను నిరాకరించెను. కాని దేవయాని పట్టినపట్టు విడువలేదు. తనతండ్రి

శుక్రాచార్యులవారి అనుమతిని పొందినమీదట పెండ్లాడుదమనెను. మరియు తనకు శాపముకూడ వున్నదని, కచుని పూర్వవృత్తాంతమును వివరించెను.

బృహస్పతి దేవగురువు. అతని పుత్రుడు కచుడు. ఆతడు మృతసంజీవనీవిద్య నభ్యసించుటకు శుక్రాచార్యుని వద్దచేరెను. గురువును శుశ్రూషలచే నొప్పించి ఆచార్యుని అనుగ్రహము పొందెను. ఎటులో శ్రమించి మృతసంజీవినీ విద్యను అభ్యసించెను.

శుక్రాచార్యుని కుమార్తె దేవయాని కచునితో పరిచయ మేర్పరచుకొనెను. ఆటపాటలందు, కలసిమెలసి యుండెడివారు. అది క్రమముగా దేవయాసక్తి అతనియందు ప్రేమగ బలపడెను. కచుని పెండ్లాడ నిర్ణయించుకొని వానిని పెండ్లికి బలవంతపెట్టెను. కాని కచుడు దేవయాని కోర్కెను తిరస్కరించెను. "నీవు గురుపుత్రివి. నాకు సోదరివంటి దానవు. నిన్ను వివాహమాడుట మహాపాపమగును. నీ మనసుమార్చుకొనుము." అని నయమున బలికెను.

దేవయాని కోపమున మండిపడెను. "ఓయీ! నీవు నాకోరికను మన్నించ నందున నీవు నేర్చినవిద్య సమయమునకు అక్కరకుపకరించకుండు గాక" యని శపించెను. కచుడును, "నీవు నిష్కారణముగ నన్ను శపించినావు. అందుకు ఫలితముగ నిన్ను బ్రాహ్మణుడు పెండ్లియాడకుండుగాక" అని ప్రతిశాపమొసంగి అటనుండి వెడలిపోయెను.

దేవయాని తనపూర్వగాథను వివరించెను. అటుమీదట దేవయాని తండ్రివద్ద కేగి, శర్మిష్టకు, తనకు మధ్య జరిగిన వివాదమును, ఆమె తనకొనర్చిన అవమానమును వివరించెను. తన పుత్రికకు జరిగిన పరాభవమునకు శుక్రాచార్యుడు చాలవ్యథచెంది. వృషపర్వునివిడచి, కుమార్తెతో వెడలిపోయెను. అది తెలిసిన దానవరాజు వృషపర్వుడు, శుక్రాచార్యుచెంతకేగి వాని పాదములపైవ్రాలి ప్రార్థించెను. తన కుమార్తె యొనర్చిన అపరాధమును మన్నించి, తిరిగి నానగరమునకు రండు." అని ఆచార్యుని వేడుకొనెను.

విప్రుని కోపము గడ్డిమంటతో సమానము. గడ్డిమంట ఒక్కసారిగ మండి, వెంటనే ఆరిపోవును. వృషపర్వుని ప్రార్థనము మన్నించి, శుక్రాచార్యుడు శాంతచిత్తుడై తిరిగి నగరప్రవేశమునకు అంగీకరించెను. కాని దేవయాని ఒక షరతు విధించెను. "ఓరాజా! నాతండ్రి నాకు వివాహముచేసి నన్నుభర్తతోడ పంపునపుడు, నీకుమార్తె

శర్మిష్ఠయు, తనవారితోవచ్చి నాకు ఊడిగముచేయుచు నాతోడనెవుండి తీరవలెను. ఈ నిబంధన నీకు యిష్టమైనచో మేము నీరాజ్యమునకు వత్తుము." అని చెప్పెను.

దేవయాని విధించిన షరతు వృషపర్వునకు పెద్దసమస్య అయెను. తనపుత్రికను పంపినచో, ఆమె బ్రతుకు నాశనమగును. పంపకున్నచో ఆచార్యుని ఆగ్రహమునకు తాను, తనవారు అంతరించు ప్రమాదము సంభవించును. ఏమిచేయుటకు తోచని వాడై కొంతతడవు ఆలోచించెను. చివరకు దేవయాని విధించిన నిబంధనకు లోబడి, తనపుత్రిక శర్మిష్ఠను పంపుటకంగీకరించెను. శర్మిష్ఠను పరివారముతో దేవయాని కప్పగించెను.

శుక్రాచార్యుడు దేవయానిని ఆమె యభిమతముమేరకు యయాతికొసగి వివాహము చేసెను. దేవయాని భర్తవెంట వెళ్లునపుడు శర్మిష్ఠకూడ తన పరివారముతో వెళ్లెను. మరల దేవయాని నియమమొకటి పెట్టెను. తన భర్త యయాతి ఎట్టి పరిస్థితి యందును శర్మిష్ఠను కన్నెత్తిచూడరాదు. మాటాడరాదు. కలువరాదు." అని. అందులకు యయాతి సమ్మతించెను. అందుకుగాను. శర్మిష్ఠకు వేరొక విడిది మందిరము నేర్పాటు చేసెను. యయాతి దేవయానితో భోగములదేలుచు రాజ్య పాలనము, ప్రజాక్షేమము యధావిధి నెరపుచుండెను.

శర్మిష్ఠ దేవయాని కారణముగా తనకు జరిగిన అన్యాయమును తలచి లోలోన కుములుచుండెను. యవ్వనము, సౌందర్యము అడవి కాచిన వెన్నెల చందమున వ్యర్థమగుచున్నందులకు, తనదుస్థితికి వాపోవుచుండెను.

ఒక దినమున శర్మిష్ఠ ఋతుస్నాతయై, సర్వాలంకారభూషితయై ఏకాంతమున యుండెను. అట్టి తరుణమున యయాతి ఆమెకంటబడెను. రాజును కాంచినంతనే ఆమెయందు మదనుడు మేల్కొనివేధించెను. మదనతాపమును భరింపజాలక యయాతిని నిలువరించి, తనకు పుత్రుని ప్రసాదింపుమని కోరెను. తనను పత్నిగ స్వీకరించి తనవాంఛను తీర్చుమని ప్రాధేయపడెను. యయాతియు ఆమెకోర్కెను మన్నించి, రతిక్రీడల సుఖింపచేసెను. దాని ఫలితముగ శర్మిష్ఠ గర్భవతయ్యెను.

ఆ విషయము దేవయానికి తెలిసెను. భర్తపై కోపమున మండిపడెను. నియమమును మీరినందులకు ఆతనిపై అలుకబూని పుట్టినింటికేగి, విషయమును తండ్రి శుక్రాచార్యునకు నివేదించెను. అంత యయాతి దేవయాని వద్దకుచని, పలు

విధముల నచ్చబలికెను. ఎంతకు దేవయాని వినలేదు. మొండిగ ప్రవర్తించెను. శుక్రాచార్యుడంత, ఆగ్రహించి, "ఓయీ ! రాజా ! కామాంధకారమున నియమమును మీరి ప్రవర్తించి నాకుమార్తెకు తీరని ద్రోహమొనర్చినావు. అందుకు ఫలితముగ దుర్భరవార్ధక్యము ప్రాప్తించుగాక" అని నిర్దయుడై శపించెను.

అంతట యయాతి తీవ్రమనస్తాపముచెంది, శాపవిముక్తి ననుగ్రహించమని శుక్రాచార్యుని ప్రార్థించెను. అందులకు ఆచార్యుడు, నీపుత్రులలో నెవరైన నీవార్ధక్యమును గ్రహించినచో, వారియౌవనమును నీవు స్వీకరించి సుఖింతువని శాపవిముక్తి తెలిపెను. శాపఫలితముగా యయాతి రాజేంద్రుని భయంకరవార్ధక్యము ముంచివైచెను.

అప్పటికి యయాతికి దేవయానివలన యదు, పర్వసు అను ఇరువురు పుత్రులును, శర్మిష్ఠవలన ద్రుహ్యుడు, అనుడు, పూరుడు అను ముగ్వురు తనయులు జన్మించిరి. యయాతికి యింకను స్త్రీ వ్యామోహము తీరనందున కామాగ్నిచే పీడింపబడుచుండెను. ఒక దినమున తనపుత్రులను చేరబిలచి, "మీలోనెవ్వరైనను తన ముసలితనమును స్వీకరించి, యౌవ్వనమునిందు" అని కోరెను. ఎవరును యాయితి కోరికను మన్నించరైరి. అందరు వ్యతిరేకించిరి, కాని వారిలో పూరుడు మాత్రము తండ్రి మాటను శిరసావహించెను. తనయౌవనమును తండ్రికి సంక్రమింప చేసి, తండ్రిజరను తానుసంతసమున స్వీకరించెను. పూరుడు శర్మిష్ఠపుత్రుడు.

యాయాతి, అటు తరువాత పెక్కు సంవత్సరములు ఐహికభోగముల దేలియాడి, విరక్తుడయ్యెను. భగవద్భక్తుడై, అనేక యజ్ఞములాచరించెను. పురునకు యౌవ్వనము నప్పగించి, వార్ధక్యమును గ్రహించెను. తనరాజ్యమును తనయులకు పంచి, పూరుని సార్వభౌమునిగా అభిషిక్తుని గావించెను. అన్నలమాటమీరక రాజ్యమును ధర్మయుతముగ పాలించుమని ఆశీర్వదించెను. అనంతరము సర్వము త్యజించి ముక్తసంగుడై తపోభూములచేరి, పరంధాముని ఆరాధించి విష్ణుపదము పొందెను. దేవయానియు సర్వముత్యజించి భక్తిమార్గమున భర్త ననుసరించి దేహము త్యజించెను.

యయాతి పుత్రులు ధరామండలమును నాలుగుచెరగులు పాలించుచుండగా, పూరుడు చక్రవర్తియై ప్రకాశించెను. పూరునకు భరతవంశపురాజులెందరో జన్మించిరి. ప్రసిద్ధుడైన దుష్యంతుడు ఈవంశములోనివాడే.

## 51. శకుంతల

పూర్వమొకసమయమున విశ్వామిత్రుడు తపోనిష్టయందుండెను. మహర్షి తపమును భగ్నమొనర్పదలచి ఇంద్రుడు మేనకను ప్రేరేపించి పంపెను. మేనక తనహావభావ నటనాచాతుర్యములతోడను, మృదుమధురగానకళా నైపుణ్యముతోడను, సౌందర్యమును ప్రదర్శించియు మహర్షి ధ్యాననిష్టను భంగమొనర్చెను. మునియు మేనక రూపసౌందర్యాది విలాసములకు, మత్తున ముంచెడి ముగ్ధమోహనాకృతిని గాంచి ఆమెయందు మోహితుడయ్యెను. కామిని యందు కామేచ్ఛ బలీయముకాగా మేనకను మోహించి భోగించెను. దాని ఫలితముగ ఆమెకు ఒక బాలిక జన్మించెను. పసిపాపను నట్టడవిలో నిర్దయగవదలి మేనక తిగిరి స్వర్గముచేరెను. విశ్వామిత్ర మహర్షియు జరిగిన పొరపాటుకు ఖిన్నుడై అందుండి వెడలిపోయెను.

నిర్దాక్షిణ్యముగా తల్లిదండ్రులచే విడనాడబడిన ఆశిశువును పక్షులు రక్షించి కాపాడెను. వనమునకువచ్చిన కణ్వమహాముని బాలికను కనుగొని, జాలిగొని, ఆశ్రమమునకు గొనిపోయెను. శకుంతపక్షులచే సాకబడిన కారణమున బాలికకు శకుంతల యని పేరిడి అల్లారుముద్దుగ పెంచసాగెను. కణ్వాశ్రమములో పెరిగిన శకుంతలకు యౌవనమంకురిం చెను. అందుకు తోడుగ సౌందర్యమున అప్సరసలను మించియుండెను.

పూరువంశజుడైన దుష్యంతుడు ఒకదినమున వేటకైవచ్చెను. వేటకారణమున దుష్యంతుడు మిగుల అలసెను. చేరువులో వున్న కణ్వాశ్రమము చేరెను. ఆ సమయమున ముని ఆశ్రమమునలేడు. శకుంతల దుష్యంత మహారాజును గౌరవించి అతిథ్యమిచ్చెను. శకుంతల రూపలావణ్యములుగాంచి రాజామెను మోహించెను. రాజుయందు ఆమెకును మోజుకలిగెను. ఇరువురి మనస్సులు లగ్నమాయెను. తనను వివాహమాడుమని రాజు శకుంతలనడిగెను. క్షత్రియులకు గాంధర్వవివాహము శాస్త్ర సమ్మతమనియు, పుట్టబోవుపుత్రుని యువరాజును చేయుదునని చెప్పి వివాహమునకు సుందరిని యొప్పించెను. ఇరువురు గాంధర్వవిధిని పెండ్లాడిరి. దుష్యంతుడు నాటిరేయి అందేయుండి శకుంతలతో రతిక్రీడావిలాసముల సుఖించెను.

మరునాడు దుష్యంతుడు నగరమునకు బయలుదేరగ, శకుంతలకూడా భర్తవెంట ప్రయాణమయ్యెను. దుష్యంతుడు అందులకంగీకరించలేదు. "దేవీ ! నిన్ను రాజలాంఛనములతో పురమునకు గొనిపోదును. అందులకు నాపరివారజనులు

సకల సన్నాహములతో రాజలాంఛనములతో వత్తురు. నేను రాజధానికిచేరి వెంటనే తగిన యేర్పాట్లు గావింతును." అని శకుంతలను సమాధానపరచి, తన వ్రేలిముద్దు టుంగరమును ఆమె చేతివ్రేలుకు అలంకరించెను. అనంతరము దుష్యంతుడు తన రాజ్యమునకు చనెను.

శకుంతల గర్భము ధరించెను. తానొనర్చిన కృత్యమునకు కణ్వుడు ఆగ్రహించునేమోయని మనమున కలతనొందసాగెను. ఒకనాడు మహర్షికణ్వుడు ఆశ్రమము చేరుకొనెను. మహర్షినెదుటపడుటకు శకుంతల భయమందెను. కుమారి కలవరపాటును, భయాందోళనమును గ్రహించిన మహర్షి తన దివ్యదృష్టిచే సర్వము నెరిగెను. మనమున సంతసమంది బిడ్డను ఓదార్చి శాంతింపచేసెను.

శకుంతలకు నెలలు నిండెను. ఒక శుభసమయమున ఆసాధ్వి ఒక మగ శిశువును కనెను. కణ్వమహర్షి ఆనందించెను. బాలునకు జాతక కర్మాది సంస్కారములు యథావిధి నిర్వర్తించి, 'భరతుడు' అని నామమిడెను. లోకోత్తర పురుషుడ వగుదువని దీవించెను. శుభలక్షణములతో జన్మించిన భరతుడు బాల్యము నందే సాహసకృత్యములు చేయసాగెను. మహావీరునిపగిది జంకులేక పులి పిల్లలను అవలీలపట్టి పిల్లిపిల్లల వలె ఆడించువాడు. బాలుని శౌర్యసాహములు కనుగొని తల్లిభయమందెడిది. కణ్వమహర్షి ఆనందించెడివాడు. ఇతరులు ఆశ్చర్యచకితులైరి. అటుల కాలము జరుగుచుండెను. దుష్యంతుడు మరలరాకుండెను. పరివారజనులను పంపియుండలేదు. అసలు వర్తమానమేలేదు. తనను మరచినాడేమోయని శకుంతల భయాందోళనములు చెందెను. ఆమె మనము దిగులుతో నిండెను. ఆమె మనోవ్యథ అనిర్వచనీయము.

ఒకదినమున కణ్వాశ్రమమునకు దుర్వాసమహర్షి వచ్చెను. అసమయమున కణ్వుడు ఆశ్రమమున లేడు. శకుంతల మాత్రముండెను. ఆమె మనమున భర్త దుష్యంతుని తలచుచుండెను. మునిరాకను గమనించక, పరధ్యానమున యుండెను. తనను పలుకరించి గౌరవించలేదని దుర్వాసుడు శకుంతలపై కోపగించెను. "ఓయీ! నీవెవరిని మనమున నింపుకొని తలచుచుంటివో, అతడు నిన్ను మరచుగాక" యని దుర్వాసుడు శకుంతలను శపించెను. అంత శకుంతల మునిని పరిపరి విధముల ప్రార్థించి క్షమింపుమని ప్రాధేయపడెను. శాపపరిహారము అనుగ్రహింపుమని వేడెను. అపుడుముని శాంతించి, "దుష్యంతుడు నీకు గుర్తింపుగ నొసగిన ముద్దుటుంగరమును

చూడగలిగిచో, నీవాతనికి జ్ఞప్తికి వత్తువు" అని శాపవిమోచనమును వివరించెను. దుర్వాసముని శాపకారణముగ దుష్యంతుడు శకుంతలను మరచెను.

శకుంతల కణ్వమహర్షి అనుమతిగైకొని పుత్రుడు భరతునితో దుష్యంతుని రాజధాని ప్రతిష్ఠానపురము బయలుదేరెను. శకుంతల అత్తగారింటికి బయలుదేరగ, కణ్వుడు కలతచెంది కన్నీరు గార్చెను. పెంచిన ప్రేమ గదా ! తండ్రివలె ఆమెను సాగనంపుచు పాతివ్రత్య ధర్మములు బోధించెను. భరతుని కౌగిటచేర్చి ముద్దాడెను. ఆమెతోపాటు తనపరివారము ప్రయాణమైరి.

రాజధాని చేరిరి. అపుడు దుష్యంతుడు దర్బారుచేయుచుండెను. భటుల యనుమతి పొంది రాజును దర్శించి శకుంతల తనను, కుమారుని స్వీకరింపుమని కోరెను. కాని దుష్యంతుడు ఏమియు తెలియనివానివలె ప్రవర్తించెను. "నీవెవరివోనాకు తెలియ"దని నిరాకరించెను. అంతశకుంతల దుఃఖించసాగెను. ఆశ్రమమున నాటివారి కలయిక, సంభాషణలు, గాంధర్వవిధిగ జరిగిన వివాహము, పొదరిండ్ల యందు జరిగిన రాసక్రీడావిలాసములు, శుకపికముల మధురగానములు, మయూరముల నృత్యములు, పంచభూతములసాక్షిగ రాజుచేసిన ప్రమాణము మున్నగు అంశములన్నియు ఒక్కొక్కటి వివరించెను. "మన దాంపత్యజీవనమునకు వంశాంకురము ఈ బాలుడు. భరతుడు నీ పుత్రుడే." అని విలపించుచు గత విషయములను జ్ఞప్తికి తెచ్చెను. కన్నీరుమున్నీరుగా గాంచువారి హృదయములు ద్రవించులాగున రోదించెను. అవన్నియు అసత్యములని, అవాస్తవములని దుష్యంతుడు త్రోసిపుచ్చెను. నిరాదరణమున నిరాకరించెను.

అంత ఆకాశవాణి, "ఓ రాజా! శకుంతల నీభార్య, ఆమెనుడివినవన్నియు యదార్థములు, ఆ బాలుడు నీకుమారుడు భరతుడు. అమితతేజోవంతుడు, లోకోత్తర కీర్తివంతుడగును. నీవు భార్యకు అలంకరించిన అంగుళీయకమును చూడుము. అన్నియును నీకు జ్ఞాప్తికి రాగలవు. నీ భార్యను, పుత్రుని స్వీకరించి కీర్తివంతుడవు గమ్ము." అని పలికెను. దుష్యంతుడు శకుంతల చేతికి వున్న ఉంగరమును చూచెను.

అంత గతస్మృతులన్నియు దుష్యంతుని మనోఫలకమున ప్రతిబింబించెను. విధివశమున జరిగిన పరిణామమునకు మిగుల వగచెను. శకుంతలను, కుమారుని ఆదరమున దరిచేర్చుకొని ఆనందించెను. కణ్వమహర్షియు, అంతయు సుఖాంతమై నందులకు మిగుల సంతసించి, మహారాజదంపతులను ఆశీర్వదించి, ఆశ్రమము చేరెను.

దుష్యంతుని అనంతరము భరతుడు చక్రవర్తియై ముల్లోకము లందును అఖండకీర్తిని సంపాదించెను. దీర్ఘతపుని ఆధ్వర్యమున గంగానదీతీరమున యాబది యైదు అశ్వమేధములు, యమునానదీ తీరములో డెబ్బది ఎనిమిది వాజిపేయములు దిగ్విజయముగ నిర్వహించెను. భూరి దానాది దక్షిణలతో బ్రాహ్మణులను, వేదవిదులను గౌరవించెను. దేవతలు, మునులాదిగ మహనీయులు భరతుని విష్ణ్వంశసంభూతునిగ భావించి కొనియాడిరి.

భరతుడు ఇరువదివేల సంవత్సరములు ధరామండలమును పాలించి, ముక్తసంగుడై, సర్వము త్యజించి తపోభూములకేగెను. నిశ్చల మనస్కుడై తపోనిష్ఠను గైకొని, దేహముత్యజించి విష్ణుపదమును చేరెను.

భరతచక్రవర్తికి ముగ్గురు భార్యలు గలరు. వారందరు సంతానవంతులే అయినను కలిగిన పుత్రులందరు మరణించిరి. అపుడు భరతుడు యజ్ఞమొకటి నిర్వహించి మరుత్తులను ఆరాధించెను. అంత మరుత్తులు భరద్వాజుని గొనివచ్చి భరతుని పుత్రునిగావించిరి.

## 52. భరద్వాజుడు

పూర్వమొక సమయమున బృహస్పతి తన సోదరుని భార్య మమతను మోహించెను. కాని ఆ సమయమున ఆమె గర్భవతి. తననుచెరిచి తనజీవితమును పాడు చేయవలదని వేడుకొన్నది. ఆమె గర్భస్థశిశువుగూడ వలదనివారించి ప్రార్థించినను బృహస్పతి వినలేదు. మమతను బలాత్కరించి భోగించి తన కామతృష్ణను తీర్చుకొనెను.

ఆ తరువాత మమతకు ఒక పుత్రుడు కలిగెను. కాని ఆబాలుని, ఆమెను గ్రహించక వదలివేసెను. బృహస్పతి కూడా దయదాక్షిణ్యములు చూపక బాలుని విడచిచనెను. ఇద్దరి వీర్యము కలయికవలన జన్మించిన బాలుడు భరద్వాజుడయ్యెను. ఆ పిల్లవానిని ఆదరించి పెంచుకొను విషయములో మమత బృహస్పతులు నీవంటె నీవని' వాదులాడుకొనిరి. వారిలో ఏఒక్కరును భరించుటకు యిష్టపడని కారణముగ, అతడు భరద్వాజుడయ్యెను. తుదకు ఆబాలుని మరుత్తులు గొనిపోయి పెంచిరి. అతనిని గొనివచ్చి భరతునకు పుత్రునిగ నొసంగిరి. భరతుడు వానిని దత్తపుత్రునిగ స్వీకరించెను. అతనికి వితథుడని పేరు గలిగెను.

# 53. రంతిదేవుడు

భరతుని వంశమున మన్యువు జన్మించెను. మన్యువునకు బృహత్క్షత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు అను ఐదుగురు పుత్రులు గలిగిరి. అందునరునకు సంకృతి జన్మించెను. సంకృతి పుత్రుడు రంతిదేవుడు. ఇతనికి దానశీలుడనుఖ్యాతి ముల్లోకములందు వ్యాపించెను. రంతిదేవునకు దైవానుగ్రహమున విశేష సంపదలొనగూడెను. సంపదనుగాంచి అతడు గర్వించలేదు. ఐహిక భోగభాగ్యములనాశించలేదు. ధనమునందు భ్రాంతివీడి తన సంపదనంతను దానధర్మములకు వినియోగించెను. దైవోపలబ్ధమైన ద్రవ్యమునే కుటుంబ పోషణకు వినియోగించెడివాడు. తనకున్నదానితో తృప్తిచెందెడివాడు. అనేక బాధలను దుఃఖములను అనుభవించెను. అయినను తనకు లభించిన దానిలోనే దానధర్మములు చేయుచు, మిగిలినది తాను అనుభవించెడివాడు. ఒక్కొక్క దినమున తినుటకు పట్టెడు మెతుకులుకూడ లభించెడివి కావు. ఒకానొక సమయమున త్రాగేందుకు మంచినీరుకూడా లభించక నలుబదెనిమిది రోజులు కటికోపవాసములు చేసెను.

ఒక దినమున అతనికి కొలదిగ భోజనము లభించెను. దానిని భుజించనుండగా బాగుగ ఆకలిగొన్న బ్రాహ్మణుడు అతిథిగవచ్చెను. రంతిదేవుడు అతిథిని శ్రీహరిగ భావించి, లభించిన భోజనమందు సగభాగమును బ్రాహ్మణునకు సమర్పించి సంతృప్తుని గావించెను. మిగిలినదానిని తాను, తనవారు భాగించుకొని భుజించు సమయమునకు ఒక శూద్రుడు ఆకలిబాధకు నకనకలాడుచు వచ్చెను. అతనివెంట శునకముగూడ వుండెను. "క్షుద్బాధతో మేమిద్దరము అల్లాడిపోతున్నా"మని రంతిదేవుని ప్రార్థించెను. అపుడారేడు ఎంతమాత్రము సంకోచింపక, అన్నమును అతనికి, కుక్కకుపెట్టి కాపాడెను. తాను కొంచెము జలపానముచేసి ప్రాణములు నిలుపుకోదలచి, నీటిని త్రాగుటకు సంసిద్ధమాయెను. నీటినిత్రాగు సమయమునకు ఛండాలుడొకడు, కడప్రాణములు కన్నులలో నిలుపుకొని అచ్చటికరుదెంచెను. త్రాగుటకు గుక్కెడునీళ్ళిచ్చి ప్రాణములు నిలుపుమని వేడెను. ఆ సమయమున తనప్రాణములు కోల్పోవుటకు సిద్ధముగ నుండెను. అయిన ఆ రాజు సందేహించక, తాను త్రాగదలచిన నీటిని ఛండాలునకిచ్చి, వాని ప్రాణములు నిలిపెను.

అంత బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ప్రత్యక్షమైరి. రంతిదేవుని భక్తిని, దానశీలతను పరీక్షింపగోరి బ్రాహ్మణుడు శూద్రుడు, శునకము, ఛండాలుర రూపములో వచ్చినది

తామేయని పలికిరి. ఏదేని వరము కోరుకొనుమని రంతిదేవునడిగిరి. అతడును పరమానంద భరితుడై త్రిమూర్తులను పలువిధముల స్తుతించెను. తనకు "సదా విష్ణుభక్తిని ప్రసాదింపు"మని వేడుకొనెను. వారును అతని ననుగ్రహించి అంతర్ధానులైరి. అనంతరము రంతిదేవుడు ఉత్తమగతులు పొంది సుఖించెను.

## 54. వసుదేవుడు

ఒకానొక సమయమున 'కాళింది' నదీతీరమున 'మధువనము' అనువనము ఉండెడిది. మధువనువాడు ఆప్రాంతమును పాలించెను. అతని రాజ్యమునకు రాజధాని మధురానగరము. మధువు తరువాత అతని కుమారుడు లవణుడు రాజాయెను. లవణుడు కడుదుష్టుడు. అసురప్రవృత్తిగలిగి దుష్కార్యములెన్నింటినో చేసెను. శ్రీరాముని తమ్ముడైన శత్రుఘ్నుడు యుద్ధమందు లవణుని సంహరించి, రాజ్యమును తనపుత్రులైన పుష్కర, పుష్కరాక్షులకు అప్పగించెను. అది త్రేతాయుగపు నాటి చరిత్ర. క్రమముగ సూర్యవంశపు రాజులు అంతరించిన పిదప మధురారాజ్యము యాదవవంశీయుల వశమైనది.

యాదవ రాజులలో శూరసేనుడను రాజు వీరాగ్రేసరుడు. అతడు మధురా పురమును రాజధానిగ చేసికొని మాధురము, శూరసేనమను రెండు దేశములను పాలించెను. అతని భార్యమారిష. వారికి పదునొకండుగురు పుత్రులు గలిగిరి. వారిలో వసుదేవుడు పెద్దవాడు. వసుదేవునకు శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణునిగ పుత్ర రూపమున జననమందెను. వసుదేవునకు 'అనక దుందుభి' అనుపేరుకూడ గలదు. వసుదేవుడు జన్మించినపుడు దేవదుందుభులు, 'అనకం' అను వాయిద్యములు మంగళప్రదముగ మ్రోగెనట. అందువలన వసుదేవునకానామముకూడ యేర్పడెను. శూరసేన మహారాజుకు ఐదుగురు పుత్రికలుకూడ కలిగిరి. వారిలో జ్యేష్ఠురాలుపృథ. పృథను కుంతిభోజునకు పెంచుకొనుట కొసంగెను. కుంతిభోజుడు పెంచిన కారణముగ పృథ కుంతిఅయ్యెను. ఆమె శ్రీకృష్ణునకు మేనత్తకూడ.

కుంతి బాల్యమున ఒకవిచిత్ర సంఘటనము జరిగెను. ఒక దినమున దుర్వాస మహర్షి కుంతిభోజుని గృహమునకు వచ్చెను. దుర్వాసమహర్షి మిగులకోపిష్టి. మహర్షికి కుంతి అత్యంత భక్తిశ్రద్ధలతో సపర్యలు చేయగా మహర్షి ఆ సేవలకు సంతసించి ఆమెకొకమంత్రమును నుపదేశించెను. "మనమున దైవమును స్మరించి మంత్రమును పఠించినచో వెంటనే ఆదైవము ప్రత్యక్షమగు"నని మునిపలికెను.

కుంతి బాల్యచాపల్యముచే ఉదయించుచున్న సూర్యభగవానుని మనమునదలచి మంత్రము నుపాసించెను. తలచినంతనే సూర్యభగవానుడు ప్రత్యక్షమాయెను. సూర్యుని గాంచినంతనే కుంతికి సంభ్రమాశ్చర్యములు కలిగెను. తెలియకచేసిన అపచారమును క్షమింపుమని ఆదిత్యుని ప్రార్థించెను. కాని సూర్యుడు కుంతికి గర్భమును ప్రసాదించెను. ఆమె కన్యత్వమునకు భంగము లేకుండా అనుగ్రహించెను. తరువాత కుంతి పుత్రుని కనెను. ఆ బాలుడు సూర్యతేజోసంపన్నుడై సహజ కవచ కుండలములతో జన్మించెను. కాని కుంతి అపవాదు వచ్చునని భయమంది పొత్తిళ్ళలోని బిడ్డను ఒక మందసములో భద్రపరచి గంగాప్రవాహమున వదిలెను. తరువాత ఆపెట్టెను అతిరథుడైన సూతుడు కనుగొనెను. అందులోని బాలునిచూచి మిగులానందించి, గొనిపోయి పుత్రునిగ పెంచుకొనెను. ఆబాలుడే కర్ణుడు. సూతుడు బృహద్రధుని కుమారుడు. అతని భార్య రాధ.

అనంతరము కుంతి పాండవులకు మాతృమూర్తి అయ్యెను. కర్ణుని జన్మ రహస్యము ఒక్క శ్రీకృష్ణునికిదక్క ధర్మరాజాదులకు తెలియదు.

## 55. కంసుడు

యాదవరాజులలో ఆహుకుడను వాడుండెను. అతనికి ఉగ్రసేనుడు, దేవకుడు అను పుత్రులిర్వురు కలిగిరి. ఉగ్రసేనుని కుమారుడు కంసుడు. కంసుడు శ్రీకృష్ణునకు మేనమామ. రాక్షస ప్రవృత్తిగలిగి, శ్రీమహావిష్ణువుతో వైరము పెట్టుకొనెను.

గతజన్మలో కంసుడు 'కాలనేమి' అను రాక్షసుడు. అతడు మారీచుని కుమారుడు. లంకాప్రభువైన రావణునితో చెలిమిజేసి, శ్రీరామచంద్రునకు శత్రువాయెను. హనుమంతుడు సంజీవిపర్వతమును గొనివచ్చునపుడు, కాలనేమి అడ్డుపడి పలువిఘ్నములు కలుగజేయగా హనుమంతుడు అతనిని హతమార్చెను. ఆ దానవుడు తిరిగి కంసుడుగ జన్మించి, పూర్వజన్మస్మృతి నశించక, విష్ణువుపై వైరమూనెను.

ఒక సమయమున ఉగ్రసేనుని భార్య, ఆమె పేరు క్షేత్రజ యాదవకాంతలగూడి యమునానదికి స్నానార్థమేగెను. అపుడామె రజస్వల అయెను. అంతటామె మోహపరవశయై, పురుష సంపర్కమాసించెను. అది తెలిసిన ద్రవిళుడను రాక్షసుడు, ఉగ్రసేనుని రూపము ధరించి ఆకాంతతో క్రీడించెను. అనంతరము మోసము గ్రహించి, "ఓరీ ! నీ వలన నాకు జన్మించిన పుత్రుడు విష్ణువిరోధియై, అతనిచే వధింపబడును." అని ఆవేశమున పలికెను. ఆ విధముగా కంసుడు ఉగ్రసేనునకు

దానవుని వలన జన్మించెను. ఈ కారణములచే కంసుడు రాక్షసప్రవృత్తి కలవాడై విష్ణువిరోధిగా రూపొందెను. ఉగ్రసేనునకు కంసుడుగాక ఎనిమిది మంది కుమారులు, కంస, కంసవతి మున్నగు ఐదుగురు పుత్రికలు గలిగిరి.

ఉగ్రసేనుని కుమార్తెలను వసుదేవుని సోదరులు పెండ్లాడిరి. వసుదేవుడు దేవకిని గాక, పౌరవి, రోహిణి, భద్ర, మదిర, రోచన, ఇళ అనువారిని గూడా వివాహమాడెను.

దానవాంశసంభూతుడైన కంసుడు దుష్కార్యములెన్నింటినో చేసెను. దేవతలను, బ్రాహ్మణులను, సాధువులను బాధించెను. జరాసంధుని పుత్రికలైన అస్తి, ప్రాప్తులను పరిణయమాడెను. శిశుపాలదంతవక్త్రులతో మైత్రి గావించెను. అనేక పాపకృత్యము లొనర్చుచు లోకకంటకుడగుటయేగాక, కన్నతండ్రిని బంధించి చెరసాలపాలు చేసెను. తానే ప్రభువునని ప్రకటించుకొని అదుపులేక ప్రవర్తిల్లెను.

## 50. శ్రీకృష్ణ జననము

వసుదేవుడు శూరుని కుమారుడు. దేవకుని పుత్రిక దేవకి. కంసునకు సొంత చెల్లెలు లేని కారణముగ దేవకి యందు అభిమానము మక్కువ ఎక్కువ. దేవకీ వసుదేవుల వివాహము అతివైభవముగ జరిగెను. వసుదేవుడు దేవకిని వెంటనిడుకొని తనగృహమునకు బయలు దేరెను. దేవకిని అత్తవారింటికి సాగనంపుతూ దేవకుడు కానుకలు లెక్కకుమించి యిచ్చెను. నూతన దంపతులు రత్నఖచితస్వర్ణరథముపై ఆశీనులైరి. వారి వెంట బంగరు రథములు ఊరేగింపుగ వెళ్ళుటకు సిద్ధమాయెను. నాలుగువందల ఏనుగులు, పదిహేనువేల అశ్వములు, అందమైన పరిచారికలు రెండువందల మంది, నూటఎనిమిదివేల రథములను కుమార్తె వివాహకట్నముగ వసుదేవుని కొసగెను.

అపుడు మంగళ వాద్యములు మిన్నంట మారుమ్రోగెను. సోదరి దేవకిపైగల అభిమానము ప్రేమను పురస్కరించుకొని కంసుడు తానే రథము నడపెను. గుఱ్ఱముల పగ్గములుపట్టి ఉత్సాహముగ రథము నడుపుచుండగ, కంసునకు ఆకాశము నుండి దివ్యస్వరము వినిపించెను.

"ఓరీ మూర్ఖా కంసా ! నీ సోదరిదేవకి నీమరణమునకు కారణము కాగలదు. ఆమెకు జన్మింపబోవు ఎనిమిదవ కుమారుడు నిన్ను సంహరించును. నీ సంతోషము అతిత్వరలో అంతరించనున్నది." అను మాటలు కర్ణకఠోరముగ వినిపించెను. ఆ

మాటలు వినిన కంసుడు అదిరిపడెను. నలుదెసలు పరికించి చూచెను. ఎవరును కానరాలేదు. అవి ఆకాశవాణి పలుకులని గ్రహించెను. ఆకాశవాణి పలుకులు వేదవాక్కులు. తప్పక జరిగితీరును. సందేహములేదని అటుల నిర్ణయించుకొనెను. భయము, ఆవేశము, కోపము అతనిని ముంచెత్తెను. వెంటనే రథమును నిలిపి కుప్పించి క్రిందకుదుమికెను. దేవకికొప్పుపట్టి రథమునుండి ఆవేశమున క్రిందకులాగి, యొరనుండి కత్తినిదూసెను.

"ఈమె నా సోదరికాదు. నాపాలిట మృత్యుదేవత. ఈరాక్షసిని తక్షణమె తెగనరకి, ఈమెవల్ల రానున్న ప్రమాదమును తప్పించుకొని నాప్రాణములు కాపాడుకొందును" అని రోషారుణలోచనుడై దేవకిని నరుకబోయెను.

అంత వసుదేవుడు రథమునుండి వేగమున క్రిందకురికి, కంసునకడ్డుగ నిలచి "బావా ! కంసా ! నీవు శూరసేనుని కుటుంబమున జన్మించినావు. అందుచే నీ కుటుంబము చాల ఉన్నతమైనది. వీరుడవు. ఉదార హృదయుడవు. అట్టి నీవు ఒక స్త్రీని వధించి నిందలపాలగుదువా? దేవకి నీసోదరి. క్రొత్తపెండ్లికూతురు. పసుపు బట్టలతో నున్నది. కాళ్లపారాణియు మాయలేదు. అదియునుగాక స్త్రీహత్య మహాపాప కారణమను ధర్మము నీవెరుగనిదికాదు. జన్మించిన ప్రతిజీవియు మరణించక తప్పదు. అది ప్రకృతిధర్మము. కనుక కత్తినిదించుము. భయముచే ఆపాదమస్తకము గడగడ వణకుచున్న నీ సోదరిని ఆదరించుము." అని పరిపరివిధముల కంసుని వేడుకొనెను.

కాని కంసుని కరకుకసాయిగుండె కరుగలేదు. వసుదేవుని మాటలు రుచించలేదు. అతని వేడుకోలు లెక్కచేయక అనుంగుగారాలచెల్లియనియైన గణించక, నిస్సహాయ స్థితియందున్న అమాయకురాలిని కడతేర్చుటకు నిశ్చయించెను. అంతట వసుదేవుడు చివరగా ఉపాయమొకటి సూచించెను.

"బావా కంసా ! నీ సోదరిదేవకి అష్టమగర్భము వలన నీకు మృత్యువు సంభవించునని కదా నీభయము. అందుకు నానిర్ణయమువినుము. ఆమెకు జన్మించు ప్రతిబిడ్డను గొనివచ్చి నీకు అప్పగింతును. అపుడు నీవు నీయిచ్చవచ్చినట్లు ప్రవర్తింపుము. నవవధువు, ఏ పాపమెరుగని అబల, నాదుభార్య, నీకు సోదరి. అమాయకురాలిని వధించక వదలుము. నీ కీర్తికి కళంకము రానీయకుము" అని కంసునకు వాగ్దానముచేసి యొప్పించెను.

అతని మాటలకు కంసుడు తృప్తిచెందెను. దేవకిని వధించక విడచిపెట్టెను. మృత్యువునుండి తప్పించుకొన్న దేవకిని వసుదేవుడు వెంటనిడుకొని తనరాజ్యమునకు జనెను. కొంతకాలమునకు దేవకి పుత్రుని కనెను. వసుదేవుడు వెంటనే పిల్లవానిని తీసికొని కంసునివద్దకు చనెను. వసుదేవుడు తన వాగ్దానమును నెరవేర్చుకొన్నందుకు కంసుడు మిగుల సంతసించెను. అతని సత్యనిష్ఠతను అభినందించెను. "బావా! నీవు నీమాట నిలుపుకొనినందులకు నాకు చాలసంతోషము కలిగినది. ఈ పసివానిని సంహరింపజాలను. వీనివల్లనాకు గలుగు హాని ఏమియునులేదు. కనుక బాలుని గొనిపోయి సుఖించుడు." అని కంసుడు పలుక, వసుదేవుడు సంతసించి, బాలునిగొనిపోయెను. దేవకి మిగుల ఆనందించెను. వానికి కీర్తిమంతుడు అని పేరిడిరి. కాని దుష్టుడైన కంసునిగూర్చిన భయపునీడలు వారినివీడలేదు.

ఒక దినమున దేవముని నారదుడు కంసమహారాజును దర్శింప వచ్చెను. మాటల సందర్భములో మహర్షి కంసునితో, "ఓయీ! కంసరాజా! నాపలుకులు శ్రద్ధగనాలింపుము. వ్రేపల్లెయందలి యాదవులందరు దైవాంశసంభూతులు. అటులే దేవకీవసుదేవులుకూడా కారణజన్ములు. "యదువనితలు, వారివారి బంధుజనులందరు దేవతలేయని తెలియుము. నీవు, నీవారు రాక్షసాంశమువారు. దేవకిగర్భమున శ్రీమహావిష్ణువు జన్మించును. అతనివలన నీకు మరణము తప్పదు." అని వివరించెను. దానితో కంసుని మనమున క్రోధాగ్నిరగిలెను. దానవప్రవృత్తి ఒక్కసారి పెల్లుబికెను. తనగతజన్మ సంగతులు స్ఫురణకు వచ్చెను. తనకు విష్ణువుతోగల వైరకారణమును మరల గుర్తునకుతెచ్చుకొనెను. ఎటులైనను దేవకివసుదేవులను అంతమొందించవలెనని బద్ధకంకణుడయ్యెను. వేగమెచని ఆపుణ్యదంపతులను బంధించెను. శృంఖలాబద్ధులనుచేసి చెరసాల యందుంచెను. వారి ప్రధమపుత్రుని నిర్దాక్షిణ్యముగా వధించెను. యాదవపక్షపాతియైన తనతండ్రి ఉగ్రసేనుని ధిక్కరించి, కారాగృహమున బంధించెను. జరాసంధుని పుత్రికలను పరిణయమాడి అతనిని తనవానినిగ చేసికొనెను. అంతేగాక లంబుడు, ప్రలంబుడు, చాణూరుడు, ముష్టికుడు, తృణావర్తుడు, అఘాసురుడు, అరిష్టుడు, ద్వివిదుడు, కేశి, ధేనుకాసురుడు, పూతన మున్నగు రాక్షసప్రముఖులందరు కంసుని ఆస్థానమున స్థానమేర్పరచుకొనిరి. బాణుడు, మున్నగు దానవ ప్రభువులతోడను, దుర్మార్గులైన శిశుపాల దంతవక్త్రులతోడను మైత్రీబంధము నేర్పరచుకొనెను. అటుల దుష్టాత్ముడైన కంసుడు సాధువులను, సజ్జనులను, పుణ్యచరితులను వేధించి హింసించుచుండెను.

అది అటుల సాగుచుండ, దేవకి ఏటేటా బిడ్డనొకనిని కనుచుండెను. పుట్టిన వానిని పుట్టినట్లుగ కంసుడు నిర్దయుడై బలిగొనుచుండెను. ఒక్కరిని గూడ విడువక ప్రతి ఒక్కరిని పొట్టన పెట్టుకొని, దేవకీదేవికి తీరనిగర్భశోకము మిగిల్చెను. దేవకీదేవి కడుపు రంపపుకోత గోయుచుండ దుఃఖసాగరమున మునిగియుండెను. ఆ దంపతుల పుత్రశోకము అనంతమై వారిని వేధించుచుండెను. అటుల కంసుడు వరుసక్రమమున నారుగురు పసికూనలను హతమార్చెను. అయినను ఆపుణ్య దంపతులు శ్రీమన్నారాయణుని పాదాబ్జములను తమ హృత్కమలములందు నింపుకొని ధ్యానించుచు, క్షణమొకయుగముగ గడుపసాగిరి.

కంసుని బాధలు భరింపజాలక పలువురు మధురానగరమును వదలిపెట్టి కురు, పాంచాలమున్నగు రాష్ట్రములకు వలసపోయి తలదాచుకొనుచుండిరి.

దేవకీదేవి ఏడవసారి గర్భము దాల్చెను. ఆదిశేషుడు భువి నవతరింపదలచి ఆమెగర్భమున ప్రవేశించెను. అంత శ్రీమహావిష్ణువు యోగమాయను పిలిచెను. "ఓయీ ! నీవు తక్షణము వ్రేపల్లెకు పొమ్ము. అచ్చట నందగోకులములో వసుదేవుని భార్యరోహిణి గలదు. దేవకి గర్భమందున్న తేజస్సును గొనిపోయి రోహిణి గర్భమందు ఉంచుము. నేను దేవకి గర్భమున ప్రవేశించి, పుత్రునిగ జన్మింతును. నాజన్మమునకు మునుపే, నీవు నందుడను యాదవుని భార్య యశోదగర్భమున ప్రవేశించి, అచ్చట అవతరించుము." అని ఆనతిచ్చెను.

భగవంతునాదేశానుసారము యోగమాయ వాటినన్నింటిని నెరవేర్చెను. దేవకీదేవికి గర్భస్రావమయ్యెను. వాస్తవవిషయము తెలియక ఆదంపతులు విచారించిరి. రోహిణిగర్భమున ఆదిశేషుడు బలరామునిగ, కృష్ణునికంటె ముందుగ జన్మించెను. అందుచే బలరాముడు కృష్ణునకు అగ్రజుడాయెను. బలరామునకు సంకర్షణుడని, రాముడని నామములు గలవు.

దేవకీదేవి మరల గర్భము ధరించెను. అది అష్టమగర్భము. శ్రీమహావిష్ణువు ఆమెగర్భమున ప్రవేశించెను. దేవకీదేవి ఈసారి అమితతేజమున ప్రకాశించెను. ఆమెతేజమును గాంచి కంసుడు భీతిల్లసాగెను. తనను సంహరించగలవాడు దేవకి గర్భమున వర్ధిల్లుచున్నాడని గ్రహించెను. చెరసాలకు మునుపటికంటె గట్టిబందోబస్తు విధించెను. అందరికి కఠినమైన ఆజ్ఞలను విధించెను. అత్యంత జాగరూకులై మెలగుడని ఆదేశించెను.

శ్రీహరి దేవకిగర్భమున అవతరించనున్నాడని బ్రహ్మాది దేవతలు తెలుసుకొని మిగుల సంతసించిరి. బ్రహ్మ, శివుడు, ఇంద్రాది దేవతలు మారురూపములతో భూలోకమున కరుదెంచిరి. దేవకిగర్భస్థుడైన విష్ణువును వేదసూక్తములతో స్తుతించిరి. అనేక విధముల కీర్తించిరి. దేవదేవుడు అవతరించు సమయమున దేవదుందుభులు మ్రోగ, పూలవానలు కురిసెను. కిన్నెరులు, గంధర్వాదులు మధురగానముచేయ, అప్సరాంగనలు పరవశించి నాట్యమాడిరి. దశదిశలు పరిమళభరిత సుగంధ వాయువులతో నిండెను. సప్తసాగరములు సంతసమున యుప్పొంగెను.

ప్రకృతి యంతయు పులకించి శాంతించెను. శ్రావణమాసము, కృష్ణపక్షము, అష్టమితిధి, అర్ధరాత్రి, రోహిణి నక్షత్రయుక్త వృషభలగ్నం శ్రీకృష్ణుడు జన్మించిన శుభసమయము.

చతుర్భుజుడగు శ్రీమహావిష్ణువు కోటిసూర్యప్రభలతో మహాతేజస్సంపన్నుడై వెలుగొందుచుండెను. శంఖ, చక్ర, గదమున్నగు ఆయుధములు, ఒక హస్తమున పద్మము, రత్నఖచితమైన కిరీటము, కంఠమున కౌస్తుభమణి, కాంచీకంకణకేయూరాది భూషణములు చేతులందును, శ్రీవత్సం వక్షస్థలముననను, పద్మపత్రములవంటి నేత్రములు, పట్టుపీతాంబరము ముజ్జగములను మోహింపచేయు నీలమేఘ దేహఛాయయు,గలిగి శిశువుగ దేవకిగర్భమున జన్మించెను. దేవకీవసుదేవులు ఆవిరాట్‌రూపమును గాంచి కొంతతడవు సంభ్రమాశ్చర్యములతో గొట్టుమిట్టాడిరి. వారి మనము ఆనందడోలికల నూగులాడెను. జగత్కల్యాణమూర్తి శ్రీమహావిష్ణువు తమకు పుత్రుడుగా జన్మించినాడని పట్టరాని సంతసమున దంపతులు తేలియాడిరి. పవిత్ర యమునానదీ పుణ్యతీర్థముల స్నానమాడి, శుచియై పదివేల గోవులను బ్రాహ్మణోత్తములకు దానమిత్తునని వసుదేవుడు మనమున సంకల్పించెను. పరిశుద్ధాత్ముడై శ్రీహరిని వేభంగులస్తుతించెను. దేవకీదేవి ఆనందమునకు అవధులులేవు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే తనగర్భమున పుత్రుడై జన్మించినందులకు కరములుమోడ్చి నమస్కరించెను. కాని వారి ఆనందానుభూతి క్షణములో ఆవిరైపోయెను. ఈ బిడ్డడైన తమకు దక్కునాయని ఆదపంతులు విచారమున క్రుంగిరి. వీనినైనను రక్షింపుమని దేవతలను కైమోడ్చి దేవకీదేవి అశ్రునయనములతో ప్రార్థించెను.

పొత్తిళ్ళలో పసిపాపడుగయున్న శ్రీమహావిష్ణువు వారలనోదార్చి సంతసమును సమకూర్చి, యిట్లనెను "అమ్మా! దేవీ! మీరు గతజన్మమున బహుపుణ్యాత్ములు. మీరు పదిరెండువేల దివ్యసంవత్సరములు నన్నుగురించి కఠోరతపస్సు చేసినారు. అంతనేను ప్రత్యక్షమై వరము కోరుకొమ్మన మీరు," "మహాత్మా! నీ వంటి పుత్రుని ప్రసాదింపు"మని కోరితిరి. అటుల మీరు ముమ్మారు పలికితిరి. నా వంటివాడు వేరొకడు లేనందున, మీ మనోరథమీడేర్ప, నేనే మీకు పుత్రుడనై జన్మించితిని.

మొదటి జన్మమున నీవు ప్రశ్నివి. అపుడు నేను ప్రశ్నిగర్భుడనుపేర జన్మించితిని.

రెండవ జన్మమున మీరు అదితి, కశ్యపులు, అపుడు వామనుడనై అవతరించితిని.

మూడవ జన్మమున దేవకీవసుదేవులు. ప్రస్తుతము నేనీ రూపమున జన్మించి నా మాట చెల్లించుకొంటిని. మీరు మహాపుణ్యులు కనుకనే నాదగు దివ్యరూపము గాంచగలిగితిరి. ఇక మీకు జన్మములేదు. కంసునివలన నాకెట్టి యాపదలేదు. అట్టిభయము వలదు. ఇంక అతని అగడములు సాగనేరవు. చింతలుడిగి ప్రశాంతచిత్తులు కండు. కాగలకార్యము చెప్పెద వినుడు. నాయీదివ్య రూపమును ఉపసంహరింతును. సామాన్య శిశువువలెనుందును.

వెనువెంటనే నన్ను వ్రేపల్లెకు గొనిపొండు. అచ్చట నందుని భార్యయశోద ఒకబిడ్డను ప్రసవించియుండును. నన్ను ఆమె ప్రక్కలో పరుండజేసి, ఆమెపుత్రికను గొనివచ్చి యిచట వుంచుడు. ఆమె యోగమాయ. మీకార్యము నాదుమహిమవల్ల చక్కగ నెరవేరును. అనంతరము అంతయు శుభమగును." అని పలికి శ్రీమన్నారాయణుడు పసిపాపడై వారలకు కనువిందొనర్చెను.

భగవంతుని ఆదేశానుసారము వసుదేవుడు తత్కార్యము నెరవేర్చుటకు ఉద్యుక్తుడాయెను. ఇంక భగవంతుని లీలావినోదములు ఆరంభమాయెను. వసుదేవుని ఇనుపసంకెళ్ళు తమకుతామే వీడెను. అంత వసుదేవుడు బాలుని ఒక బుట్టలో పరుండజేసి తలపై నుంచుకొని బయలుదేరెను. బంధించియున్న కారాగృహపు ద్వారములు తెరచుకొనెను. కావలివారందరు నిద్రాదేవత ఆవహించినట్లు నిద్రావస్థ యందు మునిగియుండిరి. పట్టణమంతయు గాఢసుషుప్తిలో వుండెను. ఎందుగాంచినను నిశ్శబ్దవాతావరణం. వసుదేవుడు మనమునహరిని చింతించుచూ, నగరపొలిమేర దాటెను. యమునానదిని సమీపించెను. ఆనది మధురకు, వ్రేపల్లెకు నడుమనుండెను. అపుడాపవిత్రనదీమతల్లి పరువళ్ళు త్రొక్కుచు ప్రవహించుచుండెను.

వసుదేవుడు భీతమనస్కుడై యమునలో కాలిడెను. అలనాడు శ్రీరామచంద్రుని వారధినిర్మాణకార్యమునకు సాగరుడు సహకరించిన చందమున, మహోగ్ర రూపమున ప్రవహించుచున్న యమున రెండు పాయలుగ చీలి మార్గమిచ్చెను. వసుదేవుడు సురక్షితముగ అవలియొడ్డు చేరెను.

ఆసమయమున జడివానకురియుచున్నను, వసుదేవుడుగాని, బాలుడుగాని తడువలేదు. ఆదిశేషుడు తనపడగను ఛత్రముపగిదిపట్టి వారిననుసరించెను. అందువలన వారికెట్టికీడు వాటిల్లలేదు. వసుదేవుడు గోకులమున ప్రవేశించెను. అందరు గాఢనిద్రలోయుండిరి. మెల్లగా బాలుని యశోదప్రక్కన పరుండజేసి, ఆమెకుమార్తెను గైకొని మరలివచ్చి, బిడ్డను దేవకిప్రక్కలో పరుండబెట్టెను, అంత విచిత్రముగ, వసుదేవుని కాలుసేతులకు సంకెళ్లు తమంతటతాము తగులు కొనెను. కారాగృహపువాకిళ్లు మూసుకొనెను. కావలివారందరు మత్తువదలి అప్రమత్తులైరి. ఇంతజరిగినను, మధురానగరమందు గాని, వ్రేపల్లెలోగాని ఒక్కరికి గూడ ఈ చర్య తెలియదు, అనంతరము యశోద తనపొత్తిళ్లలోని ముద్దుబాలునిగాంచి, తనకు పుత్రుడు జన్మించినాడని మురిసెను. బాలుని హృదయమునకు ఆనందమున హత్తుకొని పరవశించెను. చనుబాలిచ్చి ఆనందించెను.

ఆహా ! యశోదజన్మమే ధన్యము. సాక్షాత్తు శ్రీమన్నారాయణునకు రొమ్ముకుడిపిన అదృష్టశాలి యశోద. భగవంతుని లీలలు అగోచరములు, అద్వితీయములు, అనంతములు. అవిసామాన్యులకు తెలియనసాధ్యము.

కారాగృహమందలి పసిపాపరోదించెను. రోదనపుధ్వని వినిన కావలివాండ్రు వెంటనే పరుగునపోయి దేవకి ప్రసవించినదని చెప్పిరి. అర్ధరాత్రి ఆవార్తవినినంతనే కంసుడు భయాందోళనములతో వేగముగ కారాగృహమున కేతెంచెను.

అంత దేవకీదేవి ఆడబిడ్డను చంపవలదని అనేక విధముల ప్రార్థించెను. దీనాతిదీనముగా వేడుకొనెను. అయినను కఠినాత్ముని హృదయము మారలేదు. దేవకివద్దనుండి బిడ్డనుగుంజుకొని, దాని కాళ్ళనుబట్టి గట్టిగా అచ్చటగల బండపై కొట్టెను. కాని బాలికమరణించలేదు. ఏద్వనైనలేదు. మహాద్భుతముగ శిశువు గగనమున కెగసెను. వెంటనే రూపుమారెను. దివ్యాభరణ భూషితయై గొప్పతేజస్సుతో ప్రకాశించెను. శ్రీమన్నారాయణుడే మాయాదేవి రూపమున గోచరించెను. ఎనిమిది చేతులు గలిగి, శంఖ, చక్ర, గదా ద్యాయుధములు గలిగియుండెను. దేవతాగణము

లామెను పరివేష్టించి సేవించుచుండిరి. అంతమాయాదేవి ప్రళయభీకరకంఠ స్వరముతో "ఓరీ ! కంసా ! నీవు పరమమూర్ఖుడవు. నీవు నన్ను చంపజాలవు. నీకు మరణకాలమాసన్నమైనది. నిన్ను సంహరించగలవాడు. ఈసరికే జన్మించి వేరు ప్రదేశములో పెరుగుచున్నాడు. అతని మూలమున నీకు మరణము నిశ్చయము." అని హెచ్చరించి యోగమాయ అంతర్ధానమయ్యెను.

విష్ణుమాయ మాటలువినిన కంసుడు కొంతతడవు యోచించెను. ఆకాశవాణి పలికిన పలుకులు అసత్యములని భావించెను. దేవకీ వసుదేవులకు జన్మించిన బిడ్డలు తనమరణమునకు కారణముగాదని నమ్మెను. వెంటనే వారిసంకెళ్ళు తొలగించి, చెరసాల నుండి విముక్తులను గావించెను. తానుచేసిన ఘోరమైన అపచారమును క్షమింపుమని దేవకీ వసుదేవులను వేడుకొనెను. "ఆకాశవాణి మాటలు నమ్మి మీ బిడ్డలనందరిని సంహరించి ఘోరపాపమొడికట్టుకొంటిని. నిష్కారణముగ మిమ్ము బంధించి పలుకష్టములపాలు గావించితిని. క్షమించుమని కోరుకొను అర్హతనుగూడ గోల్పోతిని" అని పలు తెరగుల కంసుడు విచారించెను.

కంసునియందు సంభవించిన పరివర్తనమునకు దేవకీవసుదేవులు సంతసించిరి. అనంతరము కంసుడు తనమందిరమునకు జనెను.

## 57. నందుడు

నందగోపుడు యాదవదొరలలో ప్రముఖుడు. అతని నివాసం వ్రేపల్లె. భార్య యశోద. ఆ దంపతులకు సంతానములేదు. చాలకాలమునకు ఒకబాలిక జన్మించెను. కాని వసుదేవుడొనర్చిన కృత్యమువలన నందయశోదలు తమకు పుత్రుడు కలిగెనని అమితానందమందిరి. ఎంతో ఘనముగ పుత్రోత్సవము జరుపుకొనిరి. వ్రేపల్లె వాసులందరు సంతసమున వేడుకలు, వినోదములు జరుపుకొనిరి. బాలునకు కృష్ణుడనిపేరిడి, అమిత ప్రేమమున పెంచుకొనుచుండిరి. యశోద కుమారునకు కృష్ణుడని, రోహిణిపుత్రునకు రాముడని పేరిడిన మహనీయుడు గర్గమహాముని. దేవకీవసుదేవులు, తమబిడ్డడు కంసుని బారినుండి తప్పించుకొని క్షేమముగ గోకులములో పెరుగుచున్నందులకానందించిరి.

బాలుని లక్షణములన్నియు దివ్యతేజస్సుతో ప్రకాశించుచుండెను. ఆకారణముచే విష్ణుభక్తుడైన నందుడు, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే తనయింట అవతరించినాడని మహదానందము పొందెను.

పూర్వజన్మమున నందుడు ద్రోణుడనువసువు. అతనిభార్య యశోదకూడ గతజన్మమున ధర. ఆపుణ్యదంపతులు గొప్పభక్తులు. వారి నోములుపండి విష్ణువు ఈ జన్మలో ఆదంపతులకు పెంపుడుబిడ్డడై వారిముచ్చటలు తీర్చుచుండెను.

కృష్ణుని జన్మకారణముగా వ్రేపల్లె వినూత్నశోభలతో వెలుగొందెను. స్త్రీపురుషు లందరు ఆటపాటలతోడను, వినోదకాలక్షేపములతోడను ఆనందించిరి. బాలుని పన్నీట జలకాలాడించిరి. సుగంధభరిత ధూపములు వేసిరి. జోలపాటలు పాడి, మంగళహారతులు పట్టిరి. మంగళవాద్యములు మ్రోగించిరి. ప్రకృతియంతయు వింతకాంతులతో ప్రకాశించెను.

కృష్ణుని జన్మదినం అష్టమితిథి కావడంవలన, దానిని జన్మష్టమి, కృష్ణాష్టమి, యని పిలచుకొనుచుండిరి. గోకులాష్టమియనిగూడ, కృష్ణుని జన్మదినమునకు ప్రసిద్ధి కలదు. ఆవిధముగ శ్రీకృష్ణుడు నందయశోదల జన్మమును సార్థకతనొనర్చి మోక్షమును ప్రసాదించెను.

## 58. కంసుని దురాగతములు

కంసునకు మనశ్శాంతి కరవయ్యెను. తనను సంహరించగల మహనీయుడెందో పుట్టి పెరుగుచున్నాడని ఆకాశవాణి మాటలకు అతడు భయాందోళనముల కుములుచుండెను. తన మనోవ్యధను మంత్రులతో చెప్పుకొనెను. యోగమాయచెప్పిన మాటలను వారికిచెప్పి కర్తవ్యమును ప్రశ్నించెను. కంసుని అభిప్రాయమువినిన అమాత్యులందరు, దురాలోచనలనేకములు తెలిపిరి. ముఖ్యముగా పసిబాలురను పట్టివధించుట శ్రేయస్కరమని ప్రోత్సహించిరి. యాదవుల నివాసములన్నియు గాలించి, బాలురను హతమార్చుడముతప్ప వేరుమార్గము లేదని నమ్మబలికిరి. వసుదేవుని భార్యలు నందగోపుడు నివసించు గోకులమంతయుగాలింపు చర్యలుజరిపి బాలురనుపట్టి వధించడం కర్తవ్యమని విన్నవించిరి.

"ధర్మమున్నచోట భగవంతుడుండును" అను సూక్తి ననుసరించి, గోవులు, బ్రాహ్మణులు, జపతపములు, యజ్ఞయాగాదులు, దానధర్మాది పుణ్యకర్మలు, వేదపఠనం ఎక్కడ స్థిరముగనుండునో, అక్కడ ధర్మముండును. భగవంతుడచ్చటయుండి అట్టివారలను రక్షించుచుండును. కావున గోబ్రాహ్మణులను వధించడము, యజ్ఞయాగాదులను ధ్వంసమొనర్చడము, యిత్యాది దురాగతములు మిక్కుటముగా యొనర్చిన, అక్కడున్న భగవంతుడు వారలను రక్షించుటకు బయల్పడును. కనుక

దుష్కార్యములు మిక్కుటముగ యొనరించుటయే తక్షణ కర్తవ్యమని బాగుగ నూరిపోసిరి.

మంత్రుల దురాలోచనములు కంసుని మనమున స్థిరముగ నాటుకొనెను. చెట్టుచెడుకాలమున కుక్కమూతి పిందెలన్న చందమున, పోగాలముదాపురించిన కంసుడు దుర్మార్గుడై దుష్కార్యములుచేయ మొదలిడెను.

కామరూపులు, దుష్టులు, రాక్షసప్రవృత్తి గలవారిని, అమిత బలాఢ్యులనెంపిక చేసెను. వారిలో స్త్రీ పురుషులు కలరు. వారినందరిని వివిధప్రాంతములకు పంపెను. వారందరు పట్టణములు పల్లెలు, గ్రామములపై దాడిచేసి అనేకములగు దుర్మార్గములు, దుష్కార్యములు చేసిరి. వారొనర్చిన దురాగతము లనంతములు. గోబ్రాహ్మణులను వధించిరి. పుణ్యస్త్రీలను చెరపట్టిరి. యజ్ఞభూములను ఆక్రమించి ధ్వంసమొనర్చిరి. సాధుజనులను బంధించి చిత్రహింసలవేధించిరి. ప్రధానముగ పసిబాలురను పట్టి ఖండించి సంహరించిరి. వారి కిరాతకృత్యములు అదుపుచేయు నాథుడు లేకుండెను. రాక్షసమూకలు వివిధరూపములలో పురములందు ప్రవేశించి అకృత్యము లనేకములొనర్చిరి.

బిడ్డలను కోల్పోయినతల్లుల ఆక్రందనలు దశదిశలు మారుమ్రోగెను. తండ్రుల దుఃఖము వర్ణింపనశక్యము. అందందు మిగిలిన పాలుద్రాగుబిడ్డలను, బాలురను కాపాడుకొనుటకు తల్లిదండ్రులు పడుపాట్లు వర్ణనాతీతము. ఎపుడెవడువచ్చి తమబిడ్డలను సంహరింతురోయని తల్లులు భీతిల్లుచుండిరి. వారి బ్రతుకులు క్షణభంగురములై క్షణమొకయుగముగ గడచుచుండెను.

ఒక సమయమున నందగోపుడు కంసమహారాజు చెంతకు కప్పము చెల్లించు నెపమున మధురానగరమువచ్చెను. తాను తెచ్చిన కప్పము, కానుకలు కంసునకు చెల్లించెను. నందగోపుని రాకవినిన వసుదేవుడు అతని విడిదికివచ్చి కలసెను. అప్పుడు, మిత్రుడు, మీదుమిక్కిలి బంధువు అయిన నందగోపుని ప్రియమున కౌగిలించెను. ఉచితాసనమున ఆశీనునిచేసి గౌరవమర్యాదల సేవించెను. నందగోపుని సంరక్షణ మందున్న రోహిణి, బలరాముల క్షేమమరసి సంతసించెను. నందునకు కృతజ్ఞతలు తెలుపుకొనెను. ఆ సమయమున కంసునివలన వ్రేపల్లెవాసులకేదోకీడు వాటిల్లగలదని వసుదేవుడు శంకించెను. "నందగోపా! నామనమేలనో కీడును శంకించున్నది. నీవిచ్చట జాగొనర్చక తక్షణము వ్రేపల్లెచేరుము. నీ వారిని రక్షించుకొనుము." అని తొందరచేసి, నందుని సాగనంపెను.

## 59. పూతన

పూతన భయంకర రాక్షస స్త్రీ. గతజన్మలో యీమె బలిచక్రవర్తి పుత్రిక. అపుడామెపేరు రత్నమాల. వామనమూర్తిని చూచిన రత్నమాలకు అతనిపై పుత్రప్రేమ కలిగెను. "ఇట్టి బాలునకు చనుబాలిచ్చు భాగ్యము నాకు కలిగిన బాగుండునుకదా" యని మనమున తలసోసెను. అదిగమనించిన వామనమూర్తి అమెకోర్కెను మరుజన్మలో తీర్చవలెనని భావించెను.

ప్రస్తుతము ఈజన్మలో బాలఘాతకిగ రూపొంది, అనేకమంది బాలురను తన పొట్టనపెట్టుకొనెను. కంసుని ప్రేరణపై పూతన విజృంభించి, పట్టణములు, పల్లెలపై దాడిచేసి, చంటిబిడ్డలను చంపుచు, చివరకు వ్రేపల్లె చేరెను. కామరూపిణి యగు పూతన చక్కని స్త్రీరూపముధరించి ఊరంతయు తిరుగుచు, నందునియింట ప్రవేశించెను.

పూతనరాకను గమనించిన రోహిణి యశోదలు, ఆమె రూపలావణ్య సౌందర్యములు గాంచి ఆశ్చర్యమందిరి. సాక్షాత్తు లక్ష్మీదేవివలె ప్రకాశించుచున్న పూతన రూపమును జూచి అచటివారందరు అబ్బురమందిరి.

అపుడు చిన్నికృష్ణుడు బంగరు టూయలలో పరుండియుండెను. లీలామానుష విగ్రహుడు సర్వముతెలిసియు, ఏమియు తెలియనట్లు నిద్రించుచున్నటుల నటించెను. పూతన అందరితోడను చాలచనువుగ ప్రవర్తించెను. మెల్లన ఊయల దరిచేరి, బాలుని మురిపమున ముద్దులాడెను. బాలకృష్ణుని చేతులలోనికి తీసికొని, ఒక చోట కూర్చొని ఒడిలోనికి చేర్చుకొనెను. పమిటెమాటునయున్న రొమ్మును కృష్ణుని నోటికందించెను. దానిరొమ్మున విషముండెను. దానిని గురించి తెలియనీయక మాయనటించెను. దానిమాయ గ్రహించిన లీలామానుష విగ్రహుడు పాలుత్రాగుచున్నట్లు నటించుచు, పూతన పంచప్రాణములు పీల్చివైచెను. అపుడామె ఘోరమైన నరకయాతన అనుభవించెను. ఆ బాధభరింపజాలక కెవ్వున కేకపెట్టెను. గిలగిలతన్నుకొనుచు, "ఇంకచాలు విడిచిపుచ్చుము" అని రోదించెను. కాని చిన్ని కృష్ణుడు విడువలేదు. క్షణకాలములో పూతన ప్రాణవాయువులు అనంతవాయువులలో లీనమయ్యెను. అపుడామె అతిభయంకరముగ బొబ్బిలిడుచు. గబాలున నేలగూలెను.

పూతన అరపులకు దశదిశలు మారుమ్రోగెను. భూమి కంపించెను. గిరులు ప్రతిధ్వనించెను. ఆకాశము సైతము గడగడలాడ, గ్రహములు, నక్షత్రములు

చలించెను. భువనములన్నియు అదిరెను. సముద్రములుప్పొంగెను. ఒక్కపరి పిడుగులెన్నియో పడినట్లు జనులు భీతావహులై మూర్ఛిల్లిరి. శ్రీహరిచే హతురాలైన పూతన నిజరూపము బయలుపడెను.

## ౮౦. పూతన భయంకర వికృతరూపము

భయంకరమైన పెద్దపెద్దకోరపండ్లు. కొండగుహలు బోలిన నాశికారంధ్రములు, గండశైలముల వంటి కుచద్వయము, పాడుపడిన నూతులవలె నున్న నేత్రములు, అడుగంటిన పెద్దమడుగును తలపించు ఉదరము, రక్తవర్ణముతో నిండిన చింపిరి జుట్టు, పెద్దవైన యూరువులు, పాదములు, వృక్షశాఖలవంటి బాహువులు గలిగి, ఇంద్రుని వజ్రాయుధముచే కూలిన వృత్రాసురుని పగిది, ఆ ఘోరరక్కసి నేలకొరిగెను. ఆ రక్కసి మృతకళేబరము గాంచిన ప్రజలు భయమున పరుగులుతీసిరి. కాని చిన్నికృష్ణుడెంత మాత్రము చెక్కుచెదరక, నిర్భయముగ, ఆకళేబరముపై ఉల్లాసముగ ఆటలాడుచుండెను.

గోపకాంతలు భయమున పరుగునవచ్చి కృష్ణుని గొనిపోయిరి. అనేకరకముల ఉపశాంతులు చేసిరి. దిష్టితీసిరి. దీప ధూపములుతో చేసి దిగతుడుపులాచరించిరి. పెద్ద ప్రమాదము తప్పినదని తృప్తిచెందిరి. ప్రాణగండమునుండి బయటపడినాడని ఆనందించిరి. ముద్దులాడిరి, లాలించిరి. ఉపచారములెన్నోచేసిరి. రక్షలుకట్టించిరి. భూత, ప్రేత, పిశాచ, యక్షరాక్షసమున్నగు బాలగ్రహములు కృష్ణుని ఆవహించకుండగ, భగవన్నామము జరిపించుచూ ఉపశాంతులొనర్చిరి. యశోద బాలుని అక్కున చేర్చుకొని ముద్దాడి పాన్పున పరుండజేసి చనుబాలిచ్చి జోకొట్టెను.

అంతనందగోపుడు శీఘ్రముగ వ్రేపల్లెచేరుకొనెను. అచ్చట పర్వతాకారముగ పడియున్న పూతన కళేబరముగాంచి మిగులాశ్చర్యమందెను. వసుదేవుడు కీడును శంకించినటులే జరిగినందున, ఆమహనీయుడు దివ్యజ్ఞానసంపన్నుడని నుతించెను. పూతనదేహమును ఖండఖండములుగ తెగనరికి, ఊరిపొలిమేరకు గొనిపోయి దహనసంస్కారములు గావించెను. తన ముద్దులతనయునిగాంచి ఆనందించెను.

పూతన బాలుని రూపమందున్న భగవంతుని సంహరించవలెనని వచ్చి, తానే శ్రీహరిచే సంహరింపబడి మోక్షమందెను. భగవంతునిచే హతుడైనవాడు, అతడెట్టి వాడైనను ఉత్తమగతులను పొందును.

# 61. శకటాసురుడు

గర్గుడను ఆచార్యుడు యాదవులకు పురోహితుడు. ఆమహనీయుడు రోహిణి పుత్రునకు రాముడని, యశోదపుత్రునకు కృష్ణుడని నామకరణములు గావించెను. కాని నామకరణవినోదము ఆర్భాటము లేకుండగ, నిరాడంబరముగ గావించెను. ఈ విషయము కంసునకు తెలిసినచో బాలురకు, తనకు, వ్రేపల్లెవాసులకు ఆపద వాటిల్లునని తలంచి, పుత్రోత్సవమెట్టి ఆడంబరములు లేకుండగ జరిపించెను.

రక్కసియైన పూతనసంహారము ముగిసెను. బలరామకృష్ణులు శుక్లపక్ష చంద్రుని పగిది దినదిన ప్రవర్ధమానులగుచుండిరి. కాని కంసునికి మాత్రము దేవకి అష్టమ గర్భమున బాలుడే జన్మించి యుండునను అనుమానము ధృవపడెను. అందువల్ల కామరూపులగు రక్కసవీరులను వ్రేపల్లెకు పంపుచుండెను.

ఒకనాడు కృష్ణుని జన్మనక్షత్రం రోహిణినాడు, యశోద పండుగచేసెను. గోకులమందలి ముత్తయిదువులను పేరంటమునకు ఆహ్వానించెను. వేదవిదులగు బ్రాహ్మణులను రప్పించి ఆశీర్వదింపచేసెను. బాలకృష్ణుని చక్కగ నలంకరించి ఉయ్యలలో పరుండచేసి, జోలపాటలాలపించి నిద్రింపచేసెను. అటుపై వచ్చినవారికి మర్యాదలుచేయుచు, ఆయాపనులందు యశోద నిమగ్నమైయుండెను.

ఆసమయమున శకటాసురుడనువాడు బండి రూపములో కంసుని పనుపున అచ్చటికి చేరుకొనెను. బండిరూపు ధరించిన రాక్షసవీరుడు మహావేగమునవచ్చి కృష్ణుడు పవ్వళించియున్న బంగరు టూయలపై వచ్చిపడెను. అంతబాలుడు గట్టిగ రోదించసాగెను. రోదించుచు, కాలుచేతులు ఆడించెను. అటులాకాళ్ళ నాడించుచు బండిని గట్టిగ తన్నెను. ఆతాపునకు బండి మొత్తము తునాతునకలై నామరూపములు చెడి నుజ్జునుజ్జాయెను. శకటరూపుడైన దానవుడు అసువులు బాసి నేలగూలెను.

అటు తరువాత నందయశోదలు, గోపికలచ్చటికి చేరి నుగ్గుగపడియున్న బండినికనుగొని అమితాశ్చర్యమందిరి. పిల్లవానికి పెద్ద ప్రాణగండము తప్పినందులకు ఆనందించిరి. ప్రత్యక్షసాక్షులైన బాలురుకొందరు, శకటము రూపుచెడిన విషయమును వివరించగా, పరమాద్భుతమంది, అందరు ముక్కునవ్రేలిడుకొనిరి. యశోద బాలకృష్ణుని హృదయమునకు హత్తుకొని, బాలగ్రహపీడలు తొలగుటకు శాంతి కార్యక్రమములు చేయించెను.

# 32. తృణావర్తుడు

బాలకృష్ణునకు పొరాడు ప్రాయమువచ్చెను. ఒకదినమున తల్లి యశోదమ్మ బాలుని తనయెడిలో కూర్చుండపెట్టుకొనెను. అపుడా తల్లికి విచిత్ర అనుభూతి కలిగెను. అట్టి దివ్యానుభూతి అనుభవించుటకు గతజన్మలో ఆమె నోచిన నోముల పంట ఎట్టిదో కద !

అపుడామెకు బాలుడు కొండంతబరువు యున్నట్లు తోచెను. బాలునిభారము మోయలేక నేలపై కూర్చుండచేసెను.

"ఇదేమిచోద్యము? ఎంత ఆశ్చర్యము? నేలపై పొరాడు బాలుడేమి? ఇంతటి భారమేమి? ఈ బాలుడు నిజముగా మానవమాత్రుడేనా? లేక ఏదైనా భగవదంశలతో గూడిన భగవత్స్వరూపుడా? ఏమైయుండును?" అని పరిపరి విధముల చింతించెను. మరుక్షణమే అన్నియు మరచినదై గృహకృత్యములందు నిమగ్న మయ్యెను. అటుల మరపింప చేయుటయు కృష్ణ మాయయే.

అట్టి తరుణమున కంసభృత్యుడైన తృణావర్తుడను దానవవీరుడు పెద్దసుడిగాలి రూపములో నచ్చటికి వచ్చెను. ఆసుడిగాలి వేగము చెప్పనలవిగాదు. వ్రేపల్లె అంతయు అతలాకుతలమాయెను. భూమ్యాకాశములునిండెను. గాలికిలేచిన దుమ్ముధూళిచే దిక్కులన్నియు నిండెను. పల్లెయంతయు చీకట్లావరించెను. అటులా ఝంఝా మారుతము పేట్రేగి సుళ్లుతిరుగుచు వచ్చి చిన్నికృష్ణునెత్తుకొని గగనమున కెగసెను. భయంకరమైన గాలిమ్రోతకుతోడుగ శిలావర్షముకూడా వర్షించెను.

అలజడికి యశోద పరుగుపరుగున వచ్చెను. తనయుడు అచ్చటలేడు. అటు నిటు చూచెను. పరుగులిడుచు ఇల్లంతయు కలియ తిరిగెను. ముద్దుల చిన్ని కృష్ణుడెందున గానరాలేదు. గగ్గోలు పెట్టెను. గుండెలు బాదుకొనుచు రోదించెను. అంత గోపకాంతలు పరుగున వచ్చిరి. బాలుని కొరకు నలుదిక్కుల కలయచూచిరి. బాలుని జాడతెలియలేదు. అందరు బిగ్గరగ రోదించసాగిరి.

గాలిలోనికి కృష్ణునితో ఎగసిన తృణావర్తుడు బాలుని గొంతునులిమి చంప బూనెను. కాని రక్కసునకు సాధ్యపడలేదు. కొంతసేపటికి వాడు కృష్ణుని మోయలేక పోయెను. అతనిని క్రిందకు జారవిడువదలచెను. అదియు రాక్షసునకు అసాధ్య మాయెను. అంత కృష్ణుడు రక్కసునిగొంతు గట్టిగ పట్టెను. ఆపట్టు దానవుడు

విడిపించుకొనలేకపోయెను. ఆ రక్కసుడు భయంకరముగ బొబ్బలిడుచు మహా పర్వతమువలె నేలగూలి అసువులు బాసెను. శివుని బాణహతికి కూలిన త్రిపురములు పగిది, రాక్షసుని కళేబరము వ్రేపల్లెలో ఒక ప్రదేశమున గుభిల్లున నేలబడెను. బాలకృష్ణుడు వాని రొమ్ములపై కూర్చుండి పిడికెళ్లతో గ్రుద్దుచుండెను. గోపకాంతలు బాలుని గొనివచ్చి నందయశోదలకప్పగించిరి. వారును కుమారునెత్తుకొని ముద్దాడిరి. తమపూర్వపుణ్యవశమున తనయుడు మృత్యువాత పడకుండా దక్కినాడని ఆనంద భరితులైరి. 'ఈ బాలుడు సామాన్యబాలుడుకాడు, సాక్షాత్తు భగవంతుడే'యని నమ్మిరి.

గతజన్మలో తృణావర్తుడు పాండుదేశపురాజు. అతని పేరు సహస్రాక్షుడు. ఆ రాజు కాంతాలోలుడు. అతనికి వేయిమంది శృంగారవనితలు గలరు. ఒక దినమున తనకాంతలతో గూడి తుంగభద్రానదీజలముల క్రీడావినోదముల ననందించు చుండెను. అదే సమయమున దుర్వాసముని అచ్చటికరుదెంచెను. మునిరాకను గమనించియు నిర్లక్ష్యమున ప్రవర్తించెను. కామమోహితుడైన రాజును గాంచినంతనే సహజముగ ముక్కోపియైన దుర్వాసునకు కోపము ముంచుకొచ్చెను. "నీవు రాక్షసుడవై పుట్టుదువు గాక" యని శపించెను. అంత సహస్రాక్షుడు తన అపరాధమును క్షమింపుమని మునిపాదములంటి ప్రార్థించెను.

దుర్వాసుడు కరుణించి, "ఓ రాజా ! నీవు రాక్షసుడవై జన్మించినను, నీవు శ్రీహరిచేత చంపబడుదువు. అటుపై పూర్వవైభవముతో రాణించి, ముక్తినందగలవు." అని శాపవిమోచనము తెలిపివెళ్లెను. మునిశాప కారణముగా తృణావర్తుడు బాలకృష్ణునిచే హతుడాయెను.

## 63. బాలక్రీడలు

బాలకృష్ణుడు మెల్లమెల్లగా ముద్దుముద్దుగా తప్పటడుగులు వేయ ప్రారంభించినాడు. కాళ్లగజ్జలు ఘల్లుఘల్లుమని మ్రోగుచుండగ, నందయశోదలు, గోపకాంతలు, ఆబాలగోపాలము ఆనందమున పరవసించెడివారు. ముగ్ధమనోహరుని అందెలసవ్వడులు చెవులకు సోకినంతనే ఎంతటివారును మైమరచి లయబద్ధముగా నృత్యముచేయవలసినదే. ముద్దుముద్దుగ మాటలాడుచు, కొంటెచూపులు చూచుచు, ప్రతిఒక్కరిని ఆకట్టుకొనుటలో అతనికాతడేసాటి. అట్టి అల్లరికృష్ణుడు, చిన్ని కృష్ణుడు చేసెడి కొంటెపనులు అనంతములు, అపారములు. ఎన్నని వర్ణించగలము? ఏమని వర్ణించగలము?

లేగదూడల తోకలుపుచ్చుకొనిలాగెడివాడు. అపుడాలేగలు చెంగుచెంగున గెంతుతూ పరుగిడుచుండగ చూచి ఆనందించెడివాడు. చప్పట్లు చరచి వినోదించెడి వాడు.

గోపికలు ఇంటలేని సమయమున గాని, వారేదోపనిపాటులందున్న సమయము నందుగాని ఇండ్లలోచొరబడి ఉట్లమీద భద్రపరచిన పాలుపెరుగులు త్రాగెడివాడు. వెన్నముద్దలు భక్షించెడివాడు. మీగడ తినెడివాడు. తోటి బాలురకు పంచెడివాడు. ఉట్లు అందకున్నచో పీటలమీదపీట దొంతరులుగాపేర్చి. పాలు, వెన్న, పెరుగు పిడతలు అందుకొని, తానారగించి, తోటివారికి ఆరగింపు చేసెడివాడు. ఒక్కొక్క సమయమున రోళ్లను ఎత్తుగనమర్చి ఉట్లనందుకొనెడివాడు.

ఒక్కొక్కపరి, తోటి బాలురను నొకరిపై ఒకరిని నిలబెట్టి ఉట్టినందుకొనువాడు. కొన్ని సమయములందు ఒక కర్రను చేతబూని దానితో ఉట్టిమీద కుండనుకొట్టి బెజ్జమిడి అందున్న పాలుపెరుగును త్రాగెడివాడు. కృష్ణుని చర్యలన్నియు పరిశీలించినచో పాలు, మీగడ, వెన్నలు ముందుగ తన సహవాసులకు పెట్టి, వారిని ఆనందపరచి, తదుపరి తానుగ్రైకొనెడివాడు. ఆచర్యయందు భగవంతుని విశిష్ట ధర్మగుణం అవగతమగును. అనగా ఆశ్రితపక్షపాతవైఖరి తెలియుచున్నది. అటులే ఆర్తజన రక్షణము, శరణన్నవారి శరణాగతరక్షణము భగవంతుని గుణములలో ప్రముఖములు.

గోపికలు చిన్నికృష్ణుని చిలిపి పనులకు ఒక్కొక్క సమయమున విసిగియు, అలుకబూనియు, ఆతనిని పట్టుకొనబోయిన అందెడివాడు కాడు. పకపక నవ్వుచు పరుగిడెడువాడు. ఏమియు నెరుగని వానివలె చిలిపిచేష్టలుచేసి అందరిని నవ్వించెదు వాడు. అంతటితో వారికోపతాపములు మటుమాయమయ్యెడివి.

కృష్ణుడటుల వ్రేపల్లె నంతయు తిరుగుచు అల్లరిపనులు చేయుచుండెడివాడు. రానురాను బాలుని అల్లరిపనులకు వేగలేక, గొల్లపడుచులందరు యశోదచెంతకు వచ్చి కృష్ణుని ఆగడములు చెప్పుకొనసాగిరి.

"అమ్మా ! యశోదమ్మా ! నీకుమారుని ఆగడములు మేము భరింపజాల కుంటిమి. ఆ కొంటె వాని కొంటె పనులు మితిమీరుచున్నవి."

అమ్మా ! నీ పుత్రునదుపులో పెట్టవమ్మా ! లేకుంటే మేము ఊరువిడచి పోవలసినదే"

"మాయింట పాలకుండలు ప్రతి నిత్యము పగులగొట్టుచున్నాడమ్మా ! రోజూ క్రొత్తవి ఎక్కడనుండి తెచ్చుకొనగలమమ్మా? "లేగల కట్టుత్రాళ్ళు విప్పి, తల్లులవద్దకు వదలుచూన్నాడమ్మా! అది తెలియక పాలుపితుకబోవ, ఆవు పాలనీయక తన్నుచున్నది. "పొరుగింట పాలు, పెరుగుత్రావి, ఆ పిడతలను మాయింట నిడగ, మాయిరువురకు పోరుగొప్పగ జరిగెనమ్మా ! తల్లీ ! వెన్నమీగడలు తానారగించి, వెన్నను గొనిపోయి నిదురించెడి కోడలి మూతికి రాయ, అత్తకోడండ్లకు పెద్ద జగడమాయెనమ్మా !

నిదురించెడి ఆలుమగల జడకుకొప్పుకు ముడులిడగ ఆదంపతులు తగవులాడుకొనగ కొంటెగజూచి విరుగబడి నవ్వి గేలిచేసెనమ్మా ! "తలుపులు బిగించి తాళమువేసి, నదికి నీటికైపోయి వచ్చుసరికి, మా బుడుతనిచే వాకిలితెరిపించి, పాలు, పెరుగు మీగడలు పాడుచేసెనమ్మా! వాకిలికి అడ్డునిలువ చక్కిలిగింతలిడి, నగుచు పారిపోయె తల్లీ !"

ఇటుల గోపకాంతలు కొంటెకృష్ణుని అల్లరిపనులు ఏ కరువుపెట్టి యశోదమ్మకు పిర్యాదు చేసిరి. అన్నియు వినిన యశోద, అప్పటికెట్లో వారిని సమాధానపరచి, శాంతింపచేసి పంపెను.

చిన్ని కృష్ణుని మందలించి అదుపుచేయ ప్రయత్నించెను. కాని కొంటె కృష్ణుడు ఏవేవో మాటలు చెప్పి తల్లిని మురిపించెడివాడు. యశోదను కవ్వించి నవ్వించెడి వాడు. దానితో ఆమెకోపము ఆవిరై పోయెడిది. బాలకృష్ణుని నగుమోముచూచి సర్వముమరచి, ఎత్తుకొని ముద్దాడెడిది.

ముద్దుకృష్ణుని గాంచినంతనే కోపమున రగిలెడి గోపకాంతలు అన్నియు మరచి ఆనందమున సుఖించెడివారు. జగన్నాటక సూత్రధారి, సర్వాంతర్యామి అయిన అమహనీయుని లీలావినోదములు అంతుతెలియుట సాధ్యమా? పురుషోత్తముడు, మాయానాటక సూత్రధారి చిన్నికృష్ణుని వినోదక్రీడలు ఎన్నో, ఇంకెన్నో? చూద్దాం, చూద్దాం చూచి ఆనందిద్దాం.

## 64. యశోదగాంచిన విశ్వము

ఒక దినమున బాలకృష్ణుడు తోటిబాలురతో కలసి ఆటలాడుకొనుచు పిడికిలితో మన్నుగైకొని తినసాగెను. అది గాంచిన రాముడు పరుగునవచ్చి యశోదతో," అమ్మా! మన అల్లరికృష్ణుడు మన్నుతిన్నాడమ్మా" అని చెప్పెను. గోపబాలకులు కూడా

రామునితో వంతపాడిరి. భగవంతుడుచేయు చర్యలన్నింటియందును అర్థం, పరమార్థం ఇమిడియుండును, అది తెలియక మరోవిధముగా ఆలోచించుట సహజం.

ఆ మాటలు విన్న యశోద పరుగునబోయి, తనయుని రెక్కపుచ్చుకొని గృహము లోనికి గొనివచ్చెను. బాలునివంక కన్నులింతవిగ చేసికొని కోపముతో, "కృష్ణా! నాకన్నా! మన్నుతింటివా ? మన్నుతినుటకు నీకేమి పని గలిగెను? ఎన్ని విధముల మొత్తికొన్నను నీకొంటె పనులు మానవైతివి. అంతకంతకు మితిమీరుచున్నవి. చూడు, ఇపుడు నిన్నేమిచేయుదునో" అని గ్రుడ్లురిమి బెదరించెను.

అంత కృష్ణుడు, "అమ్మా! నేను మన్నుతినలేదమ్మా! మన్ను తినుటకు నేనేమైన ఆకలితో నుంటినా ? అంత వెర్రివాడినా ? మతిలేని వాడినా ? వీరి మాటలు నమ్మకమ్మా! నాపై కొండెములు పలుకుచున్నారు." అని ముద్దుగపలికెను.

"రాముడు, తోటి గోపబాలకులు నీవుమన్నుతింటివని చెప్పుచుండ, వారి మాటలు అబద్ధములా? అసత్యవచనములు వారేల చెప్పుదురు? అని యశోదాదేవి మరల నిలదీసి ప్రశ్నించెను.

అటుల తల్లీతనయుల వాగ్వివాదము కొంతతడవు జరిగెను. అంత కృష్ణుడు, "అమ్మా! ఎంత చెప్పినను నామాటనమ్మకుంటివి. నమ్మకములేకయున్న నానోటిని పరీక్షింపుము. వాస్తవము నీకే తెలియగలదు" అని పలుక, యశోద, "అగుచో నీనోటిని చూపు" మనెను.

అంతట లీలామానుషస్వరూపుడు, భగవంతుడైన బాలకృష్ణుడు వినోదముగ తననోటిని తెరచెను. బాలుని నోటిని చూచెను. ఆమె కన్నులు భ్రమలు కమ్మెను. మనస్సు సంభ్రమాశ్చర్యములతో నిండెను. బాహ్యప్రపంచపు స్పృహను గోలుపోయెను. ఆబాలుని నోటియందు బ్రహ్మాండ భాండమును గాంచెను. అనగా భూమి, ఆకాశము, దశదిశలు, కులపర్వతములు, సప్తసాగరములు, సమస్తద్వీపములు సూర్యచంద్రులు, గ్రహనక్షత్ర సమూహములు, చతుర్దశ భువనములు, సమస్త చరాచర భూతజాలము, అది ఇది అననేల? విశ్వమంతయు బాలుని నోటిలో దృగ్గోచర మయ్యెను. ఇంకను తను, తనగోకులము సర్వమును యశోద గాంచెను. అమహాద్భుత దృశ్యమును గాంచినంత యశోదాదేవి దిగ్భ్రాంతి చెందెను. ఊహాతీతమైన సర్వ చరాచరజగత్తును గాంచి జీర్ణించుకొనలేనిదై, "ఏమిచిత్రము! బాలుడేమి? ఈతని వదనగహ్వరమున విశ్వము ఇమిడియుండుటేమి? ఇది కలయా? మాయయా?

నిజమా? భగవంతుని లీలావినోదమా? అంతయు అయోమయముగనున్నదే?" అని పరిపరివిధముల వితర్కించుకొని నిశ్చేష్టురాలాయెను. ఆమెకెవరో పరతత్వాన్ని బోధించినట్లాయెను. సమస్తమునకు కర్త, భర్త, సంహర్త అయిన ఆ జగన్నాథుని లీలావిలాసముల తలంచుచు నమస్కరించెను. విశ్వవ్యాపకుడైన శ్రీమహావిష్ణువును నిండారిన భక్తితోస్తుతించి శరణువేడెను. అంత సృష్టి, స్థితి, లయలకు ఆధారభూతుడైన శ్రీహరి తన మాయాప్రవృత్తిచే యశోదకు ఇహలోకభ్రాంతిని, పుత్రవ్యామోహమును కలిగించెను. వెంటనే యశోదమనసు భగవత్తత్వచింతనమునుండి మరలి సాంసార బంధపాశముల తగుల్కొనెను. ఎప్పటివలె మానవచర్య నాచరించెను. ముద్దుల చిన్నికృష్ణయ్యను గైకొని గుండెలకు హత్తుకొని తనివితీర ముద్దులాడెను.

ఆహా ! యశోద ఎంతటి ధన్యురాలు? శ్రీమహావిష్ణువు యొక్క విశ్వరూపాన్ని దర్శించగలిగిన భాగ్యము సామాన్యవిషయమా? సర్వముతానైయై, తనకంటె అన్యము మరేదియు సృష్టియందులేదను సత్యము, ధర్మము తెలుప, శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడుగ అవతరించెను. అదియె ఆజగద్గురువుయొక్క దివ్యబోధామృతము.

## 65. మద్దిమ్రానులు

ఒకదినమున యశోద కవ్వముచే పెరుగు చిలుకుచుండెను. మీగడతో కూడియున్న పెరుగును చిలికినచో వెన్న లభించును. వచ్చిన వెన్నను సేకరించి వేరుపాత్రలో భద్రపరచును. యశోదకు, పాలుపితుకుట, కాయుట, కాచిన పాలను తోడుపెట్టుట, వచ్చిన మీగడపెరుగును కవ్వముచేచిలుకుట మున్నగు చర్యలన్నియు దినచర్యలు.

ఆ దినమున చిన్నికృష్ణుడేలనో రోదించసాగెను. మజ్జిగ చేయుచున్న తల్లివద్దకు వచ్చి కొంగుపట్టిలాగుచు, పాలనిమ్మని కోరెను. యశోదయు, మజ్జిగ చిలికిన తరువాత పాలనిత్తునని చెప్పెను. కాని కృష్ణుడు తల్లిమాట వినలేదు. మారాముచేయుచు మంకుపట్టు పట్టెను. ఎంత చెప్పినను వినిపించుకొనక పాలకొరకు గోలచేయసాగెను. అంత చేయునదిలేక మజ్జిగ చిలుకుట నాపి, బాలకృష్ణుని వడిలోనికి చేర్చుకొని రొమ్ముకుడుపసాగెను.

అట్టిసమయమున పొయ్యిమీద క్రాగుచున్నపాలు బాగుగమరగి పొంగిపొరలి అగ్గిపాలగుచుండెను. అది గాంచిన యాసాధ్వి బాలుని క్రింద కూర్చుండజేసి, ఒక్క

అదుటునలేచి పొంగుచున్న పాలవద్దకు చేరెను. పాలుకుడుపుచు నిండుగ(త్రాగనివ్వక దిగవిడచి వెళ్ళినందుకు చిన్నికృష్ణునకు అలుకవచ్చెను. అలుగుటయేగాక కోపముగూడ నావహించెను. అటుల తల్లిపై అలిగిన బాలుడు అచ్చటనే యున్న కర్రతో వెన్న కుండను, పాలపిడతను పగులగొట్టెను. వెన్నను కొంత నారగించెను. కొంత నేలపాలు చేసెను. మరికొంత తనమూతికి, మొగమునకు పులుముకొని, కొంత వెన్నను చేతగైకొని ఇంటి వెలుపల కూర్చొని తినసాగెను.

యశోద తనపని ముగించుకొనివచ్చి చూచుసరికి వెన్నమీగడలు, పాలు పెరుగు పాత్రలు పగిలియుండెను. అందలి దధి, నవనీత క్షీరములు నేలపాలై యుండెను. ఆ దృశ్యము చూచినంతనే కోపావేశములు ముంచుకొచ్చెను. బాలునిపై కోపముకట్టలు త్రెంచుకొచ్చెను. ఎటులైనను అల్లరివానిని పట్టిబంధించి, శిక్షించవలెనని నిర్ణయించు కొనెను. తనయుని కొరకు ఇంటినలుమూలలు గాలించివెదకెను. ఎందున కృష్ణుడు కానరాలేదు. ఇంటి వెలుపల వసారాలో తొంగిచూచెను. అచ్చట కొంటెవాడు వెన్నను తిని, మిగిలిన దానిని ఒక కోతిపిల్లకు పెట్టుచుండెను. ఆ దృశ్యము గాంచినంతనే యశోద పరుగుగ బోయి తనయుని గట్టిగ పట్టుకొనెను. తల్లినిచూచి చిలిపికృష్ణుడు భయముతో వణకసాగెను. బుంగమూతిపెట్టి వదనమున విచారము ప్రదర్శించెను. తల్లి దండించునని బెదురుచూపులు చూచెను. దీనుడై యుండెను.

యశోదపట్టును విడిపించుకొని అందక, పరుగులు తీసెను. చివరకెటులో చిక్కెను. తన చేతిలో బెత్తమునుగాంచి, తనపుత్రుడు నిజముగా భయపడినాడనితలచి యశోద దానిని అవలపారవైచెను.

"కృష్ణా ! నీ అల్లరిపనులు, ఆగడములు మితిమీరి పోవుచున్నవి. నీకు తగిన శిక్షవిధింతును చూడుము. ఈ రోటికి గట్టిగ కట్టివేయుదును చుము. "అని కోపమున పలుకుచు, ఒక త్రాటినితెచ్చి ముందుగ బాలుని మొలకుకట్టెను. రెండవ కొసను రోటికి బంధించబోవ ముడివేయుటకు రెండు(వ్రేళ్ల పరిమాణపుత్రాడు తగ్గెను. అంతట ఆమెలోనికి పోయి మరియొక త్రాటినితెచ్చి దానిని జతపరచి కట్టబోయెను. మరల అంతే పరిమాణపు త్రాడు తగ్గెను. అటుల ఎన్ని త్రాళ్లు తెచ్చి ప్రయత్నించినను ముడికి త్రాడు తగ్గుచుండెను. ఇల్లంతా గాలించినా త్రాళ్లు లేకుండెను. యశోదకు విసుగుజనించెను. దానికి తోడుగ ఆయాసము వచ్చెను. దేహమంతయు చెమటలు పట్టెను. అచిత్రమేమిటో అర్ధము కాలేదు. అందలిమాయ అంతపట్టక అందోళన చెందెను.

చిన్ని కృష్ణుడు తల్లి నిస్సహాయతను, కష్టమును గ్రహించెను. తనకు తానుగ కట్టుపడవలెనని తలచెను. అటుల భావించినంతనే తాడు సరిపోయెను. అతి సులువుగ రోటికి బంధింపబడెను. భక్తసులభుడైన శ్రీహరి త్రాళ్లకు, గొలుసులకు కట్టుబడడు. భక్తికి మాత్రమే వశుడగును. కట్టుబడును.

కృష్ణుని రోటికి బంధించి, యశోద లోనికిచనెను. అంత బాలుడు రోటిని లాగికొనుచు పోసాగెను. అటుల ముందుకు పోయిపోయి, కవలపిల్లలవలె జంటగ నున్న మద్దిమానుల మధ్యనుండి రోటిని లాగెను. రోలు మ్రానుల నడుమ చిక్కుకొనెను. అంత కృష్ణుడు రోటిని బలముగలాగెను. అపుడా వృక్షములురెండు సమూలముగ భయంకర శబ్దము చేయుచు భూమిపై గుభిల్లునగూలెను. వెంటనే వృక్షములనుండి సిద్ధపురుషులు ఇరువురు దివ్యతేజస్సుతో లేచివచ్చి కృష్ణునకంజలి ఘటించి, నమస్కరించిరి. కృష్ణుడును వారిని అనుగ్రహించగ, వారు శ్రీకృష్ణుని వేదసూక్తములతో స్తుతించి గగనమున కెగసి, ఉత్తరాభిముఖులైచనిరి.

దివ్యపురుషులు ఇరువురు కుబేరుని పుత్రులు. నలకూబరుడు, మణిగ్రీవుడని వారినామములు. మిగుల సౌందర్యవంతులు. ఒక దినమున యక్షులిర్వురు కైలాస పర్వత సమీపమున అప్సరకాంతల గూడి విహరించ సాగిరి. మధుపాన మత్తులై, వివస్త్రులై అందొక సరోవరమున దివ్యాంగనలగూడి, జలక్రీడావినోదముల ఆనందించు చుండిరి. ఆ సమయమున అచటికి నారదమహర్షి అరుదెంచెను. దేవకన్యలు సిగ్గుచెంది వస్త్రములు ధరించిరి. కాని యక్షులు మాత్రము లజ్జచెందలేదు. వస్త్రములు ధరించలేదు. గర్వితమతులై బ్రహ్మర్షిని గౌరవించకుండిరి. నారదుడు వారి ప్రవర్తనమునకు ఆగ్రహించి, "ఓ యక్షులారా ! మదగర్వమున పొంగుచున్నారు. అందుచే తక్షణము భూలోకమున మద్దిమానులై పుట్టుదురుగాక" అని శపించెను. అంతవారు తెలివిగలిగి క్షమింపుమని ప్రార్థించిరి. మహర్షి వారియందు దయదలచి, "మీరు నూరుదివ్య సంవత్సరములు వృక్షములై పడియుందుదు. అనంతరము శ్రీకృష్ణుని పాదస్పర్శమాత్రమున మీకు శాపవిముక్తి కలుగును." అని యనుగ్రహించెను. మద్దివృక్షములుగా పడియున్న నలకూబర, మణిగ్రీవులు శ్రీకృష్ణుని కారణమున శాపవిముక్తులై హరిభక్తులై తరించిరి.

వృక్షములు ఒక్కసారిగ నేలకూలగ భయంకరధ్వని పుట్టెను. ఆ ధ్వనికి నందయశోదలు, గోపకులు పరుగున వచ్చిరి. ఆ సన్నివేశముగాంచిన వారందరు. ఆశ్చర్యమందిరి. కాని బాలకృష్ణుని మిత్రులు గోపబాలురు జరిగిన సన్నివేశమును మొత్తము వివరించిరి. పరమాద్భుతమైన చిన్నికృష్ణుని చర్యకబ్బురమంది, నంద యశోదలు తనయునెత్తుకొని ముద్దాడి పరవశించిరి.

## ౭౮. జంబూఫలములు - (నేరేడు పండ్లు)

ఒక దినమున కృష్ణుడు తోటివారితో గూడి ఆటలాడుచుండెను. అపుడొక నిషాదస్త్రీ తలపై బుట్టనిడుకొని, “ఫలములు ఫలములు జంబూఫలము” లని కేకలిడుచు అమ్ముచుండెను. కృష్ణుడు అమ్మిని చూచి, పిలిచెను. “అమ్మా ! నాకు కొన్నిపండ్ల నిమ్ము. జంబూఫలములనిన నాకు మిక్కిలి మక్కువ” అని కృష్ణుడనెను.

“అయినచో నేనిచ్చు పండ్లకు వెలనిమ్ము” అని స్త్రీ పలికెను. “వెల అనగానేమి”? కృష్ణుడు ప్రశ్నించెను.

“నీవు తీసికొన్న ఫలములకు యిచ్చు మూల్యము. ఇచ్చిపుచ్చుకొనుట వ్యాపారమునకు లక్షణము” అని నిషాద స్త్రీ పలికెను.

“అదేమో నేనెరుగను. కొన్ని గింజలనిత్తును. పండ్లనిత్తువా?” కృష్ణుడు ప్రశ్నించెను.

“అట్లే కానిమ్ము. పోయి గింజలు తెమ్ము” అమ్మి పలికెను. అంత కృష్ణుడు లోనికేగి, పద్మములవంటి తనదోసిటినిండుగ బియ్యపు గింజలను తీసికొనివచ్చెను. పరుగున వచ్చునపుడు లోనిగదినుండి వీధిగుమ్మము వరకు గింజలురాలెను. బోయెతస్త్రీని సమీపించి అందమైన తనహస్తములను చూపెను. లేతగులాబివన్నెలతో ప్రకాశించు బాలకృష్ణుని అందమైన హస్తములను చూచి ఆమె బాలుని రిక్తహస్తముల నిండుగ నేరేడుపండ్లనునింపెను. అరణ్యక ఫలముల గైకొనిన నవనీతచోరుడు ఆనందముగ లోనికేగెను. ఆరణ్యకములనగా ఉపనిషత్తులని అర్థము. అట్టి అరణ్యకములను కోరుట భగవంతుని లీలలలో యొకటి.

ఇంటికి పోయిన నిషాదస్త్రీకి తనబుట్ట బరువెక్కినట్లుతోచెను. పరిశీలించగ బుట్టనిండుగ మణులుండెను. అవిగాంచిన ఆయువతి ఆశ్చర్యమందెను. భగవంతుని అనుగ్రహమున్న ఫలితముకూడ అట్లేదక్కును.

## 67. బృందావనము

బృందావనము మధురకు రమారమి అరుమైళ్ల దూరమున యున్నది. గోకులమునకు సమీపమున గలదు. బృందావనము నానావిధ ఫలవృక్షముల తోడను, శుకపికమయూరముల తోడను అత్యంత రమణీయమై చూపరులకు నయనానందకరమై మనోల్లాసమును కలిగించుచుండును. ఈ ప్రదేశమునకు సమీపమున అనేక పల్లెలు, గ్రామములున్నందున గోవులు మున్నగు పశువులు ఎల్లపుడు పచ్చికమేయుచు, యమునా నదీజలములుత్రావుచు అహ్లాదముగ తిరుగాడుచుండును. కనుక ఈ క్షేత్రము గోపాలురకు, అలమందలకు ఆవాసప్రాంతమై అలరారుచుండెను. మధుర, గోకులము, బృందావనము, యమునానదీ తీరము, ఇసుకతిన్నెలు పల్లెసీమలు శ్రీకృష్ణుని బాల్యక్రీడలతో పరమపవిత్ర పుణ్యభూములుగా వాశిగాంచెను. కావుననే బృందావనప్రాంతము నాటికి, నేటికి, ఏ నాటికి భారతీయులకు, పవిత్రయాత్రాస్థలముగ ఖ్యాతిగాంచెను. ఇందు ప్రాచీన దేవాలయములు అనేకములున్నవి. అందలి శిల్పసంపద మనభారతీయ సంస్కృతీసాంప్రదాయములకు మచ్చుతునకలు.

శ్రీకృష్ణుడు తోటి గోపబాలురతో కలసి అనేక అద్భుత కృత్యములు, సాహస కార్యములు చేసెను. దుష్టరాక్షసులనెందరినో సంహరించెను. సుందర యమునాతటీ సైకతప్రదేశములలో సంచరించి వాటిగోపాలురకు, గోపకాంతలకు తనయెడ భక్తి, ప్రేమ, అనురాగము గలిగింపచేసెను. తన్నాశ్రయించినవారికి మోక్షమనుగ్రహించెను. అట్టి పవిత్రక్షేత్రమైన బృందావనమును ప్రత్యక్షముగ దర్శించిన కలుగు ఆనందానుభూతి వర్ణనాతీతము. బృందావనమునకు సమీపమునందే గోవర్ధన పర్వతము కలదు.

## 68. గోపాలురు బృందావనమునకు తరలుట

యాదవులలో ఉపనందుడు కడువృద్ధుడు. బుద్ధికుశలుడు. దేశకాలపరిస్థితుల బాగుగ నూహించగల ధీమంతుడు. అతని యందు, అందరికి గౌరవభావము గలదు.

ఒకనాడు తనవారినందరిని సమావేశపరచి అంతవరకు సంభవించిన ప్రమాదములను సమీక్షించెను. తరచుగా కృష్ణునకు కలిగిన ఆపదలు వివరించెను. పూతన, శకటాసురుడు, తృణావర్తుడు, మున్నగు రక్కసుల బారినుండి కృష్ణుడు సురక్షితముగా బయట పడినాడు. కవలలుగాయున్న మద్దివృక్షముల ప్రమాదము

నుండి రక్షింపబడినాడు. ఇంకను ఎట్టిప్రమాదములు రానున్నవో. ఇంతవరకు గోవులకుగాని, బాలురకుగాని ఎట్టికీడును మూడినదికాదు. ఆపదలు రాకమునుపే మనము గోకులము విడచి బృందావనమునకు పోవుదము. అది మనయెల్లరకు నివాసయోగ్యమై యున్నది. మన గోసంపదకు ఆహారము, నీటికి కొదువలేదు. అందుగల గోవర్ధనపర్వతము పచ్చికభూములు యమునాతీర సుందరప్రదేశములు మిగుల ఆనందము చేకూర్చును. కనుక మనయెల్లరకు సురక్షిత ప్రాంతము. మీకు అంగీకారమైనచో అందునివాసము లేర్పరచుకొని యుందము.' అని చెప్పెను.

ఉపనందుని నిర్ణయమునకు అందరును సమ్మతించిరి. ఇంక ఒక్క క్షణమైనను వ్యర్థపుచ్చక గోకులవాసులందరు తమతమ వస్తుసామగ్రిని, బిడ్డలను, గోవులను వెంటనిడుకొని పెద్దఊరేగింపుగ బయలుదేరిరి. అబాలగోపాలము బృందావనమునకు సాగిరి. గోపకాంతలందరు చక్కగ అలంకరించుకొనిరి. మంచివస్త్రములు ధరించిరి. అల్లరి కృష్ణుని చిలిపిచేష్టలను ఇంపుగ వర్ణించుచు పాటలుపాడిరి. గోకులము వదలుచున్నందులకు ఏ ఒక్కరి యందును చింతగాని, బాధగాని లేదు. అందరి వదనములు ఆనందమున ప్రకాశించుచుండెను. కృష్ణునితోడి జీవనమే తమకు ప్రధానమని, పరమార్థమని తలంచిరి. ఒక బండిలో రోహిణి, యశోదలు బలరామకృష్ణులుండిరి. ఆనందోత్సాహములతో ప్రయాణముసాగెను.

గమ్యమైన బృందావనము చేరుకొనిరి. బలరామకృష్ణులు సంతసమున బండి నుండి క్రిందకు దుమికిరి. దివ్యమైన గోవర్ధనపర్వత సౌందర్యమును తనివితీరగాంచి ఆనందించిరి. ప్రక్కన పరవళ్ళుత్రొక్కుచు ప్రవహించుచున్న యమునానదిని గాంచిరి. అత్యంత శోభాయమానమైన ప్రకృతిని గాంచిరి. బలరామకృష్ణుల పాదస్పర్శచే బృందావనము పావనమయ్యెను.

బలరామకృష్ణులు బాల్యదశనుండి. యౌవనదశలో ప్రవేశించిరి. తోటి జతగాండ్రు కూడ పెద్దలైరి. గోపాలురతోను, గోవులతోడను పచ్చికభూములకు పోయెడివారు. వారితో ఆడెడివారు. పాడెడివారు. కృష్ణుడు వేణుగానలోలుడు. సమస్తమును సమ్మోహపరచునట్లు వేణువునూదెడివాడు. గోవులు, గోపకాంతలు భగవానుని వేణుగానమునకు మంత్రముగ్ధులయ్యెడివారు. బాలురిద్దరు కాలిగజ్జెలు ఘల్లుఘల్లుమని లయబద్ధముగ మ్రోగ, ఆడుచు పాడుచు, అందరిని అలరించెడివారు. వారితోపాటు ప్రకృతియు పరవసించెడిది. ఆహా ! అలనాటిగోకులవాసుల అదృష్టమేపాటిదోకద!

## 69. వత్సుడు

ఒక దినమున రామకృష్ణులు గోపాలురతోకలసి ఆటలాడుచు, యమునానదీ తీర పచ్చికబయళ్ళలో గోవులను మేపుచుండిరి. అపుడు కంసుడు పంపగావచ్చిన రాక్షసుడొకడు ఆవుదూడరూపముదాల్చి, గోవుల మందలో ప్రవేశించెను. అది గోవులను, గోపాలురను మాయచేసి చంపుటకు ప్రయత్నించెను. కృష్ణుడు దాని మాయను, మోసమును గుర్తించెను. అపుడారక్కసుని కాళ్ళు పట్టుకొని గిరిగిరత్రిప్పి నేలకేసిబాదెను. ఆదెబ్బకు రాక్షసుడు విలవిలతన్నుకొని రక్తముకక్కి చచ్చెను. అటుల రాక్షసుడు అసువులు బాయుటగాంచి, గోపాలురు ఆశ్చర్యమందిరి. పెద్దప్రాణగండము తప్పినందులకు సంతసించి కృష్ణుని పలువిధముల గొనియాడిరి.

## 70. భకుడు

వేరొకనాడు రామకృష్ణులు, గోపాలురు ఆలమందలకు నీరు త్రాగించుటకు యమునానదికి గొనిపోయిరి. అపుడొకరాక్షసుడు కంసుడు పంపగా వచ్చెను. అతడొక బకరూపమున పెద్దకొండవలె నుండెను. ఆ రూపమును చూచి గోపాలురందరు భయభ్రాంతులైరి. అంతట బకాసురుడు గబాలునవచ్చి కృష్ణుని మ్రింగెను. కాని కారుచిచ్చుపగిది కృష్ణుడు వాని గర్భమును దహించసాగెను. అపుడారక్కసుడు ఆబాధను భరించజాలక, కృష్ణుని వెడలగ్రక్కెను. అంతటితోనాగక బకుడు తనముక్కుతో కృష్ణుని పొడువనుంకించెను. కృష్ణుడసురుని గ్రహించి వట్టి దానిముక్కునుగట్టిగ పట్టి, రెండుగ చీల్చివైచెను. బకుడు విలవిలతన్నుకొని ప్రాణములు విడిచెను. అపుడు బృందారకులు గోవిందునిపై దివ్యపుష్పములను విరజిమ్మిరి. దేవదుంధుభులు నెడములేక మ్రోగెను. బృందావనమందలి ప్రజలందరు యశోదా తనయుని వేభంగుల కీర్తించిరి.

## 71. అఘాసురుడు

ఒకదినమున అఘాసురుడను దుష్టదానవుడు ఏతెంచెను. వాడూ కంసుడు పంపగ వచ్చినవాడే. వాడు బకాసురుని తమ్ముడు, మహాబలశాలి. ఎటులైనను కృష్ణుని మట్టుపెట్టవలెనని దృఢనిశ్చయుడై వచ్చెను. ఆరక్కసుడు భయంకర కొండచిలువ రూపము ధరించెను. దానినోరు పెద్దకొండగుహవలెనుండెను. ఆసర్పము తన గుహాలయమువంటి నోరుతెరచి అందరిని మ్రింగుటకు సిద్ధముగ

నుండెను. దానినోరు, కోరపండ్లు, నాలుకగాంచి అందరు భీతావహులైరి. అంతలో అజగరము గబాలున కృష్ణుని, గోపబాలురను పట్టి గుటుక్కునమ్రింగెను.

గోపాలురందరు తమ్ముర్క్షించుమని హాహాకారములు చేయుచు కృష్ణుని ప్రార్థించిరి. అపుడు దశదిశలు చిమ్మచీకట్లు ఆవరించెను. దేవతాగణములు, దేవర్షులు, మునులు ఆర్తనాదములుచేయ, కంసాది దుష్టదానవులు హర్షధ్వానములు చేసిరి.

అంత విశ్వవ్యాపియైన వాసుదేవుడు తన దేహమును పెంచెను. అపుడు కొండచిలువకు ఊపిరాడక విలవిలతన్నుకొనెను. అటుల గిలగిల తన్నుకొని అజగరము ప్రాణములు బాసెను. గోపాలు రందరు పునర్జీవితులైరి. మబ్బుమాటు నుండి వెలువడిన ఉదయభానుని పగిది శ్రీకృష్ణుడు మందస్మిత వదనారవిందుడై వెలువడి దివ్యతేజుడై ప్రకాశించెను. ముల్లోకవాసులు సంతసించిరి. బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణుని వేదసూక్తముల నుతించిరి.

## 72. బ్రహ్మ చర్య - విష్ణు చర్య

చరాచర జగత్తుసర్వము శ్రీమహావిష్ణువు యొక్క మాయాకల్పితము. విష్ణు మాయకు లోను కానిదేమియు ఈసృష్టిలో లేదనునది పరమసత్యము. మానవులేగాక, దేవతాగణములు సైతము ఆమాయామానుషవిగ్రహుని మాయాజాలమునకు వశులు కావలసినదే.

ఒక సమయమున బ్రహ్మకుకూడ జగన్నాటక సూత్రధారి కృష్ణుని మాయను ప్రత్యక్షముగ అనుభవించవలెననెడి కోరిక గలిగెను. అట్టివేడుక కలిగినదే తడవుగ, బ్రహ్మ తగినచర్యకు పూనుకొనెను.

ఒక దినమున కృష్ణుడు గోపాలురతోకలసి, ఆలమందలతో వనభూములకు చనెను. అందందు గోవులను మేపుచు అనేక వినోదక్రీడల ఆనందించిరి. మధ్యాహ్నమాయెను. తెచ్చుకొన్న చద్దులను అరగించిరి. కృష్ణుడును వారితో పెరుగు మీగడలు కూడిన చద్దిఅన్నమును కడుపార ప్రీతిగ భుజించెను. ఆసమయమున ఆలమందలు అందందు పచ్చికమేయుచు దూరతీరములకు వెళ్లెను.

అంతటబ్రహ్మ, అదేమంచిసమయమని తలచి, గోగణములనపహరించి, రహస్యముగ దాచెను. తరువాత గోపాలురు వచ్చి చూడగ గోవులు కనుపించలేదు. వానికొరకు పరిసరములన్నియు వేయికళ్ళతో గాలించిరి. ఎందును వొక్కధేనువు కూడ కానరాకుండెను. వారు విచారమునవచ్చి కృష్ణునితో చెప్పుకొని, గగ్గోలుపెట్టిరి.

కృష్ణుడు వారలనందరిని నూరడించెను. తానువెళ్లి గోవులను వెదకి తెత్తునని, వారిభయమును నివారించి గోవులను వెదకి తెచ్చుటకై బయలుదేరెను.

దివినుండి బ్రహ్మ అంతయుగాంచి వినోదించుచుండెను. కృష్ణుడులేని సమయమున, గోపాలురనందరిని మాయచేసి రహస్యముగ దాచియుంచెను.

కృష్ణుడు గోవులకొరకు పరిసరప్రదేశములు వెదకెను. ఎచ్చటను గోవులు గానరాకుండెను. విసిగితిరిగి తన సఖులున్న ప్రదేశమున కరుదెంచెను. అక్కడ తనవారు కనిపించరైరి. అంతట కొంతతడవుయోచించెను. ఇదంతయు బ్రహ్మచేసిన మాయయని గ్రహించెను. విశ్వవ్యాపకుడు, విశ్వదర్శనుడైన జగన్నాథుడు తనమాయను ప్రతీకారచర్యగ ప్రయోగించెను.

మరుక్షణమున, మాయమైన ఆవులు, దూడలు యథారూపములతో అవతరించెను. అట్లే గోపాలురును వచ్చినిలచిరి. రూపము, వర్ణము గుణము మున్నగు లక్షణములలో భేదము అణుమాత్రము ఆలమందలందుగానరాదు. అట్లే గోపాలురును యథారూపములు, గుణములు, లక్షణములు గలిగియుండిరి. సర్వాంతర్యామియైన కృష్ణపరమాత్ముడు గోవులందును, గోపాలురందును తానెయై ఆయారూపములతో వెలుగొందెను. అంతయు కృష్ణని మాయయని యెవ్వరికి తెలియదు.

కొంతకాలము అట్లుగడచెను. చతురాననుడైన బ్రహ్మ బృందావనమున పరిస్థితిని పరిశీలింపనరుదెంచెను. అచ్చటి స్థితినిగాంచి బ్రహ్మ ఆశ్చర్యమందెను. అపరిమితానందముగూడ గలిగెను. శ్రీమహావిష్ణువు యొక్క విరాట్ స్వరూపము మనమునదర్శించెను. గోవులందును, గోపాలురందును వేనవేలు రూపములుగ శ్రీకృష్ణుని దర్శించెను. వాణీవల్లభుడు విష్ణుతత్వమును గ్రహించెను. శ్రీకృష్ణుని మాయలో ముంచవలెనని తలచిన బ్రహ్మ, కృష్ణమాయకు తానే మోహింపబడెను. తన అజ్ఞానమునకు తానే పశ్చాత్తాపమందెను. వెనువెంటనే కృష్ణుని చెంతకువచ్చి, తనను మన్నించమని వేడుకొనెను. తాను దాచియుంచిన గోగణమును, గోప బాలకులను కృష్ణునకు సమర్పించెను. కృష్ణతత్త్వమును కృష్ణుడు వాణీవల్లభునకు బోధించెను.

బ్రహ్మనుండి గోవులు, గోపబాలురు వచ్చినంతనే కృష్ణుడు సృజించిన గోగణము, సఖులు అదృశ్యమాయెను. గోపాలురు మురళీగానలోలుని కీర్తించి ఆనందించిరి. అంత కృష్ణుడు దరహాసవదనారవిందుడై వారినందరి నలరించెను.

# 73. ధేనుకాసురుడు

గోకులమునకు సమీపమందు తాళవనము కలదు. దానియందు తాడిచెట్లు చాలగలవు. ఋతుకాలమున వృక్షములనిండుగ తాటిపండ్లగెలలు మిక్కుటముగ వ్రేలాడుచుండెను. ఆపండ్లను తినవలెనని గోపాలురకు కోరికగలిగెను. కాని ఆ వనమును సాహసించి యెవరును సమీపించరు. అందు ధేనుకాసురుడను భయంకర రాక్షసుడు కలడు. చాల బలవంతుడు. మిగుల దుర్మార్గుడు. కంసునకు మిత్రుడు, ఆప్తుడు. మీదు మిక్కిలి యాదవులపై వానికి వైరభావము మెండు.

శ్రీదాముడను యాదవుడు రామకృష్ణులవద్దకువచ్చి తమకు తాటిపండ్లను తినవలెనను కోరిక గలదనియు, కాని అచట రాక్షసునివలన, భయమందుచున్నా మనియు చెప్పెను. ఆ మాటలు విన్న రామకృష్ణులు, వనమునకు తాముకూడ వత్తుమని వారికి ధైర్యము గూర్చి, వారితో రామకృష్ణులు తాళవనమును చేరిరి.

వనమున తాళవృక్షములు చాల గలవు. అవి బాగుగ ఎత్తునపెరిగి యుండెను. వాని నిండుగ ఫలములు గుత్తులుగ వ్రేలాడు చుండెను. బలరాముడు తన బాహుబలముతో చెట్లనుపట్టి ఊపసాగెను. అంత పండ్లు జలజల గుట్టలు గుట్టలుగ రాలెను. వెంటవచ్చిన గోపబాలురు పరమానందభరితులైరి. పండ్లను పగులగొట్టుకొని తృప్తిగ తినసాగిరి. వనమంతయు అల్లకల్లోలమయ్యెను.

అలజడి ధేనుకాసురునకు తెలిసి, ఉగ్రుడై, పర్వతాకారుడై భయంకరముగ బొబ్బలిడుచు బలరామునెదుర్కొనెను. వానిని చూచినంతనే రామునకు ఉత్సాహము, రోషము కలిగెను. ఆదిశేషుని అవతారమైన బలరామునకు, ధేనుకాసురునకు భయంకరయుద్ధము జరిగెను. తన ముందరికాళ్లతో అసురుడు రాముని బలముగ తన్నెను. కాని అణుమాత్రమైన చెక్కుచెదరక రాముడు వాని రెండుకాళ్ళనుపట్టి దూరముగ విసరెను. అల్లంత దూరమున బడిన రాక్షసుడు రెట్టించిన పౌరుషముతో రాముని తాకెను. అంత రాముడు వాని నాలుగుకాళ్లనుపట్టి గిరగిర చక్రమువోలె త్రిప్పి, నేలకేసిబాదెను. గార్ధభరూపుడైన రక్కసుడు విలవిలతన్నుకొనెను. వాని నాడులు, నరములు తెగెను. ఎముకలన్నియు నుజ్జునుజ్జు అయ్యెను. పెద్ద పర్వతమువలె నేలగూలి భయంకరముగ కేకలిడుచు, ప్రాణములు విడిచెను. బలరాముని శక్తియుక్తులు తెలిసిన కృష్ణుడు చిరునవ్వులు చిందించుచు మిన్నకుండెను. గోపబాలురు రాముని బలపరాక్రమములకు ఆశ్చర్యమందిరి.

ధేనుకాసురుని మరణవేదనపు ధ్వనులకు వనమంతయు ప్రతిధ్వనించెను. వాని పెడబొబ్బలు వినిన సహచరదానవులందరు ఒక్కుమ్మడివచ్చి రామకృష్ణులను తాకిరి, కాని వారలనందరిని అన్నదమ్ములిరువురు సునాయాసముగ సంహరించిరి. తాళవనమంతయు రాక్షసుల కళేబరములతో నిండెను. అది గాంచినదేవతలు వారిపై విరిజల్లులు కురిపించిరి. అంతటి నుండి తాళవనము యాదవుల వశమాయెను. వ్రేపల్లె వాసులు రక్కసులవలన వెరపులేక సుఖించిరి. రోహిణి యశోదలు తమ బిడ్డలను గాంచి హర్షపులకిత గాత్రులైరి. అట్టిబిడ్డలను గాంచిన ఏతల్లులు గర్వించరు?

## 74. కాళీయ మర్దనము

కశ్యప ప్రజాపతికి ఇద్దరు భార్యలు కలరు. వారు దక్షుని కుమార్తెలు. కద్రువ వినతలని వారి నామములు. కద్రువకు సర్పములు జన్మించెను. వినతకు పక్షులు కలిగెను.

కద్రువకు జన్మించిన సర్పములలో వాసుకి, శేషుడు, తక్షకుడు, కర్కోటకుడు, ధనంజయుడు, కాళీయుడు అనువారు ముఖ్యలు. వినతకు జన్మించిన వారిలో అనూరుడు, గరుత్మంతుడు ప్రముఖులు. అనూరుడు సూర్యునకు రథసారధి. గరుత్మంతుడు విష్ణువుకు వాహనము.

కాళీయుడు ఇంకను కొన్ని సర్పములుకలసి రమణక ద్వీపమున నివసించెడి వారు. అదివారికి సురక్షితప్రాంతము. గరుత్మంతుడు సర్పములనుపట్టి భక్షించెడివాడు. అందుచే సర్పములకు వినతాసుతుడన్న అమిత భయము. అపుడు సర్పములన్నియు కలిసి గరుత్మంతునితో యొప్పందమొకటి కుదుర్చుకొనిరి. దాని ప్రకారము రమణక ద్వీపమందలి సర్పములు వంతుప్రకారము, దినమునకొక సర్పము గరుత్మంతునకు ఆహారమగుచుండెను.

కాళీయుని వంతువచ్చెను. కాని బలగర్వముచే కాళీయుడు గరుత్మంతుని తృణీకరించి, నిర్భయముగ వానినెదిరించెను. తన విషపూరిత కోరలతో గరుత్మంతుని కరచి బాధించెను. దానికి ఖగేంద్రుడు క్రోధుడై వజ్రసదృశమైన తనరెక్కలతో కొట్టెను. దాని దెబ్బలకు తాళలేక కాళీయుడు రమణక ద్వీపమువిడచి పారిపోసాగెను. వైనతేయుడు కాళీయుని వెంబడించి తరుమసాగెను. తుదకు కాళీయుడు దిక్కుతోచక కాళింది మడుగున దాగెను. గరుత్మంతుడు కాళింది మడుగును దరిచేరజాలడు. అందుకు ప్రబలకారణము గలదు.

పూర్వము సౌబరి అను ముని కాళిందిమడుగు యొద్దన తపము చేయు చుండెను. అపుడు గరుత్మంతుడు అచ్చటికిచేరి, ఒక పెద్దమత్స్య రాజునుపట్టి భక్షించెను. దానిని తినవలదని ముని చెప్పినను అతని మాటలను పెడచెవిన పెట్టెను. అంత మరణించిన మత్స్యరాజు భార్యలు విలపించుచువచ్చి మునిని ప్రాధేయపడిరి. తమ్ము రక్షింపుమని ప్రార్థించిరి. వారిపై జాలి గలిగిన సౌబరిముని గరుత్మంతుని, "ఇక మీదట మడుగును సమీపించినను, అందలి చేపలను తిన్నను మరణించు గాక"యని శపించెను. అది తెలిసిన కాళీయుడు మడుగునుజొచ్చి, భార్యలతో సుఖముగ నుండెను. శాపకారణముగ పక్షిరాజుకూడ కాళింది మడుగును సమీపింప జాలకుండెను. అటుల యుగములెన్నో గడచెను. కాళీయుడు హ్రదమును ఆశ్రయించు కొనిన కారణముగ అందలి జలములు విషపూరితములయ్యెను. అందలి జలము నెవ్వరైన త్రాగినచో మరణించుట తథ్యము.

ఒక సమయమున గోపాలురు, తమ గోవులను మేపుకొనుచు ఆప్రదేశము చేరిరి. అది మండువేసవి. గ్రీష్మతాపమునకు తాళజాలక వారు, గోవులు మడుగులోని నీరు గ్రోలిరి. వెంటనే గోపాలురు, గోవులు మరణించెను. కొందరు స్పృహ కోల్పోయి నేలవ్రాలిరి. అది తెలిసిన కృష్ణుడు గోవులను, గోపబాలురను తన మాయాప్రభావముచే బ్రతికించెను. పునర్జీవితులైన గోపాలురందరు ఆనందమున కృష్ణుని మహిమను కీర్తించిరి.

కృష్ణుడు మడుగులో దాగియున్న కాళీయుని మదమణచవలెనని నిర్ణయించెను. వెంటనే మడుగు ప్రక్కనున్న వృక్షము నెక్కెను. పీతాంబరమునెగగట్టి పౌరుషమున మడుగులో దుమికెను. మడుగు అల్లకల్లోలమయ్యెను. అందుదాగియున్న భయంకర విషసర్పము తన విషజ్వాలలను విరజిమ్మెను. దాని విషజ్వాలలు ప్రళయకాల విషాగ్నులను బోలియుండెను. కృష్ణుని దేహమంతటిని తన కోరలతో కాటేసి బాధించెను. కాని కృష్ణుడెంత మాత్రము చలించలేదు. కనికందను లేదు. కాళీయుడు దేవకీ సుతుని బంధించి, పడగలతో కప్పివైచెను. అదృశ్యముగాంచిన గోపాలురు హాహాకారములు చేయసాగిరి. ఆలమందలన్నియు కృష్ణునకు వాటిల్లిన ఆపదకు, మోరలుపైకెత్తి "అంబా" యని అరచుచు విలపించసాగెను.

అదే సమయమున వ్రేపల్లెలో అపశకునములు పొడగట్టెను. భూమికంపించగ, దివినుండి అగ్నికణములు వర్షించెను. జనులకు ఎడమకన్నులు, ఎడమభుజములు

అదిరెను. యశోద మున్నగువారి హృదయములలో భీతి జనించెను. ఏదో కీడు రానున్నదని ఊహించిరి. కృష్ణునిదలచి పరిపరివిధముల చింతించిరి. అంతట నందయశోదలు, బాలురు, వృద్ధులు, స్త్రీలు అందరు బయలుదేరి వేగముగ కాళింది హ్రదమును చేరిరి. వారితో బలరాముడు కూడవచ్చెను. కాని కృష్ణునిశక్తి తెలిసిన వాడగుటచే బలరాముడెంతమాత్రము కలవరమందలేదు.

వారు కృష్ణుని గాంచిరి. కాళీయునిచే బంధింపబడి కృష్ణుడు కదలలేక యుండెను. అతని దురవస్థను గమనించిన వారెల్లరు గుండెలు బాదుకొనుచు పెద్దపెట్టున రోదించిరి. కొందరు మూర్ఛిల్లిరి. కొందరు నేలపొరలచు కృష్ణుని దలచి విలపించిరి. కృష్ణుడులేక తమబ్రతుకులు వ్యర్థమని, మడుగులో దుమికి ప్రాణత్యాగ మొనర్పదలచిరి. కాని బలరాముడు వారిని వారించి నోదార్చెను.

తనవారందరు శోకసాగరమున మునిగియున్నారని కృష్ణుడు కనుగొనెను. మానవ సహజవైఖరిని ప్రదర్శించి గొప్ప ఆపదలో యున్నట్లు నటించెను. క్షణకాలములో దానిబారినుండి విముక్తుడై, దాని పడగలపై నిలచెను. కాళీయుడు భయంకరవిషజ్వాలలు వెడలగ్రక్కుచున్నను లెక్క చేయలేదు. కృష్ణుడు వాని పడగలపై విచిత్రముగ విన్యాసములుచేయుచు చిందులు త్రొక్కెను. లయతాళబద్ధముగా నాట్యమాడెను. యశోదాతనయుని తాండవముగాంచి దేవతాగణములు పరమానంద భరితులైరి. ముల్లోకవాసులు ఆనందపరవశులైరి. దేవగంధర్వాదులు మృదంగాది వాద్యములు మ్రోగించిరి. కాళిందీమడుగున చేరిన ఆబాలగోపాలము మంత్ర ముగ్ధులైరి. తాండవకృష్ణుని నృత్యభంగిమలు భరింపజాలక కాళీయుని శిరస్సులన్నియు నలిగి క్రిందికొరిగెను. నెత్తురుగ్రక్కుచు రక్షింపుమని మరిమరి ప్రార్థించెను. కాళీయుని భార్యలువచ్చి తన భర్తను మన్నించి రక్షింపుమని మొరలిడిరి. నాగకాంతల మొరలు విన్న కృష్ణుడు కనికరించి, మూర్ఛిల్లిన సర్పరాజును విడచెను. కొంతతడవునకు కాళీయుడు తేరుకొనెను. అంత భగవానుడు, "కాళీయుడా ! తక్షణము ఈ మడుగును విడచి పోయి సముద్రమును చేరుమనెను. ఇకపై హ్రదమందలిజలము పరిశుద్ధములై అమృతతుల్యములగును. సమస్త ప్రాణులకు జీవనాధారమగును" అని అందరికి భయమిచ్చెను. "ఓయీ ! నేను నీశిరస్సుపై తాండవము చేసిన కారణమున, నీ శిరస్సుపై నాపాదముద్రలేర్పడును. అవి చూచి గరుడుడు నీకెట్టి హానియు చేయబూనడు." అని పలికెను. అనంతరము కాళీయుడు తన వారితో కలిసి సాగరజలముల ప్రవేశించెను.

యశోద మున్నగు వారందరు కృష్ణుని కనుగొని మిగులానందించిరి. గండము గడచినందులకు వేల్పులకు మ్రొక్కిరి. యశోద తనపుత్రుని ఒడిలోచేర్చుకొని ముద్దాడెను. బృందావనవాసుల అదృష్టమునకు, తని ప్రియపుత్రుడు క్షేమముగ బ్రతికి బయటపడినందులకు కడు ఆనందించి, ఆనందబాష్పములు రాల్చెను.

కృష్ణుడు తన దివ్యత్వము ప్రదర్శించినను, అమాయకులైన బృందావన వాసులు మాయామోహమునకు లోనగుచు, జగన్నాథునకు ఉపచర్యలు చేయబూనిరి. ఆ రేయి వారందరు అందే సంతసమున గడపిరి.

## 75. వేణుగాన మహిమ

యమునానదీతీరమున మధువనమను తోటకలదు. అందలి వృక్షములు లతలు పుష్పములతోనిండి యుండెను. పుష్పములందలి మకరందమును గ్రోలుచు తుమ్మెదలు రొదచేయుచు పరిభ్రమించుచుండెను. వృక్షములపై యున్న శుకపికములు మృదుమధురముగ ధ్వనులు చేయుచుండెను. ఆసమయమున కృష్ణుడు గోపాలుర తోడను, గోపికలతోడను, గోవులతోడను వనమును ప్రవేశించెను. వారందరు వివిధరీతులాడి, పాటలు పాడిరి. యమునలోని మధుర జలములు గ్రోలిరి. అందరు ఆనందముగ నుండిరి.

అపుడు కృష్ణుడు వేణువునూదసాగెను. అందుండి వెలువడుచున్న మధుర నాదము నలుదెసల వ్యాపించెను. మృదుమధుర సంగీతము నాలకించిన గోపికలు తన్మయులైరి. ఆ నల్లనయ్య అందచందములు, గుణగణములు, లీలా వినోద క్రీడలు, విన్యాసములు గోపికలు ఒకరితోనొకరు ముచ్చటించుకొనుచు మధురానుభూతుల తేలియాడిరి.

కృష్ణుని నల్లనికురులు, అల్లనల్లన మెల్లనవీచు పిల్లగాలికి వదనముపై అందమున కదులాడుచుండెను. తలపై అమరిన నెమలిపింఛము, చెవులకమర్చిన రత్నఖచిత కుండలములు, కంఠమునధరించిన ముత్యాలసరులు, రత్నమణిమయహారములు, దండకడియములు, ముంజేతి స్వర్ణసింహతలాటములు, రత్నాంగుళీయకములు, పట్టుపీతాంబరము, బంగరుమొలనూళ్లు, వల్లెవాటు, ఘల్లుఘల్లున రవళించు కాలిఅందియలు, పద్మదళములుబోలిన నేత్రములు, నుదుట కస్తూరితిలకము, నీలిమేఘదేహఛాయ, రంగురంగుల పూమాలలతో ప్రకాశించు కంఠము, హృదయ

సీమ నలంకరించిన కౌస్తుభము ఆహా! కృష్ణునిశోభ యెంతని వర్ణించగలము? అని అనవమన్మథాకారుని వర్ణించుచు గోపకాంతలు పరవశించి మురియుచుండిరి.

కృష్ణుడు వారిమధ్య నిలుచుండి వేణుగానము చేయుచుండ గోపాలురు, గోపకాంతలు, సంగీత స్వరములకు అనుగుణముగా లయబద్ధముగ నృత్యము చేయుచు, మధువనమునకు ప్రత్యేకశోభను కూర్చుచుండిరి. వారికి ఆ వేణుగానలోలుడు దక్క అన్యమేమియు తెలియుటలేదు. ఇతర విషయములపై చింతనలేదు. బాహ్యప్రపంచమునే మరచి వేణుగానమధురామృత పానమత్తచిత్తులై యుండిరి. ముజ్జగములను మురిపించి మరపించెడు వేణుగానప్రియుడు తమమధ్య యుండుటే మహద్భాగ్యముగా దలచి ఆనందానుభూతుల నోలలాడు చుండిరి. లీలామానుష విగ్రహుడైన కృష్ణుడును వారియందు తన ప్రేమామృతమును వర్షింప చేయుచు, వారలను కంటిపాపలుగ కాచుచుండెను. ఆవేణువుగూడ, కృష్ణుని పెదవులు తనను స్పృసించుచున్నందున, తనకు గలిగిన అదృష్టమునకు ఆనందించుచుండెను.

కృష్ణుని పాదస్పర్శకు బృందావనము ఎంతోపుణ్యము చేసికొన్నది. ఆ మహనీయుని వేణుగానమునకు వశమై మయూరములు నాట్యమాడెను. వెదురుతో చేసినవేణువును కృష్ణుడు తనసంగీత వాద్యపరికరముగ నెంచుకున్నందులకు వెదురు వృక్షములు తమకు గలిగిన భాగ్యమునకు పొంగిపోయెను. వేణుగానము వినిన పశుపక్ష్యాదులు సైతము పరవశించెను. గగనచారులైన దేవ, గంధర్వ యక్షులాదిగ గల గగనచారులు గూడ వేణునాదామృతమునకు వశులై వర్తిల్లుచుండిరి.

పాలుత్రాగు పసిపాపలు రొమ్ములు కుడుచుట మరచిరి. పయ్యెదలు తొలగిన విషయము మగువలు మరచిరి. కట్టుకొన్న పట్టువస్త్రములు జారుచున్నను యువతులు పట్టించుకొనరైరి. దూడలు తమతల్లులవద్ద ప్రాలుత్రాగుట మరచి, వేణుగానము వినుచుండ, ధేనువులుకూడ చెవులు నిక్కించి గానము వచ్చినదెసకు తమదృక్కులు సారించెను.

తపోధనులైన మహర్షులు, మునులు, యోగులు కృష్ణుని వేణునాదమునకు పరవశులగుచుండిరి. యమునానదీతరంగములు సైతము, ఆ వేణుగోపాలుని వేణునాదమునకు అనుగుణముగ ధ్వనించుచు పరవళ్ళు త్రొక్కుచు సాగుచుండెను. సృష్టియందలి చరాచరములన్నియు కృష్ణపరమాత్ముని వేణుగానామృతమునకు వశులై వర్తించుచుండెను. అందుగల గోవర్ధనపర్వతము సైతము, కృష్ణుని సేవించుచు, ఆ మహనీయునకు మిగుల ప్రేమపాత్రమయ్యెను.

## 76. దవానలం

కాళీయమర్దనము తరువాత, అనాటి రాత్రి గోకులవాసులందరు యమునా నదీతీరమున విశ్రమించిరి. అది అర్ధరాత్రి సమయము. అందరు గాఢనిద్రావస్థ యందుండిరి. అంతలో కార్చిచ్చుప్రజ్వరిల్లెను. అది క్రమక్రమముగా వ్యాపించి వనమంతటినాక్రమించెను. ఆ మంటలవేడికి అందరు ఉలిక్కిపడి నిద్రనుండి లేచిరి. ఆకాశమునకు అంటుచున్న మంటలుచూచి అందరు బీతావహులైరి. అపుడు కృష్ణుడు తృటికాలము యోచించెను. గోవులను, గోపాలురను రక్షింపదలచి దవానలమును ఒక్కసారిగ మ్రింగి వైచెను. దవానలము నుండి ఆశ్రితులను రక్షించెను.

మరొక సమయమున రామకృష్ణులు గోపబాలకులుకలసి, గోవులను తోలుకొని ముంజారణ్యప్రాంతమును చేరిరి. ఆవులు పచ్చికమేయుచు, త్రోవతప్పి దూర ప్రాంతములకు పోయెను. గోపాలురు గోవులకొరకు చూచిరి. గోవులెందున కానరాకుండెను. అంత వారందరు బిగ్గరగ రోదించుచు వచ్చి రామకృష్ణులకు మొరలిడుకొనిరి. యశోదానందనుడు ఒక వృక్షమునెక్కి వృక్షాగ్రముననిలచి నలుదెసలు పరిశీలించెను. ప్రేమమున వానిని పేరుపేరు వరుసన పిలిచెను. మురళినూది గానముచేసెను. మురళిగానము వినిన ఆలమందలు పరుగుపరుగున వచ్చి చేరెను. కాని అంతలో మరియొక ప్రమాదము ముంచుకొచ్చెను.

అరణ్యమున ఒక ప్రదేశమందు కార్చిచ్చురగిలెను. ఆ దవానలము క్షణకాలములో నలువైపుల వ్యాపించెను. గోవులు మంటలవేడికి తాళజాలక అటునిటు అంబా అనుచు పరుగులుతీసెను. గోపాలురును జ్వాలలనడుమ చిక్కుకొని, ఆర్తనాదములు చేయసాగిరి. తమను, గోగణమును రక్షించుమని ప్రార్థించిరి. అంత కృష్ణుడు చెప్పిన విధమున కన్నులు మూసికొనిరి. కృష్ణుడంతట దావాగ్నిని గుటుక్కున మ్రింగివైచెను. గోగణము ఆనందమున గంతులిడుచు కృష్ణుని చేరెను. గోపాలురును సంబరమున తమ సఖునిచేరిరి. కృష్ణుని మహిమను వివిధ రీతుల కీర్తించిరి. అంతటి ఘోరఅగ్నిజ్వాలనెట్లు మ్రింగగలిగెను? అనునది అమితాశ్చర్యకరమైన ప్రశ్న. అందులకు సమాధానమొక్కటే. పదునాలుగు భువనభాండములను తన కుక్షిలో నుంచుకొనిన మహాత్మునకు అగ్ని యొక లెక్కయగునా?

## 77. ప్రలంబాసురుడు

ప్రలంబుడు రాక్షసులలో చాల బలవంతుడు. మాయలు పన్నుటలో అతనికతడే సాటి. రామకృష్ణులు గోపబాలకులతోకలసి ఆడుకొనుచుండిరి. అట్టి సమయమున ప్రలంబాసురుడు, ఒక గోపబాలుని రూపమున వచ్చి వారిలో కలసెను. అతని మాయ కృష్ణునికిదక్క వేరెవ్వరికి తెలియదు. ఎటులైనను వానిని రామునిచే చంపించవలెనని తలచెను.

అంత బాలురనందరిని రెండు జట్లుగ విభజించెను. ఒక జట్టుకు రాముని నాయకునిగ నియమించెను. మరియొక జట్టుకు తానే నాయకత్వము బూనెను. ప్రలంబుని తనజట్టులో నుండునట్లు ఏర్పాటుగావించెను. ఆటలో గెలుపొందినవారు, ఓటమిపాలైన వారిని భుజములనిడుకొని మోయవలెననెడి నిబంధనము పెట్టెను. ఎంత దూరము మోయవలయునో, దానిని కూడ కృష్ణుడే నిర్దేశించెను. రెండుజట్లువారు కృష్ణుడు విధించిన నిర్ణయమున కంగీకరించిరి.

ఆట ప్రారంభమై కడురసవత్తరముగ సాగుచుండెను. చివరకు కృష్ణుని పన్నుగడ ప్రకారము కృష్ణునిజట్టు ఓటమి పాలయ్యెను. నియమము ప్రకారము రాముడు ప్రలంబుని మోయుటకు సిద్ధమయెను. తనకు రామునిపరిమార్చుటకు అవకాశము లభించినందులకు రాక్షసుడు సంబరపడెను. అటులే కృష్ణుడు సుదాముని, భద్రసేనుడు వృషభుని మోయుటకు నిర్ణయము జరిగెను.

అందరు గెలిచిన వారలను మోయుచు ముందుకు సాగిరి. ప్రలంబుడు రాముని మోయుచు, నిర్దేశించిన ప్రదేశమునుదాటి యింకను ముందుకు దూసుకొని పోవుచుండెను. రాముని మట్టుపెట్టవచ్చునని లోలోన సంబరపడుచుండెను. రాముడు ముందుగ కొంత అందోళనకు గురియై వెంటనే రాక్షసమాయయని గ్రహించెను. అంతలో ప్రలంబుడు బాలునిరూపము ఉపసంహరించుకొని, రాక్షసాకృతిని దాల్చెను. తాడిప్రమాణముగ దేహముపెంచెను. పొడవైన కోరపండ్లు, పర్వతగుహను బోలిన పెద్దనోరు, అగ్నిగోళములవలె మండెడినేత్రములు, వికృతరూపము. వానిని గాంచి నంతనె అదిశేషుడైన రాముడు తన బలవిక్రమములను ప్రదర్శించెను. భూభాండమునే భరించిమోయగలిగిన అవతారపురుషునకు ప్రలంబుడు తృణప్రాయముగ తోచెను.

రామునిశక్తిని యారక్కసుడు తెలిసికొనెను. తన భుజములపైయున్న రాముడు కైలాసపర్వతముపగిది కడుభారమైతోచెను. రక్కసుని యావజ్జీవములు క్రుంగెను. భారము భరించజాలక నేలపై కూలెను. రాముడంత వానిగుండెలపై కూర్చొని, తనపిడికెళ్ళతో కుళ్ళపొడిచెను. శిరస్సును చితుకబాదెను. ఆముష్టి ఘాతములధాటికి ప్రలంబునిశిరము వ్రయ్యలయ్యెను. అతని దేహమునుండి రక్తము సెలయేరులై ప్రవహించ, ప్రాణములు అనంతవాయువులందు లీనమయ్యెను.

బలరాముడు సంహరించిన దానవులలో ప్రలంబాసురుడు మిగుల బలాఢ్యుడు. అంతలో గోపాలురతో కృష్ణుడు అచ్చటికి చేరెను. రాక్షసుని మృతకళేబరముగాంచి అందరు ఆశ్చర్యమందిరి. సర్వాంతర్యామియైన కృష్ణుడు బలరాముని సంతసమున కౌగిలించుకొని ప్రస్తుతించెను.

## 78. గోపికావస్త్రాపహరణము

శ్రీకృష్ణుని శృంగారక్రీడలకు గోపికావస్త్రాపరహరణఘట్టం మహోన్నతమైనది. మరియు పరమోత్కృష్టమైనది. వేదాంతతత్వముతో గూడినది. శృంగారపురుషుడు కృష్ణుడు. జగన్మోహనాకారుడు. వేణుగానలోలుడు. తనవేణుగానామృతమునెల్లరకు పంచియిచ్చి, గోపికాలోలుడైనాడు. వారలనందరిని పరవసింపచేసినాడు. ఆ కారణముగ కృష్ణుడు నందవ్రజ జనానందుడై ప్రకాశించినాడు. గోపికలందరు ఆముగ్ధమోహనుని వెంటపడినారు. కృష్ణుని ప్రేమించినారు, కామించినారు. ఆ మహనీయుడే తమకు పతియు గతియు యని నమ్మినారు. అతడు దక్క తమను తరింపచేయువాడు వేరొక్కడులేడని త్రికరణశుద్ధిగ విశ్వసించినారు. "**అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణంమమ**" అను పరాకాష్టభావముతో కృష్ణుని శరణు కోరినారు. ఒక్కక్షణము గూడ ఆసచ్చిదానంద విగ్రహునెడబాటు సహింపజాలని వారైరి. కృష్ణుని ముగ్ధమనోహరాకృతిని గోపకాంతలు తమమనోఫలకములపై ముద్రించుకొని, స్మరించుచు, కీర్తించుచు బాహ్యమునే మరచినవారైరి. అట్టి గోపకాంతలతో కృష్ణుడు కలసిమెలసి సంచరించెను. యమునానదీ తీర సైకతస్థలు లందు శరద్రాత్రులు గడపినాడు. యథేచ్ఛగ విహరించినాడు. జలక్రీడల వినోదించెను. రాసక్రీడల ఆనందించినాడు. వారలకు అనిర్వచనీయమైన ఆనందానుభూతుని అనుగ్రహించినాడు.

అయితే శ్రీకృష్ణుడు ఒకరుకాదు. ఇద్దరుకాదు వేలమంది గోపకాంతలతో శృంగార క్రీడలు సాగించుట సాధ్యమా? అట్లు విహరించుట అనుచితము కాదా! అని సామాన్య దృష్టికి సందేహం కలగడం సహజమే. కాని ఆమహనీయుడు సర్వాంతర్యామి. సృష్టిలో ప్రత్యణువునందు తాను ప్రకాశించుచుండెను. "ఇందుగల డందు లేడని సందేహము వలదు" అని భక్తుడైన ప్రహ్లాదుడు భావించి, ఆ నిత్య సత్యమును తనతండ్రి హిరణ్యకశిపునకు ధృవపరచినాడు. కనుక కృష్ణుడు అందరితో క్రీడించినాడని పేర్కొనడము కంటే, అందరియందు అట్టిభావమును కలిగించి, వారిని తాదాత్మ్యస్థితికి చేర్చినాడని ఊహించడం సముచితమగును. అదియునుగాక భక్తునకు భగవంతునకు మధ్యగల సంబంధము పరిశీలించినచో, భగవంతుని లీలలు అవగతమగును. భక్తుని భక్తిభావము తారస్థాయికి చేరినపుడు పరమపదప్రాప్తి అనుగ్రహించడము భగవంతుని ధర్మము. ఇట్టి సన్నివేశములు అవతారపురుషుడైన కృష్ణుని లీలావినోదములందు కోకొల్లలు. కనుక కృష్ణుని జలక్రీడలు, రాచక్రీడలు మాయావినోదములే.

మరియొక విశేషము ఏమనగా? భగవంతుని దృష్టిలో అందరు సమానులే. స్త్రీపురుషభేదము మనకుగాని, పరంధాముని దృష్టియందులేదు. అందుకే మహోన్నతుని అభేదుడని పేర్కొనినారు. గుణాతీతుడు. అన్నింటికి అతీతుడు. కనుక పుణ్యపాపములు, సుఖదుఃఖములు, రాగద్వేషములు ఆ మహనీయునకు అంటవు. వానియందు తగుల్కొనడు. భక్తికే తగుల్కొని వశుడగును. అందుకు ఉదాహరణగ గజేంద్రమోక్షము చక్కని తార్కాణము. యశోద అల్లరికృష్ణుని రోటికి బంధించు సన్నివేశము నిదర్శనము. ఆ సన్నివేశమున ఎన్ని త్రాళ్లను తెచ్చినను బంధించుటకు చాలకుండెను. చివరకు విసిగి మనమున శ్రీహరిని ధ్యానించగ బంధనము సరిపోయెను. కనుక మోహబంధములకుగాక, భక్తిబంధములకు వశుడై బంధింప బడినాడు. అదియే భక్తునకు భగవంతునకుగల అవినాభావ సంబంధము.

వాస్తవముగ శ్రీకృష్ణునియందు జార, చోరగుణములు ఉన్నచో, అలనాడు నిండుసభలో పరాభవింపబడుచు, నిస్సహాయురాలుగ నున్న పరమపతివ్రత, మహాసాధ్వి, ద్రౌపది రెండుచేతులు పైకెత్తి జోడించి, శ్రీకృష్ణుని ప్రార్థించునా?

అటులే మీరాబాయి, సక్కుబాయి వంటి భక్తురాండ్రు కృష్ణుని సేవింతురా? జయదేవుడు, లీలాశుకుడు, తుకారాంమున్నగు భక్తాగ్రగణ్యులు శ్రీకృష్ణుని సేవించి

ముక్తులగుదురా? వారు సామాన్యులా! కావున కృష్ణభగవానుని సర్వాత్మన నమ్మిన భక్తులకు, భక్తురాండ్రకు తాదాత్మ్యస్థితిని పొందుటేగాని, తుచ్ఛము, అనిత్యము అయిన శారీరక సౌఖ్యములు, కామోపభోగములుండవు. కనుక భగవంతుడు అగ్నిస్వరూపుడు. అట్టివానిని భక్తులుగాక అన్యులు దరిచేర సాహసించరు. ఒకచో సాహసించినచో, అగ్నిజొచ్చిన శలభములపగిది మాడిబుగ్గియగుదురు. ఎందైన అగ్నికి చెదలుపట్టునా? కావున శ్రీకృష్ణుని క్రీడలు, చర్యలు అన్నియు వినోదార్థమే. ఇవి బాహ్యార్థము. అందు అంతర్లీనమైన భగవత్తత్త్వము చర్మచక్షువులకు అగోచరము. ఇక గోపికావస్త్రాపహరణము కథలోనికి వత్తము.

ఒకానొక సమయమున గోపకాంతలు, కృష్ణుని భర్తగపొంది, తమజీవితములు ధన్యత గావించుకొనతలచి వారందరు గూడి వ్రతమొక్క దానిని చేయబూనిరి. అది కాత్యాయనీవ్రతం. నెలరోజుల వ్రతం. మార్గశిరమాసమున ఆచరించుట ముఖ్యము.

గోపికలు ప్రతినిత్యము ప్రాతఃకాలమున నిదుర మేల్కొని, కాలకృత్యములు ముగించుకొని కాళిందీజలములందు స్నానము చేయవలెను. ఇసుకతో అమ్మవారి ప్రతిమను చేసి, గట్టున ప్రతిష్ఠించవలెను. షోడశోపచారములతోనర్చించి నివేదనలు సమర్పించవలెను. అటులావిధముగ యువతులందరు వ్రతమును అతినిష్ఠత గలిగి భక్తిశ్రద్ధలతో ఆచరించుచుండిరి.

ఒకనాడు గోపికలందరు కాళింది హ్రదమును చేరిరి. వస్త్రాభరణములన్నియు విడచి గట్టునచేర్చి, మడుగును ప్రవేశించి జలకము లాడుచుండిరి. అంత కొంటె కృష్ణుడు అచ్చటికి తనసఖులతో చేరెను. గోపికల చీరెలన్నియు చుట్టచుట్టి పరుగిడి చెంతనున్న నింబవృక్షమునెక్కి కూర్చుండెను. వేపచెట్టుపై కూర్చుండిన కృష్ణుడు, "కాంతలారా ! ఇటురండు. మీకట్టుబట్టలు గైకొనుడు," అని ఎలుగెత్తి పిలచెను. ఆ మాటలు విన్న గోపికలు సిగ్గునమొగ్గలైరి. ఆశ్చర్యమున, ఆందోళమున ఒకరి మొగమొకరు చూచుకొనిరి. ఆ సుందరాంగనలు ముసిముసి నగవులతో లజ్జచే కుంచించుకుపోయి మొగ్గలైరి.

అంత గోపికలు, "కృష్ణా ! మేము కుత్తుకబంటి నీటిలో దిగంబరులమై యుంటిమి. మేము నీచెంతకెట్లు రాగలము? కనుక మమ్ములను వేధించక మాచీరెలు మాకిమ్ము." అని యడిగిరి. వారి మాటలకు కృష్ణుడు సమ్మతించలేదు. వస్త్రముల నివ్వననెను. "కృష్ణా! మడుగులో నీరు మిగుల చల్లగనున్నవి. చలి వేయుచున్నది.

చలికి మాశరీరములు మిగుల నొచ్చుచున్నవి. నరములు గుంజివేయుచున్నవి. ప్రాణములు లాగుచున్నవి. మమ్ములను వేధించక మాకోకలనిమ్ము. నిన్నుసేవింతుము. నీపాదదాసీలుగ నుందుము. నీకు అనుకూలురమై వర్తింతుము. కనికరించి మా కట్టుపుట్టములు మాకిమ్ము" అని పరిపరివిధముల ప్రార్థించిరి.

అందులకు కృష్ణుడు ఒప్పుకొనలేదు. మడుగునుండి బయటకు వచ్చినగాని కట్టుబట్టల నీయనని ఖచ్చితముగా పలికెను. అంతట యువతులు చేయునదిలేక, తమ మర్మస్థానములను తమహస్తములతో కప్పికొని సిగ్గు, అభిమానము, భయము ముప్పిరిగొన కృష్ణుని సమీపించిరి. అంతట కృష్ణుడు చీరెలతో చెట్టుదిగివచ్చెను.

"ఓ సుందరాంగనలారా ! మీకొక విషయము చెప్పెదను వినుడు. స్త్రీలు ఎన్నడును వివస్త్రలై స్నానము చేయరాదు. అది అనేక అనర్థములకు హేతువగును. మరియు మీరు వ్రతదీక్షయందు గలరు. అట్టి తరుణమున చేయరాని కృత్య మాచరించితిరి. అయ్యది దేవతలకపచారమగును. కనుక దోష పరిహారముగ చేతులు జోడించి నన్ను ప్రార్థించిన మీ వస్త్రములనిత్తును." అని కృష్ణుడు పలుక, చేయునది లేక అవనజాక్షులు, ఒకచేతిని మాత్రము పైకెత్తి పరమాత్మునికి నమస్కరించిరి.

"ఓ కమలలోచనులారా ! మీరు చేయునమస్కారము ధర్మయుతముగాదు. భగవంతుడు మీకు రెండుచేతులనిచ్చినాడు. అవి సత్కర్మలు చేయుటకేయని తెలియుడు. కావున రెండుచేతులు జోడించి మ్రొక్కుడు." అని ముక్తికి మార్గమును తెలిపెను. అంత గోపికలు దేహభ్రాంతినివీడి పరబ్రహ్మస్వరూపునికి కరద్వయము మోడ్చి నమస్కరించిరి.

"ఓ కాంతలారా ! మీరు తెలిసియో తెలియకయో రెండుతప్పులు చేసినారు. వివస్త్రలై స్నానము చేయుట మొదటినేరము. ఒంటిచేతితో నమస్కరించుట రెండవ దోషము. అయినను మీదోషములు మన్నించితిని. భక్తికి సంతసించితిని. మీరిపుడు లజ్జ, బిడియము, దేహాభిమానములను త్యజించి, నన్ను భగవత్స్వరూపునిగా భావించితిరి. సర్వాంతర్యామియైన శ్రీహరికి, మీకు భేదము లేదని నెరింగితిరి." అని వారినభినందించి, వారి వస్త్రములను వారికొసగి అనుగ్రహించెను. భగవంతుని యందు అనన్య భక్తిప్రపత్తులను ప్రదర్శించి, సర్వమును అర్పించినపుడే భగవంతుడు వశుడగును.

# 79. గోవర్ధనపర్వతము

ఒకానొక సమయమున నందుడు మున్నగు యాదవప్రముఖులందరూ "ఇంద్ర యాగం" చేయ సంకల్పించిరి. అందుకు కావలసిన సన్నాహములు ప్రారంభించిరి. కావలసిన వస్తువాహనములు, సంబారములు సేకరించిరి. గోపకులంతా యాగ నిర్వహణ నిమిత్తం సందడిగ యుండిరి. కృష్ణుడు వారిని చేరి, చేయుచున్న ప్రయత్నమును గురించి ప్రశ్నించెను. కులపెద్దలిట్లుతెలిపిరి.

"మేము ఇంద్రయాగముచేయ సంకల్పించియుంటిమి. ఆ యాగము చేసినందున ఇంద్రుడు సంప్రీతుడై మనకు వర్షము కురిపించును. వర్షములు బాగుగ కురిసినచో పంటలు సమృద్ధిగ పండును. పశువులకు కొరతలేక పశుగ్రాసము లభించును. దేశమున కరవుకాటకములుండవు. పుడమియంతయు సస్యశ్యామలమై కనులకు, మనస్సుకు ఆనందమును కలిగించును. ఇంద్రయాగమువల్ల ఒక్క ఇంద్రుడే గాక వరుణుడు, అగ్ని, వాయువు మున్నగు దేవతలు సంతసింతురు. అందువల్ల భూలోకవాసులందురు సుఖసంతోషములతో వర్ధిల్లుదురు."

కృష్ణుడు వారిమాటలను శ్రద్ధగవినెను. "ఇంద్రాది దేవతలకు అధినాయకుడైన జగన్నాథుడు వేరొకడు కలదు. అతడే జగద్రక్షకుడై సమస్త భువనములను రక్షించు చున్నాడు. ఇంద్రాధిపత్యమొక్కటే మూలము కాదు. ఈ సత్యము తనవారికిక తెలియ చేయవలెను." అని కృష్ణుడు తలచెను. కృష్ణుడు కులవృద్ధులను ఒకచోట సమావేశ పరచెను. "అయ్యలారా ! ప్రస్తుతము ఇంద్రయాగము నాపుడు, అందుకు బదులుగా, మనలకు సర్వవిధముల అండగనుండి రక్షించుచున్నది గోవర్ధన పర్వతము. అది మనలను, మన గోకులమును కాపాడుచున్నది. బృందావనమునకు, వనభూములకు, పచ్చికభూములకు ఈపర్వతము ప్రాణాధారమైయున్నది. మనమందరము దీనివల్లనే సుఖసంతోషములతో నుంటిమి. కనుక ఇంద్రయాగము బదులుగా గోవర్ధన పర్వతమును పూజించుడు. హోమములు చేయుడు. అందుకు బ్రాహ్మణోత్తములను రప్పించుడు. అన్నదానములు చేయుడు. మనకున్న గోవులకు కడుపునిండుగ ఆహారము నిండు. వాటిని సంతోషపెట్టుడు. కనుక మీరు సమకూర్చిన ద్రవ్యమును గోవర్ధన పర్వతపూజకు, ఉత్సవమునకు వినియోగించుడు. దీనివలన యెల్లరకు శుభము, కలుగును." అని వివరించెను.

కృష్ణుని శుభసందేశము అందరికామోదయోగ్యమయ్యెను. గోవర్ధనోత్సవం మహావైభవోపేతముగ జరుప నిశ్చయమాయెను. కృష్ణుడు చెప్పిన విధముగ వేదపండితులను, విప్రశ్రేష్ఠులను రావించిరి. పాలు, పెరుగుమున్నగు సంభారములతో గోపికలు, గోపకులు, బాలురు, స్త్రీలు అందరు గోవర్ధనపర్వతమువద్దకు బయలుదేరిరి. బండ్లు, వాహనములు బారులుతీరి సాగుచుండ బ్రాహ్మణోత్తములు వేదమంత్రములు, శుభాశీస్సులు చదువుచుండ మంగళవాద్యధ్వనులతో దశదిశలు మారుమ్రోగెను. అటులందరు గోవర్ధనపర్వతమును చేరిరి. పసుపు కుంకుమలు, పళ్లుపూలు, దీపధూపములు సమకూర్చుకొని అబాలగోపాలము పర్వతరాజమునకు ప్రదక్షిణ నమస్కారములాచరించిరి. హోమములు చేసిరి. వేదసూక్తములతో నుతించిరి. గో, భూదానములు, విందులు, వినోదములు విరివిగ జరిగెను. పండితులను, బ్రాహ్మణులను భూరిదక్షిణలతో సత్కరించిరి. ముత్తైదువులను పూజించిరి. అటులే యమునానదిని భక్తి శ్రద్ధలతో నర్చించిరి. అటుల గోవర్ధనోత్సవము అతివైభవముగ ముగిసెను. కృష్ణుడు మనమున మిగుల సంతసించెను. ఇంద్రుని గర్వమణచి, కనువిప్పు గలిగించ వలెననెడి తనసంకల్పము నెరవేరు సమయ మాసన్నమైనదని కృష్ణుడు సంతసించెను.

ఇంద్రుడు గోకుల మందలి యాదవులు తనను పూజించి గౌరవించనందులకు, నాగ్రహించెను. ఐశ్వర్యమదోన్మత్తులై ప్రవర్తించినారని క్రోధమున మండిపడెను. కృష్ణుని సామాన్యమానవునిగ దలచెను. గోకులమును నాశనముచేయ నిశ్చయించెను.

ఇంద్రుని అధీనములో సంవర్తక మేఘసమూహములుండెను. వానిని గోకులమును సర్వనాశనమొనర్చుటకు ప్రోత్సహించి పంపెను. ఇంద్రుని ఆజ్ఞను తలదాల్చి మేఘములు బయలుదేరెను. ప్రళయము సృష్టించగల సంవర్తక మేఘములు బయలుదేరెను. అవి విజృంభించి గోకులంమీదకు విరుచుకుపడెను. ఫెళఫెళ ఉరుములు, కన్నులు మిరిమిట్లుగొలుపెడి మెరుపులు, దిక్కులు పిక్కటిల్లునట్లుపిడుగులు ఆకాశముతూట్లుపడినట్లుగ వర్షపుధారలు విరామములేక కురవసాగెను. గోకుల మంతయు జలమయమాయెను. వర్షపుధారలకుతోడు దివినుండి రాళ్ళు కురువ సాగెను. గోపకులు వర్షపు ధాటికి తాళజాలక, హాహాకారములొనర్చుచు దిక్కుతోచక పరుగులిడసాగిరి. జనజీవనము స్తంభించెను. కార్యకలాపములు అస్తవ్యస్తమాయెను. ఇండ్లు వాకిళ్లు నీటమునిగెను. త్రాగుటకునీరు, తినుటకు తిండిలేక అందరు అల్లాడిరి. ఇంక ఆలమందలు, దూడలు, వృషభరాజములు అనుభవించు యిక్కట్లు హృదయ

విదారకములు, వర్ణనాతీతము. ఆవులు, దూడలు, ఎద్దులు గుండెలు పగులునట్లు రంకెలిడుచు దవ్వుదవ్వులకు పారిపోసాగెను. ప్రతియొక్కరు శోక, భయవిహ్వల చిత్తులై గోవిందుని శరణుజొచ్చిరి. ఇంద్రయాగము చేయనందున యిట్టి విపత్తు సంభవించినదని వాపోయిరి. ఇంతటి అనర్ధకమునకు ఇంద్రుడే కారణమని దీనాతి దీనముగా విలపించిరి.

కృష్ణుడంత గోకులమును, గోవులను రక్షింపదలచెను. తనశక్తిని ప్రదర్శించి, ఇంద్రుని పరాభవింపదలచెను. గోవర్ధనపర్వతమును ఒకచేతితో అవలీల పైకెత్తి గొడుగుపగిది నిలిపెను. "గోపాలులారా ! మీకేమియు ప్రాణభయము లేదు. ఆలమందలతో, బిడ్డపాపలతో నావద్దకు రండు. పర్వతము క్రిందకు రండు. రక్షణ పొందుడు." అని అర్తజన రక్షకుడగు పరంధాముడు వారలను అదరమున పిలిచెను. వారందరంత పర్వతము క్రిందకుచేరి రక్షణ పొందిరి. గోవర్ధన పర్వతమును కృష్ణుడు తన చిటికెనవ్రేలుపై నిలుపుట గాంచిన ముల్లోకవాసులు ఆశ్చర్యచకితులైరి.

ఇంద్రుడు ఏడుదినములు రాళ్లవానను ఎడతెరిపి లేకుండగ కురిపించెను. ఏడు దినములు కృష్ణుడు అలాగుననే పర్వతమును పట్టి ఉంచెను. అదెంతటి పరమాద్భుత కార్యము?

కాని ఇంద్రుని సంకల్పము వికల్పమాయెను. గోకులమందలి స్త్రీ పురుషులుగాని, గోవులుగాని, వృషభరాజములుగాని, ఒక్క ప్రాణియు అణుమాత్రమైన అపదలచిక్కక సురక్షితముగ నుండెను. అది గాంచిన ఇంద్రుడు ఆశ్చర్యమందెను. భయకంపితు డయ్యెను. అధికారదర్పము, గర్వము, అహంకారమడుగంటెను. "కృష్ణుడు సామాన్యుడు గాడు. మానవ మాత్రుడుగ అవతరించిన సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే. ఆ మహనీయుని శక్తి తెలియక, అల్పబుద్ధినై అతనియెడ మహాపరాధమొనర్చితిని." అని పశ్చాత్తాపమందెను. సంవర్తక మేఘసమూహములను ఉపసంహరించెను. జడివర్షధారలు ఒక్కసారిగ ఆగెను. గగనమునుండి శిలలు రాలుట నిలచెను. కారు మబ్బులు విచ్చిపోయెను. ఆకాశము నిర్మలమాయెను. గగనమున సూర్యుడు తేజమున ప్రకాశించెను. నిర్మల ప్రశాంత వాతావరణము నెలకొనెను. అంతట వాసుదేవుడు తన్నాశ్రయించి పర్వతము క్రింద రక్షణ పొందుచున్న గోపాలురను. గోవృషభములను బయటకు రండని ఆదేశించెను. కృష్ణుడు చెప్పినదే తడవుగ అందరును మహదానందమున కీవలకు విచ్చేసిరి. యశోదానందనుడు పర్వతరాజమును

యధావిధిగ ధరణిపై నుంచెను. అంత వారందరు గోవిందుని వివిధరీతుల కీర్తించిరి. పలువిధముల కృష్ణుని శక్తియుక్తులను గొనియాడిరి.

దేవతాగణములు, గగనచారులు సంబరమున వేదసూక్తముల నుతింప, విరిజల్లులు జలజల జాలువారెను. ఆ బాలగోపాలము సంబరమున గంతులువేయ. అందంతటను పండుగ వాతావరణము నెలకొనెను.

ఇంద్రుడంత ఐరావతమునెక్కి గోకులము చేరెను. అతని వెంట కామధేనువు వచ్చెను. కృష్ణుని దర్శించి పాదములంటి మ్రొక్కెను. తెలియక యొనర్చిన అపరాధమును మన్నించుమని ప్రార్థించెను.

కామధేనువొసగిన పవిత్ర క్షీరముతోడను, ఐరావతము తొండముతో గొనివచ్చిన పావన గంగాజలములతోడను ఇంద్రుడు జగద్రక్షకుడైన కృష్ణుని అభిషేకించెను. అచటికేతెంచిన బ్రహ్మ, మహేశ్వరులు, దేవతాగణములు భగవంతుని గుణములు గానముచేయ, దేవకన్యలు నాట్యమాడిరి. దివినుండి సుగంధభరిత విరులు వర్షించెను. కృష్ణుడు ఇంద్రుని మన్నించెను. ఇంద్రుడంత కృష్ణునకు నమస్కరించి తనలోకమునకేగెను. దేవతలందరు కృష్ణుని యనుమతి పొంది తమతమ నివాసములకు చనిరి. ప్రకృతి యంతయు పులకించెను. పుడమి యంతయు ఓషధులతో పరిపూర్ణమయ్యెను. సమస్త ప్రాణులు ఆనందించెను.

ఈ సంఘటనము జరిగిన నాటికి నందనందను వయస్సు ఏడుసంవత్సరములు మాత్రమే. కృష్ణుడు తన అవతారతత్వమును, శక్తిని మానవాళికి నిరూపించుటకు, అద్భుతముల నెన్నింటినో ప్రదర్శించినాడు. సర్వాత్మన తననాశ్రయించిన ఆశ్రిత జనులను రక్షించుటకు ఎంతటి ఘనతరకార్యమునైనను అవలీలగ నెరవేర్చును. అరిషడ్వర్గములకు వశులై అహంకరించిన గర్వితమతుల గర్వమణచి, భగవత్తత్వమును పాదుకొలుపుట భగవానుని వ్రతదీక్ష.

## ౬౦. ఆపదలో నందుడు

నందుడు ఏకాదశి పర్వదినమున ఉపవాసముండెను. ద్వాదశితిథిన నందుడు తెల్లవారు ఝామున నిద్రమేల్కొని యమునకు స్నానముచేయవెళ్లెను. నదిలో స్నానము చేయుచుండగా. వరుణుని సేవకుడు ఒకడువచ్చి, నందుని అపహరించుకుపోయెను. నదిలో నందుడు కానరానందున గోపికలు అతనికొరకు బిగ్గరగ నేడ్వసాగిరి. కృష్ణుడు

వారలనోదార్చి, నందుని గొనివచ్చుటకు వరుణలోకమున కేగెను. వరుణుడు పశ్చిమ దిక్కునకు అధిపతి. కృష్ణుని గాంచిన వరుణుడు చాల ఆనందించి సముచిత మర్యాదలతో గౌరవించెను.

అంత కృష్ణుడు తాను వచ్చిన పనిని వివరించెను. తన భటుడు తెలియకచేసిన అపచారమునకు వరుణుడు చాల విచారించి, క్షమింపుమని ప్రార్థించెను. నందుని గొనివచ్చి కృష్ణునకు అప్పగించెను. తండ్రిని వెంటనిడుకొని కృష్ణుడు వ్రేపల్లెకు సురక్షితముగ చేరెను. నందునకు కలిగిన ఆపదనుండి కృష్ణుడు రక్షించినందులకు, గోపకులందరు పలువిధముల కీర్తించి, కృష్ణుడు నిజముగ భగవంతుడని నమ్మిరి.

అటులనే మరొక సమయమున నందుడు తనవారందరితోగూడి అంబికా వనమున కేగెను. ఆవనము సరస్వతీ నదీతీరమున గలదు. అందుగల అంబను అర్చించదలచెను. మేలగు అశ్వములు పూన్చిన రథములందు బయలుదేరి అంబికా వనముచేరిరి. రామకృష్ణులును అచ్చటకు చేరుకొనిరి. అందరు సరస్వతీనది పవిత్ర జలముల స్నానమాడి, పార్వతీపరమేశ్వరుల నర్చించిరి. గో, భూ, హిరణ్య దానములతో బ్రాహ్మణులను సంప్రీతుల చేసిరి. ఆ రోజు అందరు ఉపవసించి, కేవలము జలపానము మాత్రము చేసిరి.

ఆ రాత్రి పెద్దసర్పమువచ్చి నందుని చుట్టుకొని, మింగప్రయత్నించెను. నందుడు మిగుల భయమంది పెద్దగ కేకలిడెను. ఆ అలజడికి గోపకులందరు మేలుకొని కాగడాలతో వచ్చి అచ్చట దృశ్యమునుగాంచి సర్పమును బడితలతో బాదిరి. కాగడాలతో కొట్టిరి. కాని సర్పము నందుని విడువలేదు. అంత కృష్ణుని ప్రార్థించిరి. కృష్ణుడు పరుగున వచ్చి పామును పట్టిలాగి క్రింద పడవేసి కాలితో మర్దించెను. కృష్ణుని పాదస్పర్శచే పాముమాయమై ఒక గంధర్వుడు ప్రత్యక్షమాయెను. అతడు దివ్యాభరములచే మిగుల ప్రకాశించుచుండెను. ఆ గంధర్వుడు, తనకు శాపమోక్ష మనుగ్రహించినందులకు కృష్ణుని పలువిధముల కీర్తించుచు, పాదములకు మ్రొక్కి నిజలోకమునకు చనెను.

ఆ గంధర్వుడు గతజన్మలో సుదర్శనుడు. అతడొక సమయమున గగనమున విమానయానము చేయుచుండెను. ఒక ప్రదేశమున అతనికి అంగిరసుడు మున్నగు మునులు అగుపించిరి. వారి రూపములు చూచి పరిహాసమాడెను. మునులంత ఆగ్రహించి, "ఓరీ ! మూర్ఖా ! నీ అందచందములు చూచుకొని మిగుల గర్వించి

మమ్ములను అవమానించితివి. అందుకు ప్రతిఫలముగ వికృతమైన సర్పరూపము ధరించెదవుగాక" అని శపించెను. అంత సుదర్శనుడు, జ్ఞానముగలిగి, పశ్చాత్తాపమున అంగిరసాదిమునులను, తనను క్షమింపుమని ప్రార్థించెను. శాపవిముక్తి అనుగ్రహించుమని దీనుడై వేడెను. వారును గంధర్వుని కరుణించి, "ఓయీ! శ్రీహరి శ్రీకృష్ణుడై భువినవతరించును. అతని పాదస్పర్శచే నీవు క్షమింపబడుదువు." అని పలికి వెడలిపోయిరి. నందాదిగోపకులు ఆవిచిత్ర సన్నివేశముగాంచి ఆశ్చర్యమంది ఆనందించిరి.

## 81. శంఖచూడుడు

ఒకనాటి వెన్నెలరాత్రి బలరామకృష్ణులు గోపికలతోకలసి యమునానదీతీరమున వినోదముగ విహరించుచుండిరి. ఆ సమయమున కుబేరుని అనుచరుడు శంఖచూడుడనువాడు అచ్చటికరుదెంచెను. గోపికలను గాంచినంతనే వానిలో దాగియున్న మన్మథతాపమును సహింపజాలక, యక్షమాయను ప్రదర్శించి గోపికలను అపహరించెను. వానికి కృష్ణునిశక్తి, మహిమ తెలియదు. గోపికలు ఆర్తనాదములు చేయసాగిరి. "రామా ! కృష్ణా ! రక్షించండి రక్షించండి" అనుచు పెద్దపెట్టున రోదించసాగిరి. రామకృష్ణులు వారి రోదనములనాలించిరి. విషయము తెలిసికొని మానులు, కొమ్మలు చేగొని వానిని వెంబడించిరి.

కృష్ణుడు తాను ఒక్కడే శంఖచూడుని వెంటబడెను. రాముడు మిగిలిన గోపికలను రక్షించుచుండెను. శంఖచూడుడు కృష్ణుని బారినుండి తప్పించుకొనజాలక, గోపికలను విడచి పెట్టెను. కాని కృష్ణుడు వానిని విడువలేదు. వెంటబడి తరుమసాగెను.

చివరకు అదుష్టుడు కృష్ణునకు పట్టుబడెను. కృష్ణుడు తన పిడికిలి బిగించి వాని తలపై గట్టిగ గ్రుద్దెను. ఆముష్టిఘాతమునకు వాని తలపగిలి వ్రయ్యలయ్యెను. శంఖచూడుడు గావుకేకపెట్టి మరణించెను. వాని తలలో దివ్యరత్నముండెను. కృష్ణుడు దానిని గైకొని పోయి రామునకు కానుకగనిచ్చెను. రాముడు శిరోరత్నమును గైకొని సంతసించెను. అందరు కృష్ణుని పలురీతుల కొనియాడి, ఆనందించిరి.

## 82. అరిష్టాసురుడు లేక వృషభాసురుడు

అరిష్టాసురుడనువాడు కంసుని పనుపున వృషభరూపముదాల్చి గోకులముపై పడెను. పెద్దపర్వతాకారుడైవచ్చి వ్రేపల్లెలో విచ్చలవిడి విహరింపసాగెను. వృషభమును జూచి గోపాలురు గోపకాంతలు మిగుల భయమందిరి. గోవులు బెదరి నలుదెసలకు

పరుగులెత్తెను. వృషభము ఘనమేఘము గర్జించుచున్నట్లు రంకెవేసెను. కాలి గిట్టలతో భూమిని అదురగొట్టెను. బలమైన కొమ్ములతో పుడమిని పెల్లగించు చుండెను. అదిగాంచి యాదవులు, పశుగణముల మిగుల భీతి చెందెను. వారందరు పరుగున వచ్చి గోవిందుని శరణుజొచ్చిరి. అపుడు దేవకీతనయుడు వారల కభయమిచ్చెను. వృషభరూపమున వచ్చినవాడు రాక్షసుడని తెలిసికొనెను.

కృష్ణుడు వెనువెంటనే వృషభాసురు నెదుర్కొనెను. వాడును తన పదునైన కొమ్ములతో కృష్ణునికుమ్మి అంతమొందించవలెనని ఒక్క ఉదుటన కృష్ణునిపై దుమికెను. కృష్ణుడంత వానిశృంగములను గట్టిగపట్టి వెనుకకునెట్టెను. రక్కసుడు రెట్టించిన వేగముతో వచ్చి మరల కృష్ణునితాకెను. అపుడు యిరువురకు గొప్ప యుద్ధము జరిగెను. ముల్లోకవాసులు వారిపోరుగాంచి సంభ్రమాశ్చర్యముల తేలియాడిరి. కృష్ణుడంత రౌద్రుడై అసురుని శృంగములనుపట్టి గిరగిరత్రిప్పి నేలమీద గొట్టెను. పాదముల తోడను, హస్తములతోడను, వానిదేహమును మర్దించెను. వృషభుడు మాంసపుముద్దగమారెను. కుండలతో గ్రుమ్మరించినట్లు నెత్తురుగ్రక్కి విలవిల తన్నుకొని వృషభాసురుడు ప్రాణములు విడచెను. "భళా! భళా!" అనుచు వ్రేపల్లె వాసులందరు ఆనందమున గంతులువైచిరి.

## 83. కేశి రక్కసుడు

కేశియను రాక్షసుడు ఒకదినమున గోకులములో ప్రవేశించెను. అతడొక అశ్వరూపము ధరించెను. అది మిగుల భయంకరముగ నుండెను. దాని సకిలింపు గోకులమును భయభ్రాంతులతో ముంచి వేయుచుండెను. భీకరరూపుడైన కేశి కృష్ణుని అంతమొందింపవచ్చెను. కంసుడు చేసిన కుట్రలలో ఇదికూడ ఒకభాగమే.

కృష్ణుడు కేశినియొక్క మాయను గ్రహించి ఆదుష్టుని సంహరించ నిశ్చయించెను. ఒక్కసారిగ రక్కసునెదిరించెను. దుష్టరాక్షసుడంత కొండగుహవంటి తననోరుతెరచి గట్టిగ సకిలించెను. గబాలున పైకెగసి తనముందరికాళ్ళతో బలముగ తన్నెను. గోవిందుడు వానిదెబ్బకు ఎంతమాత్రము జంకలేదు. అణుమాత్రమైన చలించలేదు. మహానాగమును గరుడుడు ఒడిసిపట్టినట్లు, గుఱ్ఱము ముందరికాళ్లను పట్టుకొని మహావేగమున బలాతిశయముతో మిక్కిలి దూరమునకు విసరివేసెను. రక్కసుడు అల్లంతదూరమున బడిమూర్ఛిల్లెను. వెంటనే తేరుకొని మిగుల రోషముతో వచ్చి ముకుందుని దాకెను.

అంతట శ్రీహరి తనవామహస్తమును దానినోటిలోజొనిపెను. అపుడు పరమాత్ముని చేయి ఎఱ్ఱగకాలిన ఇనుపదూలమువలె నుండెను. దాని ధాటికి దాని నోటిలోని పండ్లు జలజలరాలిపడెను. వాసుదేవుని హస్తము క్రమక్రమముగ పెరిగి పెద్దదయ్యెను. పెద్ద కొండంతాయెను. అచర్యతో రక్కసుడు ఊపిరాడక విలవిల తన్నుకొనెను. మితిమించిన బాధతో గ్రుడ్లు వెళ్లబెట్టి ప్రాణములు విడిచెను. పర్వతాకృతిలో యున్న కేశిని అశ్వరూపం గుభిల్లున నేలకూలెను. వానినోరు బ్రద్దలుగ చీలెను. కృష్ణుని సాహసచర్యకు దివిజులాదిగ గగనచారులు ఆశ్చర్యచకితులై, ఆ మహనీయునిపై పుష్పవృష్టి సంతసమున కురిపించిరి. కేశినిని సంహరించినందున శ్రీకృష్ణుడు నాటినుండి కేశవుడై ప్రకాశించెను.

## 84. వ్యోమాసురుడు

ఒకానొక సమయమున రామకృష్ణులు తోటినెచ్చెలులతోకూడి, ఆలమందలను తోలుకొని వనభూములకేగిరి. అడవులందును, కొండవాలులందును గోవులు పచ్చిక మేయుచుండెను. తన సఖులగూడి కృష్ణుడు దాగుడుమూతలాట లాడసాగెను. ఆ తరుణమున, కంసుని ఆదేశానుసారము, వ్యోమాసురుడు అచ్చటికరుదెంచెను.

వ్యోమాసురుడు మయుని పుత్రుడు. గొప్పమాయావి. రాక్షసుడైన వ్యోముడు బాలుని రూపముదాల్చి బాలురుతో ఆడుచు, ఒక్కొక్క బాలుని గొనిపోయి, దాపునవున్న కొండగుహలో బంధించసాగెను. అందుండి బాలకులు వెలుపలకు రాకుండగ బిలద్వారమును పెద్దబండతో మూసివైచెను.

గోపబాలుని రూపములోయున్న వ్యోముని మోసమును కృష్ణుడు పసిగట్టెను. అది తెలిసిన ఆమాయావి తనశరీరమును పెంచెను. అటుల పెరిగిపెరిగి పర్వతాకారుడయ్యెను. కృష్ణుడు వానినెదిరించి ఒక్కతాపున క్రిందపడగొట్టెను. అటుల క్రిందపడిన మాయారక్కసుని గుండెలపై కూర్చొని, ఉక్కుగుదియలవంటి పిడికెళ్ళతోనుజ్జుగ గ్రుద్ది సంహరించెను. అనంతరము కొండగుహను సమీపించి, ద్వారమునకు అడ్డు పెట్టిన బండను తొలగించెను. సునాయాసముగ గోపాలురను ప్రాణగండమునుండి రక్షించెను. అంతదేవతలు ఆనీలదేహుని పలుతెరగుల కొనియాడుచు, కుసుమ వర్షమున ముంచెత్తిరి. అటుల కంసవైరి కంసానుచరులను సంహరించి, గోబృందమును, గోపకులను, గోపకాంతలను, సాధుజనులను రక్షించి, దేవతలను సంతసపరచుటమేగాక, భూదేవిని శాంతిపచేసెను.

## 85. కంసుని దురాలోచన

రామకృష్ణులు మహాబలాఢ్యులు. మహామాయావులైన రాక్షసులనెందరినో నవలీలగ సంహరించినందున కంసుని గుండెలో గుబులు రేకెత్తెను. దిక్కుతోచనివాడై భయసంశయములతో గొట్టుమిట్టాడు చుండెను. దానికి తోడుగ, రామకృష్ణులు దైవాంశ సంభూతులనుభావం ప్రజలలో వృద్ధి చెందెను. తనకు మృత్యువు వారితో తప్పదేమోయను సంశయము కంసుని అనుక్షణము పీడించసాగెను. అట్టి ఆలోచనలు కంసుని ముసురుకొని వేధించుచుండగ వానికి కంటికి కునుకులేదు. పానీయములు రుచించవు. ఆహారము హితముకూర్చదు. ఇతర చింతనములేదు. ఎవ్వరితోడను ముచ్చటించడు. పానుపుపై పరుండబోడు. నిలచినచోట నిలువడు. సాగరతరంగము వలె, ఆలోచనలు చంచలములై స్థిరత్వమును కోల్పోవుచుండెను. మరణభయమధిక మయ్యెను. అతని ప్రవర్తనమంతయు మతిభ్రమించిన వానిచందమున యుండెను.

అట్టి తరుణమున త్రిలోకసంచారి నారదమహర్షి మధుర కరుదెంచెను. కంసరాజు నారదుని సమాదరించి, గౌరవమున పూజించెను. యోగక్షేమము లరసిన మీదట కలహాభోజుడైన దేవర్షి రామకృష్ణుల జన్మరహస్యములను పూసగ్రుచ్చినట్లు వివరించెను. గోకులములో వృద్ధిచెందుచున్న రామకృష్ణులే పూతన, ప్రలంబాది రాక్షసవీరులను సంహరించిరనియు, వారి వల్లనే కంసునకు మరణము తప్పదని, సుస్పష్టముగ వివరించెను.

కంసుని అనుమానము నారదుని మాటలతో ధృవపడెను. రామకృష్ణులు దేవకీ వసుదేవుల పుత్రులని రూఢిఅయ్యెను. వసుదేవుడు తనను మోసగించినాడని, అతనిలో క్రోధాగ్నిరగిలెను. వెంటనే వసుదేవుని సంహరించ హుటాహుటి బయలుదేరెను. నారదుడు వానిని శాంతింపచేసెను. కంసుడంతట దేవకీ వసుదేవులను సంకెళ్ళతో బంధించి చెరసాలలో నుంచెను. ఇంక ఉపేక్షించిన ప్రమాదము తప్పదని తానే స్వయముగ రామకృష్ణులను హతమార్చ పూనుకొనెను.

వెంటనే కంసుడు మంత్రిమండలిని సమావేశ పరచెను. మంత్రులందరు దుష్టులు, దురితాత్ములు. సజ్జనసాధుజనులను హింసించువారే. దురాలోచనాపరులే. రామకృష్ణులను సంహరించుటకు కుట్రలు కుతంత్రములు యోచించి ఒకపథకము నిర్ణయించిరి. రామకృష్ణులను ఏదోనెపమున మధురకురప్పించి, వారినెట్లులైనను మట్టుపెట్టుట మంత్రిమండలి దురాలోచనమందలి ప్రధానాంశము.

చాణూరుడు, ముష్టికుడు అనువారిద్దరు కంసుని ఆస్థానమందలి మల్లయోధు లందు ప్రముఖులు. వారేగాక కంసునివద్ద "కువలయాపీడ" మను మదపుటేనుగు గలదు. దానిని రెచ్చగొట్టి విడచినచో ఎందరినైనను అవలీలగ మట్టుపెట్టగలదు. ఎంతటి బీభత్సమైనను సృజించగలదు. కావున రామకృష్ణులను తననగరమునకు రప్పించి, మల్లయోధులతోగాని, ఆ మదమత్తేభముతోగాని మట్టుపెట్టించవచ్చునని కంసుని దురాలోచన. అందుకై తన రాజ్యమున వినోద క్రీడలు, కాలక్షేపములు కల్పించి, ఆ బాలురనిద్దరను ఆహ్వానించవలెను. మేనమామ ఆహ్వానమును రామకృష్ణులు తప్పక మన్నించి వత్తురు. వచ్చినవారిని వచ్చినట్లుగ హతజీవులను చేయవచ్చును. వ్రజపురము నుండి వారిని ఆహ్వానించుట ఎట్లు? అందుకు తగిన దూతకావలెను. దూతకార్యము నేర్పుగ నెరవేర్చగల నేర్పరి, ధీమంతుడెవడని కొంతతడవు చింతించెను. అట్టి సమర్థుడు, స్వామిభక్తి పరాయణుడగు అక్రూరుని పిలిపించెను.

కంసుడు అక్రూరుని గాంచి, "అక్రూరా! నీవు నాకు ఆప్తుడవు, చెలికాడవు. కార్యదక్షుడవు. ఎంతటి జటిల కార్యమైనను నేర్పుగ సమర్థించగల ధీశాలివి. రానున్న చతుర్దశినాడు మనరాజ్యములో 'ధనుర్యాగము' జరుప నిశ్చయించితిమి. అందు అనేక క్రీడలు, వినోదములు జరుగును. పురప్రజలందరు వేడుకలను మహావైభవో పేతముగ జరుపుకొందురు. అందుపాల్గొనుటకు, వినోదములను కన్నుల పండువుగ వీక్షించుటకు అనేకులు పలు ప్రాంతముల నుండి వత్తురు. నాదు చెల్లెలిపుత్రులు, మేనల్లుళ్లు రామకృష్ణులను ప్రత్యేకముగ ఆహ్వానించదలచి యుంటిని. అందు నిమిత్తము నీవు గోకులమునకేగి వారలను గొని రమ్ము. రామకృష్ణులతో పాటుగ నందాది గోపప్రముఖులను విడివిడిగ పేరుపేరున ఆహ్వానించి, వెంట నిడుకొని రమ్ము. నేర్పుగ వ్యవహరించి, వారలను యొప్పింపుము. ఇట్టి దూతకార్యనిర్వహణ మందు నీకునీవే సాటియగువాడవు."

కంసుని కపటప్రవృత్తి, దురాలోచనము తెలిసియుండియు, అక్రూరుడు స్వామిభక్తి పరాయణుడై దూతకార్యము నిర్వహింపబూనెను. వ్రేపల్లె వెళ్ళుటకు అంగీకరించెను. సేవా ధర్మమాతనిని కట్టి వైచెను.

## 86. అక్రూరుడు

అక్రూరుని తల్లి కాందిని, తండ్రి శ్వఫల్కుడు. మధురాపురమాతని నివాసము. ఆతని యందు భగవద్భక్తి మెండు. సహజముగ సద్గుణసంపన్నుడు, రామకృష్ణులు అవతారపురుషులని ఆమహనీయుడు గుర్తించెను. కంసుడు దురాలోచనాపరుడనియు, రామకృష్ణులను అంతమొందించ కుట్రపన్నుచున్నాడనియు అక్రూరునకు తెలియును. కంసుడు వారినేమి చేయజాలడని కూడ తెలియును. భగవత్స్వరూపులయిన రామకృష్ణులను కన్నులవిందుగగాంచి, సేవించు భాగ్యముకలుగునని ఆశించి అక్రూరుడు వ్రేపల్లెకు బయలుదేరెను. వారిని వెంటనిడుకొని వచ్చెడి అదృష్టమునకు మురిసిపోయెను.

"వినాశకాలే విపరీతబుద్ధిః" అనుచందమున కంసునకు వినాశకాల మాసన్న మైనది. కావుననే మృత్యువును స్వయముగ ఆహ్వానించుకొనుచున్నాడు. పోగాలము దాపురించినపుడు యిట్టి దుర్బుద్ధులే కలుగు చుండును". అని అక్రూరుడు చింతించుచు, కంసుని ఆజ్ఞను తిరస్కరించు ధైర్యము చాలక వ్రేపల్లెకు పయనమాయెను. రామకృష్ణుల దివ్యరూపములను ఆత్మలో దర్శించుచు, వారి లీలలను మనమున చింతించుచు ఆత్మానందానుభూతిని పొందుచూ వ్రేపల్లెకు రథారూఢుడై వచ్చుచుండెను.

సాయంసంధ్యవేళ అక్రూరుడు వ్రేపల్లెకు చేరుకొనెను. బృందావనములో రామకృష్ణులను దర్శించెను. వారినిచూచి రథముదిగెను. సూర్యచంద్రులవలె ప్రకాశించు రామకృష్ణుల పాదపద్మములపై పెల్లుబికిన ఆనందోత్సాహములతో సాగిలపడెను. భక్తిమీర వారిచరణారవిందములను కన్నులకద్దుకొనెను.

అంత రామకృష్ణులు అక్రూరుని సాదరమున లేవనెత్తి కౌగిలించిరి. గౌరవించి తమ గృహమునకుగొనిపోయిరి. అర్ఘ్యపాద్యములతో సమాదరించిరి. నూతన వస్త్రములతో సత్కరించి, మధుర పానీయములనిచ్చి మార్గాయాసమునుదీర్చిరి. పిమ్మట షడ్రసోపేతమైన విందునిచ్చిరి. నందాదులును అక్రూరుని మర్యాదపూర్వకముగా నమస్కరించి గౌరవించిరి. కుశల ప్రశ్నలతో ఆనందించిరి.

అనంతరము రామకృష్ణులు ప్రియవచనముల అక్రూరుని క్షేమములడిగి తెలిసికొనిరి. అక్రూరా ! నీవు కడుధన్యుడవు. మిగుల పుణ్యాత్ముడవు. నీ యందు క్రౌర్యగుణము లేని కారణముచే నీవు అక్రూరుడవని సార్థకనామధేయుడవైతివి. నీవు వచ్చిన కార్యమేమి? పూజ్యులు, దైవసమానులు మాతల్లిదండ్రులెట్లుండిరి?

మా మామ కంసుడు ఎట్లున్నాడు? మాపై, యాదవులపై ద్వేషము మానెనా? మధురానగరవాసు లెట్లుండిరి? అని ప్రశ్నించిరి.

అంత అక్రూరుడు, మహనీయులారా ! "నారదమహర్షి వలన మీ జన్మ రహస్యములన్నియు కంసుడు తెలిసికొనెను. నాటినుండి మీయందు ద్వేషభావము బాగుగ వృద్ధిచెందినది. ఎట్టులైనను మిమ్ములనంతమొందించవలెనని అతని పన్నాగము. అందునిమిత్తము ధనుర్యాగమును సంకల్పించినాడు. యాగమునకు మిమ్ముల తోడ్కొని రమ్మని నన్ను మీవద్దకు పంపినాడు. సర్వము తెలిసియుండుయు, కంసరాజు ఆజ్ఞనుకాదను ధైర్యముజాలక తమసన్నిధికి వచ్చితిని. నేను దూతను. దూతకార్యము నెరవేర్పవచ్చితిని. నన్ను మన్నించుడు" అని వినమ్రుడై పలికెను.

అక్రూరుని వచనములు వినిన రామకృష్ణులు నవ్వుకొనిరి. అటుపై అక్రూరుడు నందుని ఆహ్వానించెను. నందుడు కంసునకు సామంతుడు. అందుచే నందుడు కట్నకానుకలతోడ సర్వసన్నాహములు సమకూర్చుకొని ప్రయాణమునకు సిద్ధమాయెను. ఆ రాత్రే వ్రేపల్లెయందు చాటింపు వేయించెను. ప్రజలందరిని మధురకు తరలిరమ్మని ఆదేశించెను.

## 87. రామకృష్ణుల ప్రయాణము

యాదవులందరు మధురకు ప్రయాణమైరి. రామకృష్ణులు బుధశుక్రులవలె దివ్యతేజులై వెలిగి పోవుచుండిరి. అక్రూరుడు రథపగ్గములను పట్టెను. నందుడు మున్నగు గోపముఖ్యులు రథములు సిద్ధపరచుకొని వారివెంటజనిరి. అందరు సంతోషమున వుండిరే గాని, గోపికలు మాత్రం విచారగ్రస్తులై యుండిరి. కృష్ణుడు తమను వదలి వెళ్ళుచున్నందులకు యెడబాటును భరించజాలరైరి. గోపకాంతలు రథమును చుట్టుముట్టిరి. తమను విడచివెళ్లవద్దని బ్రతిమాలిరి. ప్రాధేయపడి ప్రార్థించిరి. త్వరలోనే మరలివత్తునని కృష్ణుడు వారినోదార్చెను. రోహిణీయశోదలు మంగళహారతులిచ్చి రామకృష్ణులకు తిలకములు దిద్దిరి. అంతయు మేలు కలుగవలెనని దీవించిరి.

అక్రూరుడు వాయువేగమనోవేగములతో రథమును నడిపెను. మధ్యాహ్నమాయెను. యమునను సమీపించిరి. అచ్చట కొంతతడవు సేద తీర్చుకొనిరి. యమునయందలి మధురజలములు గ్రోలిరి. మరల రథములు సాగినవి.

అక్రూరుడు నదిలో స్నానము చేయుచుండగా, నీటిలో అతనికి రామకృష్ణులు అగుపించిరి. అశ్చర్యమున రథములవంకచూడగ, రథముపై అదివ్యసుందర విగ్రహాలు ఆశీనులైయుండిరి. మరల నదీజలములనుగాంచెను. శ్రీమహావిష్ణువు శ్రీదేవి సహితుడై శేషశయనుడై పవ్వళించి యుండెను. అక్రూరుడు ఆనందముతో పరవసించెను. తనువు పులకరించెను. మహాయోగులకు సైతము అసాధ్యమైన బ్రహ్మజ్ఞాన, ఆత్మానందానుభూతి కలిగెను. చేతులుజోడించి ఆనందాశ్రువులు నేత్రములనుండి జలజల రాలుచుండగ శ్రీహరిని దివ్యస్తోత్రముల స్తుతించెను. కృష్ణుడు తనే భగవంతుడననెడి దివ్యజ్ఞానమును అక్రూరునకు కలిగించెను.

సాయంసమయమున రథములు మధురను చేరెను. నగరపొలిమేర యందుగల ఉద్యానవనమున విడిదిచేసిరి. ఆరాత్రి అందుండుటకు వారు నిర్ణయించుకొనిరి. తమరాకను ముందుగ తెలుపుమని అక్రూరుని కృష్ణుడు పంపదలచెను. కాని విష్ణుభక్తుడైన అక్రూరుడు అందులకు సమ్మతించలేదు. రామకృష్ణులను, గోపకులను తనగృహమునకువచ్చి ఆతిధ్యమును స్వీకరించి కృతార్ధునిచేయుమని ప్రార్ధించెను. అందులకు కృష్ణుడు అంగీకరించలేదు.

"అక్రూరా! నేను వచ్చిన కార్యము నెరవేర్చిన తదుపరి నీ గృహమునకు తప్పక వత్తును. అందులకిపుడు సమయము కాదు కావున నగరమునకు వెళ్లుము. మారాకను కంసునకు తెలుపుము" అని కృష్ణుడు అక్రూరుని సమాధాన పరచెను. భగవదాజ్ఞను శిరసావహించి, అక్రూరుడు రాజధానికిచేరుకొని, కంసమహారాజునకు విషయమును వివరించెను. రామకృష్ణులు మధురకు చేరినందులకు, కంసుడు లోలోన సంబరపడెను. తన కుతంత్రము ఫలించనున్నదని ఆనందించెను.

రామకృష్ణులకు మధురానగర శోభను గాంచి తనివిదీర ఆనందించవలెననెడి కోరిక గలిగెను. అందుకు ప్రధాన కారణములు, ఒకటి తాను జన్మించిన స్థలము. జన్మభూమి, జన్మనిచ్చిన తల్లి స్వర్గసౌఖ్యముల కన్న మిన్నకదా! తన తల్లిదండ్రులు అందేయుండుట రెండవ కారణము. తన మేనమామను కన్నులార గాంచి, అతని బలదర్పములనడచి, సంహరించగల కాలమాసన్నమగుట మూడవకారణము.

అటుపై పురవీధులన్నియుతిరిగి వింతలు విశేషములు చూడసాగిరి. నగర శోభను గాంచి అన్నదమ్ము లిరువురు ఆనందించిరి. నగరమందలి స్త్రీలు, పురుషులు, వృద్ధులు, బాలురు ప్రతిఒక్కరు రామకృష్ణుల రూపలావణ్యాది విశేషములగాంచి

మహదానంద భరితులైరి. రామకృష్ణులనుగాంచి, అవతార పురుషులుగ తలచి భక్తిమీర నమస్కరించిరి. అత్యంత భక్తిప్రపత్తులతో వారిపై పరిమళ ద్రవ్యములు, పుష్పములు, గంధము, అక్షతలు జల్లిరి. బాలురిద్దరిని క్రూరాత్ముడైన కంసాంతకులుగ గుర్తించిరి.

అటుల రామకృష్ణులిర్వురు నగరశోభను తిలకించుచు, తిరుగాడుచున్న సమయమున వారికొక రజకుడు కాన్పించెను. వానివద్ద వివిధరకముల వస్త్రము లుండెను. కృష్ణుడు రజకుని చేరబిలచి, "ఓయీ ! రజకా ! నీ వద్దమేలగు వస్త్రములు ఉన్నవి. మాకు ధరించుటకు యిత్తువా?" అని అడిగెను. రజకుడు కడుగడుసరి. దుష్టుడు. అందుచే, ఆతడు రామకృష్ణుల ప్రజ్ఞా విశేషములు తెలియక గర్వముతో అవమానించెను.

"ఓయీ! గోపాలులారా ! నావద్దగల వస్త్రములను కంసమహారాజువంటివారు మాత్రమే ధరించ యోగులు. కొండకోనల్లో, పచ్చికబీడుల్లో సంచరించుచు పశువులను మేపుకొనుచు తిరుగాడు మీవంటివారికి ఈ దుకూల వస్త్రములు ధరించు అర్హత లేదు." అని రజకుడు రామకృష్ణులను ఆక్షేపించెను.

ఆ మాటలకు రామకృష్ణులకు పట్టరాని కోపము కట్టలు త్రెంచుకొనెను. కృష్ణుడా రజకుని ఒక్క పిడిగ్రుద్దుతో హతమార్చెను. అదిగాంచి మిగిలినవారు పరుగున పారిపోయిరి. రామకృష్ణులు అచ్చోట యున్న మేలగు వస్త్రములు ధరించిరి. వారికేగాక మిగిలిన గోపకులకుకూడ నిచ్చిరి.

అంతవారు కొంతదూరము పోవుసరికి సాలెవాడొకడు తారసపడెను. వాడు పలువిధ వర్ణములతో వస్త్రములు నేయుటలో దిట్ట. అంతేగాక భగవద్భక్తుడు. అనేతకార్మికుడు రామకృష్ణులను గాంచినంతనే అవతార పురుషులుగ భావించెను. వారిద్దరను గౌరవించి పూజించెను. మేలగు వస్త్రములు సమర్పించి అలంకరించెను. కృష్ణుడు వాని భక్తికిమెచ్చి, ఆతనికి ఆయురారోగ్యములు, భోగభాగ్యములను అనుగ్రహించెను. అటుమీదట రామకృష్ణులు సుదాముని గృహమున కేగిరి. సుదాముడు పూలమాలలు కట్టుచుండును. ఆతడుకూడ భగవద్భక్తుడు. రామకృష్ణులను భక్తితో నమస్కరించి పూజించెను. పుష్పమాలలతో అలకరించి, మధురఫలములనిచ్చి గౌరవించెను. వారికి పాదాభివందనముగావించెను. సుదాముని భక్తికిమెచ్చి, ఏదేని వరము కోరుమనెను.

అంతట సుదాముడు, "స్వామీ ! అనవరతము నాకు నీపాదపద్మములపై అపారభక్తి భావముండునట్లు వరమనుగ్రహించుము, ఇంక ఇతరములు నాకేమియు వలదు" అనెను. కృష్ణుడు మిగుల సంతసించి, భక్తితోపాటుగ సిరిసంపదలు, యశస్సు అనుగ్రహించెను.

## ౩౩. కుబ్జ

కుబ్జ కంసుని అంతఃపుర దాసీజనములందు ఒకదాసి. అమె పుట్టుకతోడనే కురూపి. వికారపురూపు గలిగియుండెను. శరీరము వంపులుదిరిగి, చూపరులకు అసహ్యము జనింపచేయును. తన దురదృష్టమునకు లోలోన దుఃఖించుచుండును. ప్రాయముగలిగియు వక్రరూపియగుటచే పురుష సౌఖ్యమునకు యోగ్యతలేనిదయ్యెను. అమె దేహము మూడు వంకరలు కలిగియుండుటచే, అమెను 'త్రివక్ర' అనిరి. తనకట్టి కురూపము వచ్చినందులకు, వ్యర్ధజీవితమునకు వాపోవుచుండెడిది. అయినను భగవంతుని అరాధించుట కుబ్జకు జన్మవ్రతము.

రామకృష్ణులు మధురను దర్శించు సమయమున, కుబ్జ త్రోవలో వారి కెదురయ్యెను. అమె మంచిగంధము, పరిమళద్రవ్యములు పాత్రలందు నింపుకొనిపోవుచుండెను. కృష్ణునకు కుబ్జనుగూర్చి సర్వము తెలియును. అయినను, ఏమియు నెరుగనివాని చందముగ నామెను చేరబిలిచి సంభాషించెను.

**కృష్ణుడు :** వనితా ! ఎవ్వెతవు నీవు ? నీ నామమేమి ? పాత్రలందు గల పదార్ధమేమి?

**కుబ్జ :** ఆర్యా ! నేను కంసుని దాసిని. నాపేరు త్రివక్ర. పాత్రలందు గంధాది పరిమళ లేపనములు గలవు. కంసమహారాజుకు ఈమైపూతలనిన మిక్కిలి మక్కువ. నేనిపుడు రాజుకడకేగుచుంటిని.

**కృష్ణుడు :** అయిన మగువా! సుగంధలేపనములనిన నాకును మిక్కిలి మక్కువ మైపూతనిత్తువా?

**కుబ్జ :** "ప్రధమదర్శనమందే నీయందు అపారఅభిమానము జనించినది, తప్పక యిత్తును. ఈపరిమళద్రవ్యములు స్వీకరించుము. అంతకుమించిన భాగ్యము నాకింకేమున్నది. సంతోషముగ గైకొనుము." రామకృష్ణులు అవతార పురుషులని త్రివక్ర విశ్వసించినది. భక్తితో లేపనములను వారికొనగెను. సంతోషమున

రామకృష్ణులు లేపనములను తమదేహములకు అలముకొనిరి. బంగారమునకు తావివలె, రామకృష్ణులు పరిమళసుగంధములతో రెట్టించినశోభతో ప్రకాశించిరి. కుబ్జ శ్రమమున ముందునకువంగి కృష్ణుని పాదపద్మములంటి నమస్కరించెను

అంతకృష్ణుడు త్రివక్రను అనుగ్రహించదలచెను. ఆమె పాదములను తన పాదములతో త్రొక్కెను. మెల్లగలేవనెత్తెను. కృష్ణుడు కుబ్జను స్పర్శించినంతనే, ఆమె వక్రరూపముతొలగి, సుందరసుకుమారశరీరము లభించెను. వినూత్న సౌందర్యముతో దేవకన్యవలె ప్రకాశించెను. వెంటనే జగన్మోహనాకారుడైన కృష్ణునిపై ఆమెకు మోహము జనించెను.

అంత కుబ్జ "ఓ కృష్ణా ! గోవిందా ! నాకు మరో జన్మను ప్రసాదించినావు. సుందరరూపమునుగూడ అనుగ్రహించినావు. నీపైనాకు అపారమైన ప్రేమ అభిమానము జనింపచేసినావు. ఇక మీదట నాగతియు, పతియు నీవే ! నాజన్మకు సార్థకత కల్పింపుము. నీవు దక్క వేరుదిక్కు లేదు" అని ప్రార్థించెను. కృష్ణుడామె ప్రార్థనము నంగీకరించెను. కాని కంసవధ అనంతరము ఆమె అభీష్టమును నెరవేర్చెను. ఆ సుందర సుకుమార సౌందర్యరాశిని చేపట్టి ఆమెకు పుత్రుని అనుగ్రహించెను. ఆతని పేరు ఉపశ్లోకుడు.

కృష్ణుడు కుబ్జకు వికృతరూపమును తొలగించి, సౌందర్యమును ప్రసాదించుటయే గాక, ఆమె జీవితమునకు సార్థకతనుచేకూర్చెను. అదియు కృష్ణుని లీలావినోదములలో ఒక భాగము. మధురానగరమును ప్రవేశించి దుష్టులను శిక్షించియు, శిష్టులను అనుగ్రహించియు అవతారధర్మమును చాటుకొనెను.

## 89. కంసుని కలవరం

మధురానగరమున కృష్ణుడు దుష్టులను శిక్షించి భక్తులను అనుగ్రహించెను. కృష్ణుడు దైవాంశసంభూతుడని పురప్రముఖులు, భక్తులు కొనియాడి పూజించిరి. రామకృష్ణులు మధురానగరంలో సృజించిన సాహసకార్యములకు కంసుని మదిలో కలవరము, భయము చోటుచేసుకొనెను. అంతులేని అశాంతికి లోనయ్యెను.

రామకృష్ణులు ధనుర్యాగము చేయదలచిన ప్రదేశమును చేరిరి, పలువిధ శస్త్రాస్త్రములు అందు భద్రపరచబడెను. సాయుధులైన వీరులు కొందరు రక్షక వలయము నేర్పరచుకొని యాగశాలను, క్రీడా స్థలమును అప్రమత్తులై రక్షించుచుండిరి.

అందొకచోట పెద్ద ధనుస్సుకలదు. అది నాటి శివునివిల్లువలె కోటిసూర్య ప్రభలతో వెలిగిపోవుచుండెను. సామాన్యులు దాని నెత్తజాలరు. కృష్ణుదు అధనువును అవలీలగనెత్తి, చెరకుగడపగిది దానిని నడిమికి రెంటిగ విరచెను. అదిగాంచిన రాచభటులు హాహాకారములొనర్చిరి. అధ్వనికి మధురదద్దరిల్లెను. కంసుదాప్రళయ భీకరధ్వనికి అదిరిపడెను. అంతట సైనికులు రోషముతో కృష్ణుని చుట్టుముట్టిరి. యుద్ధమునకు సంసిద్ధమైరి. యుద్ధము ఇరువర్గములనడుమ భీకరముగ సాగెను. కాని రామకృష్ణులు వారినందరిని మట్టుపెట్టిరి. సమాచారము తెలిసిన కంసుడు క్రోధముతో మండిపడెను. వారిని హతమార్చుటకు యోధులను వారిపైకి ఉసిగొల్పెను. వచ్చిన వారందరు హతులైరి. రామకృష్ణుల శౌర్యప్రతాపములు గాంచి పురప్రజలు ఆశ్చర్యమందిరి. అనంతరము విజయలక్ష్మితో తమ విడిది చేరిరి.

కంసుడు చిత్తస్థైర్యమును కోల్పోయెను. భయము, దిగులు, విచారము కంసుని పట్టి పీడించసాగెను. రామకృష్ణులు తనను అంతమొందించుటకే జన్మించి యుండిరా యని కంసుడు అందోళ పడసాగెను. మృత్యువు తనను నీడలా వెన్నంటి వెంటాడు చున్నదని తలచి దిగులు చెందెను. అర్ధరాత్రి అయినను కంటికి కనుకులేదు. తను పవ్వళించిన పానుపు కంటకసదృశమాయెను. అశుభసూచనలు మెండుగ పొడగట్టెను. ఎంత ప్రయత్నించినను నిద్రపట్టదు. నిదురపట్టిన పీడకలలు ముసురుకొని వేధించెను. అపుడపుడు ఉలిక్కిపడుట, ఏమియు తోచనివాడై దిక్కులు వీక్షించుట, నీడనుగాంచి మృత్యువని భ్రమించి భీతిల్లుట మున్నగు లక్షణములు వెంటాడుచుండెను.

## 90. మల్లక్రీడామహోత్సవం

తెల్లవారెను. మల్లయుద్ధ క్రీడామహోత్సవమునకు సన్నాహములన్నియు ముగిసెను. నగరమంతయు పచ్చతోరణములతోడను, విజయపతాకములతోడను అలంకరింపబడెను. రాజోద్యోగులు, మంత్రులు, సామంతులు, పురప్రజలు పెద్ద సంఖ్యలో విచ్చేసిరి. కంసమహారాజు వేదికపై అమర్చిన రత్నసింహాసనమున ఆశీనుడయ్యెను. నందగోపులు తాముతెచ్చిన కానుకలను కంసునకు సమర్పించిరి.

మల్లయుద్ధము ప్రారంభము కానున్నదని సంకేతముగ భేరీమృదంగధ్వనులు మార్మ్రోగెను. మల్లయుద్ధ ప్రవీణులైన చాణూరుడు, ముష్టికుడు, కూటుడు, శలుడు, తోసలుడు మున్నగువారు రంగప్రవేశము చేసిరి. ముఖద్వారమున రామకృష్ణులను మర్దించుటకు మదపుటేనుగు సిద్ధపరచబడెను. అది తప్పిపోయిన మల్లయుద్ధంలో వారిని హతమార్చవచ్చునని కంసుడు పథకము సిద్ధముచేసెను.

బలరామకృష్ణులు వస్త్రాభరణములతో చక్కగ నలంకరించుకొని రంగస్థలిని ప్రవేశించిరి. ముఖద్వారముచెంత "కువలయాపీడము" అను మత్తేభము భయంకరముగ ఘీంకారధ్వనులు చేయుచు రామకృష్ణుల మీదకు దూసుకొనివచ్చెను. తొండముతో కృష్ణుని చుట్టివేసెను. దాని పట్టునుండి కృష్ణుడు తప్పించుకొని తన పిడికిలితో గట్టిగ పొడిచెను. పుండరీకాక్షు నెట్టులైనను పట్టవలెనని ఏనుగు ప్రయత్నించెను. కృష్ణుడు దాని తోకను పట్టుకొని చాలదూరము గుంజెను. అది మరణవేదనతో విలవిల్లాడెను. కాని అది రామకృష్ణులను హతమార్చుటకు విశ్వప్రయత్నము చేసెను. కాని ఆ దివ్యతేజులు మదగజమును పలురీతుల బాధించిరి. కృష్ణుడు దాని దంతము నూడ బెరికెను. సింహకిశోరములవలె నందకిశోరుడు దానిపై కుప్పించి నెగసెను. కుంభస్థలమును వజ్రసన్నిభమైన దాని దంతముతో పగులగొట్టెను. అంత గజరాజము దిక్కులు దద్దరిల్లునట్లు ఘీంకరించుచు ప్రాణములు వదలెను. మావటివానినిగూడ, ఒక్క పిడికిలి పోటుతో సంహరించెను. అంత యశోదానందనుడు దానిదంతమును మూపున అలంకారముగధరించి తన మిత్రులైన గోపాలురతోకలసి రంగస్థలమును ప్రవేశించెను. కృష్ణుడు కువలయా పీడమును సంహరించిన విషయము తెలిసిన కంసుడు నివ్వెరపడెను. చిత్తస్థైర్యమును కోల్పోయెను.

క్రీడారంగమును ప్రవేశించిన. రామకృష్ణులను గాంచిన జనసందోహము హర్షధ్వానములు చేసిరి. రామకృష్ణుల బలదర్పములను, సాహసకృత్యములను పలువిధముల ప్రశంసించిరి.

అంత చాణూరముష్టికులు తమతో పోరాడుమని రామకృష్ణులను పిలచి కవ్వించిరి. చాణూరునితో కృష్ణుడును, ముష్టికునితో బలరాముడు తలపడిరి. రామకృష్ణులు బాలురు, అతిసుకుమారులు. చాణూరముష్టికులు ఆరితేరిన మల్లయుద్ధ ప్రవీణులు. గొప్పదేహధారిఢ్యము గలిగి పర్వతాకారులుగ నుండిరి. చూచువారలకు అయ్యది అధర్మయుద్ధముగ తోచినది. అయినను కంసుని ఆజ్ఞకు లోబడి, భయముచే ఎవ్వరును మారాడలేక మిన్నకుండిరి.

మల్లయుద్ధము సాగినది. మదపుటేనుగులుగ నున్న వారిమధ్య రామకృష్ణులు చిన్న సింహపు పిల్లలవలెనుండిరి. బాహాబాహి ముష్టాముష్టి భయంకరయుద్ధము సాగెను. మహోత్సాహంతో ప్రజలు ఆ యుద్ధమును తిలకించుచుండిరి. ఒకరినొకరు సంహరించుకోవలెననెడి విజయకాంక్షతో పోరాడుచుండిరి. రామకృష్ణులు మిగుల నేర్పుగ పోరాడుచుండిరి.

ఇంక ఆదుష్టుల ఆర్భాటమును అంతంచేయాలని కృష్ణుడు నిర్ణయించెను. కృష్ణుడు చాణూరుని బాహువులను నేర్పుగ పట్టుకొని గిరగిరత్రిప్పి నేలకేసిబాదెను. అపుడా యోధుడు ప్రళయభయంకరముగ కేకలిడుచు, నెత్తురుగ్రక్కుచు ప్రాణములు బాసెను. అటులే బలరాముడు ముష్టికుని తనఅరచేతులతో చరచికొట్టి సంహరించెను. అది గాంచిన ప్రేక్షకుల ఆనందానికి అవధులులేవు. విజయోత్సాహపుధ్వనులు మిన్నంటెను.

కొందరు మల్లయోధులు రామకృష్ణులపై విరుచుకు పడిరి. వారి నందరిని రామకృష్ణులు సంహరించిరి. కొందరు వారి శౌర్య ప్రతాపములకు భయమంది పారిపోయి ప్రాణములను రక్షించుకొనిరి. అటుల భగవత్స్వరూపులైన రామకృష్ణులు వీరవిహారమొనర్చి చూపరులను ఆనందాశ్చర్యములందు ముంచెత్తిరి.

## 91. కంస వధ

రామకృష్ణుల సాహసకృత్యములను గాంచిన కంసుని గుండెలో వేయి పిడుగులు పడినట్లయ్యెను. ఏమి చేయవలెనో తోచక భయకంపితుడయ్యెను. దిక్కుతోచనివాడై, "రామకృష్ణులనుపట్టి వధించుడు." అని అతికఠినాత్ముడై భటులనాజ్ఞాపించెను. కంసుని సేవకులు కత్తులు బల్లెములు మున్నగు మారణాయుధములను చేబూని రామకృష్ణుల మీదకు ఒక్కుమ్మడి విరుచుకుపడిరి.

"ఆలశ్యం అమృతం విషం" అను చందమున ఎంతమాత్రము ఉపేక్షింపక కంసుని వధించి తీరవలసినదే యని రామకృష్ణులు నిశ్చయించిరి. వెంటనే శ్రీకృష్ణ భగవానుడు మేనమామయైన కంసుని మీదకు మత్తగజము మీదకు లంఘించు సంహకిశోరమువలెనురికెను. కంసుడును ఏమియు తోచనివాడై ఖడ్గకవచాదులను ధరించి కృష్ణుని వధించుటకు సన్నద్ధుడాయెను. వసుదేవసుతుడు సహస్రకిరణసన్నిభుడై వెలుగొందుచు కంసుని సిగపట్టి సింహాసనమునుండి లాగి క్రిందపడవేసెను.

కృష్ణుని స్పర్శ మాత్రమున కంసుని తేజస్సు క్షణములో అంతరించెను. గోపాలుడు కంసుని మర్మస్థానములను నుగ్గొనరించి హతునిగావించెను. కంసుని మృతదేహమును బరబరలాగి ఈవలపడవేసెను. అది పరికించిచూడ, గరుత్మంతుడు సర్పమును పట్టి విదలించినట్లుండెను.

దేవతలు కృష్ణునిపై విరుజల్లులపారముగ కురిపించిరి. దేవదుందుభులు అంతులేక మ్రోగెను. బ్రహ్మ, మహేశ్వరుడు, మహేంద్రుడు, దేవర్షులు, మునులు

గగనమున నిలుచుండి బాలురను పలుతెరంగుల కీర్తించిరి. ముల్లోకవాసులు ఆనందోత్సాహముల నోలలాడిరి. మధురానగరవాసులు సంతసించిరి. కంసుని అనుచరులు భీతావహులై పారిపోయిరి.

కాని కంసునిసోదరులు, కంకన్యగ్రోధకాదులు ఎనమండుగురు రామకృష్ణులపై పోరాడ సిద్ధమైరి. వారి నందరిని బలరాముడొక్కడు పెద్ద ఇనుపగుదియతో హతమార్చెను. మల్లయుద్ధభూమి మరుభూమియై భయానకమయ్యెను.

కంసమహారాజు భార్య, తమ్మునిభార్యలు తమభర్తల మరణవార్తవిని శోకతప్త హృదయలై కురులు విరియబోసుకొని గుండెలు బాదుకొనుచు అచ్చటికి చేరుకొనిరి. భర్తలశవములపైబడి హృదయవిదారకముగా విలపించిరి. వారి ఆర్తనాదములతో ఆ ప్రదేశమున విషాదఛాయలావరించెను. రోదనపు ధ్వనులతో మారుమ్రోగెను. రామకృష్ణులు అత్తలనందరిని అనునయవచనములతో నోదార్చెను. మేనమామలకు అంత్యక్రియలు యధావిధిజరిపించిరి.

కంసుడు దుష్టుడు దుర్మార్గుడైనను, శ్రీహరి కరుణావిశేషము చేతను, అనుగ్రహము చేతను అతనికి సద్గతులు ప్రాప్తించెను.

కంసుడు రాజ్యకాంక్షచే తండ్రి ఉగ్రసేన మహారాజును బంధించి అధర్మ మార్గమున సింహాసనమధిష్టించెను. అతని మాటకు, చేతకు ఎదురాడువారు లేకుండగ అందరిని బెదరించి తన మార్గము నిష్కంటకము గావించుకొని దురాచారుడై ప్రవర్తించెను.

కంసుడు మరణించిన వెంటనే రామకృష్ణులు చెరయందు బందీయై యున్న తాతగారు ఉగ్రసేనుని బంధవిముక్తుని గావించిరి. గౌరవముతో పూజించి, తిరిగి రాజ్యాభిషిక్తుని గావించిరి. కంసుని దుశ్చర్యలకు భయమంది పారిబోయి ఆత్మ రక్షణము గావించుకొనుచున్న యదు, వృష్ణి, కుకురాంధకుడు మున్నగు వారినెల్లరను కృష్ణుడు మధురకు ఆహ్వానించెను. వారి భయమును పోనాడి, సత్కరించెను. చక్కని నివాసమందిరములను ఏర్పాటు గావించెను. రామకృష్ణుల ప్రాపున యాదవులు, మధురానగరవాసులు నిర్భయముగ నుండసాగిరి. వారికపుడు శాంతి సౌఖ్యములకు, ఆనందమునకును కొదువలేదు.

అటుమీదట రామకృష్ణులు తమ మాతాపితరులైన దేవకీ వసుదేవులను బంధ విముక్తులగావించిరి. భక్తి ప్రపత్తులతో తల్లిదండ్రుల చరణారవిందములర్వాలి ప్రణమిల్లిరి. అనేక విధముల నుతించిరి. దేవకీ వసుదేవులు పుత్రులను కౌగిలించి ఆనందాశ్రువుల ముంచితేల్చిరి.

నందయశోదలు, రోహిణి రామకృష్ణుల నెడబాటు భరింపజాలక మధురకు హుటాహుటి నేగుదెంచిరి. కుమారులను గాంచి ఆనందమున పొంగిపోయిరి. కృష్ణుడు నందయశోదల నోదార్చి, "కొంతకాలము మధురలోనే వుండి అనంతరము తప్పక వత్తును" అని వారిని సమ్మతపరచెను. కాని వారు కృష్ణుని వియోగమును భరింపజాలక మిగుల దుఃఖించిరి. కన్నప్రేమ కంటె పెంచినప్రేమ మిన్నగదా! వారందరిని సముచితరీతిని సత్కరించెను. అంత వారందరు రామకృష్ణులను విడువలేక విడువలేక గోకులమునకు తరలిరి.

## 92. విద్యాభ్యాసం

గర్గాచార్యుడు వసుదేవుని రాజపురోహితుడు. రామకృష్ణులకు అయనచే వేదోక్తముగ, శాస్త్రవిధిగ ఉపనయన సంస్కారము గావించెను. బ్రాహ్మణులకు వేయి ఆవులను, భూరిదక్షిణలను దానమిచ్చెను. అన్నదానము గొప్పగ చేయించెను. గర్గాచార్యులు వటువులకు గాయత్రీ మంత్రము నుపదేశించెను. విశ్వవ్యాపకుడు, జగన్నాథుడు అయిన శ్రీకృష్ణుడు గురువుల వద్ద విద్యాభ్యాసము చేయుట ఆశ్చర్యము గాదా! అనగా ఈ ప్రక్రియ లోకాచార విధానము. అందుచే సాందీపుడను వేదవేదాంగ నిధి యొద్ద విద్యాభ్యాసమునకు నియుక్తులైరి. సోదరు లిద్దరు బ్రహ్మచర్య వ్రతమును దీక్షగ అనుష్ఠించుచు గురుకులవాసము చేయుచుండిరి. అనవరతము గురువులను సేవించుచు సమస్త విద్యలు అభ్యసించిరి.

సాందీపుని అదృష్టము ఎంతని వర్ణించగలము? ఆచార్యులకు ఆచార్యుడైన జగద్గురువునకు విద్యను గరపెడి మహద్భాగ్యం సాందీపునకు లభించడం, అయన పూర్వపుణ్యవిశేషమేగదా! వేదవేదాంగములు, సమస్త ధర్మశాస్త్రములు, ధనుర్వేదము, రాజనీతి, చతుష్షష్టివిద్యలు అనర్గళముగ అభ్యసించిరి. గురుకుల వాసమందే సుధాముడను బ్రాహ్మణవిద్యార్థితో స్నేహ బంధమేర్పడెను. అతడు కడు బీదవాడు. ఆ బాలుడే కుచేలుడు. అతని చరిత్ర ముందు రాగలదు.

## 93. గురుదక్షిణ

రామకృష్ణుల విద్యాభ్యాసము ముగిసెను. భక్తితో గురువుకు నమస్కరించిరి. గురుదక్షిణగ తమ కోరికను తెలుపుమని గురువును రామకృష్ణులు కోరిరి. తన శిష్యులైన రామకృష్ణులు సామాన్యులుకారని సాందీపుడు గ్రహించెను. ధనధాన్యములు, భోగభాగ్యములు ఆశించలేదు. తన భార్య అభిమతముమేరకు, మరణించిన తన కుమారుని తెచ్చి యిమ్మని కోరెను. అట్టి గురుదక్షిణయిచ్చి, పుత్రశోకార్తయైన తన భార్య కడుపుకోతను నివారింపుడనెను. రామకృష్ణులు గురువుల అభీష్టమును నెరవేర్చుటకు అంగీకరించిరి. అందుకై ప్రయత్నము సాగించిరి.

ఒక సమయమున సాందీపుని కుమారుడు "ప్రభాసతీర్థ"మను ప్రదేశమున సముద్ర స్నానమునకు వెళ్లెను. అంతలో ఒక పెద్ద సముద్రపుటలవచ్చి బాలునిలోనికి గొనిపోయెను. ఆ బ్రాహ్మణ బాలుని పంచజనుడను రాక్షసుడు మ్రింగెను. అది తెలిసిన రామకృష్ణులు ప్రభాస తీర్థమునకు చేరిరి. సాందీపుపుత్రుని తెచ్చియిమ్మని సముద్రుని కోరిరి.

సముద్రుడంత రామకృష్ణుల సముఖమున వచ్చి నిలచెను. భక్తితో నమస్కరించెను. బ్రాహ్మణ బాలుని తానేమియు చేయలేదనియు, పంచజనుడను దానవుడు వానిని మ్రింగి సముద్రగర్భమున దాగియున్నాడని తెలిపెను. రామకృష్ణులు సముద్ర గర్భమునకు జొచ్చి దానవునికొరకు వెదకిరి. అచ్చటరాక్షసుడు కనుపించలేదు. కాని వాని దేహమునుండి జనించిన శంఖము లభించెను. దానిని పాంచజన్యమనిరి. కృష్ణునకు పాంచజన్యమట్లు లభించెను.

గురుపుత్రుడు మరణించి యమలోకమునకు చేరి యుండునని దలచి వెంటనే రామకృష్ణులు సంయమపురమునకేగిరి. కృష్ణుడు పాంచజన్యమును పూరించెను. దాని ధ్వనికి భువనభాండములన్నియు దద్దరిల్లెను. యముడాధ్వనికి భయభ్రాంతుడై రామకృష్ణుల సన్నిధినిలుచుండి భక్తితో పూజించి నమస్కరించెను. వచ్చిన కార్యమును ప్రశ్నించెను. గురుపుత్రునితెచ్చి యిమ్మని రామకృష్ణులు కోరిరి. ధర్మప్రభువైన యమధర్మరాజు సాందీపుని పుత్రుని తెచ్చి వారికప్పగించెను.

అంత రామకృష్ణులు గురుపుత్రుని గొనివచ్చి గురుదక్షిణగ సాందీపునకు సమర్పించిరి. గురుదంపతులు పుత్రుని కనుగొని పరమానందభరితులైరి.

రామకృష్ణలంత గురువులకు నమస్కరించి, ఆశీస్సులు పొంది రథారూఢులై మధురకేతెంచిరి. దేవకీవసుదేవులు, పురజనులు ఆదివ్యతేజోమూర్తులను కన్నులపండువుగ గాంచి సంతసమున యుప్పొంగిరి.

## 94. ఉద్ధవుడు

ఉద్ధవుడు వృష్ణి వంశజుడు. గొప్ప విష్ణుభక్తుడు. దేవభాగుని కుమారుడు. కృష్ణునకు ఆత్మీయుడు, అంతరంగిక మిత్రుడు. అందువలన కృష్ణుడు భగవత్తత్వ జ్ఞానాన్ని ఉద్ధవునకు బోధించెను. ఉద్ధవుడు జ్ఞాని యగుటయే గాక బుద్ధికుశలుడు. సమయస్ఫూర్తి గలిగి మంచి ఆలోచనలు అందచేసి, కార్యసాధనకుతోడ్పడు నీతి వర్తనుడు, ఒకానొక సమయమున యాదవులందరు నశించిననూ, ఉద్ధవుడు జీవించియున్నట్లు భాగవత ప్రమాణము.

ఉద్ధవుడు మంచిదూతగ గూడ కృష్ణునకు సహకరించినాడు. ఒక సమయమున వ్రేపల్లెకేగి యాదవుల యోగక్షేమములు అరసివచ్చెను. కృష్ణసందేశమును గోపాలురకు, గోపకులకు నెరుకపరచెను. అట్టి మహత్తరకార్యము నిర్వహించుట మిగులకష్టము. అందుకు మాటలపొందిక, వాక్చాతుర్యము ఎదిటివారి మనోగతమును గ్రహించగల నేర్పు, ఓర్పు, వచోసామర్థ్యము ఎంతో అవసరము. అట్టి శక్తియుక్తులుగలధీశాలి ఉద్ధవుడు.

అదే సమయమున కృష్ణునెడబాసి విరహతాపాగ్నిలో క్రుందుచున్న గోపికలకు కృష్ణసందేశమును వినిపించి, వారి వేదన, ఆవేదనలను శాంతింపచేసినాడు. గోపికల విరహవేదనమును భ్రమరగీతికల రూపములో వ్యాసమహర్షి భాగవతమున కృష్ణభగవానునకు మధురాతి మధురముగ నివేదించినాడు.

ఒక దినమున కృష్ణుడు ఉద్ధవుని తోడ్కొని, అక్రూరుని గృహమున కేగెను. అక్రూరుడు కృష్ణుని భక్తితో పూజించెను. అంత కృష్ణుడు కడుసంతసించి, అక్రూరుని అనుగ్రహించి "అక్రూరవరదు" దని సార్థక నామధేయుడయ్యెను.

పాండురాజు "కిందమముని" వల్ల శాపగ్రస్తుడై వైరాగ్యభావమున సర్వము త్యజించెను. తపోనిష్ఠ స్వీకరించి మాద్రి కుంతులను వెంటనిడుకొని శతశృంగ పర్వతప్రాంతమును చేరెను. కాని పాండురాజు కామోద్రేకుడై మాద్రిదేవితో భోగించెను. ముని శాపకారణముగ పాండురాజు మృతుడయ్యెను.

## 95. పాండురాజుకు శాపము

ఒక సమయమున పాండురాజు వేటకేగెను. ఆ సమయమున 'కిందమముని' హరిణరూపు దాల్చి భార్యతో క్రీడించుచుండెను. అంత పాండురాజు స్త్రీ హరిణమును వధించెను. లేడిరూపములో వున్న ముని ఆగ్రహించి, "ఓరాజా! అన్యాయముగ నాప్రియురాలిని వధించి, నెడబాటు కల్పించినావు. అందుకు ఫలితముగ, నీవు నీభార్యతో సంగమించితివేని వెంటనే మరణింతువు" వని శపించెను.

పాండురాజు మరణించగా, మాద్రికూడ భర్తతో సహగమనముచేసెను. పుత్రులు దిక్కులేని వారగుదురని కుంతిమాత్రము సహగమనము చేయక గృహము చేరెను. హస్తినాపురమందు ధృతరాష్ట్రుని పోషణలో కుంతియుండసాగెను.

ధృతరాష్ట్రుడు దుర్యోధనాదులయెడ పుత్రవ్యామోహితుడై పాండవులందు నిరాదరణ చూపుచుండెను. దుర్జనులైన దుర్యోధనాదులు పాండురాజు పుత్రులకు అనేక కష్టములు కల్పించి, అవమానములపాలు చేసిరి. కుంతీపుత్రులు అనుభవిస్తున్న ఇడుములను వినిన కృష్ణుడు, అక్రూరుని పాండవుల కడకుపంపి, వారి దుస్థితిని అరసిరమ్మనెను. కృష్ణుని ఆదేశానుసారము హస్తినకుజని పాండవులను గాంచెను. వారి యోగక్షేమములు తెలిసికొని, కృష్ణుడు చెప్పుమనిన ప్రియోక్తులను వివరించెను. పాండవులకు ధైర్యము, ఊరట గలిగించెను. అటుపై ధృతరాష్ట్రునికూడ కలిసి, ధర్మములనెన్నింటినో వివరించెను. హితము కూర్చు ప్రియవచనములను వినిపించెను తమ్ముని పుత్రులనాదరించి, ధర్మయుతముగ వారి రాజ్యభాగమును వారికొసంగి, ధర్మప్రభుడవని కీర్తిగాంచుమని హితవుబలికెను. అక్రూరుడు చాల దూరదృష్టి గలవాడు. భవిష్యత్తునూహించి దాయాదుల మధ్యరగిలిన చిచ్చును శమింపచేయ ప్రయత్నించెను.

## 96. జరాసంధుడు

కంసునకు అస్తి, ప్రాప్తి అనువారు ఇద్దరు భార్యలు. వారు జరాసంధుని పుత్రికలు. జరాసంధుడు మగధ దేశాధిపతి. కంసుడు కృష్ణునిచే మరణించిన అనంతరము, అతని భార్యలిద్దరు పుట్టినింటికివచ్చి, తమకు వాటిల్లిన దుఃఖమును తండ్రికి చెప్పుకొని రోదించిరి. వైధవ్యము ప్రాప్తించిన పుత్రికలనుగాంచి జరాసంధుడు మిగుల విచారించెను. అందుకు కారకుడైన కృష్ణునిపై మండిపడెను. రామకృష్ణులను

సర్వనాశనం చేయవలెనని నిర్ణయించుకొనెను. యాదవులనుకూడ తుదముట్టించ వలెనని దృఢ నిశ్చయుడాయెను.

జరాసంధుడు మహాబలవంతుడు. అతని సైనికబలముకూడ గొప్పది. ఆ కాలంలో అంతబలదర్పములుగల రాజు మరొకడు లేడు. తన బలమును గూడ తీసుకొని, తన అల్లునకు అజన్మవిరోధులైన రామకృష్ణులను అంతమొందించవలెనని మధురపై దాడిచేసెను. ఇరవైమూడు అక్షౌహిణుల జరాసంధుని సైన్యము మహా సముద్రమువలె నుండెను. అంత మధురానగరవాసులు మిగుల భయమంది రామకృష్ణుల శరణుజొచ్చిరి.

రామకృష్ణులు దివ్య శస్త్రాస్త్రములను సిద్ధపరచుకొనిరి. కొద్దిపాటి సైన్యమును కూర్చుకొని రథారూఢులై యుద్ధభూమిని ప్రవేశించిరి. అపుడు సోదరులిద్దరు అతిభయంకరులై దివ్యతేజమున ప్రకాశించుచుండిరి. కృష్ణుడు పాంచజన్యమును పూరించెను. శంఖధ్వనికి భువనములన్నియు దద్దరిల్లెను. అమిత బలతేజుడైన జరాసంధుడుసైతము భీతిల్లెను. అతని సైనికులుకూడ భయకంపితులైరి. పోరు ప్రారంభమాయెను. రామకృష్ణుల జరాసంధులనడుమ రణము దారుణముగ జరిగెను. యదువీరుల బలదర్పములందు జరాసంధుని సైనికులు నిలువలేక నిర్వీర్యులైరి. జరాసంధుని అస్త్రములన్నియు రామకృష్ణుల తేజస్సు ముందు వ్యర్థమగు చుండెను. కొండను తాకిన రాళ్లవలె నుజ్జుగుచుండెను. అగ్నిగుండము జొచ్చిన శలభములపగిది జరాసంధుని సైన్యము భస్మమగు చుండెను. జరాసంధుడు పరాజితుడయ్యెను. బలరాముడు వరుణబంధములతో జరాసంధుని బంధించి ఖడ్గముచే నరుక సిద్ధమాయెను. కాని కృష్ణుడు అన్ననువారించి, ప్రాణములతో వదలివేసెను. అందుకు కారణము వేరుగ నున్నది. అతని మరణము భీముని చేతిలో యన్నది.

ఆ రహస్యము కృష్ణునకు మాత్రము తెలియును. ఎన్నడు ఓటమినెరుగని జరాసంధుడు పసివారైన బలరామకృష్ణుల చేతిలో పరాజయమందుట చాల బాధాకరమయ్యెను. పరాభవమును భరించలేకుండెను. పరాభవాగ్ని దహించుచుండ జరాసంధుడు తన రాజ్యమును చేరెను. మధురానగరవాసులు విజయోత్సవములు జరుపుకొనుచు రామకృష్ణులను ప్రశంసలముంచిరి.

పరాభవ, పరాజయఅవమాన భారముతో పరితప్తహృదయుడైన జరాసంధుడు తపోవనములకేగ నిశ్చయించెను. కాని ఆత్మీయులు, హితులు అతని ఆలోచనములకు

అడ్డుకట్ట వేసిరి. రణమున జయాపజయములు దైవాయత్తములనియు, ధైర్యమూని మరల ప్రయత్నించి జయము చేకొనుట ధీరుని లక్షణమని ధైర్యము నూరిపోసిరి. వారి మాటలతో ధైర్యము కూడ దీసికొని జరాసంధుడు పట్టుదలతో పదిహేడుమారులు మధురపై దాడిచేసెను. కాని ప్రతిసారి అతనికి యదువీరుల మూలమున పరాజయమే ఎదురాయెను. మరల పదునెనిమిదవ పర్యాయము యుద్ధసన్నాహములు చేయు తరుణమున, "కాలయవను"డను మహావీరుడు కోట్లసైన్యముతో మధురను ముట్టడించెను. వారందరు మ్లేచ్ఛులు. అపుడు మధురానగర యాదవులకు ఇరువైపుల నుండి యుద్ధపునీడలలము కొనెను.

## 97. కాలయవనుడు

పూర్వమొక సమయమున మదగర్వితులైన యాదవులు కులగురువైన గర్గుని అవమానించిరి. అంత గర్గుడు వారిపై మిగుల రోషించి, శివునిగూర్చి కఠోర తపమాచరించెను. యాదవులను రణమున జయించగల పుత్రుని బడయగోరుటయే గర్గుని ఆశయం. యవనరాజు అదిగ్రహించి, గర్గుని గొనిపోయి అలమందలనడుమ ఉంచెను. ఆ సమయమున యమునయను అప్సరకాంతరాగా, ముని ఆమెనుగాంచి కామించెను. అపుడు వారికి బాలుడు జన్మించెను. యవనరాజు ఆబాలుని పెంచి పెద్దచేసెను. ఆతడే కాలయవనుడు. మహాబలశాలియైన కాలయవనుడు మిగుల గర్వించి సంచరించుచుండెను.

కాలయవనుని నశింపచేయు తలంపుతో నారదమహర్షి ఒకదినమున ఆతనివద్ద కరుదెంచెను. "ఓయీ! యవనుడా! నీ బలపరాక్రమములను ముల్లోకవాసులు కొనియాడుచున్నారు. అట్టినీవు వసుదేవుని పుత్రుడైన వాసుదేవుని జయించగలిగిన నీకీర్తి రెట్టింపై ప్రకాశించును. కావున శ్రీకృష్ణుని యుద్ధమున జయించుము." అని యవనుని ప్రోత్సహించెను.

కాలయవనుడు మూడుకోట్లమంది మ్లేచ్ఛవీరులను వెంటనిడుకొని మధురా నగరముపై దండెత్తెను. అదే సమయమున యాదవులపై పగబూనిన జరాసంధుడు కూడ పదునెనిమిదవసారి దండెత్తి వచ్చెను. మధురానగరవాసులు వారి దాడితో పెద్ద ప్రమాదమున చిక్కిరి.

కృష్ణుడు ఈ ప్రమాదమునుండి యాదవులను, మధురానగర వాసులను రక్షింపదలచెను. శత్రువుల దుర్భేద్యమైన దుర్గమును సముద్రమధ్యమున నిర్మించి

తనవారినందరిని అందు భద్రపరుపనెంచెను. వెంటనే విశ్వకర్మను రావించి మహాసుందర నగరమును నిర్మింపచేసెను. ఆ నగరము సర్వులకు నివాసయోగ్యమై యుండెను. దానికి కృష్ణుడు ద్వారకయని పేరిడెను. ఇంద్రుడు "సుధర్మం" అను దివ్య సభాభవనమును సమర్పించగా, దిక్పతులు భూరికానుకలను సమర్పించిరి. వరుణుడు వేయి అశ్వములనొసంగెను. అశ్వములు నలుపు, తెలుపు రంగులుగలిగి దివ్యతేజమున ప్రకాశించుచుండెను.

కృష్ణుడు బలరామునితో సమాలోచించి, యోగమాయచే మధురాపురవాసులను, ద్వారకకు చేర్చెను. వారి రక్షణ భారమును బలరామునకు అప్పగించి, తాను దిక్కు తోచనివానివలె పారిపోవమొదలిడెను. లీలామానుష విగ్రహుడగు శ్రీకృష్ణుని అంతర్యమును గ్రహించజాలని కాలయవనుడు, కృష్ణునిగాంచి పిరికిపందయని భావించెను.

ఒంటరియై పరుగిడుచున్న గోవిందునిపట్టి వధించవలెనని తలచి రోషముతో, కాలయవనుడు కృష్ణుని వెంబడించెను. కాని కృష్ణుడు వానికందలేదు. పరుగిడి పోయిపోయి పర్వతగుహను ప్రవేశించెను.

అపుడందొక మహాపురుషుడు పరుండి గాఢనిద్రయందుండెను. అదివ్యపురుషుడే కృష్ణుడని యువనుడుభావించి, మదగర్వమున, ఆ పురుషుని కాలితోతన్నెను. మూఢుని చర్యకు అపురుషుడు మేల్కొనెను. ఎదురుగా తనకు నిద్రాభంగము కలిగించిన కాలయవనుడు కాన్పించెను. కాలయవనుని ఆగ్రహమున తనలీక్షణదృక్కులతో గాంచెను. అదృష్టినుండి వెలువడిన కోపానలజ్వాలలు కాలయవనుని దహించివైచెను. కాలయవనుడు రూపుచెడి భస్మరాసిగ మిగిలిపోయెను. దైవీశక్తికి అసురశక్తి నశించిపోయినది.

## 98. ముచికుందుడు

ఇక్ష్వాకువంశీయుడగు మాంధాత చక్రవర్తికుమారుడు ముచికుందుడు. గొప్ప శౌర్యబలపరాక్రమములు గలవాడు. సత్యసంధుడు. ధర్మవర్తనుడు, ఒకానొక సమయమున దేవదానవులకు ఘోరసంగ్రామ మేర్పడెను. అపుడు సురలు ముచికుందుని సహాయము కోరగా, చాలకాలము రాక్షసులతో యుద్ధమొనర్చి, వారలను హతమార్చెను.

శివునికుమారుడైన కుమారస్వామి దేవతలకు సైన్యాధక్షుడాయెను. దేవతలు తమకు చేసిన సహాయమునకు ప్రత్యుపకారముగ నేదేని సహాయము ముచికుందునకు చేయదలచిరి. ఏదేని వరముకోరుమని ముచికుందుని వారు ప్రశ్నించిరి.

"నేను యుద్ధములుచేసిమిగుల అలసియుంటిని. నాకు గాఢముగ నిద్రకావలెను. నిద్రాభంగమొనరించివాడు నానేత్రాగ్నిజ్వాలలబడి భస్మముకావలెను. కావున అట్టివరమును అనుగ్రహించుడు" అని ముచికుందుడు కోరెను. దేవతలు "అట్లేయగుగాక" అని వరమనుగ్రహించిరి. అంతట ముచికుందుడు ఒక కొండ గుహలో పడకనేర్పరచుకొని గాఢనిద్రలో మునిగియుండెను. మహాబలవంతుడగు కాలయవనుడు విధివశమున ముచికుందుని నేత్రాగ్నిజ్వాలల శలభముపగిది మాడిబూడిద అయ్యెను.

కాలయవనుడు మరణించిన తరువాత కృష్ణుడు ముచికుందుని ముందు ప్రత్యక్షమాయెను. కృష్ణుని దర్శనభాగ్యవశమున ముచికుందుడు దివ్యజ్ఞానుడయ్యెను. కృష్ణునకు సాష్టాంగనమస్కారాదులొనర్చి, భక్తితో అనేకరీతుల కృష్ణుని నుతించెను. కాలయవనుని అంతమొనర్చుటకు తానొనర్చిన మాయను వివరించెను. ఏదేని వరము కోరుకొమ్మనెను. కాని ముచికుందుడు నశ్వరములైన భోగభాగ్యములు రాజ్యభోగములు కోరలేదు. "మోక్షపదవి" ననుగ్రహించమని కోరెను.

కృష్ణుడు అతనికి చక్కని మోక్షమార్గమునుపదేశించెను. శ్రీహరి ఆదేశానుసారము గంధమాదనపర్వత ప్రాంతములకేగి తప మాచరించి, చివరకు వైకుంఠమును చేరెను.

అనంతరము కృష్ణుడు మధురకు తిరిగి వచ్చెను. మధురను చుట్టుముట్టిన మ్లేచ్ఛులను యుద్ధమున మట్టుబెట్టెను. ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యముతో జరాసంధుడు రణరంగమున మోహరించియుండెను. ఈసారి రామకృష్ణులు అతనితో యుద్ధముచేయక భయముతో పారిపోవునట్లు నటించిరి. అటుల పోయిపోయి చివరకు ప్రవర్షణపర్వతమున దాగిరి. అపుడు మగధాధిపతి కొండచుట్టు కట్టెలుపేర్చి అగ్నిరగిల్చెను. అంతరామకృష్ణులు పర్వతాగ్రము నుండి క్రిందకు దుమికి ద్వారకచేరిరి. జరాసంధుడు అదిగమనించలేదు. రామకృష్ణులు మరణించిరని భ్రమించెను. ద్వారాకావాసులైన యాదవులు సంతసించిరి. కృష్ణుని రక్షణలో వారందరు సుఖించిరి.

శ్రీ మహావిష్ణుస్వరూపుడైన కృష్ణుడు నివాసస్థలమైన ద్వారక మానవులకు, దేవతలకు పుణ్యస్థలమై వర్ధిల్లెను. పురాణ ప్రసిద్ధము, మోక్షదాయకమైన పుణ్య క్షేత్రములు ఏడు గలవు. ఆ సప్తపుణ్యక్షేత్రములు, ద్వారక, అయోధ్య, మధుర, మాయ (హరిద్వారం) కాశి, కంచి, అవంతిక (ఉజ్జయిని). నాటికి నేటికి ముందుతరాల వారి కవి పవిత్రపుణ్య క్షేత్రములు.

## 99. రుక్మిణీ కల్యాణము

**శ్రీ రుక్మిణీశ ! కేశవ ! నారద సంగీతలోల నగధర శౌరీ ।**
**ద్వారక నిలయ జనార్ధన కారుణ్యముతోడ మమ్ముగావుము కృష్ణా ॥**

శ్రీమద్భాగవతములో రుక్మిణీకల్యాణఘట్టము బహురసవత్తరము, రమ్యాతి రమ్యము, మధురాతిమధురము. సర్వస్వతంత్రులైన రామకృష్ణులు యాదవులకు ద్వారకానగరం రాజధానిగా ప్రత్యేక రాజ్యాన్ని ఏర్పరచినారు. ఆ కారణంగా యాదవులు సమస్త భోగభాగ్యములనుభవిస్తూ, ఆనందోత్సాహములతో నుండిరి.

నాడు పెండ్లిండ్లు బ్రాహ్మ్యం, దైవం, అర్షం, పాజాపత్యం, అసురం, గాంధర్వం, రాక్షసం, పైశాచం అను ఎనిమిది విధములుగా నుండెడివి. కృష్ణుడు రుక్మిణిని రాక్షస విధానంలో వివాహం చేసికొనెను. అనగా రుక్మిణిని కృష్ణుడు ఒక దశలో ఆమె అభీష్టముననుసరించి, బలాత్కారముగా గొనివచ్చి పరిణయమాడెను. తల్లిదండ్రులకు అంగీకారము కాకున్నను, యువతీయువకులు ఇష్టపడినచో వివాహము శాస్త్రసమ్మతమని రుక్మిణీ కల్యాణకథ వలన విశదమగుచున్నది.

కృష్ణుని వివాహమునకు పూర్వము బలరామునకు 'రేవతి' యను కన్యతో పెండ్లి జరిగెను. రేవతి రైవతుని కుమార్తె. రైవతుడు అనర్తదేశాధిపతి.

విదర్భదేశమునకు ప్రభువు భీష్మకుడు. అతనికి రుక్మి, రుక్మరథుడు, రుక్మ బాహుడు, రుక్మకేశుడు, రుక్మమాలి యనువారు ఐదుగురుపుత్రులు. రుక్మిణి భీష్మకుని గారాలపుత్రిక. రుక్మిణి మిగులగుణవతి, రూపవతి, విద్యావతి మరియు లక్ష్మి అంశ సంభూతురాలు. విష్ణుభక్తురాలు. బాల్యముననే కృష్ణుని శౌర్యపరాక్రమములను, సాహస కృత్యములను, లీలావినోదములను వినియుండెను. అందుచే కృష్ణునియందు భక్తిభావములేగాక, ప్రేమానురాగములంకురించెను. ఆ మహనీయునే భర్తగ పొంద గోరెను. చివరకు కృష్ణునిదక్క వేరొక్కని పెండ్లియాడనని ధృఢనిశ్చయమునకు వచ్చెను.

అటులుండగ రుక్మిణికి యుక్తవయస్సు వచ్చెను. తగిన వరునకిచ్చి వివాహము చేయవలెనని తల్లిదండ్రులు సంకల్పించిరి. రుక్మిణి అభిమతమును తల్లిదండ్రులు గ్రహించిరి. తల్లిదండ్రులు అందులకంగీకరించి, కృష్ణునకే రుక్మిణిని గూర్చి పరిణయము చేయనిర్ణయించిరి. కాని రుక్మిణి యన్నయగు 'రుక్మి' అభిప్రాయము వేరుగ నుండెను. రుక్మిసహజముగ సాత్వికుడుగాడు. సరసుడుగాడు. దుష్టుల సహవాసముచే, దుష్టస్వభావములచే నిండియుండెను. అందున శిశుపాలాది దుష్టులతో మైత్రి మిక్కుటముగ గలవాడు. అందువలన తన గారాలచెల్లిని శిశుపాలున కిచ్చి పెండ్లిచేయ సంకల్పించి, అందులకై ప్రయత్నములు సాగించుచుండెను. రుక్మి అభిప్రాయము కాదనుధైర్యము తల్లిదండ్రులకుగాని, మరెవ్వరికిని లేకుండెను. ఏమియు చేయజాలక లోలోన దిగులు చెందుచుండిరి. రుక్మిణియు తన అన్నగారి అభిప్రాయము తెలిసికొని విచారమున మ్రగ్గుచుండెను. కృష్ణుని భర్తగ పొందెడి భాగ్యము కలుగదేమోయని భీతిల్లసాగెను. అయినను విద్యావంతురాలు, జ్ఞాని అయిన సుగుణవతి రుక్మిణి తగిన ఉపాయమును చింతించెను. తన మనోరథమును జగన్నాథుడైన కృష్ణునకు తెలియపరచ నిశ్చయించెను. అటులొనరించిన అపుడామహనీయుడు తప్పకవచ్చి రక్షించునని విశ్వసించెను. తన వాంఛితము యీడేరునని నమ్మెను.

భగవద్భక్తుడు, సదాచార సంపన్నుడు, మిగుల విద్యాగుణసంపన్నుడు, వినయశీలి, వాక్చతురుడు, ఉపకారగుణోపేతుడు అయిన బ్రాహ్మణోత్తముడగు అగ్నిజ్యోతనుని ద్వారా కృష్ణునకు సందేశము పంపుటకు నిర్ణయించెను.

**సందేశసారాంశము** : ఓ కృష్ణా! ద్వారకావాసా! పిన్ననాటనుండి నేను నీభక్తురాలను. నిన్నేపతిగా పొందగోరిన నీచరణదాసిని. లజ్జవీడి నీకీసందేశమును పంపుచున్నాను. నన్నుమన్నించుము. వేరుదారిగానక ఇంతటి సాహసమునకు బూనుకొంటిని. తల్లిదండ్రులమాటున పెరిగిన బిడ్డను, అబలను, అస్వతంత్రను, అశక్తురాలను, నిన్నే నాదు పతిగ, అరాధ్యదైవముగ నెంచుకొంటిని. కాని నాఅన్నయగు రుక్మి నామనోరథమునకు భిన్నముగా వ్యవహరించుచున్నాడు. దుష్టుడైన శిశుపాలునకు నన్ను కట్టబెట్ట దృఢనిశ్చయుడై యున్నాడు. నా అన్నమాటకెదురాడు వారులేరు. అతని చేతలకు తిరుగులేదు. చండశాసనుడు. అవసరమగు వివాహ సన్నాహము లన్నింటిని చేయుచున్నాడు. నేను నీసొత్తును, త్రికరణశుద్ధిగ నిన్నే పతిగ పొందగోరి అహర్నిశలు ఆరాధించుచుంటిని. సింహమునకు చెందవలసిన

ఆహారమును గోమాయువుగోరు చందమున నీచాత్ముడైన శిశుపాలుడు నన్ను అపహరింపదలచి పొంచియున్నాడు. కానీ వాసుదేవా! అది ఎన్నటికిని జరుగదు. "ఎల్లవేళల నేను శ్రీహరినే ధ్యానించు దాననైతినేని, పూర్వజన్మలో పుణ్యవ్రతములు చేసినదాననైతినేని, వర్తమానజన్మమున దేవ, బ్రాహ్మణ పూజలు ఏమరక చేయు చుండిన దాననైతినేని, అమురళీగానలోలుడు, ఆగోవర్ధనోద్ధారి, అజగన్మోహనాకారుడు వచ్చి, నన్ను తప్పక పరిణయమాడగలడు. నన్ను శిశుపాలాది దుష్టాత్ములు కన్నెత్తియైన చూడజాలరు."

ఓకృష్ణా ! ద్వారాకావాసా ! యదుకుల వంశోద్దీపకా ! రేపే నా వివాహము. ఆ సమయమునకు నీవరుగుదెంచి, శిశుపాలాది దుష్టులను రణముననిర్జించి రాక్షస విధానమున నన్ను బలిమినిగొనిపోయి పెండ్లాడుము. ఓ ఆర్తజనరక్షా ! జనార్ధనా! నీవు రాకున్నచో నా ప్రాణములు నిలువవు. ఇదే నా ప్రార్ధనము."

ఓ రాక్షసాంతకా ! మరియొక ఉపాయము చెప్పెదనాలింపుము.

అంతఃపురములో పెక్కుమంది బంధుజనులమధ్యనున్న కన్యను గొనిపోవుట సాధ్యముకాదు. అందువల్ల పెండ్లికి ముందటిరోజున వధువును అలంకరించి, ఊరివెలుపలయున్న దేవాలయమునకు గౌరీపూజ నిమిత్తము గొనిపోదురు. అది మా వంశాచారము. ఆ సమయమున వచ్చి నన్నుగొనిపొమ్ము. అట్లుగానిచో దేహ త్యాగము చేయుదును." జన్మజన్మలకు, నూరు జన్మలకైనను ఆ కమలనాభునే వివాహ మాడుదునని తన నిశ్చితాభిప్రాయమును విశదపరచెను.

రుక్మిణి సందేశమును గైకొని బ్రాహ్మణుడు అగ్నిజ్యోతనుడు ద్వారాకానగరమును చేరెను. శ్రీకృష్ణుని దర్శించెను. గోవిందుడు బ్రాహ్మణోత్తమునకు సర్వమర్యాదలనొనర్చి గౌరవించెను. వచ్చిన కారణమును తెలుపగోరెను. అగ్నిజ్యోతనుడు రుక్మిణీ సందేశమును వివరించెను. రుక్మిణియందు మనసువున్న కృష్ణుడు ఎటులైనను ఆ కన్యారత్నమును వివాహమాడ నిశ్చయించెను. వెంటనే దారకుని పిలిచి ప్రయాణ సన్నాహములు చేయుమని ఆదేశించెను. సమస్తసన్నాహములతోడను, శస్త్రాస్త్రములతో సన్నద్ధుడై కృష్ణుడు దూతగ వచ్చిన బ్రాహ్మణునితోడ బయలుదేరి మరునాటి ఉదయమునకు కుండిననగరము చేరెను.

కుండిననగరములో వివాహపుటేర్పాట్లు ముమ్మరముగ జరుగుచుండెను. నగరమంతము రుక్మిణీదేవి వివాహ మహోత్సవపు ఆర్భాటములు ఘనముగ

సాగుచుండెను. రుక్మిణిని సర్వాభరణభూషితగ గావించిరి. మేలగు దివ్యవస్త్రములు ఆభరణములు ధరింప చేసిరి నగరమందెందు గాంచినను పెండ్లి సందడి సంతరించుకొని యుండెను.

చేదిదేశాధిపతి దమఘోషుడు కూడ, తనపుత్రుడు శిశుపాలుని పెండ్లికుమారునిగ నలంకరించి, పురోహితుని వెంటనిడుకొని, బంధుమిత్రాదులు వెంటనడువ మహా వైభవముగ కుండినగరమునకు తరలివచ్చెను. భీష్మకుడు వారలకెదురేగి సర్వవిధ లాంఛనములు, మర్యాదలుజరిపి, విడిదులందు ప్రవేశింపచేసెను.

కృష్ణుడు తనకు అడ్డుతగులునని శిశుపాలుడు ముందుగ నూహించెను. అందుకు అనుకూలముగ చతురంగ బలములను ఆయత్తపరచుకొని యుండెను. అతనికి తోడుగ సాల్వుడు, జరాసంధుడు, దంతవక్త్రుడు, విదూరథుడు, పౌండ్రకుడు మున్నగువారు వచ్చియుండిరి. తమ్మునకు బాసటగ నిలచుటకు బలరాముడు యాదవసైన్యమును తోడ్కొనివచ్చెను.

రుక్మిణి కృష్ణునిరాకకెదురు చూచుచుండెను. పరిపరి విధముల చింతిల్లసాగెను. "దూతగ బ్రాహ్మణుడు వెళ్లెనో లేదో? వెళ్లివుండి తన సందేశము వినిపించెనో లేదో? విని కృష్ణుడు ఆగ్రహించెనా? కినుక వహించెనా? నన్ను వివాహమాడుటకు అంగీకరించెనో లేదో ? మా వివాహమునకు పార్వతీ పరమేశ్వరులు సహకరించి సహాయులగుదురో లేదో ? నాయన్న నన్ను బలవంతముగా శిశుపాలునకు కట్టబెట్టునేమో? నా భాగ్యమెటులున్నదో కదా !" అని మనమున దురపిల్లసాగెను. ఆ బాలామణి నేత్రములు అశ్రుపూరితములాయెను.

అంతలో బ్రాహ్మణుడు అంతఃపురమున ప్రవేశించెను. అతనిని గాంచినంతనే రుక్మిణి వదనారవిందము వినూత్న వెలుగులతో వికసించెను. ఆనందమున ప్రకాశించెను. బ్రాహ్మణుని వదనము పరిశీలించెను. వెళ్లినపని ఫలించినట్లు గ్రహించెను. అయినను, "బ్రాహ్మణోత్తమా? వెళ్లిన కార్యమును వివరించి నన్నూరట పరచుము" అని ప్రశ్నించి తొందరచేసెను. భూసురుడు "అమ్మా! నీకు శుభము" అని శుభవర్తమానము తెలిపి, ఆద్యంతములు వివరించెను. "కృష్ణుడువచ్చి ఉద్యాన వనమునందున్నాడు." అని పలికెను. ఆ వార్త వినినంతనే రుక్మిణి ఆనందమునకు అవధులులేవు. విప్రోత్తముని పొగడుటకు మాటలందలేదు. భక్తి పారవశ్యముతో అగ్ని ద్యోతనుని పాదములంటి నమస్కరించి కృతజ్ఞత తెలుపుకొనెను.

భీష్మకుడు రామకృష్ణులు వచ్చిన వర్తమానమువిని, మిగుల సంతసించెను. సకల లాంఛనములతో ఎదురేగి వారిని పూజించి, మహావైభవముగా గొనివచ్చి విడిది గృహముల బసగావించెను. ఆనందపారవశ్యముచే బాలామణి నేత్రములు చెమ్మగిల్లెను.

ఆ రాత్రి గడచెను. ఉదయమున రుక్మిణిని పెండ్లికుమార్తెగ నలంకరించిరి. అపుడామె ఆదిలక్ష్మివలె వెలుగొందుచుండెను. అంతట రుక్మిణి 'గౌరి' పూజ నిమిత్తము ఊరివెలుపలయున్న 'గౌరి' దేవి ఆలయమునకు బయలుదేరెను. ఆమెవెంట ముత్తైదువులు, చెలులు, మంగళద్రవ్యములు, పూవులు, పండ్లు పళ్లెరములందు గూర్చుకొని సాగిరి. మంగళవాద్యములు మంగళకరముగ మ్రోగుచుండెను. ఆయుధపాణులైన భటులు, అంగరక్షకులు ఆమెవెంట నడచుచుండిరి.

నవవధూరత్నము రుక్మిణీదేవి గౌరి ఆలయమును ప్రవేశించెను. అమ్మవారిని అర్తిగ, భక్తిప్రపత్తులతో నర్చించెను. పేరంటాండ్రకు, ముత్తైదువులకు నమస్కరించి మంగళాశీస్సులు స్వీకరించెను. దక్షిణ తాంబూలములతో సత్కరించి గౌరవించెను. అనంతరము గృహమునకు వెనుదిరిగి, రానున్నతరుణములో కృష్ణుడు గబాలున రుక్మిణీదేవిని పట్టుకొని తనరథమునందు చేర్చెను. ఈ హఠాత్పరిణామమునుగాంచిన రాజప్రముఖులందరు చిత్తరువులుపగిది నిలచి యుండిరి. కృష్ణుడు మాత్రము రథమును వేగముగ తోలుకొని పోయెను. కొంత తడవునకు తేరుకొనిన జరాసంధాది వీరులందరు "కృష్ణుని పట్టుడు, కొట్టుడు, బంధించుడు," అని బిగ్గరగ కేకలిడుచు కృష్ణుని వెంట పరుగులిడిరి.

కృష్ణుడు శత్రువులను చూచెను. రథమును నిలుపుచేసెను. యాదవులాగిరి. అంత ఇరువర్గములవారికి భీషణ సంగ్రామము జరిగెను. శత్రువులు తమచుట్టును ముట్టడించినందులకు రుక్మిణి గడగడ వణకెను. ఎట్టి ప్రమాదము వాటిల్లునోయని భయమందెను. ఆమెస్థితిని గాంచిన జగన్నాథుడు చిరునవ్వులు చిందించెను. ధైర్యోక్తులతో అమె భయమును నివారించెను.

జరాసంధాదులు సింహనాదములు చేయుచు కృష్ణునిపై శరవర్షధారలను కురిపించిరి. వాటినన్నింటిని కృష్ణుడు తన దివ్యాస్త్రములచే తుత్తునియలు గావించెను. గదుడు మొదలైన యదువీరులందరు విజృంభించి పోరాడిరి. శత్రుసేనలను చీల్చిచెండాడిరి. ఆప్రదేశమంతయు మృతులతోడను, క్షతగాత్రులతోడను నిండి,

రుద్రభూమిగ మారెను. శత్రువులందు మిగిలినవారు ప్రాణములపై ప్రీతితో పారిపోయిరి. కొందరు చెల్లాచెదరైరి. శిశుపాలుడు నిరాశచెంది, చేయునదిలేక రణరంగము నుండి పారిపోయెను.

అంత రుక్మిణి యన్నయగురుక్మి అవమాన భారముతో వ్యధచెందెను. రుక్మిణిని కృష్ణుడు బలాత్కారముగా గొనిపోవుచున్నందులకు కోపమున మండిపడెను. రోషావేశముతో కృష్ణుని వధించి, రుక్మిణితో నగరప్రవేశము చేయుదునని ప్రతిన బూనెను. పౌరుషముతో కృష్ణునెదిరించెను. ఇరువురకు పోరు కడుభీకరముగ జరిగెను. కృష్ణుడు రుక్మిణి విరధునిచేసి పట్టుకొనెను. పట్టుబడినవానిని వధించుటకు కృష్ణుడు ఖడ్గము నెత్తెను. అంత రుక్మిణీదేవి కృష్ణునకు అడ్డునిలచి నివారించెను. అన్నను చంపవద్దని ప్రార్థించెను. శుభసమయమున అశుభకార్యము శ్రేయోదాయకము కాదని నచ్చబలికెను. అంత కృష్ణుడును శాంతిచెంది రుక్మి తలవెంట్రుకలను, మీసములను గొరిగి ప్రాణభిక్షనిడి విడచెను. అన్నకు జరిగిన పరాభవమునకు రుక్మిణి విచారించగ, బలరాముడు ఆమె నోదార్చెను. భీష్మక మహారాజుకూడ తన పుత్రికను నోదార్చెను.

అంత శ్రీకృష్ణుడు నూతనవధువు రుక్మిణీసహితుడై, యదువీరులందరు తోడునడువగ సంతసమున మధురానగరము ప్రవేశించెను. మధురానగరమున విధివిధానమున రుక్మిణీశ్రీకృష్ణుల వివాహము అతివైభవముగ జరిగెను. దేవతానీకము దేవర్షులు, మునులు కల్యాణమున కేగుదెంచిరి. భగవంతుని కల్యాణము జగత్ కల్యాణముగ భావించి పరమానంద భరితులైరి.

శ్రీకృష్ణునిచే పరాభవమందిన రుక్మి నగరము ప్రవేశించుటకు మిగుల లజ్జితుడయ్యెను. మార్గమధ్యమున 'భోజకటకం' అనుప్రదేశమునందుండిపోయెను. అనంతరము భారతయుద్ధమున దుర్యోధనునకు సహాయము చేయుటకు అతని వద్దకేగెను. కాని దుర్యోధనుడు రుక్మి సహాయమును నిరాకరించెను. అటుమీదట బలరాముని చేతిలో రుక్మి మరణించెను. అటుల రుక్మిణీ కృష్ణుల కల్యాణఘట్టము ముగిసెను.

## 100. స్యమంతకోపాఖ్యానం

సత్రాజిత్తు సూర్యోపాసకుడు. అతడు నిమ్నుని కుమారుడు. సూర్య భగవానుడు సత్రాజిత్తు భక్తికిమెచ్చి దివ్యమణి నొకటి నొసంగెను. ఆమణిపేరు శమంతకము. సత్రాజిత్తు దివ్యమణిని కంఠమున ధరించెడివాడు. అందుచే నాతడు రెండవ సూర్యునివలె ప్రకాశించెడివాడు.

స్యమంతకమణి మహిమ చెప్పనలవికానిది. అది సమస్త సౌభాగ్యములను అనుగ్రహించుటయేగాక, రాజ్యమున అధివ్యాధులు లేక సర్వవిధసంపదలుగలిగి ప్రజలు సుఖించుచుండిరి. అంతేగాక దినమునకామణి ఎనిమిది బారువుల బంగారము నిచ్చుచుండెను. ఒక సమయమున శ్రీకృష్ణుడు స్యమంతకమణిని తనకిమ్మని సత్రాజిత్తును కోరెను. కాని కృష్ణుని కోరికను సత్రాజిత్తు నిరాకరించెను. అందులకు కృష్ణుడు మారుమాటాడక మిన్నకుండెను.

అటులుండగ, ఒకదినమున సత్రాజిత్తుతమ్ముడు ప్రసేనుడు మణిని కంఠమునధరించి, వేటకేగెను. వేటలో మృగరాజు ప్రసేనునిమట్టుపెట్టి, మణిని గొనిపోయెను. అటుపిమ్మట భల్లూకరాజైన జాంబవంతుడు సింహమును సంహరించి, మణినిగైకొని తన గుహకుచనెను. జాంబవంతుడు మణిని ఆటవస్తువుగ, తనకుమారికి నొసగెను.

వేటకు వెళ్లిన తమ్ముడు ప్రసేనుడు ఎంతకు తిరిగిరాకుండెను. అందులకు సత్రాజిత్తు పరిపరి విధముల చింతించెను. కృష్ణునిపై అనుమానము కలిగెను. మణికొరకు ప్రసేనుని సంహరించి, కృష్ణుడే మణిని అపహరించి యుండునని ధృవపరచుకొనెను. తన అభిప్రాయమును తనవారికి తెలిపెను. ఆ వార్త దవానలమువలె నగరమంతయు వ్యాపించెను. కృష్ణుని అనుమానించిరి. మణికొరకు ప్రసేనుని హత్యగావించినాడని కృష్ణునిపై నిందమోపిరి. బాధాకరమైన అపవాదు గలిగినందులకు కృష్ణుడు చాల విచారించెను. నిరాధారమైన నిందారోపణము తొలగించుకొనుటకు వాసుదేవుడు నిశ్చయించెను. సత్యమును నిరూపించదలచెను. అందులకై నగరములోని పెద్దలను కొందరిని వెంటనిడుకొని అడవికిఱనెను. అల్లనల్లన ప్రసేనుని అడుగు జాడలను గుర్తించుచు వెదకసాగెను. అందొకచో ప్రసేనుని శవమును గాంచెను. అతని అశ్వకళేబరముగూడ అందే పడియుండెను. సింహమువట్టిచంపినట్లు చిహ్నములు పొడచూపెను. మృగరాజు అడుగు జాడలనాధారముగ ఒక పర్వతగుహను చేరుకొనెను. అచ్చట సింహపు కళేబరము పడియుండెను. గుహపుపరిసర ప్రాంతమందు భల్లూకపు అడుగుజాడలుండెను. కృష్ణుడు తనతోడివారలను గుహకు వెలుపల నిలిపి తాను లోనికేగెను.

గుహాంతర్భాగమున గాడాంధకారము నెలకొని యుండెను. కాని మణియున్న ప్రదేశము ప్రకాశవంతముగ నుండెను. అచ్చట ఊయలతొట్టికి స్యమంతకమణి

వ్రేలాడ గట్టబడియుండెను. కృష్ణుడు దానిని గ్రహించబోవ, అచ్చటనేయున్న వృద్ధదాది బిగ్గరగ అరచెను. ఆ గావుకేక వినిన జాంబవంతుడు పరుగునవచ్చి కృష్ణునితో తలపడెను. ఇరువురకు ఇరువది ఎనిమిది దినములు ఘోరసంగ్రామము జరిగెను. పెద్దపెద్ద రాళ్లతో కొట్టుకొనిరి. పిడికిళ్లతో గ్రుద్దుకొనిరి. రక్కుకొనిరి. తన్నుకొనిరి. మల్లయుద్ధ ప్రవీణులవగిది వివిధభంగిమల పోరాడిరి. అంతకంతకు జాంబవంతుని బలము క్షీణించసాగెను. శక్తినశించి నీరసించసాగెను. గోవిందుని ముష్టిఘాతములకు అతని శరీరమంతయు గుల్లబారెను. గాయములతో కాయము రక్తసిక్త మాయెను. శ్రీహరి అత్యద్భుత శక్తికి జాంబవంతునకు ఆశ్చర్యము గలిగెను. “ఒక్క శ్రీహరిదక్క తనను అన్యులెవరు జయింపజాలరు.” అను వాస్తవ విషయము అతనికి స్ఫురించెను.

సాక్షాత్తు కృష్ణుడే శ్రీరామచంద్రమూర్తిగా గోచరించెను. అంత జాంబవంతుడు శ్రీకృష్ణుని చరణారవిందముల ప్రణమిల్లెను. శ్రీహరిని పలువిధముల కీర్తించెను. కృష్ణుడు ఆదరమున తనదివ్యహస్తముతో అతని దేహమును నిమిరెను. ఆ దివ్య స్పర్శతో జాంబవంతుని దేహమందలి గాయములన్నియు అదృశ్యమాయ్యెను. నూతన జవసత్వములు చేకూరెను. స్యమంతకమణి కారణముగా తనకు గలిగిన అపవాదును తెలిపెను. అంతట జాంబవంతుడు తన తప్పిదమును మన్నించి క్షమింపుమని ప్రార్థించెను. మణిని, మణితోపాటుగ తన బాలామణి జాంబవతిని కృష్ణునకు సంతోషమున సమర్పించెను. జాంబవతిని భార్యగాగైకొని తనను ధన్యుని చేయుమని వేడెను.

జాంబవంతుడు బ్రహ్మ అంశమున జన్మించెను. మహాబలవంతుడు. అంజనేయుని వలె చిరంజీవి. త్రేతాయుగములో రామరావణయుద్ధమున శ్రీరాముని పక్షమున నిలచి పోరాడిన మహావీరుడు. మరల ద్వాపరయుగములో కృష్ణునితో పోరాడిన ఘనుడు, రామభక్తుడు జాంబవంతుడు. అయినను కృష్ణునితో యుద్ధ మొనర్చి, కృష్ణునియందు రాముని దర్శించి తనమక్కువను తీర్చుకొనెను.

గుహనుండి కృష్ణుడు స్యమంతక మణిని, జాంబవతిని వెంటనిడుకొని వెలుపలకు వచ్చెను. కాని అచ్చట యదువీరులెవ్వరును లేరు. వారందరును ద్వారకకు వెళ్లిరి. గుహలో కృష్ణునకేదో అపాయము జరిగినదని తలచి శోకతప్తహృదయులై, సమాచారమును వెల్లడించిరి. దేవకీవసుదేవులు, రుక్మిణియు కృష్ణునకు ఆపద సంభవించినదనిదలచి శోకసముద్రమున మునిగిరి. దీనికంతకు సత్రాజిత్తు

కారణమని ఆతనిని పలువిధముల తూలనాడిరి. వారందరు కృష్ణుని క్షేమమాశించి దుర్గాదేవిని పూజించిరి.

అంత కృష్ణుడు స్యమంతక మణితో, జాంబవతిని వెంటనిడుకొని ద్వారకకు చేరెను. కృష్ణుని గాంచినంతనె అందరు ఆనందమున యుప్పొంగిరి. సంతోషముతో పెద్దఉత్సవము చేసికొనిరి. అటుమీదట కృష్ణుడు సత్రాజిత్తును పిలిపించి, అందరి సమక్షములో వాస్తవవిషయమును వివరించెను. మణిని సత్రాజిత్తున కొసంగి, అపవాదును తొలగించుకొనెను. సత్రాజిత్తు తన అనాలోచితచర్యకు మిగుల చింతిల్లెను. అవమానభారముతో గృహమునకేగెను. చాలకాలము దీర్ఘముగయోచించి, ఒక నిశ్చితాభిప్రాయమునకు వచ్చెను. స్యమంతకమణితోడ, తనపుత్రిక సత్యభామను కృష్ణునకు సమర్పించెను. సత్యభామను వివాహమాడుమని ప్రార్థించెను.

కృష్ణుడంత ప్రసన్నుడై మణిని తిరిగి సత్రాజిత్తునకొసగెను. సత్యభామను వివాహమాడుటకంగీకరించెను. పెద్దల సమక్షమున కృష్ణునితోడ జాంబవతీ సత్యభామల వివాహము లోకాతీతవిధమున అత్యంత వైభవమున జరిగెను.

స్యమంతకమణి నపహరించవలెనని సజ్జనులైన కొందరికి దురాలోచనగలిగెను. అట్టి వారిలో అక్రూరుడు, కృతవర్మలు ముఖ్యులు. అంతకు పూర్వము సత్యభామను శతధన్వుడను యాదవరాజుకుకూర్చి పెండ్లి చేయవలెనని సత్రాజిత్తు తలచెను. అటులని మాటకూడ యిచ్చి యుండెను. కాని ప్రస్తుతము మాటదప్పెను. దీనిని నెపముగ గైకొని, అక్రూర కృతవర్మలు శతధన్వుని రెచ్చగొట్టిరి. శతధన్వుడును సత్రాజిత్తును సంహరించి ప్రతీకారము తీర్చుకొనుటకు రంగము సిద్ధముచేసెను. ఒకనాటిరేయి నిద్రించుచున్న సత్రాజిత్తుని అధర్మముగ, నిర్దయగ సంహరించి స్యమంతకమణిని సంగ్రహించి వెడలిపోయెను.

అపుడు రామకృష్ణులు ద్వారకలోలేరు. కుంతితోకూడ పాండవులు లక్కయింటిలో దహింపబడినారను వార్తవిని వారు హస్తినకు వెళ్ళిరి. దండ్రి దుర్మరణమునకు సత్యభామ కడు దుఃఖించెను. అంత సత్రాజిత్తు కళేబరమును తైలభాండమున భద్రపరచి, సత్యభామ హస్తినకు వెళ్ళెను. తండ్రి మరణమును వివరించి శోకించెను. వెంటనే బలరామకృష్ణులు ద్వారకచేరిరి. అది వినిన శతధన్వుడు భయమంది, కృతవర్మ అక్రూరులను తనకు సహాయముగ నిలువుడని కోరెను. అందులకు అంగీకరించరైరి. ఇక చేయునదిలేక ప్రాణరక్షణార్థం, మణిని అక్రూరునకుయిచ్చి, ద్వారకవిడచి పారిపోయెను. రామకృష్ణులు శతధన్వుని వెంబడించిరి.

కృష్ణుడు చక్రాయుధముతో శతధన్వుని సంహరించి, మణికొరకు వెదకిరి. ఆతనివద్ద మణి లభించలేదు. కృష్ణుడు తిరిగి ద్వారక చేరుకొనెను. మణి ద్వారకలోనే ఎవరి వద్దనోవుండునని యూహించెను. కాని అపుడు బలరాముడు ద్వారకలోలేడు. మిథిలానగరముచేరి జనకునివద్ద వుండెను. ఆ తరుణమున దుర్యోధనుడు మిథిలకు వచ్చి బలరామునివద్ద గదాయుద్ధమునభ్యసించెను.

కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చి సత్రాజిత్తునకు అంత్యక్రియలు జరిపించెను. మణిలభించలేదని సత్యభామకు తెలిపెను. మణికొరకు కృష్ణుడు అన్వేషించు చుండెను. అది తెలిసిన అక్రూరకృతవర్మలు భయమందిరి. తమ ప్రాణములకు సైతము కృష్ణునిచే ముప్పువాటిల్లునని భీతిచెంది, ఒకరాత్రి వారిరువురు ద్వారకవిడచి పారిపోయిరి.

ఆ సమయమున ద్వారకయందు కొన్ని యీతిబాధలు సంభవించెను. అందుకు అక్రూర, కృతవర్మలు ద్వారకను విడచి వెళ్లుటయె కారణమని పౌరులు భావించిరి. అది అజ్ఞానము మాత్రమే, జగన్నాథుడైన శ్రీకృష్ణుడు సూర్యదత్తము, పరమ మహిమాన్వితము, అయిన స్యమంతకమణి ద్వారకయందు లేకుండుటయే ప్రధాన కారణమని పౌరులకు నమ్మబలికెను.

అటు మీదట అక్రూరుని వెదకుటకు చారులను కృష్ణుడు పంపెను. అది తెలిసిన అక్రూరుడు ద్వారకకు చేరుకొనెను. కృష్ణుని దర్శించగ, కృష్ణుడు ఆతనిని గౌరవించెను. విషయమును వివరించెను. అక్రూరుడు తనవద్ద నున్నమణిని కృష్ణునకు వినయముతో సమర్పించెను. మణినిగాంచి అందరు సంతసించిరి. ప్రజల బాధలన్నియు తొలగెను. కృష్ణుడు మణిని తిరిగి అక్రూరునకొసగి గౌరవించెను.

మంగళప్రదమైన స్యమంతకోపాఖ్యానము చదివినను, విన్నను, స్మరించినను, సకలపాపములు తొలగును. శాంతి సౌఖ్యములు చేకూరును.

కృష్ణుడు రుక్మిణి, జాంబవతి, సత్యభామలనుగాక ఐదుగురు కన్యలను పెండ్లి యాడెను. కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనువారు ముఖ్యులు. అందరిలో రుక్మిణీదేవి పట్టమహిషి, ఆమె లక్ష్మీదేవి అంశంతో జన్మించినది. పరమ భక్తురాలు, సుహాస్వాధ్వి, పతివ్రతా రత్నము. కాని కృష్ణునకు సత్యభామయందు మక్కువ మిన్న

కాళింది లోకబాంధవుడైన సూర్యభగవానుని పుత్రిక. విష్ణుభక్తురాలు. కాని విష్ణుదేవునే వివాహమాడవలెనని తపస్సు చేసెను. తండ్రి సూర్యుడు యమునలో

గృహము నిర్మించి, తన పుత్రికనందుంచెను. కాళింది విష్ణుమూర్తియందు ధ్యాన తత్పరతయై యుండెను. ఒకానొక సమయమున శ్రీకృష్ణుడు పాండవుల యోగ క్షేమములు తెలియుటకు ఇంద్రప్రస్థపురమున కేగి, అచ్చట కొంతకాలముండెను ఒకనాడు కృష్ణుడు అర్జునునితోగూడి యమునకు వెళ్లెను. అచ్చట కాళిందిని కృష్ణుడు కనుగొనెను. ఆమె అభిమతమును తెలిసికొని కాళిందిని వివాహమాడెను. కాళింది చక్కదనములో మిన్న, మరియు సుగుణవతి.

మిత్రవింద అవంతీ దేశాధీశ్వరులైన విందానువిందుల అనుంగుచెల్లెలు. కృష్ణుని మేనత్తయగు రాజాధిదేవి కుమార్తె. కృష్ణునియందామె మోహపరవశయై, అతనినే పెండ్లాడదలచెను. కాని ఆమె సోదరులకు ఇష్టములేదు. అందుచే మిత్రవిందకు స్వయంవరము నిర్ణయించిరి. కృష్ణుడు స్వయంవరమునకు విచ్చేసి, శత్రు సమూహములను నిర్జించి, మిత్రవిందను బలిమిని గైకొని వివాహమాడెను.

నాగ్నజితి నగ్నజితుని కుమార్తె. నగ్నజితుడు కోసలదేశపురాజు. అతని రాజ్యములో మదించిన వృషభములేడు గలవు. అవి చాల బల పౌరుషములు గలవి. వానిని లొంగదీసికొన్న వీరునకు తన కన్యనిచ్చి పెండ్లిగావింతునని రాజు ప్రకటించెను. చాలమంది వృషభరాజములను లొంగదీసుకొనుటకు విఫల ప్రయత్నములు చేసిరి. కాని కృష్ణుడు సప్తవృషభములను అనాయాసముగ లొంగ దీసెను. నగ్నజితుడు మిగుల సంతసించి, తనకుమార్తె నాగ్నజితిని వాసుదేవున కొసగి కడువైభవముగ వివాహము జరిపించెను.

భద్ర శ్రుతకీర్తి కుమార్తె. ఈమె కృష్ణుని మేనత్త. సుదర్శనాదులకు గారాల చెల్లెలు. సుదర్శనాదులు కేకయ దేశపురాజులు. వారామెను గోపాలునకిచ్చి పెండ్లిచేసిరి.

లక్షణ మద్రదేశాధిపతి పుత్రిక. సర్వశుభలక్షణసంపన్న. కనుకనే ఆకన్యను 'లక్షణ' యనిరి. స్వయం వరములో కృష్ణుడు లక్షణను పరిణయమాడెను.

అష్టదిక్కులతో గూడియున్న ఈభూమండలమున కృష్ణుడే ప్రభువు. అంతటా వ్యాపించి యున్నాడు. అందుకే ఆమహనీయుడు ఎనమండుగురు కన్యలను వివాహ మాడినట్లు చెప్పబడినది. కృష్ణుడు అందరివలన సంతానమును పొందెను. అట్లు సంతానమునుపొంది తనవంశమును బహుముఖముల వ్యాప్తిగావించెను. ఆ లీలామానుష విగ్రహుని పుత్రులను ప్రస్తుతము కొందరిని పేర్కొందము.

రుక్మిణీ దేవికి ప్రద్యుమ్నుడు, చారుధేష్ణుడు మున్నగువారును; సత్యభామకు భానుడు, సుభానుడును; జాంబవతికి సాంబుడు, శతజిత్తును; నాగ్నజితికి వృషదాముడు, వేగవంతుడును; కాళిందికి భద్రుడు, సుబాహుడును; లక్ష్మణకు ప్రఘోషుడు, బలుడును; మిత్రవిందకు వృకుడు, అర్కుడును, భద్రకు బృహత్సేనుడు, సంగ్రామజిత్తు అను పుత్రులు కలిగిరి. కృష్ణునకు రోహిణి వలన దీప్తిమంతుడు అను పుత్రుడు కలిగినట్లు తెలియుచున్నది.

## 101. ప్రద్యుమ్నుడు

విష్ణుమూర్తి ఒకసమయమున సంతానార్థము శివుని ప్రార్థించెను. శివుడు సంతసమంది విష్ణువునకు పుత్రు ననుగ్రహించెను. ఆ బిడ్డడే మన్మథుడు. తనను ప్రార్థించలేదని సతీదేవికి కోపము వచ్చెను. శివానుగ్రహం వలన గలిగిన కుమారుడు శివుని ఆగ్రహమువలననే మరణించునని శపించెను. అది తెలిసిన విష్ణువు సతీదేవిని ప్రార్థించి, లోకమాతను ప్రసన్నురాలను చేసికొనెను. అంత ఆమె, "శివుని ఆగ్రహమువల్ల మరణించినను, మరల బ్రతుకునని వరమిచ్చెను."

విష్ణుమూర్తి కుమారుడు మన్మథుడు. అతిలోకసుందరుడు. అతని వాహనం చిలుక, చెఱకుగడ ఆతనివిల్లు, అరవిందాది పుష్పములు ఆతనిబాణములు. అతని చెలికాడు వసంతుడు. మన్మథుని శరీరవామభాగమునుండి జనించిన రతీదేవి మన్మథుని భార్య. బ్రహ్మాది దేవతలను, మహర్షులనుగూడ మోహమునముంచి, కామాసక్తులను చేయగల శక్తియుతుడు మన్మథుడు.

ఒక సమయమున తారకుడను రాక్షసునివలన దేవతలకు మిక్కిలి బాధలేర్పడెను. అంతవారందరు బ్రహ్మవద్దకేగి మొరలిడుకొనిరి. "శివునకు కలుగబోవు పుత్రుడు మాత్రమే తారకుని సంహరించగలడు. మరియితరు లెవ్వరివలన గాదు." అని బ్రహ్మ పలికెను.

ఆ సమయమున శివుడు పరమనిష్ఠాగరిష్ఠుడై తపమాచరించు చుండెను. అట్టి తరుణమున హిమవంతునిపుత్రిక పార్వతి శివుని పరిణయమాడదలచెను. అంత దేవతలు మన్మథుని చెంతకేగి, ఎటులైనను శివుని మోహపరవశునిచేసి, పార్వతిపై మనస్సు లగ్నమగునట్లు చేయుమని చెప్పిరి. మన్మథుడంత శివునిచెంతకేగి పూబాణములను ప్రయోగించెను. శివుని మనస్సు చలించెను. తపోభంగమాయెను. శివుడాగ్రహమున తనమూడవ కన్ను తెరచిచూచెను. అందుండి అగ్నిజ్వాలలు

వెలువడి మన్మథుని దగ్ధమొనర్చెను. భర్తమరణమునకు రతీదేవి మిగుల దుఃఖించెను. అంతట నారదుడు, "అమ్మా! నీభర్త రుక్మిణీ కృష్ణులకు ప్రద్యుమ్నుడు అనునామమున జన్మించును. కాని వానిని శంబరాసురుడు సంహరించుటకు ప్రయత్నించును. నీ పాతివ్రత్యమహిమ వలన రక్షింపబడును." అని తెలుప, దేవతలుకూడ రతీదేవి నోదార్చిరి. అటుమీదట రతీదేవి తనభర్తను దక్కించుకొనుటకు భూలోకమునకువచ్చి, శంబరాసురునింట మాయావతి అనుపేరుతో దాసిగా ప్రవేశించెను.

కొంతకాలమునకు రుక్మిణీ కృష్ణులకు పుత్రుడొకడు కలిగెను. ఆ బాలుడే ప్రద్యుమ్నుడు. ముక్కంటి అగ్నికి ఆహుతియైన మన్మథుడే ఈ ప్రద్యుమ్నుడు.

శంబరాసురుడను దానవుడు గలడు. అతడు జటాసురుని పుత్రుడు. కృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నునివలన తనకు మరణమున్నదని ఆకాశవాణివలన శంబరుడు తెలిసికొనెను. అందుచే ప్రద్యుమ్నుడు జనించిన ఎనిమిదవనాడు, శంబరుడు ఒక కాకి రూపముతో నరుదెంచి పురిటిగృహమున ప్రవేశించి, పసిబిడ్డను గొనిపోయి సముద్రములో పడవేసెను. పొత్తిళ్ళలోని బిడ్డను గానక, రుక్మిణి మున్నగు వారు మిగుల దుఃఖించిరి. సాగరమునపడిన పసివాని నొక చేపమ్రింగెను. ఆమీనము జాలరికివలలో చిక్కెను. అది మిగుల పెద్దదిగానున్న కారణమున, జాలరిగొనిపోయి, తన ప్రభువైన శంబరాసురునికి సమర్పించెను. దానిని వంటలవాడుకొనిపోయి ఖండించగా, అందు చక్కని బాలుడుండెను. వానిని గాంచినవారందరు ఆశ్చర్య మందిరి. అది తెలిసిన మాయావతి, ఆబిడ్డడెవడాయని ఆలోచించ సాగెను. అంత నారదుడు అచ్చటకరుదెంచి, బాలుని వృత్తాంతమంతయు వివరించగా, మాయావతి మిగుల సంతసించెను. అనాటినుండి బాలునకు శంబరునివలన యెట్టి ప్రమాదము రాకుండగ కాపాడుతు పెంచసాగెను. కొంతకాలమునకు బాలుడు పెరిగి పెద్ద వాడాయెను. యౌవనవంతుడై బలతేజముల ప్రకాశించుచుండెను. మాయావతి తమ గతమునంతయు తెలిపెను. అంతయు నెరిగిన ప్రద్యుమ్నునకు రతీదేవి మహామాయావిద్యనుపదేశించెను. ప్రద్యుమ్నుడంత శంబరుని యుద్ధమునకు పిలచెను. ఇరువురకు మహాసంగ్రామము జరిగెను. శంబరుని మాయావిద్యలు సర్వము వ్యర్థమయ్యెను. వాని మాయలన్నియు భగ్నమొనర్చి ప్రద్యుమ్నుడు శంబరుని యుద్ధమున సంహరించెను.

ప్రద్యుమ్నుడంత భార్య రతీదేవితో గగనయానముచేసి ద్వారకకు చేరెను. ప్రద్యుమ్నుని రూపురేఖలన్నియు కృష్ణుని పోలియుండెను. శిరమున పింఛముమాత్రము

లేదు. అందుచే అంతఃపురాంగనలు ముందుగ ప్రద్యుమ్నునిగాంచి కృష్ణుడని భ్రమ చెందిరి. తరువాత యధార్థము గ్రహించిరి. రుక్మిణి తనపుత్రుని గుర్తించలేక పోయెను. కారణము పురిటిలోనే బిడ్డడు దూరమగుట. తనపుత్రుడు జీవించియున్న ఆతడు కూడా యింతటివాడై యుండునుగదా! యని విచారించెను. అంతలో కృష్ణుడు, దేవకీవసుదేవులు అచ్చటకివచ్చిరి. దేవర్షినారదుడుకూడ అచ్చటికరుదెంచెను. నారదమహర్షి ప్రద్యుమ్నుని పూర్వగాథనంతను వినిపించెను. అదివిని రుక్మిణీదేవి పరమానందమున తేలియాడెను. ద్వారకావాసులందరు ఆనందించిరి. ప్రద్యుమ్నుడు భార్యతోగూడి తల్లిదండ్రులకు పాదాభివందనమొనర్చెను. దేవకీవసుదేవులకు నమస్కరించగ, ప్రద్యుమ్నునిగాంచి సంతసించిరి. అటుపిమ్మట తన మేనమామ రుక్మికుమార్తె రుక్మవతిని స్వయంవరమున పరిణయమాడెను. కృష్ణుడు తనకు రుక్మికి నడుమగల పూర్వవైరములను విడనాడి బంధుత్వము కలుపుకొని సుఖమున యుండిరి. ప్రద్యుమ్ననకు రుక్మవతియందు అనిరుద్ధుడను పుత్రుడు కలిగెను. రూపురేఖా విలాసములందును, శౌర్యబలాదిగుణములందును అనిరుద్ధుడు తాత తండ్రులకు సరియగువాడై ప్రకాశించెను.

## 102. ఉషాపరిణయము

బలిచక్రవర్తికి నూరుగురుపుత్రులు గలరు. వారిలో బాణుడు పెద్దవాడు. అతని రాజధాని శోణిపురం. బాణుడు మహాబలశాలి. అతనికి వేయి బాహువులుగలవు. గొప్ప శివభక్తుడు. వేయిచేతులలో అనేక వాద్యములు వాయించి శివుని మెప్పించెను. బాణుని తపమునకుమెచ్చి శివుడు ఏదేని వరము కోరుకొమ్మనెను. బాణుడంత, తన వాకిట కావలియుండుమని శివునికోరెను. భక్తవశంకరుడు అందులకంగీకరించెను. శివుడు పార్వతీసహితుడై ప్రమథగణములతోడవచ్చి శోణిపురపు ముఖద్వారముకడ కావలి యుండెను.

బాణాసురుడు వరబల గర్వమున విర్రవీగు చుండెను. యుద్ధోన్మాదుడై చివరకు పరమశివునే యుద్ధమునకు పిలిచెను. బాణాసురునకు అంత్యకాలమాసన్నమైనదని శివుడు గ్రహించెను. "ఓరీ ! మదగర్వమున కన్నుమిన్నుగానక నోటికి వచ్చినట్లు వదరుచుంటివి. నీరథటెక్కెము ఎపుడు విరిగినేలగూలునో అపుడు నిన్ను అంత మొందించువాడు రాగలడు. అపుడు నావంటివానితో యుద్ధము సంభవించును" అని శంకరుడుగ్రుడై పలికెను.

బాణాసురుని కుమార్తె ఉష అమిత అందకత్తె. ఆమె ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధునితో రతిక్రీడ ననుభవించినట్లు స్వప్నము కనెను. కాని అతడెవడో, ఎక్కడ వుండునో ఆమెకు తెలియదు. అయినను అనిరుద్ధునే పొందవలెనని పట్టుబట్టెను. నిద్రాహారములు మానెను. తన కోరిక నెరవేరు ప్రయత్నము సాగించెను.

బాణాసురుని మంత్రి కుంభాండుని పుత్రిక చిత్రలేఖ. ఎన్నోవిద్యలు నేర్చిన నెరజాణ. మిగుల తెలివైనది. చిత్రలేఖ ఉషకు ప్రాణసఖి. ఉష తన మనసులోని మర్మమును తనసఖికి తెలిపెను. అందుకై వివిధ దేశాధీశుల చిత్రపటములు సేకరించి ఉషకు చూపెను. చివరకు ఉష ప్రేమించిన పురుషుని కనుగొనెను. అంత చిత్రలేఖ గగనయానము చేసి ద్వారకచేరెను. అది అర్ధరాత్రి సమయము. కామరూపముతో కృష్ణునిమందిరము ప్రవేశించి, నిద్రించుచున్న అనిరుద్ధుని శోణపురమునకు గొనివచ్చెను.

కొంతతడవునకు అనిరుద్ధుడు నిద్రనుండి మేల్గాంచెను. ఎదురుగవున్న ఉషను చూచెను. ఆమె అందచందములకు మోహితుడయ్యెను. ఇరువురు ఒకరికొకరు చేరువైరి. మనసులు కలసెను. దేహములేకమయ్యెను. ఒండొరులు అంతఃపురములో రతికేళీ విలాసముల స్వర్గసౌఖ్యములనుభవించిరి. అటుల కొంతకాలము గడచెను.

ఉష గర్భవతయ్యెను. ఆ విషయము ఆనోటయానోట బాణాసురునకు తెలిసెను. ఆగ్రహమున తక్షణము ఉష మందిరమునకేగి అనిరుద్ధుని వధించబోయెను. మహా వీరుడైన అనిరుద్ధుడెంత మాత్రము భయమందక దానవవీరునితో యుద్ధమునకు దిగెను. ఇద్దరినడుమపోరు చాలఘనముగసాగెను. అంత దానవేంద్రుడు నాగపాశములచే అనిరుద్ధుని బంధించెను. ఉష తన ప్రియుని అవస్థగాంచి మిగుల విలపించెను.

ద్వారకయందు అనిరుద్ధునిగానక యాదవులందరు శోకసముద్రమున మునిగిరి. అది వర్షఋతువగుటచే అనిరుద్ధుని అన్వేషించుటకు అవకాశము కుదరకుండెను. ఏమి చేయుటకు దిక్కుతోచనివారై యుండిరి. అంతట నారదమహర్షివచ్చి, అనిరుద్ధుని విషయమును వివరించెను. వెనువెంటనే శ్రీకృష్ణబలరాములు శోణపురముపై దాడిచేయసిద్ధమైరి, వారితో ప్రద్యుమ్నుడు, సాత్యకి, గదుడు, సాంబుడు మున్నగు యాదవవీరులు బయలుదేరిరి. అచ్చట బాణాసురునకుతోడుగ శంకరుడు తన ప్రమథగణములతో యుద్ధమునకు సిద్ధమైయుండిరి.

పోరు ప్రారంభమాయెను. ప్రధానముగ సంగ్రామము శివకేశవుల నడుమ నెలకొని యుండెను. ఇరువురు జగన్నాథులే. లోకపాలకులే. వారి యుద్ధవిశేషములు గాంచుటకు బ్రహ్మేంద్రాదిదేవతలు, గగనమున నిలచియుండిరి. బలరామాదులు ప్రమథగణములను, వారి సైన్యమును చీకాకుపరచి చెదరగొట్టిరి. శ్రీకృష్ణుడు దివ్యాస్త్రములను ప్రయోగించి శంకరుని ఆశ్చర్యపరచెను. బాణాసురుని సైన్యమును తృటికాలములో యమసదనమునకంపెను. అంతశివుడు మహేశ్వర విషజ్వరమును సృష్టించగా, దానికి ప్రతిగా కేశవుడు వైష్ణవజ్వరమును సృష్టించెను. రెంటిమధ్య భీకరమైన పోరుజరిగెను. మహేశ్వరునిశక్తి ఓటమిపాలాయెను. చివరకు మహేశ్వర శక్తి విష్ణుపాదములపైబడి శరణుజొచ్చెను. పరమ దయాళువైన శ్రీకృష్ణుడు కరుణించి మహేశ్వరజ్వరమునకు అభయమిచ్చెను. అంత బాణుడు మరల కృష్ణునిపై పోరునకుదిగెను. యుద్ధమున బాణుని వేయిబాహువులను నరికెను. శంకరుడు వచ్చి, "జగన్నాథా ! బాణుడు నాభక్తుడు. నాకు మిగుల ప్రేమపాత్రుడు. వీనిని చంపకవదలుము" అని కృష్ణుని ప్రార్థించెను. కృష్ణుడు శివుని మాటలను మన్నించెను. "పరమేశ్వరా ! బాణుడు ప్రహ్లాదుని మనుమడు. ప్రహ్లాదుడు నాకు పరమభక్తుడు. ఆతని వంశీయులను వధించనని ప్రహ్లాదునకు వరమిచ్చియున్నాను. కనుక ఈతడును నాకు ఆప్తుడే. కాని వీని మదమణంచుటకు వేయి బాహువులను మాత్రము ఖండించితిని. ప్రస్తుతము వీనికి నాలుగుచేతులు మాత్రమే యున్నవి. ఇతడు శివుని భక్తులలో ప్రముఖుడై, జరామరణములులేక యుండును." అని పలుక శంకరుడు సంతసించెను. అంతయు వినిన బాణుడు కృష్ణునకు ప్రణమిల్లి, అనిరుద్ధుని బంధ విముక్తుని జేసి, గోవిందునకప్పగించెను. బాణుడు ఉష అనిరుద్ధుల వివాహము మహా వైభవముగ జరిపించి, కృష్ణబలరాములను, యాదవవీరులను దివ్యవస్త్రాభరణములతో సత్కరించెను. అటుమీదట కృష్ణుడు తనవారితో ద్వారకకు తరలెను.

అనిరుద్ధుడు రుక్మలోచననుగూడ పెండ్లాడెను. ఈమె రుక్మిమనుమరాలు. వివాహమునకు కృష్ణుడు, రుక్మిణి, బలరాముడు భోజకటకపురమునకు చేరెను. అచ్చట రుక్మి బలరామునితో జూదమాడెను. అందు బలరాముడు గెలిచెను. అయినను రుక్మి మోసపుబుద్ధితో తగవులాడెను. అంత బలరాముడాగ్రహించి రుక్మిని సంహరించెను. తగవునకు ప్రోత్సహించిన కళింగరాజాదులను గూడ సంహరించెను.

"భక్తులకు పరాజయ ముండదు." అది వ్యాసభగవానుని దివ్యసందేశము

# 103. నరకాసురవధ

శ్రీమహావిష్ణువు కుమారుడు నరకుడు. ఆతడు ప్రాగ్జ్యోతిషపురమునకు రాజు. భూదేవి అతనితల్లి. రాక్షసప్రవృత్తి గలవాడు. మిగుల బలగర్వితుడు. పలు దివ్య శస్త్రాస్త్రములు సంపాదించిన ఘనుడు. ముల్లోకవాసులకు అనేక బాధలు కలిగించిన దుష్టుడు. మానవులు, దేవతలు, ఋషులు వానిబాధలు భరింపజాలరైరి. తుదకు తల్లిభూదేవియు వానిదుండగములు, దుశ్చర్యలు సహించజాలకుండెను. నరకాసురుని వాహనము సుప్రతీకమను ఏనుగు. పీఠుడనువాడు అతని దండనాధుడు. నరకుడు పెద్ద సైన్యమును గూర్చుకొని నిష్కారణముగ అనేక రాజ్యములను జయించెను. రాజులను హింసించి వారి సంపదలను దోచుకొనెను. అంతేగాక పదహారు వేలమంది రాజకన్యలను చెరబట్టి తన నగరములో నిర్బంధించెను.

నరకుని దుశ్చర్యలకు అంతులేదు. దేవేంద్రాది దిక్పతులు సైతము అతనిని వారింపలేరైరి. నరకుడంతటి బలాఢ్యుడగుటకు కారణం లేకపోలేదు. నరకుని నగరమైన ప్రాగ్జ్యోతిషపురం ఐదుదుర్గములచే పరివేష్టింపబడి దుర్భేద్యమై యుండెను. గిరిదుర్గం, శస్త్రదుర్గం, జలదుర్గం, అగ్నిదుర్గం, వాయుదుర్గం అనునవా దుర్గములు. ఇంకను అనేకములైన శక్తులు అనుక్షణము అతనిరాజ్యమును రక్షించుచుండెను.

ఒక సమయమున నరకుడు వరుణుని ఛత్రమును, అదితిదేవి కుండలములను, మేరుపర్వతమందలి మణిపర్వతమును, వైజయంతీ వనమాలికను అపహరించుకొని పోయెను. దీనినంతను ఇంద్రుడు కృష్ణునితో విన్నవించుకొని, రక్షించుమని ప్రార్థించెను. కృష్ణుడు ఇంద్రున భయమిచ్చి నోదార్చెను.

కృష్ణుడంత గరుడవాహనారూఢుడై, సత్యభామతోగూడి నరకునిపై దాడిచేసెను. అస్త్రశస్త్రములతోడను, శంఖచక్రగదాది ఆయుధములతోడను ప్రాగ్జ్యోతిషమును రక్షించుచున్న దుర్గములను ధ్వంసమొనర్చెను. కృషుడు పాంచజన్యమును పూరించగ, దాని ప్రళయభీకరధ్వనికి మురుడనువాడు అదిరిపడి నిద్రలేచెను. సమస్త లోకములు దద్దరిల్లునటుల సింహనాదము చేసెను. ఉగ్రుడై త్రిశూలమును ధరించి కృష్ణు నెదుర్కొనెను. మురుడు ప్రయోగించిన త్రిశూలమును గోవిందుడు మధ్యలోనే ఖండించెను. అస్త్రములనేకములు ప్రయోగించి నొప్పించెను. మురునకు శ్రీకృష్ణునకు భీకర సంగ్రామము జరిగెను. అంత కృష్ణుడు మురుని శిరస్సుల నైదింటిని చక్రాయుధముచే ఖండించెను. పెద్ద పర్వతశిఖరమువలె మురుడు నేలగూలి

మరణించెను. అంత వాని కుమారులు తామ్రుడు, అంతరిక్షుడు మున్నగువారు పీఠుడు అనువాని నాయకత్వమున కృష్ణునిపై దాడిచేసిరి. వారినందరిని కృష్ణుడు క్షణకాలములో సంహరించి, ముల్లోకవాసులను ఆశ్చర్యపరచెను.

అటుపై నరకుడు క్రోధావేశుడై కృష్ణునెదిరించెను. దివ్యమైన మదగజము నధిరోహించెను. పెక్కుగజసైన్యములతో దాడిచేసెను. ఇరువురినడుమ మహా సంగ్రామము జరిగెను. కృష్ణ, నరకాసురుల యుద్ధమును దేవతలు గగనమార్గమున నిలచి ఆసక్తితో వీక్షించసాగిరి. గరుత్మంతుడు నరకుని పలురీతుల బాధించెను. నరకునితో యుద్ధము చేయుటయందు సత్యభామ కూడా అద్భుతమైన వీరత్వమును ప్రదర్శించి శ్రీకృష్ణునకు తోడ్పడెను. నరకుడు గరుడుని సంహరించుటకు మహాశక్తిని ప్రయోగించెను. కాని పక్షిరాజు ఎంతమాత్రము చలించలేదు. తుదకు కృష్ణుడు సుదర్శన చక్రమును ప్రయోగించి నరకుని కంఠమును ఖండించెను. నరకుడు మరణించగ దేవదుంధుభులు మారుమ్రోగెను. కృష్ణునిపై దేవతలు పూలవాన కురిపించిరి. ఋషులు మహర్షులు, దేవతాగణములు వాసుదేవుని కొనియాడిరి.

నరకునకు భగదత్తుడను పుత్రుడుండెను. భూదేవి బాలునితో కృష్ణునివద్దకువచ్చి, బాలుని రక్షింపుమని ప్రార్థించెను. కృష్ణుడు భగదత్తునకు అభయమొసంగెను. నరకుడు అపహరించిన దివ్యవస్తువులను తిరిగి వారలకు అందచేసెను.

కృష్ణుడు నగరములో ప్రవేశించెను. చెరయందు మ్రగ్గుచున్న పదహారువేలమంది రాజకన్యలను బంధవిముక్తులను గావించెను. వారందరు కృష్ణుని వలన విముక్తి పొందిన కారణముగ గోపాలునే తమపతిగ వరించిరి. తమ కోర్కెను పాలించమని ప్రార్థించిరి. కృష్ణుడు వారిప్రార్థనలను మన్నించెను. వారలను భార్యలుగా స్వీకరించెను. బంగరు పల్లకులలో వారిని ద్వారకకు సాగనంపెను. వారితోపాటుగ తాను రథ, గజ, తురగ, ధనరాశులను ద్వారకకు చేర్చెను.

కృష్ణుడు అదితికి కుండలములు యిచ్చుటకు ఇంద్రుని నగరమైన అమరావతికి వెళ్ళెను. ఇంద్రుని భార్య శచీదేవి కృష్ణుని భక్తితో పూజించెను. అపుడు సత్యభామ నందనవనములోని పారిజాత వృక్షమును గాంచెను. దానిని తనకు దక్కునట్లు చేయుమని కృష్ణుని కోరెను.

పారిజాతవృక్షం దేవతలకు దివ్యవృక్షము. దానిని దేవతావృక్షమందురు. దాని పుష్పములు, పరిమళము వారికే సొంతం. కాని సత్యభామ కోరిక తీర్చుటకు

కృష్ణుడు వృక్షమునే సమూలముగ పెకలించి గరుత్మంతుని మూపుపై వుంచెను. పారిజాత వృక్షమును భూలోకమునకు తీసికొనిపోవుట దేవతలకు యిష్టము లేదు. అజ్ఞానులై కృష్ణు నెదిరించిరి. కాని వాసుదేవుడు ఇంద్రాది దేవతలను సునాయాసముగ నెదిరించెను. అందరిని జయించి పారిజాత వృక్షమును భూలోకమునకుతెచ్చి, పూదోటలో నాటెను.

కృష్ణుడు పదహారువేల భార్యలతో సుఖించుటకు వారందరికి వేరువేరుగ మందిరములను నిర్మించెను. అందరిని సుఖముల దేల్చెను. ప్రతి యొక్కరిని ఆనందహేల ముంచితేల్చెను. అదెట్లు సాధ్యము? శ్రీకృష్ణుడు లీలావినోదుడు. ఆ మహనీయుని చర్యలన్నియు దివ్యలీలలు. కృష్ణతత్వము తెలియుట ఏరితరము?

నరకుని కుమారుడు భగదత్తుడు గొప్ప వీరుడు, కురుక్షేత్ర సంగ్రామ సమయములో భగదత్తుడు దుర్యోధనుని పక్షమున నిలచి పోరాడెను. నరకుడు పూర్వము విష్ణుమూర్తివలన వైష్ణవాస్త్రమును పొందెను. దానిని తన పుత్రుడైన భగదత్తున కొసగెను. భారత యుద్ధములో భగదత్తుడు దానిని అర్జునునిపై ప్రయోగించగ, కృష్ణుడు దానిబారినుండి అర్జునుని రక్షించెను. తుదకు భగదత్తుడు, సుప్రతీకమను మదగజము అర్జునుని చేతిలోనే అంతమందెను.

## 104. నృగోపాఖ్యానం

పూర్వము నృగుడనురాజు గలడు. అతడు మహాదాత, గోవులను, భూములను, ధనధాన్యములను దానము చేయుటలో అతనిని మించినవారు లేరు. అంతేగాక యజ్ఞయాగాదులు, పుణ్యకార్యములాచరించుటలో నృగుమహారాజుకు మించిన వారును లేరు.

ఒక బ్రాహ్మణునకు గోవునొకదానిని దానమిచ్చెను. దానమిచ్చినగోవు ఎటులో తప్పించుకొనివచ్చి నృగుమహారాజు గోగణములో కలిసెను. ఆ విషయము రాజునకు తెలియదు. ఆ గోవునే మరల మరియొక బ్రాహ్మణునకు దానమిచ్చెను. దానముగ గ్రహించిన గోవును బ్రాహ్మణుడు తోలుకొని పోవుచుండగా, మొదటిబ్రాహ్మణుడు ఎదురువచ్చి గోవు తనదని పలికెను. రెండవ బ్రాహ్మణుడు గోవును మహారాజు తనకు దానమిచ్చెనని చెప్పెను. అటులా బ్రాహ్మణు లిద్దరు గోవును గూర్చి వాదులాడుకొని వివాదమును రాజువద్దకు వచ్చి వివరించిరి. అంతేగాక, ఒకపరి

దానమిచ్చిన గోవును, మరల వేరొకరికి దానమిచ్చుట ఏపాటిధర్మమని ఆక్షేపించిరి. జరిగిన పొరపాటునకు రాజు ఖిన్నుడై, ఏమియు తోచనివాడై భయమందెను.

అంతట నృగుడు, "ఆర్యులారా! పొరపాటు జరిగినది. అది తెలిసి చేసినదిగాదు. ఎంతటి ధీమంతునకైనను ప్రమాదము సంభవించుట సహజము. మీలో యొకరు దయదలచి గోవును విడచివేయుడు. అందుకు బదులుగా లక్షగోవులనిత్తును." అని పలికెను. అందుకు బ్రాహ్మణులు ఒప్పుకొనరైరి. మొండిగ వాదించి వెడలిపోయిరి.

కొంతకాలమునకు రాజు మరణించగా, యమదూతలు రాజును యమ లోకమునకు గొనిపోయిరి. యమధర్మరాజు రాజును చూచి "రాజా ! నీవు కొంత కాలము పాపఫలమనుభవించుము. తదుపరి పుణ్యమనుభవమునకు రాగలదు. కనుక పాపమును ముందుగ అనుభవించుము." అని ఆనతీయ నృగుడు ఒకపెద్ద ఊసరవెల్లియై, పాడుపడ్డ నూతిలో పడియుండెను.

ఒకరోజున ప్రద్యుమ్నుడు, సాంబుడు, గదుడు మున్నగుయాదవులు వన విహారమునకు వచ్చిరి. వారికి దాహము కాగా, నూతివద్దకు చేరిరి. అందులో ఊసరవెల్లిని చూచిరి. దానిని బయటకుతీసి, రక్షింప ప్రయత్నించిరి. కాని వారి ప్రయత్నము ఫలించకుండెను. వెంటనే వారు నగరమునకుపోయి, విషయమును కృష్ణునకు తెలిపిరి. వాసుదేవుడంత నూతిచెంతకు వచ్చి తన ఎడమచేతితో సునాయాసముగ దానిని నూతినుండి వెలికితీసెను. వెను వెంటనే, కృష్ణుని కరస్పర్శ జరిగిన మాత్రమున నృగుడు నిజరూపమును పొందెను. కృష్ణుడు నృగుని తన పూర్వచరిత్రను చెప్పుమనెను. నృగుడు తన పూర్వ వృత్తాంతమును కృష్ణునకు వివరించెను. కృష్ణుని అనుగ్రహమువలన నృగునకు స్వర్గము ప్రాప్తించెను.

ఒకపరి దానమిచ్చిన వస్తువును తెలిసిగాని, తెలియకగాని తిరిగి దానమిచ్చుట పాపహేతువగును. అందున విప్రునిసొత్తు దానమిచ్చుట, అనుభవించుటకన్న పాపకార్యము వేరొకటిలేదు.

## 105. పౌండ్రకుడు

కురుదేశాధిపతి పౌండ్రకుడు. అతడు కృష్ణుని కాలమువాడు. అతనికికూడా కృష్ణునకువలె శంఖం, చక్రం, గద, శార్ఙ్గం, శ్రీవత్సం మున్నగు ఆయుధములు చిహ్నములన్నీ ఉండెను. అతని మెప్పుగోరి కొందరు మూర్ఖులు అసలైన కృష్ణుడు పౌండ్రకుడేయని ప్రచారము సాగించిరి.

"పౌండ్రకా ! నీవే వాస్తవమైన వాసుదేవుడవు. కృష్ణునకుగల చిహ్నములన్నియు నీయందునుగలవు. వాసుదేవుడు మాయలవాడు. తానే భగవంతుడనని చెప్పుకొని ప్రజలను నమ్మించుచున్నాడు. అందరినీ మోసము చేయుచున్నాడు. అతని నెట్లో యొప్పించిగాని, యుద్ధమొనరించి జయించిగాని నీకీర్తిని నిలుపుకొనుము." అని కొందరు దుర్జనులు పౌండ్రకునకు దుర్బోధలుచేసి రెచ్చగొట్టిరి.

వారి మాటలతో పౌండ్రకుడు పొంగిపోయెను. అహంకారపుపొరలు అతని కళ్ళను కప్పివేసినవి. ఒక దూతను వాసుదేవుని వద్దకు పంపెను. "అసలైన వాసుదేవుడను నేనే. నీవు నీలాంఛనములను, బిరుదు నామమును త్యజించి, నన్నే వాసుదేవునిగా అంగీకరించుము. లేకున్నచో రణరంగమున నిన్ను వధింతు" నని అహంకారముగ వర్తమానము పంపెను.

దూత కృష్ణునివద్దకుపోయి పౌండ్రకుని సమాచారమును వివరించెను. వాని మాటలువిని అందరు నవ్వుకొనిరి. మతి భ్రమించినదని గేలిచేసిరి. పౌండ్రకునకు వినాశకాలము దాపురించినదని భావించిరి. నిజమగు వాసుదేవుడెవరో యుద్ధమున తేలగలదని కృష్ణుడు దూతద్వారా కబురంపెను.

కృష్ణుని మహిమ, శక్తితెలియలేక దుర్మదమున పౌండ్రకుడు యుద్ధమునకు సిద్ధమయ్యెను. పౌండ్రకుని మిత్రుడైన కాశీరాజు మూడక్షౌహిణుల సైన్యముతో వచ్చి పౌండ్రకునకు సహాయముగ నిలచెను. కృష్ణుడు తనసైన్యమును వెంటనిడుకొని యుద్ధమునకు వచ్చెను. ఉభయపక్షములకు ఘోరముగ పోరుసాగెను. కృష్ణుడు పౌండ్రకుని సునాయాసముగ రణమున సంహరించెను. కాశీరాజుతలను కృష్ణుడు ఖండించగ, శిరస్సు ఎగిరిపోయి వారణాశి నగరద్వారముచెంతపడెను. వాని మరణమునకు అతనిభార్యలు, బంధుమిత్రాదులు దుఃఖించిరి. అతనిపుత్రుడు సుదక్షిణుడు తండ్రికి అంత్యక్రియలను జరిపించెను. కాని తన తండ్రిని సంహరించిన కృష్ణునిపై పగబూనెను. కృష్ణుని చంపనెంచి, దీక్షతో శంకరుని ప్రార్థించెను. శివుడు ప్రత్యక్షమై, అభిచారహోమము చేయుమని చెప్పెను. అంత సుదక్షిణుడు అభిచార హోమము భక్తిశ్రద్ధలతో నిర్వహించెను. అవుడు హోమాగ్నినుండి ఉగ్రరూపముతో కృత్యాగ్ని జనించెను. అది భూతగణాలతో ద్వారకానగరముపై దాడిచేసెను. ప్రళయాగ్ని జ్వాలలు పట్టణమంతయు వ్యాపించెను. ద్వారకావాసులు భీతిల్లి కృష్ణుని శరణుజొచ్చిరి. విలయమునకు కారణము పరమేశ్వరుడని వాసుదేవుడు గ్రహించెను. వెంటనే కృష్ణుడు చక్రాయుధమును ప్రయోగించెను. అది నగరమందు వ్యాపించిన

అగ్నిజ్వాలలను చల్లార్చెను. అంతటితో నాగక, సూర్యప్రభలతో చెలరేగి సుదక్షుణుని, అతనిచే హోమముచేయించినవారిని సంహరించి తిరిగి కృష్ణుని చేరెను. అట్లు కృష్ణుడు దుష్టులను శిక్షించి, పౌండ్రక వాసుదేవుని వధించి, ధర్మరక్షణమొనర్చెను.

## 106. జరాసంధుని వధ

మగధదేశమునకు రాజు బృహద్రధుడు. గిరివ్రజపురమాతని రాజధాని. ఆ రాజుకు సంతానము లేనికారణమ్మున వ్రతములు, పూజలనేకమొనర్చెను. ఒకనాడు బృహద్రధుడు అడవికేగెను. అచ్చట ఒకముని మామిడిచెట్టుక్రింద కూర్చొని తపము చేసికొనుచుండెను. ఆమునిపేరు చండకౌశికుడు. రాజు మునిని దర్శించి, భక్తితో పూజలొనర్చెను. తనకు సంతానము అనుగ్రహించమని ప్రార్థించెను. మునికి రాజునందు దయగలిగి, చెట్టునుండి రాలిపడిన మామిడిపండును మంత్రించి రాజున కొసగెను. "రాజా! ఈ ఫలమును నీ భార్యకిమ్ము. ఆమె దానినారగించినచో, పుత్ర సంతతి గలుగు"నని ఆశీర్వదించెను.

బృహద్రధునకు ఇద్దరు భార్యలు కలరు. రాజు మామిడి పండును రెండు భాగములుగా ఖండించి, భార్యలిద్దరిచే తినిపించెను. రాణులిద్దరు గర్భవతులైరి. కొంతకాలమునకు వారికి పుత్రులిద్దరు కలిగిరి. కాని వారు వికృతరూపులుగా జన్మించిరి. ఒక కన్ను, ఒక కాలు, ఒక చేయి, పొట్ట, తల, సగము సగముగా గలిగి జన్మించిరి. మామిడిపండుచీల్చి సగము భుజించుటచే బాలురట్లు జన్మించినట్లు తలచి, వికృత రూపులగు శిశువులనుగాంచి వారు భయమందిరి. ఆ బిడ్డలను చూచిరాజు దిగులు చెందునని తలచి, రాణులు దాసీలచే శిశువులను కోటగోడ కావల పారవేయించిరి.

కోటగోడకు వెలుపల 'జర' అనురాక్షసి, ఆ శిశువులనుచూచి భక్షించనాశించెను. కాని అంతలో ఆరెండు భాగములు కలసికొని, ఒకే బిడ్డగ ఏర్పడెను. వెంటనే బాలుడు రోదించ సాగెను. బాలుని రోదనపు ధ్వనివిని, అంతఃపుర స్త్రీలు కొందరు అచ్చటికి వచ్చిచూచి, సమాచారమును రాజుకు తెలియజేసిరి. పిల్లవానిని భక్షించినచో, రాజు తనను చంపునను భయముతో రాక్షసి బాలుని గొనిపోయి రాజునకు అప్పగించెను. బృహద్రధుడు జరిగిన సమాచారమంతయు రక్కసివలన తెలిసికొని, బాలుడు దక్కినందులకు సంతసించెను. జరవలన సంధింపబడుట వలన పిల్లవానికి జరాసంధుడని పేరిడిరి. బృహద్రధుడు బాలుని ప్రేమతో పెంచసాగెను.

జరాసంధుడు పెరిగి పెద్దవాడయ్యెను. మహాబలవంతుడై, బృహద్రథుని అనంతరము మగధకు రాజయ్యెను. గిరివ్రజపురమాతని రాజధాని. రాజధానికి చుట్టు గోరథం, ఋషభం, వైహారం మున్నగు పర్వతములు పెట్టని కోటగోడలవలెయుండి, రాజ్యమును కాపాడుచుండెను. నగరంలో చైత్రకగిరి, శృంగాన అనురెండు భేరీవాద్యములు నెలకొల్పెను. యాంత్రికశక్తి గల అవాద్యములు పర్వతపు శిఖరము లందు గలవు. శత్రువులెవరైన రాజ్యములో ప్రవేశించినంతనే భేరీవాద్యములు తమకుతామే మ్రోగును. పరమాద్భుత శక్తిగలిగిన ఆ యంత్రములు మ్రోగినంతనే శత్రువులయునికి వెనువెంటనే తెలియును. గొప్ప సైనికబలము, యంత్రబలము గలిగిన జరాసంధు నెవ్వరును నెదిరించ సాహసము చేయకుండిరి. అందుచే జరాసంధుడు అజేయుడై యుండెను.

మల్లయుద్ధములో జరాసంధుడు చాలగొప్పవాడు. నాటి మల్లయుద్ధయోధులలో అతనితో సాటియగువారు, మించినవారును లేరు. పురుజితుడు, కరూశుడు, యవనుడు, హంసడింభకులు, కంసుడు మున్నగు వీరులు జరాసంధునకు మిత్రులు, జరాసంధుడు తన కుమార్తెలను కంసునకిచ్చి పెండ్లిచేసెను. కంసుని కృష్ణుడు సంహరించినందున, జరాసంధునకు గోవిందునిపై శత్రుత్వము ప్రబలెను. పదిహేడుమార్లు మధురను ముట్టడించెను. కాని కృష్ణుని జయించలేక పోయెను. పద్దెనిమిదవసారి కాలయవనునితో తాను కృష్ణునిపై దాడిచేయగ, కృష్ణుడు సముద్రగర్భమున ద్వారకను నిర్మించి, యాదవులను రక్షించెను.

జరాసంధుడు ఎట్టి అయుధముచేతను మరణించడు. అతనికట్టి వరబలము గలదు. అవరబలగర్వముచే, అతడు పలువురు రాజులను జయించి బంధించెను. వారలను వధించుచు, బలి చేయుచు భైరవపూజ చేయుచుండెను. కాని బ్రాహ్మణు లందు జరాసంధునకు భక్తిమెండు. అందుచే వారు కోరినవి లేదనక యిచ్చెడివాడు. చెరలో మ్రగ్గుచున్న రాజులు కొందరు తమను రక్షింపుమని కృష్ణుని వద్దకు దూతను పంపిరి. అతడు కృష్ణుని వద్దకుచేరి రాజులు అనుభవించుచున్న బాధలను వివరించెను. అదే సమయమున నారదమహర్షియు వాసుదేవుని సందర్శించుటకు వచ్చియుండెను.

పాండవాగ్రజుడైన ధర్మరాజు ఇంద్రప్రస్థపురములో రాజసూయ యాగము చేయబూనెను. యాగము జయప్రదము కావలెనన్నచో శ్రీకృష్ణుని సహాయము ఎంతయు ముఖ్యము. అందువల్ల ధర్మరాజు నారదునిద్వారా ఆహ్వానము అందచేసెను. నారదుడు ఆ విషయమును కృష్ణునకు తెలియచేసెను.

కృష్ణుడు రాజసూయ యాగమునకు వెళ్లుటకు నిశ్చయించెను. వెళ్లి రెండు కార్యములు నిర్వహించదలచెను. జరాసంధుని వధించి, బందీలుగనున్న రాజులను రక్షించుట మొదటి కర్తవ్యము. రాజసూయయాగము నిర్వహించి, ధర్మరాజునకు రాజ్యసాధనకై బలముచేకూర్చుట తదనంతర కర్తవ్యము.

యాదవులలో ఉద్ధవుడు నీతిశాస్త్రకోవిదుడు. అతడు కృష్ణునితో, "కృష్ణా! వాసుదేవా ! జరాసంధుడు మనకు శత్రువర్గమువాడు కడుబలవంతుడు. అజేయుడు, ఎట్టి ఆయుధముచేతను వధింపబడడు. కాని గొప్ప మల్లయుద్ధవిశారదుడు. ఒక్క భీముడు మాత్రమే అతనిని జయించగలవాడు. కావున ద్వంద్వ యుద్ధమున వాని నంతమొందించుము. చెరయందున్న రాజులను విడిపించి రక్షించుము. రాజసూయ యాగము రక్షించి, పాండవులకు బలమును చేకూర్చుము. ఇంద్రప్రస్థపురమునకేగి సర్వము దిగ్విజయ మొనర్చుము." అని వివరించెను.

గిరివ్రజపురమునుండి వచ్చినదూతను సమాధానపరచి సాగనంపెను. అటులే నారదునికూడా దృప్తునిగావించి, యాగమునకు వత్తునని వర్తమానము పంపెను. అటుపై కృష్ణుడు భార్యలతోడను, సమస్త బంధుజన సపరివారసమేతుడై రథ, గజ, తురగ సమూహములు తోడునడువ, మంగళవాద్యములు దశదిశలు ప్రతిధ్వనించు చుండ, జయజయధ్వానములు మారుమ్రోగుచుండ, ఇంద్రప్రస్థపురము చేరుకొనెను.

ధర్మరాజు తమ్ములు, బంధు మిత్రులతో కృష్ణునెదురేగి పూజించి, వివిధ మర్యాదలతో తనభవనములో విడిది చేయించెను. కృష్ణుని ఆదేశానుసారము యాగము ప్రారంభమాయెను. పాండవుల దిగ్విజయ యాత్రప్రారంభమాయెను. భీముని తూర్పుదిశకు, సహదేవుని దక్షిణ దిక్కునకు, పశ్చిమమునకు నకులుని, ఉత్తర దిశకు అర్జునుని, తగిన సైనిక బలమునుగూర్చిపంపెను. వారును నలుదిక్కులకు చని, వివిధ దేశాధీశులను జయించి, అపారధనరాసులను కొల్లగొట్టి ధర్మజునకందచేసిరి. కాని జరాసంధునిమాత్రం జయించవలసియుండెను. వానిని జయించినగాని యాగము ప్రారంభముగాదు. అందుకై ధర్మరాజు విచారించగ, కృష్ణుడు అతనికి ధైర్యము చెప్పెను.

కృష్ణుడు భీమార్జునులను వెంటనిడుకొని గిరివ్రజమునకు బయలు దేరెను. బ్రాహ్మణ వేషములలో నగరము ప్రవేశించిరి. బ్రాహ్మణభక్తిగల జరాసంధుడు వారిని సాదరమున గౌరవించి ఆహ్వానించెను. కాని వారితీరుతెన్నులుగాంచిన జరాసంధుడు,

వచ్చినవారు బ్రాహ్మణులు కారనియు, క్షత్రియ వీరులని గ్రహించెను. వారి కోర్కెలు తీర్చుటకు సిద్ధపడెను. కావలసినది కోరుడనెను. అపుడు కృష్ణుడు, "ఓయీ! వీరాగ్రేసరా! నీతో యుద్ధము చేయవచ్చితిమి. నేను కృష్ణుడను వీరిద్దరు భీమార్జునులు. మాలో నీయిచ్చవచ్చిన వారితో పోరొనర్చుము" అని పలికెను. అంత మగధపతి, "ఓయీ కృష్ణ! నీవు యాదవుడవు. పిరికి పందవు, నన్నుజూచి, భయమంది పారిపోయి సముద్రమందు దాగితివి. అట్టినీతో పోరాటము నావంటి వీరునకు కీర్తి ప్రతిష్ఠలకు భంగకరము. అల్పుడవు, అర్భకుడవు. పైగా పసివాడవు అట్టినీతో నాకేమి కార్యమగును? ఇక భీమార్జునులలో అర్జునుడు నాకుజోడుకాదు. భీముడు మాత్రము తగినవాడు. ఆతని తోడనే పోరొనర్తును. గెలిచినను ఓడినను నాకదికీర్తిప్రదము" అనిపలుక కృష్ణుడు అంగీకరించెను. నగరము వెలుపలగల రణరంగమందు పోరు ప్రారంభమయ్యెను. భీమజరాసంధులు ముందుగ గదాయుద్ధము ప్రారంభించిరి. ఇద్దరిగదలు ముక్కలయ్యెను. అంతమల్లయుద్ధము మొదలయ్యెను. మిగుల భయంకరము, పరమాద్భుతమైన యుద్ధము సాగుచుండెను. అట్టి యుద్ధము మున్నెన్నడు గాంచలేదని ప్రజలు వాకొనిరి.

యుద్ధమెంతకు ముగియ కుండెను. జరాసంధుని భీముడు జయించలేకుండెను. అంతట కృష్ణుడు ఒక ఉపాయ మాలోచించెను. జరాసంధుని జన్మ రహస్యము తెలిసిన వాడగుట వలన, ఒక పుల్లను తీసికొని నిలువుగ రెండుగచీల్చి అస్తవ్యస్తముగ రెండువైపుల పడవేసెను. అది గ్రహించిన భీముడు జరాసంధుని క్రిందపడవేసి, కాలితో త్రొక్కిపట్టి తాటిమట్టను చీల్చినట్లు దేహమును రెండుగచీల్చి అస్యవ్యస్తముగ రెండువైపుల పడవేసెను. అటుల భీముని చేతిలో జరాసంధుడు హతుడాయెను.

కృష్ణుడు జరాసంధుని కుమారుడు సహదేవుని మగధకు పట్టాభిషిక్తుని గావించెను. చెరలో మ్రగ్గుచున్న రాజులందరిని బంధవిముక్తులను గావించెను. జరాసంధుడు మరణించినందులకు ధర్మరాజు మిగుల సంతసించెను. వాసుదేవుని కీర్తించి పూజించెను.

## 107. రాజసూయము

రాజసూయ యాగము ప్రారంభమయ్యెను. యాగమునకు ఇంద్రాది దిక్పాలురు, బ్రహ్మ మహేశ్వరులు, వ్యాసుడు, పరాశరుడు మున్నగు మహర్షులు, భీష్మద్రోణాది మహనీయులు, కౌరవప్రముఖులు, యింకను వివిధ రాజన్యచూడామణులరుదెంచిరి.

యాగారంభమున సభలో ఒకపెద్దనుపూజించి, అగ్రతాంబూలము యివ్వవలసి యున్నది. అది యొక ఆచారము, సాంప్రదాయము. అట్టి గౌరవపూజ ఎవరికి చేయవలెనో నాటిసభలో నిర్ణయించడం జటిల సమస్యగా మారినది. అంతట, బుద్ధికి బృహస్పతియైన సహదేవుడు, సభలోనిలచి, "సాక్షాత్తు భగవంతుడైన శ్రీకృష్ణుడే ప్రథమపూజార్హుడని సూచించెను. వయసున చిన్నవాడైనను, సహదేవుని యోచనము, సూచన శ్రేష్ఠమైనదని ముక్తకంఠమున సభ్యులామోదించిరి. అంత ధర్మరాజు ద్రౌపదీసహితుడై, తమ్ములు నలువురు తోడు నడువ, బంధుమిత్రాదులతో విచ్చేసి శ్రీకృష్ణుని సన్నిధినిలచెను. అత్యంత గౌరవము, భక్తిశ్రద్ధలు ప్రకటించుచు, ఉన్నతాసనమున అచ్యుతుని ఆశీనునిగావించెను. బంగారు పళ్లెరములో భువన భాండములను పావనముచేయు భగవానుని పాదములుంచి, పవిత్రనదీ జలములతో పాదప్రక్షాళనముగావించి, పాదోదకమును తనశిరస్సుపైనను, తనవారి శిరస్సుల పైనను చల్లెను. అమూల్యాభరణములు, ఉత్తమ పట్టు వస్త్రములను దేవదేవునకు సమర్పించెను. దేవాదిదేవుడు చిరునగవులు చిందించుచుండగ, ధర్మజుని వదనము ఆనందమున వికసిత పద్మమయ్యెను.

సభలో చేదిదేశాధీశుడైన శిశుపాలుడుండెను. అదంతయుచూచి సహించ లేకుండెను. వెంటనే ఆసనమునుండి చివాలునలేచి, బిగ్గరగా అందరు వినునట్లు పరుషముగ మాటలాడసాగెను. "ఆర్యులారా ! ఈ సభలో ఎందరో మహాసీయులు, తపోధనులు, పూజ్యులనేకులుండగ, వారినికాదని, ఒక గొల్లవానికి, అల్పునకు, చోరునకు, శౌర్యహీనునకు, వూరుపేరు లేనివానికి అగ్రతాంబూలమిచ్చి గౌరవించడం, ముందుగ పూజించడం చాలా అనుచితకార్యం. ఎంతో హేయము, నీచము అయినది. వివేకులైనవారు దీనినెవ్వరు సహించరు. ఇట్టి గుణహీనుని పూజించి పెద్దలందరినీ అవమాన పరచినాడు ధర్మజుడు." అని శిశుపాలుడు ధర్మజుని నోటికి వచ్చినట్లు దురుక్తులాడెను.

భగవంతుని నిందించినవాడు గొప్పదోషి పాపాత్ముడు. భగవన్నింద చెవులార వినియు, నివారించకయు సహించినవారును దోషులే యగుదురు. "హరిహరీ" అనుచు కొందురు చెవులు మూసికొనిరి. కొందరు సభనుండి నిష్క్రమించిరి. అటుల శిశుపాలుని నిందాలాపములు సహింపజాలక సభ్యులు పలువురు తమ నిరసన ప్రదర్శించిరి.

# 108. శిశుపాలవధ

జయవిజయులు వైకుంఠమున విష్ణుమూర్తి ద్వారపాలకులు, మహర్షుల శాపకారణంగా మొదటి జన్మలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగను, రెండవ జన్మలో రావణ కుంభకర్ణులుగను, మూడవ జన్మలో శిశుపాల దంతవక్త్రులుగను భువి నవతరించి, విష్ణుద్వేషులై ప్రవర్తించి, తుదకు శ్రీహరిచేత సంహరింపబడి శాపవిముక్తులగుదురు.

శిశుపాల దంతవక్త్రులు అన్నదమ్ములు. శిశుపాలునితల్లి సాత్వతి, తండ్రి దమఘోషుడు. సాత్వతి కృష్ణుని మేనత్త. శిశుపాలుని జన్మము కడువిచిత్రమైనది. పుట్టుకతో నాలుగుచేతులు, నొసట మూడవకన్ను గలిగియుండెను. అతని వికృత రూపము జూచి తల్లిదండ్రులు భయమందిరి. అతని బంధువులుగూడ ఆశ్చర్య మందిరి. ఆకాశవాణి యిట్లుపలికెను.

"బాలుని ఎవరు ఎత్తుకొనినపుడు, వానికి అదనముగా ఏర్పడియున్న అవయవములు అదృశ్యమగునో వాని వలననే మరణముగూడ వుండును."

అందుచేత తల్లిదండ్రులు శిశుపాలుని తనయింటికి వచ్చిన ప్రతివారికి ఎత్తుకొనుటకు యిచ్చెడివారు. కాని చాల మంది ఎత్తుకున్నను బాలునిలో మార్పు లేదు. ఒక దినమున రామకృష్ణులు మేనత్తను చూచుటకు వచ్చిరి. అంతట సాత్వతి బాలుని కృష్ణునిచేతికి యిచ్చెను. బాలుని కృష్ణుడు స్పృశించగనే రెండు చేతులు, కన్నుమాయమయ్యెను. దానితో తనకుమారుని మరణము కృష్ణునిచేతిలో వున్నదని సాత్వతి గ్రహించెను. అంతట సాత్వతి," కృష్ణా ! నాపుత్రుడు మూఢుడై, దుష్టుడై నీయెడ అనుచితముగా ప్రవర్తించి అపరాధములు చేయును. అయినను నీకు బావమరది కనుక నూరుతప్పుల వరకు మన్నించి రక్షించుము. అటులని మాట యిమ్ము," అని కోరెను. అందులకు కృష్ణుడు అంగీకరించి మాటయిచ్చెను.

శిశుపాలుడు పెరిగి పెద్దవాడయ్యెను. దుష్టుల సాంగత్యముతో దుష్కార్యము లెన్నింటినో యొనర్చెను. రుక్మిణీ కల్యాణ మాదిగ కృష్ణునితో వైరము పెంచుకొన సాగెను. అపచారములెన్నో చేసెను. భోజరాజును అన్యాయముగా, నిష్కారణముగ వధించెను. వసుదేవుడు యాగము చేయుచుండగా, యాగాశ్వమును అపహరించి, యజ్ఞమునకు విఘాతము కలిగించెను. కృష్ణుడు లేని సమయము చూచి ద్వారకపై దాడిచేసి దహించివచ్చెను. బభ్రు అనువాని భార్యను తనభార్యగ చేసికొనెను.

శిశుపాలుడట్లు దురాగతములు క్రూరకార్యముల నెన్నింటినో చేసెను. కృష్ణుడు వానినన్నింటిని లెక్కిడుచునే యుండెను.

చివరకు ధర్మజుని రాజసూయ యాగములో శిశుపాలుని దురాగతములు అధికమై లెక్కకుమించి పోయెను. నిండుసభలో శిశుపాలుడు నోటికి వచ్చినట్లు వదరుచు, కృష్ణుని నిందించసాగెను. అది గాంచిన పాండుపుత్రులు, ఇతర రాజన్యులు శిశుపాలునిపై కత్తులుదూసి పోరుకు సిద్ధమైరి. కృష్ణుడు వారినివారించి, తన చక్రాయుధమును ప్రయోగించెను. అదిదివ్యప్రభలతో వెలుగొందుచు తృటికాలములో శిశుపాలుని శిరస్సును ఖండించెను. అతనికి బాసటగ వచ్చిన రాజులందరు భయభ్రాంతులై పరుగులు తీసిరి.

అనంతరము ధర్మజుని రాజసూయయాగము జయప్రదముగ ముగిసెను. పాండవుల కోరికమేరకు కృష్ణుడు ఇంద్రప్రస్థమున కొంతకాలము సంతసమున నుండెను.

రాజసూయ యాగమునుండి దుర్యోధనాదులు తిరిగి వెళ్ళిరి. ధర్మరాజు సంపదలు, సమృద్ధిచూచి దుర్యోధనుడు అసూయ చెందెను. అసూయ ద్వేషముగా బలపడి నందున, అతనిమనస్సు తుకతుక ఉడికిపోసాగెను. ఆరాటము అధికమై దాయాదిద్వేషము బలపడెను.

అదటులుండ, మయుడు పాండవులకు ఒక సభాభవనమును నిర్మించి యిచ్చెను. దానిని చూడవలెనని దుర్యోధనునకు కోరిక గలిగెను. వెంటనే బయలుదేరి మయసభాభవనమును సందర్శించుటకరుదెంచెను.

అపుడు ధర్మరాజు ఉన్నత సింహాసనమునధిష్టించి, సకలవిధ రాజ లాంఛనములతో కొలువుదీరియుండెను. అపుడాసభ దేవేంద్ర సభను ధిక్కరించు నట్లుండెను. ఆసమయమున దుర్యోధనుడు సర్వాలంకారభూషితుడై తనవారితో సభలో ప్రవేశించెను. అందలి చిత్రవిచిత్రములు, పరమాద్భుత దృశ్యములు సుయోధనుడు ఆశ్చర్యముతో గాంచసాగెను. మయసభలో దుర్యోధనుడు ఒకచోట అవమానింపబడెను. దానికితోడుగ పాంచాలి, దాసీజనము అతనిని చూచినవ్వుటయు జరిగెను. అది దుర్యోధనునకు తీరని పరాభవమయ్యెను. ద్రౌపది అవిధముగా పరిహసించడం, మానధనుడైన దుర్యోధనునకు తలకొట్టేసినట్లాయెను. అవమాన జ్వాలలు అతనిని నిలువున దహించి వేయుచుండెను. అటుల దుర్యోధనుడు హస్తినకు

చేరెను. పాండవుల యున్నతి సహించలేక ఉడికి పోవుచుండగా, సభలో పాంచాలి తననుచూచి ఫక్కుననవ్వడం, సుయోధనునిస్థితి అగ్నికి ఆజ్యంపోసినట్లయ్యెను. అదే పాండవుల యెడ పైరమునకు నాంది అయెను. భారత కురుక్షేత్ర సంగ్రామానికి ప్రధానకారణమాయెను.

## 109. సాల్వ - దంతవక్త్రుల వధ

సాల్వుడు సాల్వదేశానికి రాజు. శిశుపాలునకు సాల్వుడు ప్రాణమిత్రుడు. కాశీరాజు కుమార్తెయగు అంబను సాల్వుడు ప్రేమించెను. అంబకూడ సాల్వుని ప్రేమించెను. అంబకు స్వయంవరం ప్రకటించెను కాశీరాజు. ఆ స్వయంవరమునకు భీష్ముడు కూడ వచ్చెను. అంబను వివాహము చేసికొనవలెనను తలంపుతో భీష్ముడు అంబను బలవంతముగ తీసికొని పోయెను. సాల్వుడు భీష్మునెగిరించగ యిరువురకు భయంకర యుద్ధము జరిగెను. యుద్ధమున సాల్వుడు ఓడిపోయి వెనుదిరిగిపోయెను. కాని అంబ తాను సాల్వుని ప్రేమించితిననియు, ఆతనిని తప్ప అన్యుని పెండ్లాడనని భీష్మునకు తన నిశ్చయమును తెలిపెను. భీష్ముడంత అంబను సాల్వునకు అప్పగించెను. కాని సాల్వుడు అంబను గ్రహించక, ఆమె ప్రేమను నిరాకరించెను. ఒకరు బలాత్కరించి గొంపోయి చేపట్టిన స్త్రీని పెండ్లాడనని ఖచ్చితముగ తెలిపెను. అంత చేయునదిలేక అంబ అవమానముతో క్రుంగిపోయెను. తన ప్రేమ భగ్నమగుటకు భీష్ముడే ముఖ్యకారణమని తలచి, అతనిపై పగబూనెను. భీష్మునిపై పగ తీర్చుకొనుటకు శివుని గూర్చి గొప్ప తపస్సు చేసెను. శివుడు ప్రత్యక్షమై, తన కోరిక మరుజన్మలో సిద్ధించగలదని వరమిచ్చెను.

మరుజన్మలో అంబ ద్రుపదరాజుకు శిఖండిగా జనించెను. కురుపాండవ యుద్ధములో శిఖండి భీష్మపితామహుని మరణమునకు కారణమయ్యెను.

రుక్మిణీస్వయంవర సమయమున సాల్వుడు కృష్ణునిచే ఓడింపబడెను. ఆపగ తీర్చుకొనుటకు శివునిగూర్చి ఘోర తపముచేసెను. ప్రతినిత్యము గుప్పెడుదుమ్ము భుజించుచు కఠోరదీక్షతో తపస్సుచేసి శివుని మెప్పించెను. అంతశివుడు ప్రత్యక్షమై సాల్వుని వరముకోరుమనెను. తనకొక దివ్యవిమానమును అనుగ్రహించుమని శివుని కోరెను. శివుడు "సౌభం" అను పేరుగల విమానము నొసగెను. ఆ విమానము ఏ లోకమునందైనను నిరాటంకముగ పయనించగలదు. కృష్ణుని సంహరించవలెనను తలంపుతో సాల్వుడు విమానమునెక్కి గొప్పసైన్యముతో ద్వారకను ముట్టడించెను.

శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నునకు సాల్వునకు భయంకరసంగ్రామము జరిగెను. సాత్యకి, యాదవసేనలుకలసి సాల్వునిసేనలను చీకాకుపరచిరి. కాని సాల్వుడు సౌభవిమానమున నిలచి, మాయలు పన్నుచు, అదృశ్యరూపమున యుద్ధముచేయుచు యాదవవీరులను, ప్రద్యుమ్న సాత్యకులను చిందరవందర చేసి చీకాకుపరచెను.

ఆ సమయమున కృష్ణుడు ఇంద్రప్రస్థపురమున యుండెను. సాల్వుడు ద్వారకను ముట్టడించిన విషయము కృష్ణునకు తెలిసెను. వెంటనే కృష్ణుడు ద్వారక చేరుకొనగా, సాల్వకృష్ణులకు భయంకర రణము జరిగెను. సాల్వుడు మాయోపాయముల నెన్నింటినో పన్నెను. ఒక దశలో వసుదేవుడు మరణించినట్లు అసత్యపు ప్రచారము సాగించెను. సర్వవ్యాపియైన శ్రీకృష్ణుడు వానిని నమ్మలేదు. తన గదాదండమును ప్రయోగించి సాల్వుని దివ్యవిమానమును సముద్రగర్భములో కూలగొట్టెను. చక్రాయుధమును ప్రయోగించి సాల్వుని శిరస్సును ఖండించెను. అంత దేవతలు దివినుండి విరిజల్లులను దండిగ కురిపించిరి.

అంతట శిశుపాలుని తమ్ముడైన దంతవక్త్రుడు పౌరుషమున కృష్ణునిపై యుద్ధమున కురికెను. అతడు జయవిజయులలో ఒకడు. అది అతనికి మూడవజన్మ. కృష్ణునకు దంతవక్త్రునకు గొప్ప యుద్ధము జరిగెను. కృష్ణుడు తన కౌమోదకియను గదాఘాతముతో దంతవక్త్రునిరొమ్ము బ్రద్దలుగొట్టెను. అపుడావీరుడు నెత్తురుగ్రక్కుచు నేలగూలి ప్రాణములు వదిలెను. అట్లు వాసుదేవుడు తనభక్తుని తనలో ఐక్య మొనర్చుకొనెను.

ఆ విధముగా జయవిజయులు మూడుజన్మలలో శాపవిముక్తులై ధన్యులై తమ తమ దివ్యరూపములను పొంది వైకుంఠేశుని కీర్తించుచు దివ్యధామము చేరుకొనిరి.

## 110. కుచేలోపాఖ్యానము

కృష్ణ – కుచేలుర స్నేహబంధం లోకానికి ఆదర్శప్రాయం. అందలి నీతి సర్వ కాలములకు, సమస్త మానవాళికి ఆణిముత్యము వంటిది. ఈ కథ ముఖ్యముగా బాలబాలికలకు పఠనావశ్యకత కలిగియున్నదనుటలో సందేహములేదు.

కుచేలుని అసలుపేరు సుదాముడు. కృష్ణునకు బాల్యమిత్రుడు. సాందీపునివద్ద కృష్ణునితో కలిసి విద్యనభ్యసించెను. అందుచే కృష్ణకుచేలురు ప్రాణమిత్రులు. సుదాముడు వేదవేదాంగములు, అనేక శాస్త్రములు చక్కగా అభ్యసించి గొప్ప

పండితుడాయెను. కాని బహుళసంతానం, ఆర్థికదుస్థితి పట్టిపీడించగా దారిద్ర్యబాధ నాతనిని వేధించసాగెను. కన్నబిడ్డలకు కడుపునిండా పట్టెడన్నము, కనీసం గంజినీళ్లయినా నీయలేని హృదయవిదారకదుస్థితి ఆపేదకుటుంబమునకు దాపురించెను. అష్టకష్టములన్నియు ఒక్కచోకూడి చేరియుండగా దారిద్ర్యదేవత అతని నట్టింట ఎల్లవేళల నృత్యమాడి వినోదించుచుండెను. ఆ బ్రాహ్మణునకు కట్టబట్టలు కూడా కరవయ్యేను. మాసిన మురికివస్త్రములు, అవియు చినిగిపోయి పీలికలుగ వ్రేలాడుచుండును. ఇంక అతని భార్య కల్యాణి దొడ్డయిల్లాలు. ఓర్పుకు, సహనమునకు ఆమెకు ఆమెయెసాటి. అష్టకష్టములెన్నివచ్చినను హృదయమున దాచుకొనెడి సహనశీలి. అన్నికష్టములనుభవించుచున్నను, మారుమాట్లాడదు. భర్తను రవ్వంతైనను తూలిమాట్లాడదు. విసుగుదల చీకాకు ప్రదర్శించదు. అన్నియు పురాకృత కర్మ ఫలమని సరిపెట్టుకొనును. ఓరిమికి భూదేవికి సరియగునది. కర్మ, భగవానుని అనుజ్ఞ ఎటులున్న అటుల జరుగుననిదలచి భర్తనుసేవించుచుండును. కాని దారిద్ర్య బాధ భరించడం బహుకష్టముగానుండెను. ఆ బాధ అనుభవించుటకన్న, మరణం మేలని లోలోనచింతించెడిది.

ఒకనాడు కుచేలునిభార్య కల్యాణి భర్తచెంతకువచ్చి కన్నీరుగార్చుచు అతిదీనాతిదీనంగా, "నాథా ! మన దారిద్ర్యబాధ అతిదారుణముగా నున్నది. వానిని పిల్లల దీనావస్థ వచియింపనలవికాకున్నది. ఎన్నినాళ్లీకష్టములు? అవి తొలగు ఉపాయము లేదా ? కొంచమాలోచింపుడు. మీ చిన్ననాటిమిత్రుడు కృష్ణుడు వున్నాడు గదా ! ఆ లక్ష్మీవల్లభుడు సర్వవిధ సంపదలతో తులతూగుచున్నాడు గదా ! ఆపద్బాంధవుడు తప్పక కరుణించునని నాకు గట్టి నమ్మకమున్నది. మనకేదో సహాయమొనర్చి దారిచూపగలడు. ఒకపరి మీరు ఆమహనీయుని దర్శించి మన క్లేశములు విన్నవించుడు. తప్పక కరుణించి రక్షించగలడు." అని పరిపరివిధముల భర్తను ప్రార్థించెను. కుచేలుడు భార్యచెప్పిన మాటలు శ్రద్ధగ వినినాడు. ఆలోచన బాగున్నదని భావించినాడు. బాల్యమిత్రుని సందర్శించవలెనను తలంపుగూడ కుచేలునకు బలీయముగ నుండెను. దానికితోడు భార్యచెప్పిన కార్యముగూడ కలసి వచ్చెను. ఎటులైనను ద్వారకకుపోయి కృష్ణుని చూచివచ్చుటకు కుచేలుడు నిర్ణయించుకొనెను.

బాల్యమిత్రునిచెంతకు పోవునపుడు ఏదేనికానుక గొనిపోవలెగదా! తానేమి తీసికొని పోగలడు? తనచెంత ఏమున్నది? ఏమియు తోచలేదు. కృష్ణునకు కానుకగ

నిచ్చుటకు ఏమైన సమకూర్చుమని భార్యతోననెను. ఆమెయు ఏమియు బదులు పలుకక మిన్నకుండెను. తనగృహములో తనకేమియు లభించలేదు. అంత ఇరుగుపొరుగు గృహములకేగి అర్థించెను. ఎటులో శ్రమించి అటుకులుకొన్ని సమకూర్చుకొనెను. వానినితెచ్చి భర్తఉత్తరీయమునందు భద్రముగ మూటగట్ట చూచెను. ఉత్తరీయమంతయు చినుగులు, పీలికలు. తుదకెటులో శ్రమించి అటుకులను మూటగట్టి భర్తకు అందించి, ప్రయాణమునకు సిద్ధపరచెను. కుచేలుడు అటుకులమూటను తీసికొని ద్వారకకు బయలుదేరెను. ఆసాధ్వి గంపెడాశతో భర్తను సజలనయనయై సాగనంపెను.

కుచేలుడు ద్వారకచేరుకొనెను. అతనికి అనుమానములు, సందేహములు కోకొల్లలుగా రాసాగెను. "కృష్ణుడు నన్ను గుర్తించునో లేదో? ద్వారకాధీశుడైన కృష్ణుడు గొప్ప సిరిసంపదలతో ఐశ్వర్యములతో తులతూగుచుండును. అట్టి ఆ జగన్నాథుని మందిరమును ప్రవేశించుటెట్లు? కటిక దరిద్రుడనగు తనను ఆదరిదాపులకు రానిత్తురా ? చింపిగుడ్డలు, మాసినదేహం, నా కాంతిహీనమైన ఆకారముగాంచి ద్వారపాలకులు అవలకు గెంటివేయకుందురా? పేదబ్రాహ్మణుడనైన తనను కంటితో చూడనైన చూచునా? అయ్యో! తెలివిమాలి ఎంతటి అవివేక కృత్యమొనర్చుచుంటిని?" అని వివిధరీతుల తలపోయుచు కృష్ణుని మందిర ద్వారములను దాటుచు లోనికేగెను. కృష్ణుని పదహారువేల మంది భార్యల మందిరములు కన్నుల పండువుగ గాంచెను. సాక్షాత్తు లక్ష్మీదేవియైన రుక్మిణీ మందిరమును తనివితీర గాంచెను. వాసుదేవుడు ఆసమయమున రుక్మిణీ మందిరమున యుండెను. శ్రీకృష్ణుడు బాల్యమిత్రుడగు కుచేలుని అల్లంత దూరముననే చూచెను. వెంటనే కుచేలున కెదురేగి ప్రియమార కౌగిలించుకొనెను. ఆదరమున బాల్యమిత్రుని తనమందిరమునకు గొనిపోయి, తనశయ్యపై ఆశీనునిగావించెను. బంగరుపళ్లెరమున మిత్రుని పాదములుకడిగి ఆజలమును తన శిరస్సున చల్లుకొనెను. షోడశోపచార విధానమున పూజించి గౌరవించెను. స్వాగతముపలికి కుశలప్రశ్నలతో ముంచెత్తెను. రుక్మిణీదేవి స్వయముగా వింజామర వీయుచుండెను. ఆసమయమున కుచేలుని ఆనందమునకు అంతు లేకుండెను. దేవదేవుడంతటివాడు నిరుపేదబ్రాహ్మణుని పూజించడం అందరిని ఆశ్చర్యంలో ముంచి వేసెను.

సుదామా ! మనమొకదినమున గురుపత్ని పనుపున సమిధలు మున్నగు పూజా ద్రవ్యములు గొనివచ్చుటకు అడవికి పోతిమి. తిరిగి వచ్చు సమయమునకు

కారుమబ్బులావరింప ఆ ప్రదేశమంతయు అంధకారమయ్యెను. దానికి తోడు కుండపోతగ జడివాన కురిసెను. వర్షములో తడిసితిమి. గాఢాంధకార కారణమున ఇల్లు చేరుటకు బాగుగ నాలస్యమయ్యెను. మనమిరువురము ఒకరిచేతు లొకరము పట్టుకొని నడచుచుండగ, అంతలో చంద్రుడుదయించెను. వెన్నెల వచ్చెను. అటులెట్లో తెల్లవారు వేళకు ఆశ్రమము చేరితిమి. మనరాకవలన సాందీపముని సంతసించి, మనలను దీవించినాడు. మిత్రమా ! నాటి సన్నివేశము మరువలేదు గదా !

అట్లు మిత్రులిర్వురు గురుకులంలో జరిగిన బాల్యసంఘటనలను ముచ్చటించుకొని సంబరపడిరి. అనేక విషయములను చెప్పుకొని ఆనందించిరి. అటుల సంభాషణలు సాగినవి. అనంతరము కృష్ణుడు, " మిత్రమా ! సుదామా ! రాకరాక చాలకాలమునకు నన్ను చూడవచ్చితివి. సంతోషముగా మనము కలసికొంటిమి. మరి నాకొరకు ఏమి తెచ్చితివి? " అని మిత్రుని ప్రశ్నించెను.

ఆ మాటలకు కుచేలుని మనస్సు ఒక్కసారి చివుక్కుమనెను. పరంధామునకు గుప్పెడు అటుకులు ఏమని పెట్టుదును.? అని సిగ్గుతో సంకోచించుచుండెను. కృష్ణుడంత, "మిత్రమా ! భక్తితో సమర్పించిన ఫలం, పత్రం, పుష్పం,తోయం, ఏదైనను పరమానందమున స్వీకరించెదను. సందేహించకుము." అని చిరునగవులు చిందించెను. వాసుదేవుడు సర్వాంతర్యామి. కుచేలుని ఉదంతమంతయు సర్వము తెలియును. మిత్రునకు సర్వసంపదలు అనుగ్రహించి ఆదరించు తలంపుతోనుండెను.

కుచేలుడు మారుమాటాడక విచారవదనుడై మిన్నకుండెను. కృష్ణుడంత చినుగుల బట్టలో మూటకట్టియున్న అటుకుల మూటనుతానేగ్రహించి విప్పిచూచెను. "ఆహా! అటుకులా? ఎంత అదృష్టము! అటుకులన్న నాకు మిక్కిలియిష్టము." అనుచు అచ్యుతుడు గుప్పెడు అటుకులను నోటిలోపోసుకొని సంతసమున ఆరగించెను. చాలా రుచిగా వున్నవనుచు కృష్ణుడు మరల మరో గుప్పెడు అందుకుని నోటిలో పోసికొనబోయెను.

"కృష్ణా ! ద్వారకావాసా ! లోకరక్షకా ! చాలు చాలు. ఇంక చాలింపుము. ఆపుము. నీ మిత్రుడైన బ్రాహ్మణుని నుండి యీసరికే పిడికెడు అటుకులు తిని, అతనికి అంతులేని సంపదలు అనుగ్రహించి యున్నావు. ఇంకను భక్షించినచో నీఅనుగ్రహము లోకములు భరింపజాలవు" అని రుక్మిణీదేవి కృష్ణుని అటుకులు భక్షించకుండగ నివారించెను.

అనంతరము శ్రీకృష్ణుడు అప్పుడైన కుచేలుని అనేకరీతుల నన్మానించి సాగనంపెను. "నా జన్మసార్థకమైనది. నేనెంతో ధన్యుడను. నిర్భాగ్యుడను. జగన్నాథుని కాలిగోటికి కూడా అర్హతలేని. నన్ను నెత్తినపెట్టుకొని పూజించి గౌరవమర్యాదలు చేసినాడు. ఇంతకుమించి నాకేమికావలె?" అనుచూ కుచేలుడు మనమున తలబోయుచు తిరిగి ప్రయాణమయ్యెను. వాసుదేవుడు, యితర ప్రముఖులు కుచేలుని కొంతమేరకు సాదరమున, ప్రియవచనములతో సాగనంపిరి.

కుచేలుడు బాల్యమిత్రుడైన కృష్ణుని ఎట్టి సంపదలను, భోగభాగ్యములను కోరలేదు. గమనించవలసిన ముఖ్యాంశమది.

కుచేలుడచటి సంగతులు తలబోయుచు ఇల్లుచేరెను. అంతట పరమాద్భుత మాతనికి గోచరమయ్యెను. అక్కడ తనపర్ణశాల లేదు. అచ్చోట దివ్యమగుభవన ముండెను. ఆభవనము కోటిసూర్యప్రభలతో వెలిగి పోవుచుండెను. ద్వారపాలకులు, పరిచారకులు, దాసదాసీజనములుండిరి. మృదుమధురమగు వీణానాదములు, మధుర గీతాలాపములు, మృదంగధ్వనులు, నృత్యగాన విలాసనినదములు, వేదసూక్తములు వినవచ్చు చుండెను.

పరివారజనులు కుచేలుని మందిరములోనికి గొంపోయిరి. అచ్చట తన భార్య కళ్యాణి సర్వాభరణ భూషితయై పట్టుపీతాంబరములు ధరించి భర్తరాకకై అపర ఆదిలక్ష్మివలె ఎదురుచూచుచుండెను. తన బిడ్డలందరు పలువగు వస్త్రములు, దివ్యాభరణములు ధరించి అత్యంత ఉత్సాహమునయుండిరి.

అంతయు గాంచిన కుచేలుడు సంభ్రమాశ్చర్యముల మునుకలేసెను. కొంత తడవునకు తేరుకొని "హేకృష్ణా ! ద్వారాకావాసా ! హే కృపాజలనిధే ! హే సింధు కన్యాపతే ! అంతయు నీలీలావినోదమే. నీ అనుగ్రహమున్నచో, నీ భక్తులకు కొదవేముండును? ఓ ఆర్తజనరక్షా! ఆర్తజనులను ఆదుకొనుటలో నీకు నీవే సాటి. నీ లీలలు కొనియాడ నేనేపాటివాడను?" అని వాసుదేవుని వేనోళ్ళ కీర్తించెను.

పుట్టుదరిద్రుడైన కుచేలుడు, భగవంతునియెడ అనంతమైన సేవాసౌశీల్యాదులు గలిగియున్న కారణముగ, గుప్పెడు అటుకులనొసగి అనంతమైన అష్టైశ్వర్యములను పొందగలిగెను. అటుల కుచేలుడు శ్రీమంతుడయ్యును, గర్వించక, యెప్పటివలె పరమనిష్ఠా గరిష్టుడై నిరంతరము హరిపద సేవాధ్యానతత్పరుడై వైకుంఠుని సేవించుచు తుదకు ముక్తిసామ్రాజ్యమునలంకరించెను. కుచేలుని భార్యయు సంపదలకు గర్వించక భర్తకు అనుకూలవతియై మెలగెను.

## 111. సుభద్రాపరిణయము

సుభద్ర, వసుదేవ-రోహిణుల పుత్రిక. బలరామకృష్ణులకు చెల్లెలు. సుభద్ర పాండవ మధ్యముడైన అర్జునుని రూపురేఖా విలాసములు, శౌర్యపరాక్రమములువిని, ఆవీరుని ప్రేమించెను. ఆ వీరాగ్రేసరునే వివాహమాడదలచెను. రాజ్యభ్రష్టులైన పాండవులతో వియ్యమందడము బలరామునకిష్టములేదు. తనశిష్యుడైన దుర్యోధనున కొసగి పెండ్లిచేయవలెనని అతని నిర్ణయము. కాని సుభద్రను అర్జునునకిచ్చి పెండ్లిచేయడమే సమంజసమని కృష్ణుని అభిప్రాయము. బంధువులుకూడా కృష్ణుని అభిప్రాయమును సమర్థించిరి. అయితే చెల్లెలి వివాహకారణముగా అన్నగారితో విభేదించడము కృష్ణుని అభిమతముగాదు. ఎలానో ఉపాయముగా కార్యము నెరవేర్చాలన్నది వాసుదేవుని అభిప్రాయము.

అప్పటికే పాండవులు ద్రౌపదిని పెండ్లియాడిరి. ఒక్కొక్కరు ఒక్కొక సంవత్సర కాలము ద్రౌపదితో సుఖించవలెననెడి నియమమును నిర్ణయించుకొనిరి. నియమ మతిక్రమించినచో అట్టివాడు ఒకసంవత్సరకాలము తీర్థయాత్రలు చేయవలయును.

ఒక సమయమున అర్జునుడు నియమము తప్పవలసిన గడ్డుపరిస్థితేర్పడెను. నియమనిర్ణయానుసారము అర్జునుడు తీర్థయాత్రలు చేయుచుండెను. అటుల తీర్థయాత్రలుచేయుచు ప్రభాసతీర్థమునకు చేరెను. అంతకు మునుపే అతడు సుభద్రపై మక్కువ గలిగియుండెను. ఆమెనే పెండ్లాడవలెనను నిర్ణయమునకు వచ్చియుండెను. కాని బలరాముడు మాత్రము అందుకు సుముఖుడుగ లేడనియు, సుభద్రను దుర్యోధనునకుకూర్చి వివాహము చేయదలచి యున్నట్లును పార్థుడు వినియుండెను. అంతట అర్జునుడు పరులెవ్వరు తనను గుర్తించ వీలుకాని విధమున యతివేషము ధరించి ద్వారకానగరము ప్రవేశించెను.

బలరామునకు యతులన్నను సన్న్యాసులన్నను పూజ్యభావమెక్కువ. అందువల్ల బలరాముడు అర్జునుని గౌరముగ ఆహ్వానించి సమస్త మర్యాదలను చేసెను. భక్తితో భిక్షనిడి తనమందిరమున కొన్నినాళ్లు యుండుమని కోరెను. యతివేషములోనున్న అర్జునుడు అంగీకరించెను. యతిస్వామికి సేవలొనర్చుటకు తనసోదరి సుభద్రను నియమించెను. సుభద్రయు అందులకంగీకరించి యతిని సేవించుచుండెను.

పార్థుడు సుభద్ర అందచందములు ప్రత్యక్షముగగాంచి ఆమెయందు మిగుల మోహపరవశుడయ్యెను. అర్జునుడే యతి వేషములో నున్నట్లు సుభద్రకు తెలియదు.

కాని ఆమెయును యతి అందచందములు గాంచగ అతనియందు మోహమధిక మయ్యెను. అర్జునుడును తనమనోభీష్టము సుభద్రయెడ వ్యక్తపరచుటకు సమయమునకై వేచియుండెను. లీలావినోదుడగు కృష్ణునకు మాత్రము విషయ మంతయు తెలియును. బలరామునకు మాత్రము తెలియదు. ఒకనాడు అర్జునుడు తన అభిప్రాయమును సుభద్రకు తెలియజేసెను. అర్జునుడే యతివేషములో యున్నట్లు సుభద్ర తెలిసికొని మిగుల సంతసించెను. సిగ్గుతో ముసిముసినవ్వులు చిందిస్తూ తలదించుకొనెను. మౌనం అర్ధంగీకార సూచకముగదా !

ఒకానొక సమయమున కృష్ణుడు దేశయాత్ర నేర్పాటుచేసెను. అందుకు యాదవులంతా యాత్రకు బయలుదేరిరి. సుభద్రకూడా రథమునెక్కి ప్రయాణ మయ్యెను. అంత అర్జునుడు దేవకీవసుదేవుల అనుమతిగైకొని, సుభద్రతోపాటు రథమునెక్కి ఇంద్రప్రస్థపురమునకు పోవప్రయత్నించెను. కాని యాదవులు అర్జునుని ప్రతిఘటించిరి. యాదవులకు అర్జునునకు పోరాటముజరిగెను. అర్జునుడు యాదవవీరులను తరిమికొట్టెను. వాస్తవ విషయము గ్రహించిన బలరాముడు కోపమున మండిపడెను. అర్జును నెదిరించి సుభద్రను తెచ్చుటకు బయలుదేరెను. కాని దేవకీవసుదేవులు, కృష్ణుడు, యాదవ ప్రముఖులు బలరాముని పలురీతుల ప్రార్థించి కోపమును చల్లార్చిరి. వారిమాటలు మన్నించి, సుభద్రార్జునుల వివాహమునకు బలరాముడంగీకరించెను.

అటుమీదట సుభద్రార్జునుల వివాహమహోత్సవము అతివైభవముగ జరిగెను. అపారమైన వస్తుకానుకలు, వాహనములు, ఆభరణములుగూర్చి సుభద్రను అత్తవారింటికి సాగనంపిరి. ఆ విధముగా పాండవులకు యాదవులకు నడుమ సంబంధ బాంధవ్యము లేర్పడెను. సుభద్రార్జునుల నోముల పుణ్యఫలముగ మహావీరుడైన అభిమన్యుడు జన్మించెను. ఆ మహావీరుడు కురుక్షేత్ర సంగ్రామమున అద్వితీయ పరాక్రమము ప్రదర్శించి వీరమరణమునందెను. అభిమన్యునిభార్య ఉత్తర. ఉత్తరాభిమన్యుల పుత్రుడే పరీక్షిన్మహారాజు.

## 112. స్యమంతపంచకము

పూర్వము పరశురాముడు భూమండలమునందలి రాజులందరిని ఇరువదొక్క మార్లు దండెత్తి జయించి, క్షత్రియుల నందరిని సంహరించెను. అపుడు వారిరక్తం యేరులై ప్రవహించి అయిదు మడుగులుగా నేర్పడెను. ఆ రక్తధారలతో భార్గవరాముడు

తన పిత్రుదేవతలకు తర్పణములర్పించి, వారలను తృప్తులను గావించెను. నాటి ఆ నెత్తుటిమడుగులకే స్యమంతపంచకమను పేరు ప్రసిద్ధమయ్యెను. ఈ స్యమంత పంచకము కురుక్షేత్రమున గలవు. కురుపాండవుల మహాసంగ్రామచ్చటనే జరిగెను. మహర్షులందరు ఒకసమయమున ఆ ప్రదేశమున సత్రయాగం చేసినందువల్ల ఆ ప్రదేశం ఒక పుణ్యస్థలంగా వాసిగాంచెను. పూర్వము కురుడనే మహారాజు ఆ ప్రదేశమును యజ్ఞము చేయుటకు నెంచుకొనెను. ఆ కారణముచే అది "కురుక్షేత్రము"గా ఖ్యాతిగాంచెను.

ఒక సంపూర్ణ సూర్యగ్రహణ పుణ్యదినమున బలరామకృష్ణులు, యాదవ ప్రముఖులు బయలుదేరి ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునకు చేరిరి. ఒక్క అనిరుద్ధుడు మాత్రం పురరక్షణార్థం ద్వారకలో ఉండిపోయెను. పరమపావనక్షేత్రంలో పుణ్య స్నానములు పితృతర్పణములాచిరంచిరి. గో, భూ, హిరణ్యదానాదులుభూరిగనిచ్చిరి. అదే సమయమున వ్రేపల్లెనుండి నందాదులుకూడ వచ్చిరి. హస్తినాపురమునుండి ధృతరాష్ట్రుడు, భీష్ముడు, ద్రోణుడు, గాంధారియు, ధర్మరాజాదులు, విరటుడు, ద్రుపదుడు, మరియు వివిధ దేశములనుండి రాజులు సపరివారముగా అచ్చటకు చేరుకొనిరి. అటులందరు ఒక్కచోట కలుసుకొని మిగులానందించిరి. బల రామకృష్ణులను దర్శించడం అందరికి ఆనందము కలిగించెను. అందరు కృష్ణుని పూజించి పలువిధముల నుతించిరి. అదే సమయమున కృష్ణుడు తన్నాశ్రయించిన గోపకాంతలకు ఆత్మజ్ఞానం బోధించెను. దానితో వారి జన్మలు ధన్యమయ్యెను.

భగవత్ స్వరూపులైన బలరామకృష్ణులను దర్శించి తరించవలెనన్న కుతూహలమున, వ్యాసుడు, నారదుడు, విశ్వామిత్రుడు, చ్యవనుడు, శతానందుడు, వసిష్ఠుడు, భరద్వాజుడు, పులస్త్యుడు, అత్రి, మార్కండేయుడు, యాజ్ఞవల్క్యుడు, వామదేవుడు, గౌతముడు, జమదగ్ని, భృగువు, బృహస్పతి, అగస్త్యుడు, అంగిరసుడు మున్నగు మహర్షులు, దేవర్షులు అచ్చటకరుదెంచిరి. వారివెంట వారిశిష్యప్రశిష్యులు గూడ నేగుదెంచిరి. అందరు బలరామకృష్ణులను దర్శించి, భక్తి ప్రపత్తులతో నర్చించి పూజించిరి. వేదసూక్తములతో పలురీతుల కీర్తించిరి.

వసుదేవుడు మునులాదేశానుసారము కురుక్షేత్రంలో యాగములెన్నో యొనర్చి, దేవతలను సంప్రీతులగావించెను. మహర్షులు వసుదేవునకు జ్ఞానబోధచేసిరి. వాసుదేవుడుగూడ తండ్రికి ఆత్మజ్ఞాన ముపదేశించెను. అటుల ధర్మక్షేత్రమైన కురుక్షేత్ర

మందు అందరు పుణ్యకార్యములను ముగించుకొని వారివారి నివాసములకు తిరిగి చేరుకొనిరి.

## 113. శ్రీకృష్ణుని అద్భుతలీలలు

బలరామకృష్ణులు ద్వారకలో ఉండగా పరమాద్భుతమైన కృత్యములనెన్నింటినో చేసిరి. వానిలోకొన్ని చాలా ప్రాచుర్యాన్ని సంతరించుకొన్నవి. దేవకీదేవి తాను పోగొట్టు కొనిన పురిటికసికందులను గొనివచ్చి శ్రీకృష్ణుడు తల్లిపుత్రశోకమును పోగొట్టినాడు. పుత్రశోకార్తయైన దేవకీదేవి ఒకనాడు కృష్ణుని దరిచేరి, "తండ్రీ కృష్ణా! నాకు పుట్టిన అరుగురు బిడ్డలను మరువలేక యున్నాను. లోకములో తల్లులు పుత్ర శోక మెన్నటికిని మరువలేరు. అందుకే చనిపోయిన బిడ్డలు అప్పుడపుడు గుర్తుకు వచ్చుచుందురు. అపుడు దుఃఖమును ఆపుకొనలేకున్నాను. కనుక నాబిడ్డలను ఒక్క మారు తెచ్చి నాకు చూపుము. అటులొనర్చి నాదుఃఖమును ఉపశమింపచేయుము." అని వేడుకొనెను. ఆ సమయమున బలరాముడందేయుండెను.

దేవకీదేవి అటులడుగుటకు ముఖ్యకారణమున్నది. పూర్వమెపుడో మరణించిన గురుపుత్రుని గొనితెచ్చి తనగురువగు సాందీపునకు సమర్పించి గురుభక్తిని చాటినాడు. అంతేగాక తమపుత్రులిర్వురు గొప్ప మహిమకలవారని దేవకికి తెలియును. అందులకే అసాధ్యమైన కోరికను బిడ్డలను దేవకికోరెను.

వెంటనే బలరామకృష్ణులు తమ మహిమచే పాతాళలోకము ప్రవేశించిరి. పాతాళమందున్న బలిచక్రవర్తి బలరామకృష్ణులను పూజించి గౌరవించెను. వారు వచ్చిన కార్యమును తెలిసికొనెను. తక్షణమె బలిచక్రవర్తి మరణించిన బిడ్డలారుగురను రామకృష్ణులకు సమర్పించెను. రామకృష్ణులు వారినితెచ్చి తల్లికి సమర్పించిరి. అపుదామాతృమూర్తి అనుభవించిన ఆనందం వర్ణనాతీతం. వారలను తన హృదయమునకు హత్తుకొనెను. పాలిండ్ల స్తన్యముతోనుప్పొంగ పాపలకు పాలిచ్చి పరవశించెను. శ్రీహరి కరస్పర్శవల్ల పిల్లల భవబంధములు తొలగిపోవ దివ్యరూపములు ధరించి పుణ్యలోకములుచేరిరి.

## 114. బ్రాహ్మణ పుత్రులను బ్రతికించుట

కృష్ణార్జునులు ద్వారకలో నుండిరి. అపుడొక బ్రాహ్మణుడు చనిపోయిన తన కుమారుని తెచ్చి రాజద్వారము చెంతచేర్చి గోడుగోడున రోదించసాగెను. రాజ్యము

నేలురాజు అధర్మప్రవర్తన వలననే తనకిట్టి దురవస్థ ప్రాప్తించినదని వాపోయెను. తన ఎనమండుగురు పుత్రులు అకాలమరణము పొందుటకు రాజుయొక్క అధర్మ పరిపాలనమే మూలకారణమని రాజును దూషించసాగెను. విప్రుని దీనాలాపములు అర్జునుడువినెను. అతని మనసు జాలితో నిండెను. "బ్రాహ్మణోత్తమా ! చనిపోయిన నీ పుత్రులనందరిని తెచ్చి నీకు సమర్పింతు"నని అర్జునుడు విప్రునకు వాగ్దానము చేసెను.

కృష్ణుడు అర్జునుని మాటలువిని చిరునవ్వులు చిందించి మిన్నకుండెను. అతనిచే అకార్యము నెరవేరదని కృష్ణునకు తెలియును. గొప్పవీరుడనని విర్రవీగుచున్న పార్థునకు గర్వభంగమొనర్ప దలచి కృష్ణుడు మనమున భావించెను.

బ్రాహ్మణుని భార్యమరల గర్భవతియై ప్రసవించుటకు సిద్ధముగ నుండెను. అంత విప్రుడు భయకంపితుడై పరుగున అర్జునుని దరిచేరి విషయము విన్నవించు కొనెను. అర్జునుడంత గాండీవధారియై దివ్యాస్త్రములను, పంజరమువలె పురిటి గృహము చుట్టు నిర్మించి రక్షణకవచము నేర్పాటుగావించెను. తాను గాండీవము ధరించి రక్షణము చేయుచుండెను.

విప్రునిభార్య ప్రసవించెను. కాని పుట్టినబిడ్డ మరుక్షణముననే మాయమయ్యెను. ఇంతచేసియు బిడ్డను రక్షించలేక పోతినని అర్జునుడు బాధపడెను. మాట నెరవేర్చ జాలనైతినని విచారించెను. అంతట విజయుడు బ్రాహ్మణునోదార్చి, మాయమైన బిడ్డను గొనిదెత్తునని బయలుదేరెను. ముందుగ యమపురికిజనెను. అచ్చట బ్రాహ్మణ పుత్రుడు లేడు. అంతట ఇంద్ర, వరుణలోకములు వెదకెను. కాని శ్రమఫలించలేదు. దిక్పాలుర నగరములు శోధించెను. కాని ఫలితము దక్కలేదు. నిరాశ, నిస్పృహ మిగిలెను. విప్రునకిచ్చినమాట నెరవేర్చనందులను మిగుల చింతించి, గాండీవముతో అగ్నిపడి మరణించుటకు సిద్ధమాయెను.

కృష్ణుడంత మందహాసముచేసి అర్జునుని ఆత్మహత్యాయత్నమును ఆపుచేసెను. విప్రబాలుని తాను తెత్తునని అర్జునునితో రథమునెక్కి బయలు దేరెను. సప్తద్వీపములు, సప్తసాగరములు, సప్తకులపర్వతములు దాటి, లోకాలోకములతిక్రమించి కృష్ణుని రథము సాగుచుండెను. కొంత దూరముపోగా, అచ్చట అంతయు అంధకారము. దివ్యరథమాగెను. అపుడు శ్రీహరి తన చక్రాయుధమును ప్రయోగించెను. అది దివ్యప్రభలు విరజిమ్మగ, ఆ దివ్యతేజమును అర్జునుడు గాంచలేక కన్నులు

మూసుకొనెను. ఆప్రదేశమంతయు వెలుగుతో నిండెను. అందొక ప్రదేశమున నారాయణుడు అపూర్వప్రభలతో ప్రకాశించుచుండెను. కృష్ణార్జునులు నాతనికి భక్తితో నమస్కరించిరి. "ఓకృష్ణార్జునులారా ! మీరిరువురును నాఅంశమున జన్మించిన దివ్య రూపులు. మిమ్ములను ఒకపరి చూడదలచి, నేనీ పన్నుగడపన్ని, బ్రాహ్మణ పుత్రులను తెచ్చి భద్రపరిచియుంటిని. వీరిని గైకొనుడు. విప్రునకొసంగి అతని కుటుంబమును సంతసపరచుడు" అని నారాయణుడు తొమ్మండుగురు బ్రాహ్మణ పుత్రులను కృష్ణార్జునులకు సమర్పించెను. కృష్ణార్జునులు అదినారాయణునకు నమస్కరించి, బిడ్డలతో విప్రగృహము చేరిరి. బిడ్డలను బ్రాహ్మణునకొసగ ఆదంపతులు అపరిమితానంద పరవశులైరి. శ్రీకృష్ణుని మహిమను వేనోళ్ళకీర్తించి ధన్యులైరి. అర్జునుడు శ్రీకృష్ణుని పరమాత్మతత్త్వమును గ్రహించి తన అజ్ఞానమునకు విచారించెను. కృష్ణుని భక్తితో చేతులుమోడ్చి నుతించెను.

## 115. వృకాసురుడు

బ్రహ్మ మహేశ్వరులిర్వురు తమభక్తులకు దుర్లభములైన, అసాధ్యములైన వరము లిచ్చుచుందురు. అందువల్ల అనేక సమస్యలు ఉత్పన్నమయ్యే ప్రమాదమున్నది. శ్రీమహావిష్ణువు అట్లుగాక భక్తులను పరిపరి విధముల పరీక్షించి వరము లిచ్చును. శివభక్తులలో చాలమంది స్వార్థపరులై స్వప్రయోజనమాసించి వరములు కోరుకొందురు. విష్ణుభక్తులట్లుగాక కేవలము మోక్షప్రాప్తినే కోరుకొందరు. అందుకు ఉదాహరణగా వృకాసురునిచరిత్ర చెప్పబడినది.

పూర్వము వృకుడను దానవుడు కలడు. వాడు శకుని అనువాని పుత్రుడు. ఒక దినమున వృకుడు నారదుని దర్శించి, "మహర్షీ! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో నెవరిని సులభముగా వశపరచుకొని వరములు పొందవచ్చును?" అని ప్రశ్నించెను. అంత నారదుడు అందుకు భక్తవశంకరుడగు శంకరుడే తగినవాడని వృకునకు బదులు చెప్పెను. వెంటనే వృకాసురుడు కేదారమునకేగి దీక్షగైకొని ఉగ్రతపము చేయ మొదలిడెను. ప్రతిదినము తన దేహమందలి మాంసఖండములను అగ్నికాహుతొనర్చుచు ఆరుదినములు కఠోరవ్రతమాచరించెను. అయినను శంకరుని అనుగ్రహము కలుగలేదు. అంతట ఏడవదినమున అసురుడు తన శిరస్సును ఖండించి అగ్నిలో దగ్ధమొనర్చుటకు సంసిద్ధుడాయెను. అంతట శివుడు ప్రత్యక్షమై, "భక్తా ! వృకా ! నీ భక్తికి మెచ్చితిని. వరమేదేని కోరుకొను"మనెను.

వృకుడు దురితాత్ముడై, "ఓ శంకరా ! నేను ఎవరి తలపై హస్తముంచిన, వాడు తక్షణమే మరణించవలె. అట్టి వరము నిమ్ము." అని కోరెను. వృకాసురుడు కోరినవరము చాల ప్రమాదకరమైనదని శంకరునకు తెలియును. అయినను ఆడినమాట తప్పుట పాడిగాదుగాన, భోళాశంకరుడు వరమనుగ్రహించెను. వృకుడు సంతసించెను. కాని ఆదుష్టునకు దురాలోచన కలిగెను. శంకరుడిచ్చిన వరమును పరీక్షించ కోరిక గలిగి, శివుని శిరమున హస్తమిడ ప్రయత్నించెను. పామునకు పాలుపోసి పెంచినట్లయినదని శంకరుడు విచారించి భయమున పారిపోవ మొదలిడెను. వృకుడు పరమేశ్వరుని వెంబడించెను. ఏమి చేయటకుతోచక శివుడు వైకుంఠము ప్రవేశించి, శ్రీహరిని దర్శించి, విషయమును వివరించెను. అంత వైకుంఠధాముడు శంకరుని భయమును దీర్చెను.

వృకుని చేరబిలచి, "ఓయీ ! వృకాసుర ! నీకు వరము యిచ్చినది పరమశివుడు. అతడు భూతపతి. ఆతడనుగ్రహించిన వరశక్తిపై మాకు నమ్మకములేదు. అది పనిచేయునని నేను అనుకొనుటలేదు. అతడు నిన్ను మాయచేసి యుండవచ్చును. కనుక వరశక్తిని పరీక్షించ దలచినచో, నే చెప్పినట్లు చేయుము. ముందుగనీవు నీ హస్తమును నీ శిరముపై నుంచుకొనుము. వరమహిమ తెలియగలదు. అటుపై నీ యిష్టము" అని నారాయణుడు వృకునితో నమ్మబలికెను.

హరిమాయ వృకుని ఆవరించెను. శ్రీహరి చెప్పినమాటలు వృకునకు అమృతపు గుళికలవలె మధురములై నమ్మకము కలిగించెను. మతిభ్రమించినవాడై అసురుడు తనహస్తమును తనశిరమున పెట్టుకొనెను. మూర్ఖుడైన వృకాసురుడు వెంటనే తలప్రక్కలై మరణించెను. ఆ సమయమున స్వర్గమందు జయజయ ధ్వానములు చెలరేగ, దేవదుందుభులు మారుమ్రోగెను. దివినుండి పుష్పవర్షం కురిసెను. శివుడంత వృకునిబారినుండి విముక్తుడై శ్రీహరిని కీర్తించి కైలాసమున కేగెను.

## 116. త్రిమూర్తులలో ఎవరు అధికుడు?

పూర్వము సరస్వతీనదీతీర సమీపమున మహర్షులందరు సత్రయాగము చేయ సంకల్పించిరి. అపుడు వారిలో, త్రిమూర్తులందు "అధికులెవరు" అనుసమస్య ఉత్పన్న మయ్యెను. చర్చలు వాదోపవాదములు జరిగెను. ఎవరుగొప్ప అన్నఅంశము నిర్ణయము జరుపలేక పోయిరి. ఈ విషయమును తేల్చుకురమ్మని మహర్షులందరు భృగమహర్షిని నియోగించిరి. భృగుమహాముని ముందుగా బ్రహ్మలోకమైన

సత్యలోకమున కేగెను. బ్రహ్మయొక్క సహనగుణమును పరీక్షింపనెంచి, బ్రహ్మను నుతించక మిన్నకుండెను. గౌరవముంచి వందనము చేయలేదు. అతని ప్రవర్తనమునకు బ్రహ్మకాగ్రహమొచ్చెను. కాని భృగుమహర్షి తనపుత్రుడైనందున, మారుమాటాడక మిన్నకుండెను. అంతట భృగువు కైలాసమునకేగెను. అచ్చటకూడా ముని అటులే ప్రవర్తించెను. మహేశ్వరుడు మహోగ్రుడై శూలాయుధమును ప్రయోగింపబూనెను. అంతపార్వతి శంకరుని ప్రార్థించి, శాంతింపచేసెను.మహర్షిని వధించవలదని వేడుకొనెను.

అనంతరము భృగుమహర్షి వైకుంఠమునకేగెను. ఆసమయమున శ్రీహరి లక్ష్మీదేవితొడను తలగడచేసికొని పవ్వళించియుండెను. అంతటమహర్షి "ఓయీ! లక్ష్మీవల్లభా ! అనవరతము భోగములనుభవించడము మించి నీకు వేరుపనిలేదా!" అని కోపమున ప్రశ్నించెను. అంతటితో శాంతించక రోషముతో విష్ణువక్షస్థలమున కాలితోతన్నెను. కాని శ్రీమహావిష్ణువు పరమశాంతిచిత్తుడై, చిరునగవులు చిందించుచు, శేషపాన్పుదిగి లక్ష్మీసమేతుడై నేతెంచి మహర్షిపాదములకు ప్రణమిల్లెను.

"మహర్షీ ! నా కఠిన దేహముతాకి కోమలమగు తమపాద మెక్కింత కందియుండును. తమ పవిత్ర పాదస్పర్శవలన నాహృదయము పావనమైనది. నేటినుండి లక్ష్మీదేవి నా వృక్షః స్థలమున నివసించియుండును. "అని శ్రీహరి పలికి మహర్షిని అర్ఘ్యపాద్యాదులతో పూజించి సన్మానించెను. లక్ష్మీనారాయణుని శాంతి, సహనము, ఓర్పునకు భృగుమహర్షి యెంతయో ఆశ్చర్యమందెను. తనను కాలితోతన్ని అవమానించినను అణుమాత్రమైనను ఆగ్రహించక గౌరవించుట, ఆ మహనీయుని ఔన్నత్యమునకు ప్రతీకయని ముని గ్రహించెను.

భృగుమహర్షి శ్రీలక్ష్మీనారాయణుని అత్యుత్తమగుణమును మనమున గొని యాడుచు మునులచెంతకు చేరెను. జరిగిన విశేషములను మహర్షులకు విశద పరచెను. సత్త్వరజస్తమోగుణ ప్రధానులైన త్రిమూర్తులలో శ్రీమహావిష్ణువధికుడని మునులందరు సమాలోచనలుచేసి నిర్ణయించిరి.

## 117. బలరాముడు-సాహసములు

ఒకానొక కాలంలో ద్వివిదుడను వానరుడు కలడు. అతడు సుగ్రీవుని మంత్రి యగు మైందుని సోదరుడు. వాడు నరకాసురుని మిత్రుడు. శ్రీకృష్ణుడు నరకుని సంహరించినందున ద్వివిదుడు కృష్ణునిపై పగబూనెను. ఆనెపముతో యాదవులను వేధించసాగెను.

ద్వివిదుడు మహాబలాఢ్యుడు, యాదవులు నివసించు ఆవాసప్రాంతములు ధ్వంస మొనర్చుట, దహించివేయుట మున్నగు దుర్మార్గములు చేయసాగెను. గ్రామములు పట్టణములు నాశముచేయుచుండెను. ఒక్కొక్క సమయమున సాగరగర్భమున ప్రవేశించి, సముద్రజలములను భూమిమీదకు నెగజిమ్మి దేశములను ముంచి వేయుచుండెను. సాధుపుంగవులను, ఋషులను పలువిధముల హింసించుచు, వారినిత్యకర్మలను సాగనీయక అడ్డగించుచుండెను. స్త్రీలను చెరపట్టి ఆశ్రమ వాటికలను అపవిత్రముచేయుచుండెను. ఆవిధముగా ద్వివిదుడు అనర్తదేశానికి తీరని సంక్షోభము కలిగించెను.

ఒక సమయమున బలరాముడు తనస్త్రీజనముతోగూడి రైవతపర్వతముపై కేళీవిలాసవినోదార్ధము విహరించుచుండెను. ద్వివిదుడు అచ్చటికిచేరి , తనజాతి సహజచేష్టలచే స్త్రీలను అవమానపరచెను. అదిగాంచి బలరాముడు అతనిపై మండిపడెను. హలాయుధమును చేగొని ద్వివిదునిమీదకు పోయెను. అంత యిరువురకు భయంకర సంగ్రామము జరిగెను. వానరవీరుడు పెద్ద వృక్షములతోడను, ద్రుమానులతోడను, బండలతోడను బలరామునెదిరించెను. బలరాముడు వానినన్నింటిని మార్గమధ్యముననే భగ్నపరచెను. తుదకు బలరాముడు తనబాహుబలముతో వానిని పట్టి బంధించి సంహరించెను. నాటితో ప్రజలకు ద్వివిదుని పీడ విరగడయ్యెను. అందరు సంతసించి బలరాముని కొనియాడిరి.

## 118. హస్తినాపురం

హస్తినాపురము కౌరవపాండవుల రాజ్యమునకు రాజధాని, దానినిపుడు ఢిల్లీ అనుచున్నాము. హస్తినాపురం యమునానదీతీరమున గలదు. ఈ నగరమునకు బాగుగ పరిశీలించినచో ఒకప్రక్కకు ఒరిగినట్లు అగుపించును. అందుకుకారణం బలరాముని యొక్క సాహసకృత్యమని ఇతిహాసమున్నది.

ఒకానొక సమయమున దుర్యోధనునిపుత్రిక లక్ష్మణకు స్వయంవరము జరిగెను. అందునిమిత్తము వివిధ దేశాధిపతులు విచ్చేసిరి. జాంబవతీ పుత్రుడైన సాంబుడను వాడు లక్ష్మణను ప్రేమించెను. ఆ కన్యను వివాహమాడదలచి సాంబుడు హస్తినకు పోయి లక్ష్మణనపహరించ ప్రయత్నించెను. సాంబునిపై కౌరవులంతా తిరుగబడిరి. సాంబుడు వారలనెదిరించి పోరాడెను కాని యొంటరియైనందున కౌరవవీరులకు పట్టుబడెను. విరథుడైన సాంబుడు బందీ అయ్యెను. ఈ వర్తమానము వెంటనే

నారదునివల్ల యాదవులకు తెలిసెను. యాదవవీరులు సైన్యముతో కౌరవులపై దండెత్త నాయత్తమైరి. అంత బలరాముడు కలిగించుకొని, పోరునునివారించి, సంధి కుదుర్చుటకు తానే స్వయముగ రథారూఢుడై హస్తినకుచేరెను. ఉద్ధవుడను జ్ఞానిని రాయబారిగపంపి సాంబుని విడుదల చేయుమని బంధువులనడుమ పోరు అరిష్టదాయకమని వర్తమానమంపెను. దుర్మతులైన కౌరవులు ఉద్ధవుని మాటలు వినక, యాదవులను పలురీతుల నిందించిరి.

అంత బలరాముడు కోపోద్రిక్తుడై హస్తినను సర్వనాశనము చేయుదునని హూంకరించుచు హలాయుధమునెత్తెను. బలరాముని భీకరగర్జనలకు లోకము లన్నియు కంపించెను. నాగలితో హస్తినను పెకలించి నీటముంచ సన్నద్ధుడాయెను. హస్తినాపురము ఒకవైపునకు ఒరగబడి నీటమునిగెను. అంతట హుటాహుటి కౌరవులు భీష్మద్రోణులచటికివచ్చి బలరాముని అనేక విధములనుతించి శాంతింప చేసిరి. కౌరవులంత భయమువీడిరి. దుర్యోధనుడు తనకుమార్తె లక్ష్మణను సాంబున కిచ్చి మహావైభవోపేతముగ వివాహమొనర్చెను. బలరాముడు నూతన వధూవరులను వెంటనిడుకొని సంతసమున ద్వారకకేగెను. బలరాముని సాహసకృత్యమువల్లనే నేటికిని ఢిల్లీనగరము దక్షిణభాగము మెరకగాయుండి గంగలోనికి వ్రాలినట్లుండును.

కౌరవ పాండవులనడుమ కలహమేర్పడెను. తొండముదిరి ఊసరవెల్లి అయినట్లు వైరము క్రమంగా ముదిరి కురుక్షేత్ర సంగ్రామానికి దారితీసెను. ధర్మపక్షపాతియైన శ్రీకృష్ణుడు పాండవులపక్షమున యుండెను.కాని బలరామునకు కౌరవపాండవు లిరువురు సమానులే. దాయాదులమధ్య కలహం, అందువల్ల ఏర్పడిన సంగ్రామము బలరామునకు ఎంతమాత్రము యిష్టములేదు. పోరు మంచిదికాదని పరిపరి విధముల ఉభయులకు హితముచెప్పెను. దుర్యోధనుడు తనకు ప్రియశిష్యుడు. మరోవైపు శ్రీకృష్ణుడు తనకు సోదరుడు ఆత్మీయుడు. ఎవరినికాదని విరోధము పెంచుకొనుట బలరామునకు అభిమతముగాదు. అందువల్ల తానీసమయమున అచ్చటయున్నచో ఉభయులకు క్షేమముకాదని దలచి తీర్థయాత్రలకు జనెను.

అట్లు బయలుదేరిన బలరాముడు ప్రభాసాన్ని చేరెను. అటునుండి సరస్వతీనదీ తీరమందలి పుణ్య క్షేత్రములను దర్శించెను. మధూదకము, బిందుసరోవరం, తృణకూలం, సుదర్శనం, విశాలం, బ్రహ్మతీర్థం, చక్రతీర్థం, మున్నగువానిని దర్శించి, గంగ యమునవంటి పుణ్యతీర్థములను సేవించుకొని, తుదకు నైమిశారణ్యమును

చేరెను. అచ్చట మునులనేకులుచేరి సత్రయాగము చేయుచుండిరి. వారందరు బలరాముని గాంచినంతనే స్వాగతముపలికి పూజించిరి.

రోమహర్షణుడు వ్యాసులవారి శిష్యుడు. అతడు మాత్రమెందులకో బలరాముని గాంచి గౌరవమున లేచి నిలువబడలేదు. అందులకు బలరాముడు అతనిపై కోపమూనెను. మునిని నిందించుచు, కుశాగ్రముతో రోమహర్షణుని సంహరించెను. అది గాంచిన మునులంతా హాహాకారములు చేయుచు ఆందోళనము చేసిరి. "ఓ మహాత్మా! నీవు ధర్మరక్షకుడువు. అట్టినీవు ఇట్టి అధర్మకార్యము చేయదగునా?" అని వాకొనుచు, పలువిధముల శాంతివచనములు పలుకుచు, పురాణ ప్రవచనార్థం రోమహర్షణుని బ్రతికింపుడని అర్థించిరి. అంత బలరాముడు, "మహర్షులారా! ఇతని కుమారుడు సూతుడు గొప్ప పౌరాణికుడై, దీర్ఘాయుష్మంతుడై భాసిల్లగలడు. అతడు మీకు పురాణములన్నింటిని వినిపించగలధీశాలి యగును." అని మునుల కోరికను మన్నించెను.

అటుపై సూతుడు నైమిశారణ్యములో సమస్తపురాణేతిహాసములను మునివర్యులకు వినిపించి ఖ్యాతిగాంచెను. అతని వలన తయ్యారుణి, కశ్యపుడు, సావర్ణి, అకృతవ్రణుడు, వైశంపాయనుడు, హారీతుడు మున్నగువారు పురాణము లభ్యసించి విశ్వవ్యాప్తిగావించిరి. బ్రహ్మహత్యాపాతకము పోగొట్టుకొనుటకు బలరాముడు పదిరెండునెలలు భరతవర్షమంతా సంచరించి తీర్థయాత్రలు గావించెను. మునుల కోరికమేరకు పల్వలుడను రాక్షసుని సంహరించి బలరాముడు మునుల యజ్ఞయాగాదులు నిరాటంకముగా సాగుటకు సహకరించెను. పల్వలుడు ఇల్వలుని కుమారుడు, మహా బలసంపన్నుడు, బహుమాయావి. పల్వలుని సంహరించినందుకు దేవతలు మిగుల సంతసించి బలభద్రునిపై పుష్పవృష్టి కురిపించిరి. మునులు ఆ మహనీయునకు మహాభిషేకమొనరించి, వైజయంతి అను దివ్యమాలికను కానుకగ సమర్పించిరి.

బలరామదేవుడు అనేక తీర్థములను, పుణ్యక్షేత్రములను, దివ్యప్రదేశములను దర్శించెను. కౌశిక, సరము, ప్రయాగ మున్నగు తీర్థములు సేవించెను. పులహాశ్రమమునకుచని గోమతి, గండకి, విపాస, శోణనదులలో స్నానమాడి, పితృదేవ పూజలాచరించెను. గంగసాగర సంగమమును సందర్శించెను. మహేంద్ర గిరికేగి, అందు పరశురాముని సేవించెను.

అనంతరం దక్షిణభారతమందలి పుణ్యక్షేత్రములు, తీర్థములు దర్శించెను. సప్తగోదావరులు, కృష్ణవేణి, పంప, భీమ, తుంగభద్రలను సేవించెను. శ్రీశైలము, వేంకటాచలము, కాంచి, కావేరి, శ్రీరంగము, ఋషభాద్రి, దక్షిణమధుర, అవల రామేశ్వరములను దర్శించెను. అచ్చట పదివేల గోవులను బ్రాహ్మణులకు దానమిచ్చి తృప్తులగావించెను.

తామ్రపర్ణిలో స్నానమాడి మలయపర్వతముచేరి అగస్త్యమహామునిని భక్తితో పూజించెను. కన్యాకుమారినిదర్శించెను. కేరళ, సోమాగర్త దేశములు, గోకర్ణం, శూర్పారకం మున్నగు ప్రదేశములు గడచి, మాహిష్మతివద్ద నర్మదనుసేవించి మరల ప్రభాసతీర్థమును చేరెను.

బలరాముడు తిరిగి వచ్చుసరికి భారతయుద్ధము ముగిసెను. ఇరు పక్షము లందును వీరులు, యోధులు, ఆత్మీయులు, బంధువులు, మిత్రులు మరణించి వీరస్వర్గ మలంకరించిరి. జరిగిన దారుణమారణకాండనువిని అమహనీయుడు చాల దుఃఖించెను. చివరిఘట్టముగా భీమ-దుర్యోధనులు గదాయుద్ధము చేయుచున్నారని విని బలరాముడు కురుక్షేత్రమునకు చేరెను. అచ్చట ధర్మరాజు, శ్రీకృష్ణుడు, అర్జునుడు, మున్నగు వారందరు బలదేవుని స్వాగతవచనములతో అహ్వానించి పూజించిరి.

గదాయుద్ధవిశారదులగు భీమ-దుర్యోధనులు యుద్ధము చేయుచుండిరి. వారి యుద్ధనైపుణ్యమును బలరాముడు కొంతతడవు తిలకించి ఆనందించెను. దుర్యోధనుడు గదాయుద్ధమును తనయొద్ద నేర్చుకొన్నను, భీముడే అందు శ్రేష్ఠుడు. జయాపజయములు తేలునదిగాదు. ఇరువురు సమానయోధులే. విజయము నెవరిని వరించునో తెలియకున్నది. కావున యుద్ధము విరమించి సఖ్యతగ నుండుడని వీరులిద్దరకు హితవుపలికెను. కాని బలరామదేవుని మాటను గణుతింపక, పోరాటము సాగించుచునే యుండిరి. ఫలితమును దైవనిర్ణయమునకు వదలివేసి, బలరాముడు ద్వారకకుచనెను. తరువాత భీముడు దుర్యోధనుని తొడలు విరుగగొట్టి సంహరించెను. అంతట భారతయుద్ధము ముగిసెను. ఆటుమీదట బలరాముడు ఉగ్రసేనాదులతో నైమిశారణ్యము చేరి, యజ్ఞయాగాదులనేకములొనర్చి, మహర్షులకు ఆత్మజ్ఞానమును బోధించెను.

## 119. యాదవకులంలో ముసలం

విప్రశాపము అనివార్యము, అప్రతిహతము. దానిని దాటిచరింప నేరితరము గాదు. అందుకు ఈ కథ ఒక మచ్చుతునక.

నాటిరాజులలో యాదవులు గొప్ప సైనికబలమునుగలిగి మిగుల శక్తి సంపన్నులుగా నుండిరి. దానికితోడు శ్రీకృష్ణుని అండదండలు విశేషముగా కలిగి యున్నందున, శత్రురాజులు భయము గలిగి వారిని కన్నెత్తియైన చూడకుండిరి. వాసుదేవుడు రక్షగాయున్నందున, వారినెవ్వరేమియు చేయజాలకుండిరి. అందుచే యాదవకులము వృద్ధిగాంచెను. యదువీరులు బలగర్వితులై విర్రవీగుచు, తమ నెదిరించువారులేరను నిగ్రహమున యుండిరి.

శ్రీకృష్ణుడు అవతరించిన కారణము దుష్టశిక్షణము, శిష్టరక్షణము. దాదాపు ఆమహనీయుడు అవతరించిన కారణము ముగిసినది. లక్ష్యము నెరవేరినది. దుర్మార్గులనెందరినో సంహరించినాడు. భారతయుద్ధనెపమున ధర్మసంస్థాపన మొనర్చినాడు. ఇంక యాదవకులము నుద్ధరించవలెను. అందుకు కారణమును శ్రీకృష్ణుడే కల్పించవలసియున్నది. లీలామానుష విగ్రహుడైన ఆమహాత్మునకు అనివార్యమేమున్నది.?

ఒక సమయమున విశ్వామిత్రుడు, అసితుడు, కణ్వుడు, దుర్వాసుడు, నారదుడు మున్నగు దేవర్షులు, బ్రహ్మర్షులు, రాజర్షులు ద్వారకకుచేరి, అచ్చట శ్రీకృష్ణుని సేవించి, అనుజ్ఞ గైకొని పిండారక క్షేత్రమున కేగిరి. ఆటకాయులైన యాదవులు కొందరు సాంబునకు స్త్రీవేషము వేసిరి. అంతేగాక గర్భవతిగా యున్నట్లు రూపుదిద్దిరి. అంతవారు ఆతనిని మునులవద్దకు గొనిపోయి," మహర్షులారా ! ఈ చిన్నది యాదవాంగన. గర్భవతిగాయున్నది. తనకు "మగబిడ్డ కలుగునా ! లేక ఆడబిడ్డ కలుగునా!" అని తమను ప్రశ్నించుటకు ఈ మగువ సిగ్గు చెందుచున్నది. తమరు యోగదృష్టితో పరిశీలించి, ఆమెసంశయముదీర్చి సంతసింపచేయుడు" అనిరి.

మహర్షులు వారి తుంటిరితనమును గ్రహించిరి. తమతో పరిహాసమాడు చున్నారని ఆగ్రహించిరి. "వినాశకాలే విపరీత బుద్ధిః" అనుచందమున వీరికి వినాశ కాలమాసన్నమైనదని దలచినవారై "ఓరీ ఈ మగువకు పుట్టునది మగశిశువు గాదు, ఆడశిశువుగాదు. మీ కులనాశనానికి కారణమైన ముసలంపుట్టును. అనుభవించుడు పొండు." అని దారుణముగ శపించి మహర్షులందరు అచ్చోటు వదలిపోయిరి.

క్షణములో స్త్రీ వేషములోనున్న సాంబునిగర్భమునుండి ఒక ఇనుపరోకలి క్రిందకు జారెను. అది గాంచిన యాదవులు మిగుల భయభ్రాంతులైరి. మునులతో పరిహాసమాడి, తమ వినాశము తామే తెచ్చుకొంటిమని విచారించిరి. కాని చేయునదేమున్నది? సమయము మించిపోయినది. వెంటనే యాదవులందరు రోకలితో ద్వారకకుచని, జరిగిన సంఘటనమును ఉగ్రసేనునకు విన్నవించిరి. విప్రశాపము యాదవులకు సంభవించినదని అందుగలవారందరు దుఃఖించిరి. తుదకు శ్రీకృష్ణుడు, ఉగ్రసేనాదులు చేసిన సూచనమేరకు యాదవులందరు రోకలిని ముక్కలుగచేసి, పొడిపొడిగ రూపొందించి సముద్రజలములందు కలిపిరి.

కాని విధి బలవత్తరమైనది. దానినెదిరించి తరించుట నేరివశము? శ్రీకృష్ణుడు అందులకు ప్రతీకారచర్య చేయగలడు. కాని విధివశమని మారుమాటాడక మిన్న కుండెను. అటు పిమ్మట సముద్రగర్భములో కలసిపోయిన రోకలిఅణువులనుండి ఉద్భవించిన తుంగకాడలతో యొకనినొకరు కొట్టుకొని, యాదవులందరు నశించి పోయిరి. "యాదవకులంలో ముసలంలా, నీవు వంశనాశనానికి పుట్టావురా?" అను సామెత జాతీయంగా మనలో మిగిలిపోయింది.

## 120. అవతారం ముగింపు

ఒక శుభసమయమున వాణీవల్లభుడైన బ్రహ్మ, సనకసనందనాది మునిశ్రేష్ఠులు, ఇంద్రాదిదిక్పాలురు, ప్రముఖ దేవతాగణములు, ప్రజాపతులు మున్నగు వారందరు శ్రీకృష్ణ భగవానుని సందర్శించునిమిత్తము ద్వారకానగరమునకరుదెంచిరి. శ్రీకృష్ణుని పలువిధముల పూజించి, వేదసూక్తముల నుతించిరి. "ఓ శ్రీకృష్ణా! ఎందు నిమిత్తమై నీవు భువినవతరించితివో అకార్యము ముగిసినది. నీవిక వైకుంఠమునకు విచ్చేయుము." అని వారందరు ముక్తకంఠమున ప్రార్థించిరి.

అంతట వాసుదేవుడు వారలతో, "విప్రశాప ఫలితముగ త్వరలో యాదవవంశం అంతముకానున్నది. అదికూడ నెరవేరిన తదుపరి వైకుంఠమునకు వత్తును." అని పలికెను. అంత బ్రహ్మాదులు తమ నిజస్థానములకు జనిరి. అటుతరువాత ద్వారకలో అనేకములగు ఉత్పాతములు సంభవించెను. అవన్నియు శ్రీకృష్ణనిర్యాణమునకు, యాదవవంశ వినాశనానికి దుశ్శకునములుగా భావించి అందరు భయమందిరి. శ్రీకృష్ణుడు వారలనందరిని చేరబిలచి రానున్నవిపత్తును వివరించెను. అందరు ద్వారకను విడచి ప్రభాసతీర్థమున కేగి, పుణ్యకార్యములు, దానధర్మములు,

పితృకర్మలాచరించి శేషజీవితములందు గడపుటమేలని హితపు పలికెను. కృష్ణుడు చెప్పిన మాటచొప్పున అందరు ప్రభాసతీర్థము చేరిరి.

అంతట పరమభాగవతోత్తముడైన ఉద్ధవుడు శ్రీకృష్ణునేకాంతమున కలసి "ఓకృష్ణా! ద్వారకావాసా! నీవు ద్వారకనువదలి వైకుంఠమునకు పోవుచున్నావు. నీవులేని జీవితము నాకు వలదు. నేనుకూడ నీవెంటవత్తును. నీతోడుగ నన్నును గొనిపొమ్ము" అని పరిపరివిధముల ప్రార్థించెను. "కృష్ణుడంత, ఉద్ధవా! నీకోరిక మన్నింపదగినదే. కాని నేను అవతరించిన కారణార్థము ముగిసినది. చేయవలసిన పనులన్నియు నెరవేరినవి. త్వరలో శాపగ్రస్తమైన యాదవవంశం పరస్పరం కలహించుకొని నశింపు కానున్నది. నేటికి ఏడవదినమున ద్వారకానగరము సముద్రమున మునుగనున్నది. కలిప్రవేశించనున్నాడు. ధర్మమునశించి, అధర్మం కాలూనయున్నది. కావున నీవు ఇందుండుట క్షేమముగాదు. సర్వము త్యజించి, వెంటనే తపో భూములకు పొమ్ము. అంతమున నీవు నన్నుచేరుకొందువు." అని హితవాక్యములు పలికెను. ఉద్ధవునకు బ్రహ్మజ్ఞానము, పరతత్త్వము, కర్మయోగము, భక్తియోగము, ధ్యానయోగము, ఆశ్రమధర్మములుపదేశించెను. ఉద్ధవుడు కృష్ణునివలన ధన్యుడై, భగవానుని ఆదేశానుసారము తీర్థయాత్రలు చేయుచు బదరికావనము చేరెను.

ప్రభాసతీర్థము పశ్చిమ వాహినయైన సరస్వతీనదీ తీరమున గలదు. బలరామకృష్ణులు, మిగిలిన యాదవులు ప్రభాసతీర్థముచేరి, దేవ పితృకార్యము లన్నియు యథావిధి నాచరించిరి. కాని విధివశులైన యాదవులు అహంకార మావహించగ అజ్ఞానానువర్తనులైరి. సురాపానమత్తులైరి. కృష్ణునిమాయ వారలను గప్పివైచెను. ఒకరినొకరు కలహించుకొనిరి. వారినడుమ పంతములు, భీషణప్రతిజ్ఞలు చోటుచేసికొనెను. ఆయుధములుధరించి యుద్ధమునకుదిగిరి. అదటుల భయంకర యుద్ధమయ్యెను. పోరునందు చాలమంది మరణించిరి. ప్రద్యుమ్నుడు, సాంబుడు, సాత్యకి, అనిరుద్ధుడు, గదుడు మున్నగు వీరులు ఒకరినొకరు ధిక్కరించి పోరాడిరి కృష్ణుడెంత వారించినను విన్నవారుకారు. సంగ్రామమున వారి ఆయుధములు, రథములు, అశ్వములు ధ్వంసమయ్యెను. సముద్రతీరమున బాగుగపెరిగిన తుంగ చువ్వలతో కొట్టుకొని నశించిరి. యాదవులు రోకలిని బాగుగా పొడిచేసి సముద్రములో కలుపగా, అది తీరమునకుచేరి తుంగపొదలుగ నవతరించెను. తుంగకాడలు పొడవుగపెరిగెను వానిమొనలు సూదులవలె నుండెను. వానితో కొట్టుకొని చాలమంది మరణించిరి. చివరకు మునులశాపమున పుట్టిన ముసలమే

యాదవ వంశ వినాశనమునకు కారణమయ్యెను. ఒకదశలో బలరామకృష్ణులనుకూడ తుంగలతో మోదిరి. వారును రోషముతో తుంగలతోడనే యాదవులను సంహరించిరి. అట్లు యాదవులందరు నశించిరి. ఆదిశేషుని అవతారమైన బలరాముడు సముద్ర తీరమందే యోగనిష్ఠతో భౌతిక దేహమును చాలించెను. శ్రీకృష్ణుడు కూడ తనకు కాలమాసన్నమైనదని తలచి, ఒక అశ్వత్థవృక్షమూలమున పవ్వళించెను.

## 121. అశ్వత్థవృక్షము మహిమ

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ, మధ్యతో విష్ణు రూపిణీ ।
అగ్రతో శివరూపాయ వృక్షరాజాయతే నమః ॥

జడుడను బోయవాడు సముద్రములో చేపలుపడుతూ వుండగా, ఒకచేప అతనివలలో చిక్కెను. దాని నాతడు కోయగా దాని కడుపులో ఒక చిన్న ఇనుపముక్క కనిపించెను. వాడు దానిని తనబాణమునకు ములికిగనొనర్చెను. యాదవులు రోకలిని పొడిచేసి సముద్రములో కలిపినపుడు అందులోని ఇనుపముక్కొకటి యుండెను. దానిని చేపమింగెను. ఆ ఇనుపముక్కేయిది.

శ్రీకృష్ణుడు రావిచెట్టు మూలమున పవ్వళించి తనపాదమును కదలించు చుండెను. అది ఒక మృగముయొక్క తలవలె దూరమునకు గోచరించుచుండెను. బోయవాడు శ్రీకృష్ణుని పాదమును మృగమనితలచి గురిచూచి బాణముతో కొట్టెను. బాణము కృష్ణునిపాదమునకు గ్రుచ్చుకొనెను. బోయవాడు సమీపమునకు వచ్చిచూచెను. శ్రీకృష్ణపరమాత్ముడని తెలిసికొని వ్యాధుడు మిగులవ్యధచెందెను. అపరాధమును మన్నించుమని వేడుకొనెను. అంత శ్రీకృష్ణుడు, "ఓయీ ! ఇందు నీ తప్పు అణుమాత్రమైనను లేదు. నేను ఆశించినట్లే జరిగినది. నీవు భయపడవలదు." అని వానినోదార్చెను. అంతేగాక వానికి మోక్షమనుగ్రహించెను. బోయవాని శరాఘాతముచే శ్రీకృష్ణుడు నిర్యాణమంది, అవతారము చాలించెను.

రామాయణకాలంలోని వాలిగాని, అంగదుడుగాని మరుజన్మలో బోయవాడుగ జన్మించినట్లు కొందరి అభిప్రాయము. కృష్ణునిదేహం ఒక కొయ్యగా మారినదని, అమ్రానే ప్రస్తుతము పూరీక్షేత్ర మందలి జగన్నాథస్వామియని పురాణములు పేర్కొనుచున్నవి.

శ్రీకృష్ణునిరథసారథి దారకుడు కృష్ణునికొరకు అందందు వెదకెను. రావిచెట్టు మూలమున నిర్యాణమొందనున్న శ్రీకృష్ణపరమాత్మను గాంచి, చాల దుఃఖించెను.

శ్రీకృష్ణుడు తన నిర్యాణవార్త బంధువులందరికి తెలుపుమనియు, ఇంద్రప్రసపురము చేరి అర్జునుని అండదండలలో నుండుమనియు దారకునాదేశించెను. అనంతరము దారకుని సమక్షముననే పరమాత్ముని దివ్యతేజము దివికేగెను. భగవానుని దివ్యరథము, అశ్వములు, గరుడధ్వజము, శంఖ, చక్రాద్యాయుధములు వాసుదేవుని అనుసరించెను. శ్రీకృష్ణుడు పుడమిపై సుమారు నూటయిరువది సంవత్సరము లున్నట్లు భాగవతము తెలుపుచున్నది. దారకుడు ద్వారకకుచేరి శ్రీకృష్ణుని నిర్యాణవార్త దేవకివసుదేవులకు, ఉగ్రసేనునకు , భోరుభోరున విలపించుచు వివరించెను. అంత వారందరు ప్రభాసతీర్థమునకుపోయి బలరామకృష్ణులకొరకు వెదకిరి. ఎందును వారు గానరారైరి. శోకతప్తహృదయులైన వారెల్లరు, వియోగ దుఃఖము భరింపజాలక ప్రాణములు గోల్పోయిరి. శ్రీకృష్ణునిభార్యలు, రుక్మిణి యాదవాంగనలు, బలరాముని పత్నులు అగ్నిబడి ఆత్మాహుతి గావించుకొనిరి. శ్రీకృష్ణుడు అవతారము చాలించిన వార్తవినిన అర్జునుడు మిగుల దుఃఖితుడయ్యెను. నరనారాయణులే శ్రీకృష్ణార్జునులు. వారిది జీవాత్మపరమాత్మల సంబంధము వంటిది.

**యత్రయోగేశ్వరః కృష్ణో యత్రపార్థోధనుర్ధరః ।**
**యత్రశ్రీర్విజయోభూతిః ధ్రువానీతిర్మతిర్మమ॥** (భ.గీ. అ.18 శ్లో.78)

యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడును, ధనుర్ధారియగు విజయుడును ఎచ్చటనుందురో అచ్చట, సిరిసంపదలు, సుస్థిరమగునీతియు, విజయము నెలకొనియుండును. అనగా వారిద్దరియునికి సర్వశ్రేయములకు మూలము. ఇరువురియందొక్కరు లేకున్నను పరిస్థితి పూర్తత్వమును గోల్పోవచ్చును. శ్రీకృష్ణుని నిర్యాణముతో అర్జునుడు నిస్తేజుడై తీవ్రమనోవ్యధకు లోనయ్యెను.

శ్రీకృష్ణుడు పార్థునకు ప్రాణసఖుడు, బంధువు, రథసారథి, సచివుడు, గురువు, అన్నింటికిమించి ఆరాధ్యదైవము. అట్టి శ్రీకృష్ణునెడబాటు భరించలేక పోయెను. అయినను కొంత తడవుకు జ్ఞానుడై స్వస్థతచెందెను. మరణించిన వారందరికి పరలోక క్రియలు ధర్మయుతముగ జరిపించెను.

శ్రీ కృష్ణావతారము ముగిసిన సమయమున ద్వారకానగరము సముద్రమున మునిగిపోయెను. కాని వాసుదేవుని మందిరము మాత్రము సాగరగర్భమున మునుగక అట్లేయుండెను. అది భావితరములవారు దర్శించి ముక్తులగుటకు అట్లే నిలచి యుండెను. కృష్ణుడు అవతారము చాలించినంతనే అర్జునుడు శక్తిహీనుడయ్యెను.

అతని తేజస్సు, పౌరుషము, బలవిక్రమాది ప్రతాపములన్నియు క్షీణించెను. పోరాట పటిమకూడ హీనమయ్యెను.

అర్జునుడు ఇంద్రప్రస్థపురము పోవుచుండగా, అతని వెంటనున్న యాదవ స్త్రీలను, మార్గమధ్యమున బోయవాండ్రు కొందరు అడ్డునిలచి, యాభరణములను దోచుకొనిరి. కాని మహావీరుడయ్యును విజయుడు వారి నెదిరించలేకపోయెను. ఈ సంఘటనము కృష్ణుడు లేనిలోటును తెలుపుచున్నది. అనంతరము ధనుంజయుడు ఇంద్రప్రస్థపురము చేరెను. బలరామకృష్ణుల నిర్యాణము గురించి ధర్మరాజాదులకు విన్నవించెను. ధర్మరాజాదులు అదివిని మిగుల దుఃఖించిరి. అటుతరువాత అర్జునుడు యాదవరాజ్యాన్ని, యాదవులందు మిగిలివున్న కృతవర్మ, సాత్యకీపుత్రులకు, వజ్రునకు పంచి యిచ్చెను. ఉషా అనిరుద్ధులపుత్రుడు వజ్రుడు. వజ్రుడు ఇంద్రప్రస్థపురమునకు అభిషిక్తుడాయెను.

## 122. పరీక్షిత్తు నిర్యాణం

ప్రాయోపవిష్టుడైయున్న పరీక్షిన్మహారాజునకు శుకయోగీంద్రుడు కృష్ణావతార చరిత్రమును, చంద్రవంశపురాజులను గురించియు, కలియుగంలో పాపాత్ములు ఎట్లుప్రవర్తింతురో వివరించెను. మరియు కలియుగధర్మములను తెలిపెను. సత్యం, దయ, తపస్సు, దానం అనునవి ధర్మదేవతకు నాలుగు పాదములు. కలియుగంలో ధర్మదేవత "ధర్మం" అను ఒంటిపాదముపై నడచును. క్రమముగా అదియునశించి ధర్మమే మృగ్యమైపోతుంది. అనగా అధర్మం అడ్డులేకుండా ప్రజ్వరిల్లును. అనంతరం శుకయోగీంద్రుడు పరీక్షిత్తునకు బ్రహ్మోపదేశముపదేశించి మృత్యుభయమును తొలగించెను. అపుడు పరీక్షిత్తు ముక్తసంగుడై, చిత్తము భగవదాయత్తముగావించి. సమాధినిష్ఠను పొందెను.

శుకయోగీంద్రుడు శ్రీమద్భాగవతమును పరీక్షిత్తునకు ఏడుదినములలో వినిపించగా, మహారాజు శుకయోగీంద్రునకు సాష్టాంగదండప్రణామము లాచరించెను. తన జీవితము ధన్యమైనదనిపలికి, అనేకవిధముల పూజించగ, శుకయోగీంద్రుడు అందుండి యథేచ్ఛగాచనెను. అనంతరము పరీక్షిత్తు పవిత్రగంగానదీ తీరమున దర్భాసనముపై తూర్పుదిశకు అభిముఖుడై కూర్చుండి సమాధినిష్ఠను చేరెను. అపుడు మునిశాపమనుసరించి తక్షకుడు పరీక్షిత్తును చంపుటకు బయలుదేరెను. అతనికి దారిలో కశ్యపుడు తారసపడెను. ఏడు దినములలో భాగవతపారాయణ మొనర్చుటను

"భాగవత సప్తాహ" మందురు. నలుబది దినములలో జరుపుదానిని "మండలదీక్ష" అందురు. "నవాహము" అనగా తొమ్మిది రోజులందు జరుపు భాగవతపారాయణము.

కశ్యపుడు గొప్ప శక్తిసంపన్నుడు. మంత్రసిద్ధుడు. అతడు పరీక్షిత్తును రక్షించుటకు అరుదెంచుచుండెను. రాజును రక్షించి బ్రతికింతునని కశ్యపుడనెను. అట్టిశక్తి కశ్యపునకు లేదని తక్షకుడనెను. ఇరువురి మధ్య వాదప్రతివాదములు పెరిగెను. అందుకు నిదర్శనముగా తక్షకుడు ఒకవృక్షమును కాటువేయగా అదినిలువున మాడిపోయెను. అపుడు కశ్యపుడు తన మంత్రమహిమచే మరల వృక్షమును బ్రతికించెను. అదిగాంచి తక్షకుడు ఆశ్చర్యపడెను. మునినెటులైనను ప్రసన్నము గావించుకొనదలచి, మునికి అపారధనరాసులనొసగెను. తన కార్యమునకు విఘాతము కలిగించవలదని మునిని ప్రార్థించెను.

అటుపిమ్మట తక్షకుడు కపటబ్రాహ్మణ వేషముతో పరీక్షిన్మహారాజు వద్ద కరుదెంచెను. అతనివెంట మరికొందరు బ్రాహ్మణులు కూడావచ్చిరి. పరీక్షిత్తు వారలను తనచెంతకు వచ్చుటకు అనుమతించెను. వారిమోసమును రాజు గ్రహింపజాలదయ్యెను. బ్రాహ్మణులు పరీక్షిత్తునకు కొన్ని నిమ్మపండ్లనిచ్చిరి. పరీక్షిత్తు ఒకపండును వాసనచూచెను. పండులో దాగియున్నతక్షకుడు సర్పరూపమునవచ్చి రాజును కాటువేసెను. వెంటనే రాజు మరణించుటయు, రాజర్షిశరీరము విషాగ్నిలో దగ్ధమగుటయు రెండుచర్యలు క్షణకాలములో జరిగెను. అందున్నవారెల్లరు ఆశ్చర్య చకితులైరి. ఆ సన్నివేశము గాంచిన ముల్లోకవాసులు హాహాకారములు చేయుచు అబ్బురమందిరి. దివిజులు దేవదుందుభులు మ్రోగించిరి.

పరీక్షిత్తుకుమారుడు జనమేజయుడు తనతండ్రి పాముకాటుచే మరణించినాడని తెలిసి ఆగ్రహించి, లోకములో సర్పవంశ మంతరింప చేయుదునని ప్రతినబూనెను. వెంటనే మునులను, వేదవిదులైన భూసురులను రావించి సర్పయాగము ప్రారంభించెను. ముల్లోకములందున్న సర్పములన్నియు కుప్పలు కుప్పలుగావచ్చి యజ్ఞకుండమునపడి ఆహుతగుచుండెను. అదిచూచి తక్షకుడు ప్రాణభీతిచే ఇంద్రుని శరణుజొచ్చెను. ఇంద్రుని ఆశ్రయించిన తక్షకుడు ఇంద్రసింహాసనమును చుట్టుకొని దాగియుండెను.

ఋత్విజులు తక్షకుని విషయము తెలిసికొని, జనమేజయుని అనుమతి గైకొని ఇంద్రునితోసహా తక్షకుడు అగ్నికుండమునందు పడునట్లు మంత్రములు చదివిరి.

"సతక్షకింద్రాయస్వాహా" దానితో ఇంద్రసింహాసనము కదలెను. తక్షకునితోసహా ఇంద్రుడు యజ్ఞకుండమున పడుటకు దివినుండి భువికి వచ్చుచుండెను. మహోపద్రవము జరుగనున్నదని దేవతలందరు భయమందిరి. అంతట దేవత గురువగు బృహస్పతి వేగముగ నచ్చటికరుదెంచి యజ్ఞమును తక్షణమే నిలుపుచేసి, జరుగనున్న దారుణమును నివారించవలసినదిగా హితము పలికెను.

"ఓరాజా ! తక్షకుడు అమృతమును గ్రోలినాడు. అతడు మరణించడు. అతనివల్ల దేవేంద్రునకు ముప్పుముంచుకొచ్చినది. కనుక ముల్లోకముల శ్రేయస్సునాశించి చెప్పుచున్నాను. శీఘ్రముగ యజ్ఞమునాపుము." అని బృహస్పతి పలికెను. దేవగురువు బోధనలు మన్నించి జనమేజయుడు సర్పయాగమును విరమించెను. అంతట తక్షకుడు, దేవేంద్రుడు రక్షింపబడుటయేగాక, ముల్లోకములు శాంతించి సుఖించెను.

## 123. వేదములు

బ్రహ్మ చతుర్ముఖుడు. అతని నాలుగుముఖములనుండి నాలుగు వేదములు వెలువడెను. వానిని బ్రహ్మమానసపుత్రులైన మరీచ్యాదులభ్యసించి తమశిష్యులద్వారా నాలుగు యుగములందును వ్యాపింపచేయుచుండిరి.

ద్వాపరయుగాంతమున భగవానుని ప్రేరణముతో బ్రహ్మర్షులు వేదములను విభజించిరి. వైవస్వత మన్వంతరములో పరాశరుని కుమారుడైన కృష్ణ ద్వైపాయనుడు వేదములను ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదము అని నాలుగు విభాగములుగ చేసి వేదవ్యాసుడై ప్రసిద్ధుడయ్యెను. వ్యాసమునీంద్రుని శిష్యప్రశిష్యుల మూలమున వేదములు విభాగమై లోకమున ప్రచారమయ్యెను.

వేదవాఙ్మయము విశ్వవిజ్ఞానమునకు మూలము. అందు ఖగోళ, భూగోళ శాస్త్రవిజ్ఞానమనంతము, అనిర్వచనీయము. అంతేగాక వృక్ష జంతుశాస్త్రము, ప్రకృతికి సంబంధించిన శాస్త్రములెన్నియో గలవు. వేదములు భారతీయ సంస్కృతికి, సంస్కారమునకు వెలలేని పెన్నిధి. అదిమానవాళికి భగవానుడనుగ్రహించిన విజ్ఞానసర్వస్వము.

## 124. అష్టాదశ పురాణములు

పురాణములు రెండు విధములు.

1. మహాపురాణములు 2. పురాణములు.

